BHAVAVIPLAVAKAARUDU
KODAVATIGANTI
SAHITYASAMALOCHANA
Edited By Ashok Tankasala
*Cover Sketch:* Bapu, *Designing:* Srihariraju, Chandramouli
*First Edition:* June, 1982
*Text Printing:* KRANTI PRESS, Madras - 1
*Cover:* B N K PRESS, Madras - 26
*For Copies:* B B G Tilak, 102-Poorvanchal, J N U, New Delhi-67
TEN RUPEES

# ఇందులో...



## వివేచన



## రచన

## సాహిత్య జీవితం

# రచనా రణరంగంలో కాకలు దీరిన యోధుడు

క్రియకీ, భావానికీ నడమ వుంటూ వచ్చిన ఎల్లలను తుడిపెయ్యడం అందరి వల్లా అయ్యే పనికాదు. భావం క్రియలోనుంచీ క్రియ భావంలోనుంచీ గాక, దేనికది విడిగా వుంటుందనుకోవడం అజ్ఞానమో, భ్రమో. భావానికీ క్రియకీ గల గతితార్కికమైన లంకెను చూపి, ఆ రెండూ ఎలా పరస్పర దోహదం చేసుకుంటాయో గ్రహించిన బుద్ధిశాలి కొడవటిగంటి కుటుంబరావు.

ఈ బుద్ధి అనేదీ పదార్థమే. ఇది తనంతతాను పుట్టుకునీ రాదు, పూర్వజన్మ సుకృత పరిపాకమో 'వాసనో' అంతకంటే కాదు. బుద్ధిబలంలో మాత్రం తరతమాలుండవచ్చు. ఆనువంశిక కారణాలు మాత్రమే దీనికి కారణం కావు. 'జీన్స్' పాత్రను తగ్గించనక్కరలేదు గాని వాటినే నిర్ణాయకాలని అనుకోవడమూ సరికాదు. కొ.కు. శుకమహర్షి బాపతు మనిషికాదు—పుట్టీ పుట్టకముందే సమస్త విజ్ఞానాన్నీ పొందటానికి. ఆయన అందర్లాగే ఎదిగారు. ఎదుగుదల జరిగేది శూన్యంలోగాక మానవ ప్రపంచంలోనే గనక, పరిస్థితిని ఎదిరించి ప్రశ్నించి పోరాడి గెలవక తప్పదు. ఒక



K 2

రోజులో జరిగే పని కాదిది. మంత్రదండమేదీ లేదు. అంచేత కొ.కు. విషయంలో కూడా 'అనాది' 'జన్మతః', 'స్వతస్సిద్ధం' వంటి మాటలకు అర్థం లేదు. అవన్నీ చెల్లని నాణేలు.

భౌతికవాదమైనా కొ.కు.కి సునాయాసంగా బోధపడలేదు. అసలు 'గతితార్కిక' అనే విశేషాన్ని ముందు నిలపకుండా ఆ మాటను కొ.కు. పట్ల ప్రస్తావించడం తప్పు. ఆ పేరు పెట్టుకొన్నవి లోకంలో ఎన్నైనా వున్నాయి. అయితే వాటి లోకం ప్రధానంగా ఆచరణతో అంతస్సంబంధంలేని భావలోకమే. గతితార్కిక భౌతికవాదమైనా వట్టి భావజాలమో, పిడికొట్టు సిద్ధాంతమో కాదు. క్రియాలోకాన్ని బలంగా కుదిపి మనుష సమిష్టి శక్తిని సంఘటితం చెయ్యగలిగిన చైతన్యాన్ని అందించి చారిత్రక మహాశక్తులకు ఆయుధంగా మార్గం చూపుతూ అది శుష్కశాస్త్ర స్థాయిని మించి అన్వయశాస్త్రంగా రూపొందింది. పదార్థాల అన్యోన్యాన్ని, అంతర్గతమై వున్న విరుద్ధాంశాల ఘర్షణ ద్వారా పరిణామాన్ని, స్థూలంనుంచి జటిలతకీ, అల్పం నుంచి అనల్పతకీ, రాశినుంచి గుణానికీ, ముందుకీ మీదికీ జరిగే గతిక్రమాన్ని ధర్మ (ా) బద్ధంగా విడమర్చి చూపే ఈ శాస్త్రం, ఎప్పటికప్పుడు పెరిగేదే గాని ఏదో ఒక చోట నిలిచి మడుగుగట్టి పాచిపట్టేది కాదు. అందుకనే కొ.కు. ఎదుగుదల కూడా నిరంతరాయంగా జరుగుతూ వచ్చింది. చిట్టచివరిదాకా తాను—జిజ్ఞాసను వదులుకుని, సమకూర్చుకున్న విషయ పరిజ్ఞానాన్ని దాని సారమైన విజ్ఞానాన్ని మూలధనం చేసుకుని గురుపీఠం కాలేదు. శాస్త్ర విద్యార్థిగానే వుండిపోయినందుచేత ప్రయోగపరత్వం తనను వదలనే లేదు. సర్వజ్ఞత్వాన్ని ఎన్నడూ ఆపాదించుకోకుండా, ఎప్పటికప్పుడు విస్తరించే జ్ఞానసీమనుంచి ఎన్నెన్నో కొత్త అంశాలను సేకరించుకుంటూ వచ్చాడు. ఒక్కొక్కప్పుడు ఇది విడ్డూరమనిపించి హేతుబద్ధతను కూడా మీరి అవిశ్వసనీయత అంచులను కూడా తాకింది. అయితే అప్పటికే తాను హేతుచింతనను ప్రబలాధారం చేసుకుని తన రచనలో దాదాపు పూర్తిగా శిఖరానికి ఎగబాకిపోయాడు గనక, అక్కడి నుంచి అతిలోక విషయాలతో కూడిన గహనంలోకి పడిపోకుండా కాలిపట్టువల్ల తప్పించుకున్నాడు.

'ఆవేశ' పూరితమైన కవిత్వం వైపుకి గాకుండా 'ఆలోచనా' పూరితమైన వచనం వైపుకి ప్రారంభంలోనే ఆయన మళ్లాడనడం వరకూ బాగానే వుంది. అయితే ఆవేశమైనా ఆలోచనైనా బుద్ధి వ్యాపారాలే గనక, పరస్పరబాహ్యమైనవి కావు. అంచేత ఈ రెంటిలో దేనికో ఒకదానికి పెద్దరికం యివ్వవలసిన అగత్యం లేదు సరిగదా, అలా యివ్వడం బుద్ధి వ్యాపారాన్నంతటినీ పిడచగట్టడం లాంటి పనే. కవిత్వమైనా వచన

మైనా దేనికదే ముఖ్యమైనదీ. దేనికదే అవసరమైనదీ. రాకుంటే ఇక్కడ ఒక మాట రాయాలి. కవిత్వానికి భిన్నంగా వచనానికి భ్రమను (ఇల్యూషన్) కల్పించే గుణం లేదు. పైగా, సృష్టి పరిణామక్రమంలో ఆదిమ జంతుజీవనం తాలూకు సహజోద్రేకాలూ (ఇంపల్సెస్), అసంకల్పిత భావాలూ (ఇన్‌స్టింక్ట్స్) వగైరా కవిత్వాన్ని ఆశ్రయించుకొన్నంతగా వచనాన్ని ఆశ్రయించుకోవు. దీనికి కారణం, వచనం కవిత్వం తర్వాత వచ్చింది కావడమే. జంతుకాలం నుంచి మనిషి విడబడి వచ్చాక, సుదీర్ఘమైన మానవ చరిత్ర క్రమంలో భాష, చైతన్యం జమిలిగా ఏర్పడి స్థిమితమైన అనుభవ విశ్లేషణ అవసరం బాగా పెరగడంతోపాటు వచనానికీ అవసరం పెరిగింది. సాహిత్య ప్రక్రియాపరంగా మాత్రం. పెట్టుబడిదారీ యుగం దాని అవసరం కొద్దీ వచనానికి అపూర్వమైన ప్రాముఖ్యాన్నిచ్చింది. నేటికీ తెలుగులో వచనం ఇంకా కొందరి చేతుల్లో కవిత్వ వాసనలు వదిలించుకోలేదంటే, అసలు సిసలు పెట్టుబడిదారీ వ్యవస్థ ఇక్కడ ఏర్పడకపోవడమేగాక, అది తన చారిత్రక కర్తవ్యాన్ని నెరవేర్చకుండా భూస్వామ్య వ్యవస్థ శిథిల రూపాలను కొనసాగించేందుకు తోడ్పడడమే ననాలి. వీరేశలింగం, గిడుగు, గురజాడలతో మొదలైన ఆధునిక వచనం. చలం చేతిలోకంటె కొ.కు., గోపీచంద్ వగైరాల చేతుల్లో సొంపుదేరి రాటెక్కడం — వీరు భూస్వామిక భావజాలం నుంచి మరింత ఎక్కువగా స్వతంత్రించినందువల్లనే జరిగింది. ఈ విషయంలో గోపీచంద్‌నూ వెనకేశాడు కొ.కు. ఆధునికత కొ.కు. లో పూరా విస్తరించింది. ఆయన లోకదర్శనం గోపీచంద్ దానికంటె సుసంబద్ధమైనదీ సమగ్రమైనదీ కావడమే దీనికి కారణం. శైలి విషయం కాదిది. బుచ్చిబాబుని అటుంచినా పద్మరాజు లేదా కొ.కు. తో పోటీకి ఈ విషయమే అయితే? కొ.కు. వచనం తేటే కాదు, లోతుకూడా. మరి దీనికి ఏం కారణం అంటే, కొ.కు.కి టిక్కుగానీ వెర్రిగానీ ప్రయోగాల పేరిట సందుగొందుల తిరుగులాటగానీ లేవు. అయినా ఎవడూ స్వయంసంపూర్ణుడో స్వయంసిద్ధుడో కాలేడు. వర్ణనలూ చమత్కారాలూ వివిధవర్ణ విన్యాసాలూ కిక్కిరిసిన రావిశాస్త్రి రచనల నేమనాలప్పుడు? ఎంతోనిండుగా కనిపించే కా.రా. రచనల్లో కవిత్వగుణం లేనే లేదనడం అబద్ధం కాదా? కృత్రిమ విభజనలను అన్నిటినీ నిరాకరించడమే సబబు.

బాగా తెలిసినదాన్ని గురించే రాయడం కథకుడుగా, నవలాకారుడుగా కొ. కు. విశిష్టత. సువిశాలమైన జీవితాన్ని మొత్తంగా ఎవ్వడూ ఒదిగించలేడు. ఇతిహాసాలకు పురాణాలకూ కాలం చెల్లింది. ప్రబంధాలూ కనుమరుగయ్యాయి. వచనంలోనూ 'మాలపల్లి'గానీ, 'వేయి పడగలు'గానీ ఎంతో అనవసర పదార్థాన్ని ఇముడ్చుకుని

ఆజీ_ర్తి కలిగించాయి. కథలూ కథానికలూ ఓ మోస్తరుసైజు నవలలూ నవలికలూ ఈ యుగానికి సరిపడేవని రచయితలు తెలుసుకునే నాటికి, తెలుగు జీవితం సంకీర్ణం అయిపోయింది. పాఠకుల అభిరుచినిబట్టి మాత్రమేగాక, విశ్వసనీయత (క్రెడిబిలిటీ) దృష్ట్యా కథకులు తమ రచనల తలలనూ తోకలనూ కత్తిరించడం కళాత్మకత లేదా శిల్పానికి తోడ్పడింది. కొ.కు. పుట్టి పెరిగి, పడీ లేచీ నడిచిన గుంటూరుజిల్లా మధ్య తరగతి యింగ్లీషు చదువుల బ్రాహ్మణ యువకుల జీవితంలో, ఆర్థికమాంద్యం వల్లా జాతీయోద్యమంవల్లా కమ్యూనిస్టు ఉద్యమం తొలిదశవల్లా వచ్చిన పరిణామాలు కొ.కు. కథల్లో కనిపిస్తాయి. అయితే తాను వట్టి రికార్డింగ్ యంత్రం కానుగనక, తన అనుభవాలనూ ఇతరుల అనుభవాలనూ కలగలిపి 'తైపాదు'వేసి జేరీజుగట్టి ఈ కథలలో నవలల్లో చొప్పించాడు. అయితే జీవితాన్ని వాస్తవికంగా చిత్రించినంత మాత్రాన జీవిత సత్యాన్ని నిరూపించినట్టు గాదు. స్థితిని ప్రతిబింబించడం చాలదు. మార్పుని చూపెట్టాలి. కొ.కు. బుద్ధి అప్పుడప్పుడే పరిణతి చెందుతూంది. మథన సాగుతూంది. లోకం అంతా తనలాలేదు. అంకురాల భావిరూపాంతరాలను తాను చూడగలుగుతున్నాడు. కూపస్థమండూకం స్థితి తప్పుతూంది. అది యితరులకూ తప్పందే యీ అంకురాలు పెరిగి మొక్కలు కావు. అంచేతనే కొ. కు. కథల్లో నవలల్లో వర్ణనలు బాగా తగ్గి వాదోపవాదాలతో గూడిన సంభాషణలు పెరగడం! దీన్ని ప్రచారమంటారా? అననీ! కథా గమనానికి అడ్డుపడేలా రచయితే తన పాత్రలలో 'పరకాయ ప్రవేశం' లాంటిది చేసి తన అభిమాన దురభిమానాలకు పాత్రలనే బాకాలుగా మార్చుకుంటే 'శిల్పం' చెబ్బదిని, ప్రచారాత్మకత (డిడాక్టిసిజమ్) రావచ్చునేమోగాని, కొ. కు. అలాంటి మొరటు పనేదీ చెయ్యలేదు. తనకు తన ఆదర్శాలున్నై. వాస్తవాన్ని విశ్లేషించి అభివృద్ధికరమైన అంశాలను పైకెత్తి చూపడం వాస్తవికతావాదానికి విహితమే. కాబట్టి సాహిత్యంలో వాదోపవాదాలను ఎంత నేర్పుగా ఒడుపుగా సాగించగలిగితే, తానంతటి మంచి కళాకారు డవుతాడు. తిట్లూ శాపనార్థాలూ సాధించలేనిదాన్ని యివి సాధిస్తాయి. శత్రువుని బలంగా దెబ్బదీస్తాయి. అంచేత కథాకథనంలో కుశలుడైన కళాకారుడుగా కొ. కు. ఎంతో మెళకువతో తన చేతికత్తిని అటూ యిటూ తిప్పి ఆయువుపట్లలో పొడవగలిగాడు. కొ. కు. కథలు ఉపన్యాసాలు గాక వ్యాసాలయ్యాయి. గల్పికాప్రక్రియ వచ్చి చేరింది. కత్తి ఎంతగా పదునెక్కితే అంత తీవ్రమైన గాయం. అయితే ఈ కత్తి పూరకే గాయపరచేదే కాదు. రోగ భాగాలను ఖండించేదీ, వ్యాధిక్రిములను వెలికిద్చేదీ, రుగ్మత పోవడానికి పనికి వచ్చేదికూడా.

మొదట మొదట వ్యక్తి సమస్యలకు వివిధ పరిష్కారం చూపే ధోరణి బలంగా వుండిన దిశలోనూ కొ.కు.ది ముందుచూపే. అయితే సమాజం గప్పుపొవ గనక ఏ సమస్యా దానికదిగా వుండదని గమనించాక, కథల్లోనూ నవలల్లోనూ గల్పికల్లోనూ వ్యాసాల్లోనూ తాను ఈ వివిధ సమస్యల వుమ్మడి స్వభావాన్ని చూడగలిగాడు. సంఘం మారుతూంటే ఆ మార్పుకి అడ్డుపడే వ్యక్తులుగానీ, దోహదంచేసే వ్యక్తులుగానీ కేవల వ్యక్తులుకాదు. సంఘర్షించే సామాజిక శక్తులే వివిధ బతుకులను చితగ్గొడు తున్నాయనీ,లేదా బాగుజేస్తున్నాయనీ 'మామూలు' మనుషుల వాస్తవానుభవాలు తెలుపు తున్నాయి. 'మామూలు' తనం చూపడం గొప్పదనమే అయినా, 'మామూలు'గా చూపితే పాత్రలకూ ఘటనలకూ ప్రగాఢత పోయినట్లనిపించి, అవి గుర్తుంచనంత మర్చులమైన ముద్రను మాత్రమే పాఠకులమీద వేసే ప్రమాదం వుంది. పోతే, భూస్వామికం సమాజాన్ని శవదుర్గంధంతో నింపుతూ మొండికెత్తిందిగా నిలిచేవుంది. బాల్యవివాహాలూ, నిర్బంధ వైధవ్యాలూ, వరకట్నాలూ, మూఢాచారాలూ, పిచ్చి నమ్మకాలూ, స్త్రీ బానిస బతుకులూ, కులకట్టుబాట్లూ, దొంగసీతులూ ఒకవైపు, వుమ్మడి కుటుంబాలను బద్దలుగొట్టి వ్యక్తుల బతుకులను స్వార్థానికి లోబరిచి పరమ క్రూరంగా రూపొందసాగిన ధనస్వామికం మరోవైపూ — తిరగలి రాళ్ళుగా జీవితాలను నుగ్గునూచం చేయడం చూస్తున్నాడు. చూపెడుతున్నాడు. చదువుండీ 'పని'లేక యువకులు నానాయిబ్బందుల పాలవుతున్నారు. కాయకష్టం మొక్కటే వుండి మరే ఆస్తిలేని పేదసాదలు అట్టడుక్కి పోతున్నారు. 'అగ్ర' వర్ణాలూ 'ఉన్నత' వర్గాలూ అనిపించుకునేవారి మధ్యలేని కొన్నికొన్ని మంచి పద్ధతులు, దోపిడీ అవుతున్నా దాని స్వభావాన్నీ మూలాన్నీ అంతుజిక్కించుకోలేని అజ్ఞానంతోగూడిన అమాయకత్వం, అంతుజిక్కగానే ఆ రెండింటినీ చీల్చుకొని పొంగే పోరాట చైతన్యం యీ 'కింది' జనంలో వున్నాయి. ఇవి పై కెగజిమ్మితే ఎంత బాగుణ్ణు! సంస్కరణలు పూర్తిగా వ్యర్థం కాకపోవచ్చుగాని అంతకంటె గొప్ప మార్పురాందే ఈ గంజాయితోట ఎలా ధ్వంసమయ్యేది? ఇలా వ్యక్తివాదిగా మొదలై కొ. కు. ఒక పదేళ్ళకాలంలో సమిష్టి వాది — కమ్యూనిస్టు అభిమాని — కాగలిగాడు. కాలంతోబాటు ఎదగడమంటే మరే మిటోకాదు — ఇదే.

శిల్పంకోసమే రాయడం వేరే, శిల్పదృష్టితో రాయడం వేరే అనుకుంటే కొ. కు. శిల్పవాదిగా జమపడడు. విషయ ప్రయోజనాన్ని సఫలం చేసేందుకే శిల్పం అవసరమని తన అభిప్రాయం. కథారచన ప్రారంభంనుంచీ, సమస్యాత్మకంగాని విషయమేదీ తనకు వస్తువుకాలేదు. ఒకే కాలంలో రచనలు జేసిన వేర్వేరు రచయిత

లంతా ఒకేవిధమైన భావాలకు ప్రతినిధులు కానక్కరలేదు. ఉదాహరణకు, స్త్రీ సమస్యను భిన్న దృక్కోణాలనుంచి చూశారు చలం, కొ. కు. పాతివ్రత్యమనేది గానీ, ప్రేమ అనేదిగానీ, స్వేచ్ఛ అనేదిగానీ ఇద్దరికీ ఎన్నో ఇతివృత్తాల నిచ్చాయి. మొదటిదేమో భూస్వామికానికంటె వెనకటిదయితే, చివరివి ధనస్వామిక భావాలు. అయితే వాస్తవమైన ప్రేమకీ స్వేచ్ఛకీ ఎంత మేలైన ధనస్వామికమైనా సరే పూర్తి వీలివ్వదు. ఆ వ్యవస్థలో ఈ పేర్లతో స్త్రీ శ్రమజీవి కావడమో, వేశ్యావృత్తి బదులు వ్యభిచార వృత్తికి లోబడడమో, ఆస్తికి హక్కుదారైనా మగాడిముందు నిలవలేకపోవడమో తప్పదు. చలానికి ఈ అవగాహన కొ. కు. కి వున్నంతగా లేదు.

సమాజంలో రాసాగిన మార్పులు ఒక మహాప్రళయానికి తొలి సంకేతాలు. కొత్త సామాజిక శక్తులు చరిత్రగర్భంనుంచి సొంత ఆస్తిసంబంధాలకు ప్రమాదకరంగా పొటమరిస్తున్నాయి. సంపద వుత్పత్తికీ పంపిణీకీ పొంతన కుదరక, వుత్పత్తిదారుడు నిస్పృహను వదిలి సంఘటితమై బలపడుతున్నాడు. ఇది యుగసంధ్య. దీన్ని గుర్తించి సాహిత్య స్వరూపమిచ్చిన తెలుగు రచయితలలో శ్రీశ్రీ, కొ.కు. లను జతగా పేర్కోవాలి. శ్రీశ్రీ కవిత్వాన్ని కొ. కు. తెగమెచ్చుకున్నాడంటే, కథల్లో తన సంస్కరణవాద ధోరణిని మించి విప్లవధోరణిని ఎంతో పటుతరంగా కవిత్వం ద్వారా ప్రకటించి జీవితంలోని భూకంపాన్ని కవిత్వానికి మార్చినవాడు శ్రీశ్రీయే నని గ్రహించబట్టే. అయితే తానూ త్వరలో తన ఆలోచనా పరిమితులను దాటాడు. శ్రీశ్రీ కంటె యినుమిక్కిలిగా విప్లవశాస్త్రమైన మార్క్సిజాన్ని అధ్యయనం చెయ్యడంతోబాటు, స్వయంగా కార్మిక సమస్యల అనుభవం పొంది, శ్రీశ్రీని మించిపోయే వివేచననీ, పరిజ్ఞానాన్నీ పెంచుకోగలిగాడు. వీటికి కథలు నవలలకంటె వ్యాసాలే ఎక్కువగా వేదికలయ్యాయి. తాను పనిగట్టుకు విషయాలను విప్పజెప్పి భావ విప్లవ బీజాలను వెదజల్లాడు. లేత మొక్కలను ముదరనిచ్చాడు. వాదాలలో కొ.కు. శక్తీ నేర్పూ అనన్యం.

కాస్త ఆలస్యంగానే అభ్యుదయ రచయితల సంఘం(అ.ర.సం.) లో చేరినా, ఎందరో అభ్యుదయ రచయితల కంటె చాలా యెక్కువ శాస్త్రదృష్టి హేతు తర్కబుద్ధీ పెంపొందించుకున్నాడు, ప్రదర్శించాడు కొ.కు. భూస్వామిక భావజాలం నుంచి వారి కంటె ఎంతో పూర్తిగా తప్పుకున్నాడు. అయితే ఉద్యమంతో మమేకం అయే విషయంలో మాత్రం వారి కంటె ఎక్కువ జాగర్త చూపాడు. అప్పటికే మద్రాసులో స్థిరపడడం ఒక కారణమైనా, బలమైన కారణం ఇదికాదు. ఆవేశాలకూ కావేషాలకే

గాక, ఉద్యమ నిర్మాణ నిర్వహణ బాధ్యతలకు గూడా కొ_స్త యెడంగా వుండగోర డమే కొ.కు.కి బాగా పట్టుబడినతత్వమనిపిస్తుంది. రచయిత వుద్యమం విషయంలోనే ఇలాగైతే కమ్యూనిస్టు పార్టీ మాట వేరే చెప్పాలా! అయితే సాహిత్యానికీ, రాజకీయా నికీ మధ్య బలమైన సంబంధం వుండాలనేదే కొ.కు. అభిప్రాయం. అయినా, రాజకీయ పార్టీలు ఆడించినట్లల్లా రచయితల సంఘాలు ఆడగూడదని కూడా ఆయన అనుభవం నుంచి నేర్చుకుని చెబుతూ వచ్చిన విషయం. నిబద్ధతకు ఆయన యిచ్చుకున్న అర్థమే వేరు. భద్రత అవసరమే గాని, అదే పరమార్థమైతే మాత్రం ఆశయానికే నష్టం. ఆచ రణ లేని ఆశయం ధర్మపన్నమే గదా! అయితే రచయిత ఆచరణ రచనే ననవచ్చు గాని, రచయిత కూడా పౌరుడే గనక, చైతన్యవంతుడైన రచయిత అక్షర లోకానికే పరిమితం కాకూడదు. శ్రీశ్రీకి యిలాంటి సంకోచాలు లేనందువల్ల గూడా ఆయన సాహిత్యమూర్తి ఒక శక్తిగా రూపొందగలిగింది. విప్లవ రచయితల సంఘం (వి. ర.సం.) ఏర్పడ్డాక గూడా ఈ పద్ధతే కొనసాగింది. కాని కొ.కు. మరింత ముందుకి వచ్చారు. ఎమర్జన్సీ కాలంలో 'రిస్కు' పడ్డారు. అనారోగ్యం మరో కారణమైంది. వయస్సునీ ఆరోగ్యాన్నీ లెక్కించక శ్రీశ్రీ పౌరహక్కుల ప్రచారంలో తెలుగుదేశాన్ని చుట్టివేశాడు. అయితే రచనల ద్వారానేగాక ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా యువ రచయితల కెందరికో కొ.కు. ఉత్తేజంతోబాటు వివేచనను సమకూర్చిన మాట నిజం. తన పరిమిత పరిధిని దాటకుండానే ఆయన భావప్రచారం చెయ్యగలిగాడు. తొందర బాటు సూత్రీకరణలు లేకుంటే ఇవి మంచి వుపదేశాలే.

భావాలు రచయితలకేగాక జనానికీ అందాలంటే, ఉపన్యాసాలే ఏకైక శరణ్యం కాదు. రచనలు యింకా బలమైనవీ స్థిరమైనవీ. అ.ర.సం. రోజుల నుంచీ. కొ.కు. విజ్ఞానశాస్త్ర విషయాలను అనువాదాల ద్వారా తెలుగువాళ్ళకు అందిస్తూ వచ్చాడు. శాస్త్రీయ ఆలోచనా సరళికి జనం మనస్సుల్లో పాదులు తీశాడు. శాస్త్రజ్ఞానం వురక లేస్తూన్న యుగంలో దాని వూపునందుకోవడమే కష్టం. కొ.కు. మాత్రం అతి నవీన విషయ సంపదను గూడా సంపాదించి పంచగలిగాడు ఒక్కోమారు, ముఖ్యంగా చివరి రోజుల్లో, యీ కృషిలో తప్పటడుగూ వేశాడు. పేరాసైకాలజీ శాస్త్రం కిందికే రాదని ఎన్నో పరిశోధనలు చేశాక ఒక విశ్వవిద్యాలయం సాధికారికంగా ప్రకటించడం ఆయన మరణం తర్వాత జరిగిన సంగతే అయినా, అసలు దానికెప్పుడూ శాస్త్రం హోదా లేదు. అయినా కొ.కు. అసక్తి 'తీరని దాహం' లాంటిది గనక ఆయన ఈ కుహనాశాస్త్రం గురించి చాలా చాలా ఆలోచించారు. దీనికి ఒక కారణం రష్యాలో యోగం వగైరాల గురించి యిటీవల జరిగిన ప్రయోగాత్మక కృషి కావచ్చు.

చిన్నటుంచి, మార్క్సిజం ఎప్పటికప్పుడు వైజ్ఞానిక విషయాలను విచక్షణతో ఆమోదించి స్వీకరించకపోతే, గిడసబారిపోతుందనే సంగతి కొ.కు.కి బాగా తెలుసు. ఆయన కొటేషన్ల పండితుడు కాడు. అభ్యుదయ కవులు కొందరు అపరిణత భావాలతో మార్క్స్ లెనిన్లకు రుషితుల్యత నిచ్చినట్టే, సందర్భశుద్ధి లేకుండా, స్థల కాల నిర్దిష్టతను గుర్తించకుండా మార్క్సిస్టు మహోపాధ్యాయుల మాటలతో ప్రతివిమర్శను నోరు మూయించే దబాయింపు ధోరణి కూడా విజ్ఞుడైన కొ.కు.కి నచ్చుబాటు కాదు.

కార్మికవర్గ సిద్ధాంతమైన మార్క్సిజం గురించి కార్మికులకు గాక మధ్య తరగతికీ చెప్పడమెందుకనేది పిచ్చిప్రశ్న. నిరక్షరాస్యులుగా వున్న కార్మికజనం చైతన్యవంతమైన ప్రజగా మారటానికి వారి పోరాటాలూ తద్వారా వచ్చే రాజకీయ పరిజ్ఞానం చాలా ముఖ్యం. వారిని చదువరులుగా చెయ్యడం ప్రస్తుతానికి కలే. చదువుకున్న మూర్ఖులు పిక్కటిల్లే మధ్యతరగతి పాఠకుల్ని శాస్త్రవిహిత, హేతుబద్ధ వాస్తవ ప్రజాస్వామిక భావధోరణులవైపు మళ్ళించగలిగితే చాలా ఘనకార్యం చేసినట్లే. సంస్కారం క్రమంగా స్వవర్గ పరిమితులను దాటి కార్మికవర్గంతో సహానుభూతితోనూ ఆగక ఆ వర్గ దృక్పథాన్ని అవలంబించే పర్యంతం పోగలగడం మాటలు కాదు. వైవర్గత (డీ క్లాస్) చెందటం ఎంతో కష్టం. కొ.కు. అంత పెద్ద గురి పెట్టుకోలేదు. ఎక్కువగా మధ్యతరగతి కుళ్ళునీ కంపునీ తెగుళ్ళనీ సమస్యల్నీ మధ్యతరగతి పాఠకులకే చూపడంలో ఆయన ఆశించింది—ఆ తరగతి జీవితాన్ని శుభ్రం చెయ్యడం మట్టుకే కాదు. 'కాంట్రాస్ట్'గా కొ.కు. రచనల్లో ఎన్నో చోట్ల శ్రామికుల జీవితాల నికృష్టతనే గాక, సామాజికంగా వారికంటె ఉన్నతస్థానంలో వున్నవాళ్ళు సైతం నేర్చుకుని అవలంబించదగిన పద్ధతులను చూపడం జరిగింది. హాస్యమనే సన్నసూది పని చెయ్యదనుకున్నప్పుడు అపహాస్యమనే దబ్బసరి సూదిని వాడక తప్పలేదు. అవహేళనను పదును విషయంలో మరే ధోరణీ మించిపోలేదు. తిట్టూ మొట్టూ చెయ్యలేని పనిని వ్యంగ్యం అవలీలగా చేస్తుంది. కొ. కు. వ్యంగ్యం లూ షున్ ని గుర్తుకి తెస్తుంది.

లూ షున్ Old Tales Retold లాగా పనిగట్టుకు రాయకపోయినా, పురాణ కథలు కొన్నిటిని కొ.కు. తిరగజెప్పి, దేశీయుల మనస్సుల్లో పాతుకుపోయి వున్న విలువలను తల్లకిందులు చెయ్యగలిగాడు. చరిత్ర కూడా ఆయన అభిమాన విషయాలలో ఒకటి. సొంతంగా పరిశోధించి సరికొత్త సంగతులు వెలికి దీయకపోయినా, శాస్త్రీయ వైఖరిగల ఆధునిక చరిత్రకారుల, అభిమానుల రచనల నుంచి కావలసింది తీసుకుని, చిన్నచిన్న చరిత్రవ్యాసాలు రాశాడు. అయితే వీటికి వుండవలసినంత కండ

పుష్టిలేదు, అస్థిపుష్టి లేదు. అయినా, ఏ కొద్దిపాటి వెలుగు ప్రసరింపజెయ్యగలిగినా మేలే. చిమ్మచీకటి కంటె గూటిదీపకాంతే నయం.

ఎన్నో సామాజిక వైరుధ్యాలకు కూడలిలాంటి స్త్రీ గురించి కొ.కు. చాలా లోతుకు దిగి ఆలోచించారు. మహిళా సమస్య మానవ సమస్యల్లో దేనికీ తీసిపోదని గుర్తించిన వాళ్ళు అరుదు. గుర్తించినా సవ్యమైన పరిష్కారం చూపినవాళ్ళు మరీ తక్కువ. వీరేశలింగం సంస్కరణోద్యమాలు, గురజాడ నాటకాలూ కథలూ, రాజమన్నారు నాటికలూ, చలం కథలూ, ఈ సమస్యను చూసిన కోణాలు భిన్నమైనవి. అలాగే కొ.కు. దృక్కోణం కూడా. ఈ సమస్య విషమం, జటిలం. దీని పరిష్కారం కూడా తేలికగాదు. ఆస్తిలో వాటా, చదువూ, నౌకరీ, యివి దాన్ని పూర్తిగా తొలగించలేవు. వేతన దాస్యాన్ని మించిన మహిళాదాస్యం, సమాజంలో సగానికి పైబడివున్న వారికి మానవత్వ స్థాయి తిరిగి రావడంతోనే తీరుతుంది. అది ఇప్పటికిప్పుడు జరిగేపని కాదు. దాసులకు దాసులైన స్త్రీలు విడిగా తమ స్థితిని పెంచుకోవడం కష్టం. ఇతర కష్టజీవుల దుస్థితి తొలగందే ఆడవారి హీనస్థితీ అంతరించదని కొ.కు. గ్రహించాడు. అయితే తొలికథల్లోనే గాక నవలల్లోనూ ఇతరత్రా ఆయన దీన్ని సుదూర భవిష్యత్తుకి వాయిదా వేద్దాం లెమ్మనే చాటేటు ధోరణిని చూపెట్టకుండా, ఎప్పటికప్పుడు ఏ కొంచెంపాటి మంచి జరిగినా మేలేననుకున్నాడు. వేశ్యలనటుంచి, 'అలగా' జనం స్త్రీలతో పోల్చినా మధ్యతరగతి స్త్రీల స్థితి కీతే గనక, వాళ్ళ దృక్పథం నుంచే ఆయన ఎన్నో రచనలు చేశాడు. పెళ్ళి, ప్రేమ, రూపం, గుణం, వ్యభిచారం, సానిపని, వైధవ్యం, చండశాసనం—యిలాంటి అంశాలు వాటికి ముడిసరుకు నందించాయి. పశువుగానే భావించి వుంచే కామసంతృప్తిలోనే ఆయనకు స్త్రీ విముక్తి కనిపించి వుండేది. వర్తక సరుకుగానే భావించివుంచే విక్రయంలోనే కనిపించి వుండేది. అలాగాక, మానవిగా భావించబట్టే ఈ సమస్య జటిలత్వం ఆయనకు బాగా బోధపడింది. 'ఫేమిలీ' అనే మాటకిగల లేటిన్ మూలశబ్దం అర్థమే భార్యాబిడ్డలూ, బానిసలూ వగైరా. ఆడది ఆస్తి. వారసుల్ని కనే మానవయంత్రం. పితృస్వామిక దశ దాంపత్యంతో బాటు స్త్రీకి అధీనస్థితి కల్పించింది. స్త్రీకే నీతి, పురుషుడికి కాదు. నీతీ అవినీతీ భావాలు కూడా మారుతూ వచ్చేవి. సౌఖ్యం, గౌరవం, స్వేచ్ఛ యింకా ముఖ్యం కాబట్టి అవి యీ వ్యవస్థలో సమకూరేవి కావనుకొన్నాడు కొ.కు. అయినా వాటికోసం సాగే చిన్నా పెద్దా ప్రయత్నాలను అభిమానించాడు. అంతే గాకుండా వాటిని బుజాన వేసుకున్నాడు. ఇందులోనూ ఆయనది శాస్త్రదృష్టే. ఇందువల్లనేనేమో చలం రచనల నిర్భరత్వం, సాహసం, కొ.కు. రచనల్లో కనిపించవు.

'మామూలు' తనం నిజంగా కొ.కు. రచనల బలమై కూడా దౌర్బల్యమనిపించేదీ యిదే. గాఢ వర్ణాలతో ఉన్మత్తస్థితిలో వుద్రేకాలతోపుతో 'లేచి'పోయి యథేచ్ఛనే స్వేచ్ఛగా, స్వ'సీత'నే మహోత్తమంగా ఎంచే స్త్రీల చిత్రాలు కొ.కు. రచనల్లో చాలా తక్కువ. 'యావజ్జీవం హోష్యామి' ప్రాణిని శవంగా మార్చింది. 'దాంపత్యం' ఏకపక్ష వ్యవహార మైంది. స్త్రీకి ఏది శాపమో పురుషుడికి అదే వరం. అసమానత ముష్టిచెట్టు. శోషలిస్టు సమాజమే దానికి గొడ్డలివేటు. బానిసలకూ తదితరులకూ పరిపూర్ణ మానవత్వం సాధ్యం అక్కడే, అప్పుడే. ప్రేమకూ, స్వేచ్ఛకూ మొట్టమొదటిసారిగా అవకాశం దొరికేదీ అక్కడే, అప్పుడే. సొంత ఆస్తితోనే చెడుగులెన్నో నశిస్తాయి. వాటి భౌతిక ఆధారం పోతుంది. సంస్కరణవాదం యథాస్థితిని కొనసాగించేదే. విప్లవవాదం అలాక్కాదు. విప్లవం కొ.కు.ని భయపెట్టలేదు. వుత్సాహపరచింది, వదునెక్కించింది.

ఇంగ్లీషువాడనేట్టు, కొ.కు. ధరించిన శాస్త్రకవచంలో తొర్రలు కొన్ని లేకపోలేదు. విమర్శను విమర్శించవలసివస్తే, కొ.కు. సినీమాల గురించీ, జానపద కథల గురించీ, శాస్త్ర విషయం గురించి కూడా చేసిన విమర్శ అంతా నవ్యమైనది కాదు. జర్నలిస్టుగా ఆయన వర్తకసరళిలో సిద్ధహస్తుడు. ఆయన సినిమా సమీక్షలు లోపరహితమైనవి కావు. సంగీతంలో ఆయన సంప్రదాయాభిమాని. కొన్నిచోట్ల ఆయన కళావిమర్శనూ రాజకీయ విమర్శనూ విడగొట్టి చూపడంగానీ, వర్గాతీతమైనదిగా విజ్ఞానశాస్త్రాన్ని తటస్థం చెయ్యబోవడం గానీ, సూక్ష్మపరిశీలనలో తేలిపోతాయి. అయితే తన నెరసుల్ని కూడా తిరుగులేని సిద్ధాంతాలుగా భావించే మొండితనం కొ.కు.కి దూరం. విప్లవం సుదూర గమ్యమని కొ.కు. భావించి ఉంటే అది తప్పే. అది మన సమాజంలో మొదలై సాగు తూంది. భావవిప్లవం ముందా, సామాజిక విప్లవమా అనే మీమాంస కూడా వ్యర్థం. అవి ఏకకాలంలో జరిగేవి. ఒకదాని కింకొకటి వూపు.

బహుముఖమూ సత్ఫలదాయకమూ అయిక కొ.కు. సాహిత్య వ్యక్తిత్వాన్ని ఈ వ్యాస సంకలనం కొండను అద్దంలోలాగా చూపే ప్రయత్నం. ఇది సర్వ సమగ్రం అని నే ననను. ఏదీ అలాంటిది కాదు. మంచి ప్రయత్నమని మాత్రం గట్టిగా అన గలను. అన్ని వ్యాసాలూ ఒకే స్థాయికి గానీ, ఒకే కాలానికి గానీ చెందినవి కాక పోవటం ఒక చిన్న లోపం. అయినా దీన్ని కప్పివేయగలంత వైవిధ్యం వుండటం విశేషం. ఎంతో కృషి చేస్తేగాని ఇలాంటిది రూపొందదు. 'ప్రగతి సాహితి' మిత్రుల్ని అభినందించక తప్పదు.

జవహర్ భారతి,
కావలి.

కె. వి. రమణారెడ్డి
18-1-1982

# ఎందుకీ పుస్తకం?

రచయితలలో అధిక సంఖ్యాకులు మధ్యతరగతికి చెందినవారు. అందువల్ల, మధ్యతరగతి ఎట్లా ఉందో మన రచయితలూ అదేవిధంగా ఉన్నారు. వారి సామాజిక-జీవిత—రచనా దృక్పథాలూ, రచనలూ — అన్నీ, వారి పుట్టుకనుండి చావువరకు అంతా అస్తవ్యస్తమే. తాము సమాజంలో భాగమని, సామాజిక సమస్యలే ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తమను వేధిస్తున్నాయని వారు గ్రహించరు. అదే విధంగా తమ జీవితాలలోని మార్పులకు సాంఘిక పరిణామాలతోను, తమ ఆలోచనా లయలకు సామాజిక గతి పురోగతులతోను గల అవినాభావ సూత్రాన్ని వారు గుర్తించరు. కనుకనే వారి పడవ ఏ ఒడ్డూ ఎన్నడూ చేరదు. ఆ మధ్యతరగతి నుండే వచ్చిన కుటుంబరావుకు వీరికి కీలకమైన తేడా ఇక్కడే.

వ్యక్తిగత జీవిత సమస్యలకు బాల్యంలోనే గురయిన కుటుంబరావు తానూ వ్యక్తివాదిగానే రచనలు ప్రారంభించాడు. పరిసర కౌటుంబిక—సామాజిక సమస్యలను చూసి, అనుభవించి, అప్పటి సాంఘికోద్యమాల ప్రభావంతో సంస్కరణవాద దృక్పథాన్నే తన రచనలలో ప్రతిబింబించాడు. అయితే వ్యక్తివాదం, సంస్కరణ

వాదం భూమికగాగల ఈ దశలోనూ ఆయన వ్యథచెందడంలో పూర్తి నిజాయితీ చూపాడు. తక్కిన రచయితలకు ఆయనకు దృక్పథం విషయంలో ఈ విధంగా మౌలికమయిన తేడా లేకున్నా, నిజాయితీకి సంబంధించిన తేడా ఉంది. కనుకనే ఆ సమస్యల గురించి తీవ్రమైన యోచన, శోధన తప్ప వారిలోవలె ఆషామాషీ ధోరణి, పలాయన వాదం, కర్మవాదం, అవకాశవాదం, careerism ఆయనలో చోటు చేసుకో లేదు. అవే సమస్యలపై కుటుంబరావు రచనలలో కనిపించే వ్యగ్రత, చర్చ, తరచు విద్యుదాఘాతసదృశంగా తోచే తిరుగుబాటు తత్వం—ఇవేవీ తక్కిన రచయితలలో సాధారణంగా 'దర్శనం' ఇవ్వకపోవటానికి కారణం ఇదే.

వ్యక్తి సమాజంలో ఒక భాగం, ఈ రెంటికీ గతితార్కిక సంబంధం ఉన్నదీ అన్న సత్యాన్ని కుటుంబరావు తర్వాత గుర్తించి ఆమోదించేట్లు చేసిందికూడా సమస్యల పట్ల నిజాయితీతో కూడిన ఆయన యోచన, శోధనే. ఇట్టి గుర్తింపు, ఆమోదం వల్ల కలిగిన చైతన్యమే ఆయనను వ్యక్తివాదం నుండి వర్గవాదం వైపు, సంస్కరణ దృష్టి నుండి అభ్యుదయ దృక్పథంవేపూ నడిపించింది. అంతేకాదు. మార్క్సిస్టు కానివాడు మేధావి కాడన్న సార్త్ర్ (Sartre) ఆ వెనుక రెండూ కాకుండా పోయినట్లుగాక, మార్క్సిస్టు కానివాడు అభ్యుదయ రచయిత కాలేడన్న తన సూత్రీకరణకు—మార్క్సిజం—లెనినిజం — మావో ఆలోచనావిధానం ఆమోదం ద్వారా విప్లవ రచయితై ఆయన స్థాయీ ఔన్నత్యం కల్పించింది ఆ చైతన్య స్రవంతి కారణంగానే.

మధ్యతరగతి రచయితలు, మధ్యతరగతి గురించిన ప్రస్తావన సంకేత ప్రాయమే. ఆ రచయిత తన తరగతి పౌరుడై, తన తరగతితో పాటు విశాల సమాజంలో భాగమయినవాడు. అతని రచనాదృక్పథం మాటేగాక జీవిత—సామాజిక దృక్పథాల గురించి కూడా చేసిన ప్రస్తావన అందుకే. మధ్యతరగతి రచయిత (అతని వర్గానికి చెందిన అన్ని తరగతుల వారూ) వ్యక్తికి సమాజానికి గల గతితార్కికతను గుర్తించి సరైన జీవిత—సామాజిక — రచనా దృక్పథంతో చైతన్యవంతుడు కావడం గురించిన సమస్య ఇది. అట్టి చైతన్యంతో కుటుంబరావు వలె వర్గవాదం వైపు పురోగమించడానికి సంబంధించిన సమస్య ఇది. ఈ పుస్తకం లక్ష్యమూ అదే. బహుముఖ రచయిత అయిన కుటుంబరావు సాహిత్య కార్తవీర్యార్జునుడని చెప్పటం కాక, ఆయన రచనలు పాఠకునిలో ఏర్పరచబూనే దృక్పథాన్ని గణించాలన్నదే మా ప్రయత్నం. అందువల్లనే ధనాంశాలతో పాటు, ఆయనలోని పూర్వవాసనా ఋణాంశావేశాలను కూడా బేరీజు వేయడం జరిగింది.

కుటుంబరావుపై చర్చ ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రపై చర్చ. వివిధ సమకాలీన విషయాలపై ఆయనంతటి విస్తృత పరిశీలన, రచన మరే తెలుగు రచయితా చేయలేదు గనుక ఆ పరిస్థితులు కొనసాగినంత మేర ఆయన భవిష్యత్తులోనూ జీవిస్తాడు. ఆయనపై జరిగే చర్చకూడా అంతకాలం జీవిస్తుంది. అయితే అట్టి చర్చకు ఈ పుస్తకం సమగ్రరూపం కాదు; ప్రాతిపదిక మాత్రమే.

మూడేళ్ళ క్రితం 'జలపాతం' కవితా సంకలనాన్ని ప్రచురించిన తర్వాత 'ప్రగతి సాహితి' రెండవ ప్రయత్నం ఈ పుస్తకం. ఇందు గురించి ఆలోచించటం మొదలు, పుస్తకం రూపుదిద్దుకునే వరకు అయిదువందల మందికి పైగా ఈ కృషిలో పాల్గొన్నారు. ఇందులోని రచయితలకు, మొదటినుండి చివరివరకు ప్రతి పనిలో తోడ్పడిన జంపన శ్రీహరిరాజు గారికి, కె.జి. కృష్ణమూర్తిగారికి ఆయన కుటుంబానికి, శ్రీపతి, ప్రొఫెసర్ కె. శేషాద్రి, వనరుల సేకరణలో సహకరించిన బి. వేణుగోపాల రెడ్డి, ఎ. రామిరెడ్డి, జి. నాగభూషణం, సైమల్, గొడవర్తి వెంకట సుబ్రహ్మణ్యం గార్లకు, ముఖచిత్రం గీసిన 'బాపు' గారికి, పుస్తకాన్ని అందంగా వేసిచ్చిన ప్రెస్‌ల వారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు.

పుస్తకంపై తమ అభిప్రాయం తెలుపవలసిందిగా పాఠకులను కోరుతున్నాం.

న్యూఢిల్లీ,
3 ఫిబ్రవరి 1982.

సంపాదకుడు.

# విప్లవాత్మక సాహిత్య దృక్పథం

త్రిపురనేని మధుసూదనరావు

సాహిత్యంలో మూఢవిశ్వాసాల్ని గురించి బాధపడేవాళ్ళు చాలామంది వున్నారు. ప్రకృతి మీదా, సమాజంమీదా, శాస్త్రీయమైన అవగాహన కలిగించవలసిన సాహిత్యం మూఢవిశ్వాసాల్ని ప్రచారంచేయటం అన్యాయమే. కులాల్నీ, మతాల్నీ సమర్థించడం, దేవుళ్ళనీ, దెయ్యాల్నీ ఆవాహన చేయటం, స్త్రీని కించపరచటం వంటి పనుల్ని సాహిత్యం ద్వారా చెయ్యటం సామాజిక ద్రోహమే. ప్రగతిశీలవాదుల్లో ఈ విషయంలో ఏకాభిప్రాయం వుండటం కూడా సంతోషించతగ్గ విషయమే. గురజాడవంటి సంస్కరణవాదులకంటే పూర్వం వున్న కవులందరూ సాహిత్యంలో మూఢవిశ్వాసాల్ని చెప్పినవాళ్ళే. మనిషికంటే మతానికీ కులానికీ, మనిషి ఇంద్రియాలకంటే ఆత్మకీ ప్రాధాన్యం ఇచ్చినవాళ్ళే. ఈ ప్రపంచంకంటే పరప్రపంచం గొప్పదని చెప్పినవాళ్ళే. ఈ లోకంలో జీవించటంలో పరమార్థం ఈ లోకంలో జీవించటం కాదు. పుణ్యలోకాల్లోకి ప్రవేశించటానికి అర్హతని సంపాదించుకోవటమే ఈ లోకంలో జీవించటానికి పరమార్థం. 'విశ్వశ్రేయః కావ్యం' అంటే కూడా విశ్వశ్రేయస్సు అంటే పుణ్యలోక ప్రాప్తి అనే అర్థం. కాబట్టి సాహిత్యానికి మూఢవిశ్వాసాల్ని ప్రచారం

చేసిన చరిత్ర సుదీర్ఘ చరిత్రే. ఆనందం, బ్రహ్మానందం, చిదానందం, రసానందం వంటి దేనికీ పనికిరాని సంఘ వ్యతిరేక ప్రయోజనాల్ని సాహిత్య ప్రయోజనాలుగా చిత్రీకరించి మానవతని అవమానించారు.

తెలుగు వాళ్ళకి ప్రాచీన లిఖిత సాహిత్యంలేదు. నన్నయ్య నుంచీ ప్రారంభం అయిందని చెప్పబడుతున్న సాహిత్యం మధ్యయుగాల సాహిత్యమే. రాచరికంతో సురక్షితం చేయబడిన భూస్వామ్య వ్యవస్థ భావజలాన్ని ప్రతిబింబించిన సాహిత్యాన్ని మధ్యయుగాల సాహిత్యం అంటారు. వ్యాసుని సంస్కృత భారతంలో వున్నంత 'ప్రాచీనతా' గుణం కూడా నన్నయ భారతంలో లేదు. రాచరిక—భూస్వామ్య వ్యవస్థ చట్రంలోకి భారతాన్ని అనువదించటం జరిగింది. అంటే భారత అనువాదం సామాజిక అనువాదమే తప్ప పండిత పరిశోధకులు ప్రచారం చేస్తున్నట్లు సాహిత్య అనువాదం కాదు. కేవలం సాహిత్యానువాదం వర్గ సమాజంలో జరగదు. వర్గ ప్రయోజనాలకి అనుగుణ్యంగానే అనువాదాలు జరుగుతాయి. అంటే సామాజిక ప్రయోజనాల కోసం వర్గ పరిధిలోనే నన్నయ నుంచీ జరిగిన అనువాదక్రమాన్ని మనం పరిశీలించాలి. కమ్యూనిస్టు మానిఫెస్టోనీ, మావో మిలటరీ రచనల్నీ, వైరుధ్య, ఆచరణల్నీ వాటికోసమే ఎవడూ అనువాదం చెయ్యడు. కార్మిక వర్గ ప్రయోజనాలకోసం, వర్గ పోరాటం కోసం, వర్గ యుద్ధ స్వరూపాన్ని తెలుసుకోవటం కోసం అనువాదం చేయటం జరుగుతుంది. అనువాదాల మూలకారణాల్ని అనువాదకుడు ప్రకటించిన ఉద్దేశాల్తోనే తెలుసుకోలేం. చారిత్రిక, సామాజిక దృష్టితో పరిశీలించినప్పుడే అనువాదాల సామాజిక పాత్రని అర్థం చేసుకోగలుగుతాం.

ప్రకృతిని గురించీ, సమాజాన్ని గురించీ సత్యాలుగా రుజువైన విషయాలమీద కూడా పౌరాణిక దృక్పథాన్ని వదలకుండా వుండటాన్ని మూఢవిశ్వాసం అనవచ్చు. ఫ్యూడల్ సమాజంలో మతం ప్రధాన భావజాలంగా వుంటుంది. పరిమాణాత్మక మార్పులు కూడా మతం ముసుగులోనే జరుగుతాయి. మతం స్వతంత్ర శక్తి కాదు. అంటే మతంగా మతం మంచీ చెయ్యలేదు చెడూ చెయ్యలేదు. అనిర్దిష్ట మతం కూడా వుండదు. మతం పేరుతో వర్గాలూ, బృందాలూ దోపిడీలు చేస్తాయి. యుద్ధాలు చేస్తాయి. రెండు మతాలు యుద్ధం చెయ్యలేవు. రెండు మతాల పేరుతో రెండు వర్గాలో, రెండు జాతులో రెండు దేశాలో యుద్ధం చేస్తాయి. అందుకని మూఢవిశ్వాసాలన్నీ మతాలకి అంటగట్టి మతవ్యతిరేక యుద్ధ ప్రకటనలు చేయటం ఒక పెద్ద మూఢవిశ్వాసం. మత సంబంధమైన సామాజిక మూలాలు వెతికి వాటికి వ్యతిరేకంగా బాణం ఎక్కుపెట్టాలి.

మధ్యయుగాల సాహిత్యంలో మూఢవిశ్వాసాలుగా కనిపించేవి దాదాపు అన్నీ పాలక వర్గ భావజాలంలోనూ, యుగభ్రమల్లోనూ భాగాలే. అందుచేత మతాల్నీ, మూఢ విశ్వాసాల్నీ సిద్ధాంత స్థాయిలో ఖండించి, నిరాకరించటమే పెద్ద పోరాటం అని ఇప్పుడు భావించటం నిరర్థకమైన వ్యవహారం. వర్గ పోరాటంలో భాగం కాని మత వ్యతిరేక, మూఢవిశ్వాసాల వ్యతిరేక పోరాటం భావవాదస్థాయిలో, ఆదర్శవాద స్థాయిలో వుండిపోతుంది. మతం జీవితానికి తలక్రిందు ప్రతిబింబం. మతాన్ని కాళ్ళ మీద నిలబెడితే మతం ప్రతిబింబించిన జీవితాన్ని విశ్లేషించవచ్చు. అప్పుడు మతం పోయి జీవితం మిగులుతుంది. మనిషి తన నుంచే దేవుణ్ణి సృష్టించాడు. ఆ దేవుడికి తానే లొంగిపోయాడు. సామాజిక మానవతని సాధిస్తే దేవుడు మరి కనపడడు. మతాన్ని, మూఢవిశ్వాసాల్నీ శాస్త్రీయ దృష్టితో పరిశోధించిన ఆధునిక రచయితల్లో కుటుంబరావుది ప్రత్యేక స్థానం.

"నాకు విశ్వాసం మనిషిలోనే కానీ, దేవుడిలో లేదు" (కొ. కు.)

కొ. కు. జీవితంలో, సాహిత్యంలో ఎన్నడూ దేవుడిని విశ్వసించలేదు. చరిత్రలోని యే అంశాన్ని పరిశీలనకు తీసుకున్నా కొ. కు. మనిషినుంచీ వివరించ టానికే పూనుకున్నాడు. మనిషిని గురించి అవగాహహన చేసుకోవటానికి మానవాతీత శక్తుల్ని ప్రమాణంగా గ్రహించే ఆస్తికవాదాన్ని కొ. కు. తొలిదశలో కూడా చేయలేదు. భారతదేశంలో పెట్టుబడిదారీవర్గం లాభాల్ని పొంది ప్రజలు తీవ్రమైన కష్టాలుపడిన ఆర్థిక సంక్షోభపు రోజులనుంచీ సాయుధ విప్లవమే జాతి విముక్తికి మార్గం అని బోధిస్తున్న నేటివరకూ కొ.కు. మనిషిమీద విశ్వాసంతోనే రచయితగా జీవించాడు. "దేవుడి పుట్టుకే పాపిష్టిది" (కొ. కు.). ప్రకృతి శక్తుల మధ్య సంబం ధాల్నీ, ప్రకృతిలో సంభవించే సంఘటనల్నీ మానవత్వ, జంతు, దైవత్వ ఆరోపణ చేయటం వర్గేతర సమాజ జీవితంలో అనివార్యం. తర్వాత వర్గ సమాజంలో ఈ ఆరోపణలకే మతరూపం ఇవ్వడం జరిగింది. వర్గసమాజంలోనే మానవులమీద అధికారం చెలాయించే దుష్టశక్తిగా దేవుడు పాలకవర్గం పాలుతాగి పెరిగాడు అందుకే దేవుడి జన్మ పాపిష్టిది అన్నాడు కొ.కు. "సమష్టి దృక్పథం పోయి వ్యష్టి దృక్పథం వచ్చేసరికి దేవుడి అవసరం కలుగుతున్నట్టు కనిపిస్తుంది" (కొ.కు.) ఆదిమగణ సమాజాల్లోనేకాదు వర్గసమాజాల్లో కూడా సమష్టి దృక్పథం వున్నప్పుడు భక్తులకు కూడా దేవుని గురించిన స్పృహ వుండదు. దేవుడిని పదిమంది కలిసి చూపినట్టు చెప్పటం ఎక్కడాలేదు. ఎవడు చూసినా ఒంటరిగానే చూశాడు. దేవుడు కూడా పక్క

వాడికి కూడా కనబడకుండా తన భక్తుడికే కనబడటం జరిగినట్లు ప్రచారంలో వుంది. సమాజాన్ని వదిలిపెట్టిన వాళ్ళకీ జీవించటం మానేసినవాళ్ళకీ దేవుడి అవసరం ఎక్కువలా వుంది. అడవుల్లోనూ, కొండల్లోనూ ఏకాంతవాసం చేసేవాళ్ళకి తప్ప దేవుడు ఎవరికీ ప్రత్యక్షంగా కనబడినట్టు లేదు. సమష్టి కార్యాల్లో దేవుడి ప్రసక్తిని తేవడం, ప్రమేయాన్ని నిరూపించడం కష్టం. స్వాతంత్ర్య ఉద్యమానికీ, అక్టోబర్ విప్లవానికీ దేవుడు కారణం అంటే జనం మొఖంమీద వుమ్మేస్తారు. సమష్టి దృక్పథం సమష్టి కార్యాచరణ నుంచీ పెరుగుతుంది. సమష్టి కార్యాచరణ పెరిగే పరిణామంలో దేవుడిని గురించిన ఆలోచన కూడా తరుగుతూ వస్తుంది.

"హేతువాదాన్ని నమ్మాలన్న ప్రేరణ ప్రతివ్యక్తిలోనూ వుంటుంది. దాన్ని సక్రమంగా పని చెయ్యకుండా చెయ్యడమే దేవుడిపాత్ర" (కొ.కు.) దేవుడిని గురించి ప్రచారం చేసేవాళ్ళు పరమ హాస్యాస్పదమైన వ్యక్తులు. పళ్ళపొడిని గురించీ, అమృతాంజనం గురించీ ప్రచారం చెయ్యటంలో అన్నా అర్థం వుంది. దేవుడిని జనం నమ్మటం వల్ల ప్రయోజనాన్ని పొందే స్వార్థపర వర్గాలు వున్నాయి. అందుకని జనం ఎక్కడ మరచిపోతారో అని ఈ వర్గాలు దేవుడిని గురించి ప్రచారం చేస్తూ వుంటాయి. దేవుడికీ మన నిత్య జీవితానికీ సంబంధం వున్నట్టు ఒక్క వుదాహరణ కూడా ఇవ్వలేం. హేతువాది కాకుండా మనిషి ఒక్క చిన్నపని కూడా చెయ్యలేడు. ఆశ్చర్యం ఏమంటే హేతువాదం చెయ్యకుండా దేవుడిని గురించిన ప్రచారం కూడా చెయ్యడం సాధ్యం కాదు. "కష్ట సుఖాలు మిధ్య అనుకొని రెండింటికీ అతీతంగా వుండమని మతబోధకులు చెప్పారు. రెండింటికీ అతీతంగా వుండదలిస్తే జీవించటం దేనికి?" (కొ.కు.) కష్టాల్ని తగ్గించుకుంటూ సుఖాల్ని పెంచుకునే మార్గం చూడాలి కానీ కష్టసుఖాలకి అతీతంగా వుండటం దేనికి? పోనీ అలా చెప్పిన వాళ్ళు నిజంగా కష్ట సుఖాలకి అతీతంగా వున్నారా? పరమ సాధువుగా పేరు తెచ్చుకున్న వినోబాభావే పుష్టికరమైన ఆహారాన్ని తృప్తిగా భోంచేస్తూ జనాన్ని కష్టసుఖాలకి అతీతంగా వుండమంటున్నాడు. దీనికి అర్థం మీరు కష్టపడండి, మేం సుఖంగా వుంటాం అని కాక ఇంకా యేముంది? "మనం మనకి లభ్యమై ఉన్న భౌతిక జ్ఞానాన్నీ, సమాజ జ్ఞానాన్నీ పూర్తిగా సద్వినియోగం చేసుకుంటే మానవ జీవితం చాలా బాగుపడుతుంది." (కొ.కు.) దేవుడూ మతం వంటి వాటి పుట్టుకనూ పాత్రనీ విశ్లేషించి భౌతిక, సమాజ జ్ఞానాన్ని సద్వినియోగం చేసుకోవాల్సిన అవసరాన్ని వివరించటం, అతీతశక్తుల లౌకిక పునాదిని ఎత్తి చూపటం కొ.కు. ఆలోచనా పద్ధతిలో ఒక భాగం.

సాహిత్య కళారంగాలమీద కొ.కు. దృష్టి శాస్త్రీయమైనదే కాదు, విప్లవాత్మక మైనదికూడా. కళని గురించీ సాహిత్యం గురించీ కొ.కు. ఏ రకమైన మూఢ విశ్వాసానికి తావు ఇవ్వలేదు. చాలామంది అభ్యుదయ దృక్పథం వున్నవాళ్ళకి కూడా సాహిత్యంలో మూఢవిశ్వాసాల మీద స్పష్టమైన వైఖరి వున్నప్పటికీ, సాహిత్య స్వరూపంమీద అనేక మూఢవిశ్వాసాలు వుంటాయి. కొ.కు. సాహిత్య స్వరూపాన్ని భౌతికవాద దృక్పథం నుంచి పరిశీలించాడు.

"మన బూర్జువా సంస్కృతి ఫ్యూడల్ సాంకర్యం గలిగినది. ఫ్యూడల్ సంస్కృతిని నిర్మూలించి పైకి వచ్చినది కాదు. దానితో చేతులు కలిపి రాజీపడినది." (కొ.కు.) ఈ ఒక్క వాక్యంలో కొ.కు. ఆధునిక సామాజిక వ్యవస్థని బహుముఖం గానూ లోతుగానూ విశ్లేషించాడు. మన సాంస్కృతిక రంగాన్ని అర్థం చేసుకోవ టానికి ఈ సూత్రీకరణ ఎంతో వుపయోగపడుతుంది. పారిశ్రామిక పునాదిమీదకూడా ఫ్యూడల్ భావజాలపు జెండా ఎగురుతూ వుండటం మన సాంస్కృతిక పోరాటాన్ని సంకీర్ణం చేస్తూ వుంది. మనం దేన్నీ సరళరేఖలో అర్థం చేసుకోలేం. అన్నీ వక్ర రేఖలే. కొన్ని సందర్భాల్లో బిందువును గుర్తించడం అసాధ్యం అయిపోతుంది. బూర్జువా సంస్కృతి ఆకారం ఫ్యూడల్ సంస్కృతి సారాంశం. చాలామంది ప్రముఖ ఆధునిక రచయితలు వాస్తవానికి సారాంశంలో ఫ్యూడల్ భావజాలంవున్న రచయితలే. అభ్యుదయ రచయితల్లో కూడా ఎంతోమంది భూస్వామ్య ఆలోచనా పద్ధతుల్ని వదిలించుకోలేకపోయారు. వీళ్ళకి తెలిసిన మార్క్సిజాన్ని తమ ఫ్యూడల్ భావజాల చట్రంలో ఇమిడ్చారు. లెనిన్‌ని అవతార పురుషుడుగా వర్ణించిన అభ్యుదయ కవులూ, మార్క్స్‌ని మహర్షి చేసిన అభ్యుదయ కవులూ వున్నారు. హిందూమతాన్ని నిరాక రించి బౌద్ధధర్మాన్నీ, క్రైస్తవ మతాన్నీ ప్రస్తుతించిన అభ్యుదయ మేధావులు వున్నారు. యువకుడుగా వున్నప్పుడు మార్క్సిస్టు వీరాలాపనల్ని చేసి నడివయస్సు నుంచీ యం.యన్. రాయ్‌నో, అరవిందునో, జిల్లెళ్ళమూడి అమ్మనో ఆశ్రయించిన వాళ్ళు ఎంతోమంది వున్నారు. మార్క్సిజానికి ఈ గతి పట్టడానికి కారణం మౌలికంగా ఫ్యూడల్ భావజాలం నుంచి బయట పడకపోవడమే. యౌవనంలో ప్రగతిశీలవాదం చేసి ముసలితనంలో భగవద్గీత పారాయణంచేసే సంకరజాతి వుండటానికి కూడా ఇదే కారణం. ఫ్యూడల్, బూర్జువా సంస్కృతుల సాలెగూడులో పడకుండా తుదివరకూ అభ్యుదయ, విప్లవవాదిగా నిలచిన రచయిత కొ.కు. ప్రాచీన, ఆధునిక సంస్కృతిని గురించి సామాజిక, వర్గ విశ్లేషణ చేయడంలో కూడా కొ.కు.కి మన ఆధునిక సంస్కృతిమీద వుండిన ఈ అవగాహనే దోహదం చేసింది.

"సాహిత్యంలో జీవిత విశ్లేషణ వుంటుంది. జీవితం స్పష్టం చేయలేనిదాన్ని సాహిత్యం స్పష్టం చేస్తుంది" (కొ.కు.)

జీవిత పరిభాషలోనే సాహిత్యం వుంటుంది. జీవితం నుంచీ జీవితాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవడం కష్టం కావచ్చు. జీవితం తన తత్త్వాన్ని తానే స్పష్టం చేయలేదు. ఎంత నిశితమైన దృష్టి వున్నా యే ఇతర సాధనాల సహకారం లేకుండా జీవితాన్ని విశ్లేషించటం సాధ్యం కాదు. సాహిత్యంలో జీవితం ప్రతిబింబిస్తుంది కాబట్టి జీవితాన్ని గురించి సాహిత్యం నుంచీ అవగాహన చేసుకోవడం సాధ్యం అవుతుంది. సాహిత్యానికి, జీవితానికి ఈ శాస్త్రీయ సంబంధాన్ని అంగీకరించాడు కాబట్టే- "ఈనాడు రచయితలకు పెద్దగా భాషాజ్ఞానమూ, పాండిత్యమూ ప్రాచీన సాహిత్య పరిచయమూ అవసరము లేదన్నది యేనాడో నిర్ణయమయింది. కానీ వారికి ప్రపంచ జ్ఞానమూ, జీవితానుభవమూ సామాజిక దృక్పథమూ కూడా అవసరం లేదన్నది రాను రాను రుజువవుతున్నది. ఇతివృత్తాలలోగాని, పాత్రపోషణలోగాని, సన్నివేశాలలో గాని ఎలాటి వాస్తవికతా అవసరం లేదు" అని వ్యంగ్యంగా అన్నాడు. భాషాజ్ఞానం, పాండిత్యం, ప్రాచీన సాహిత్య పరిచయం ఈనాటి కవులకి అవసరం అనేది కొ.కు. అభిప్రాయం. వీటికంటే ముఖ్యంగా ప్రపంచ జ్ఞానం, జీవితానుభవం, సామాజిక దృక్పథం వాస్తవిక రచనలు చేయటానికి, అంటే సాహిత్యంలో జీవిత విశ్లేషణని స్పష్టం చేయటానికి చాలా అవసరమనేది కొ.కు. అభిప్రాయం. ఈ విశ్లేషణా దృష్టి గల కథల్నీ నవలల్నీ చదవటం మన పాఠకులకి అలవాటు లేదు. జీవితాన్ని స్పష్టం చేయకుండా వీలైనంత గందరగోళ పరచీ సాహిత్యాన్ని, విశ్లేషణా ఫలితమైన ఆలోచనకన్నా వర్ణనా ఫలితమైన ఆవేశంపాలు ఎక్కువ వున్న సాహిత్యాన్ని మాత్రమే మన పాఠకులు చదవగలరు. ఈ విస్పష్టమైన జీవిత విశ్లేషణా అంశం అధికంగా వుండటం వల్లనే కొ.కు. కథలకీ, నవలలకీ అనన్య ప్రచారం రాలేదు. అయితే కాలగమనంలో తెలుగు పాఠకులు కొ.కు. సాహిత్యాన్ని సమీపిస్తారు. అధ్యయన పద్ధతిలో మనం ఎదిగామా లేదా అనే దానికి కొ.కు. నవలల్నీ కథల్నీ ఆసక్తితో చదవగలుగుతున్నామా లేదా అనేది కొలబద్దగా వుండేదశ తప్పకుండా వస్తుంది. మనం అటువేపే నడుస్తున్నాం. జీవిత విశ్లేషణ వివరణ శాస్త్రాల లక్ష్యమనీ, వర్ణన ఆవేశం సాహిత్య లక్షణమని చాలామందికి తప్పుడు అభిప్రాయం వుంది. ఎక్కువ చదివితే 'సృజనాత్మక' రచనలు చెయ్యలేమని ప్రకటించిన చాలామంది బాల రచయితలు మనకి అసంఖ్యాకంగా వున్నారు. యేమీ చదవకుండా యేమీ తెలియకుండా వీళ్ళు యేమిటి, ఎలా రాయదల్చుకున్నారో మనకి తెలీదు. చదివినదాన్నీ, తెలుసుకున్న దాన్నీ

రచనకి ఎరువులుగా ఉపయోగించుకోవటం చాతగాక అసలు చదువే వద్దు, తెలుసుకోనే వద్దు అనడం అర్థరహితం.

"ప్రజల అనుభవాన్ని స్పృశించలేని కళ సిద్ధాంతరీత్యా ఎంతో ఉదాత్తమైనది అయినప్పటికీ అది ప్రజలలో వాంఛనీయమైన అభిరుచులను పెంపొందించలేదు" (కొ.కు.) రచనలో జీవితాన్ని విశ్లేషించటం అంటే జీవితానికి సిద్ధాంతాన్ని ప్రత్యామ్నాయం చెయ్యటం కాదు. జీవిత విశ్లేషణకీ, జీవిత చిత్రణకీ సిద్ధాంతాన్ని వుపయోగించుకోవటం. కళలో విశ్లేషణద్వారా విస్పష్టం చేయదలుచుకున్న జీవితాన్ని ప్రజల అనుభవాన్ని స్పృశించే విధంగా చేయగలిగినప్పుడే అది మంచి రచన అనిపించుకుంటుంది. కథలోనో, నవలలోనో బిందువునుంచీ కదిలిన జీవిత విశ్లేషణా రేఖని మధ్యలో ఆపి సిద్ధాంత ఉపన్యాసం యిస్తే దాని రేఖాస్వరూపం చెడిపోతుంది. ఇలాంటి రచయితలవల్ల సాహిత్యానికీ జీవితానికీ కూడా నష్టమే.

సాహిత్య విమర్శ — పోనీ, విమర్శ సాహిత్యంలో సంస్కృతిలో ఒక భాగం. కాస్త శాస్త్రిల్లోనూ శాస్త్ర చర్చల్లోనూ పరిచయం వున్నవాళ్ళకి విమర్శ స్వరూపం ఇంకా లోతుగా తెలుసు. విమర్శ, వాదోపవాదాలు చర్చాంశ ప్రతిదాంట్లోనూ అనివార్యంగా వుంటుంది. వాదోపవాదాలూ, విమర్శలేకుండా శాస్త్రం కానీ, సంస్కృతి కానీ పురోగమించవు. వాదోపవాదాలకి దూరంగా శాస్త్రజ్ఞుడు పరిశోధనలో నిమగ్నం కావచ్చు. కానీ ఆ పరిశోధనని రాసేటప్పుడు దానిలో అంతర్లీనంగా అయినా వాదోపవాద అంశం వుంటుంది. కుటుంబరావుకి వాదోపవాదాలన్నా, చర్చ అన్నా చాలా ఆసక్తి. ఆయన సృజనాత్మక రచనల్లో కూడా విమర్శ వుంటుంది. అందుకని కుటుంబరావు విమర్శని కేవలం రూఢి అర్థంలో ప్రచారంలో వున్న విమర్శగా భావించకూడదు. ఆధునిక విజ్ఞానశాస్త్రిల నుంచీ మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల రచనా పద్ధతి నుంచీ రూపొందిన భౌతిక గతితర్క విమర్శ, విమర్శనాంశం లేకుండా కొ.కు. చేసిన రచన అంటూ లేదు.

"సాహిత్యంలో సంఘర్షణలు సిద్ధాంత సంఘర్షణలే. ఇది గిడుగుమీద విమర్శల్తో ప్రారంభం అయింది. విరసం మీద విమర్శతో కొనసాగుతోంది." (కొ.కు.) సాహిత్యంలో సంఘర్షణలు కేవలం వాదవినోదులైన రచయితల మధ్య సంఘర్షణలు కావు. అవి సిద్ధాంతపరమైన సంఘర్షణలు. మధ్య యుగాల సాహిత్యంలో సంఘర్షణలు జరగకపోలేదు. కానీ అవి సిద్ధాంత సంఘర్షణలు కావు. వాటి ఆకారంలో భేదమే కానీ సారాంశంలో అవి అన్నీ భావవాదాలే. గిడుగు వ్యవహారిక భాషా వుద్యమం

బూర్జువా వర్గ ఉద్యమం. భాషా విషయంలో తరతరాలుగా వస్తున్న ఫ్యూడల్ భావ జాలంమీద గిడుగు యుద్ధం చేశాడు. వ్యవహారిక భాషావాదం వరకూ గిడుగు భౌతిక వాద పరిధిలోనే చేశాడు. గ్రాంధిక భాషావాదులు ఆ వాదాన్ని ఆధ్యాత్మికవాద పునాది నుంచీ చేశారు. అందుకనే గిడుగుమీద విమర్శలు సిద్ధాంత సంఘర్షణలు. విరసం మీద విమర్శలు స్పష్టంగానే సిద్ధాంత సంఘర్షణలు. గతితార్కిక భౌతికవాదులకీ నానారకాల భావవాదులకీ మధ్య సంఘర్షణయే విరసం మీద వస్తున్న విమర్శలకి పునాది. కొ.కు. విరసం మీద వచ్చిన విమర్శల్ని సాహిత్యంలో సిద్ధాంత సంఘర్షణలుగా భావించే వాదోపవాదాలు చేశాడు. విరసాన్ని వ్యతిరేకిస్తున్న వాళ్ళ సిద్ధాంత పునాదిని ఎత్తి చూపించాడు. "విమర్శ అనేది ఒక రకం ప్రచారం" (కొ. కు.) ప్రచారం అంటే ఒక విషయాన్ని అందరికీ తెలియజేస్తూ ఆ విషయం మీద సుముఖం చేయటానికి ప్రయత్నం చేయటం. ఏ రంగంలో అయినా విమర్శ వ్యాపారం ఇదే. సాహిత్యం లోనూ, శాస్త్రంలోనూ కూడా ప్రచారాంశం వుండినా వాటి ప్రధాన వ్యాపారం అది కాదు. శాస్త్ర విషయాన్ని కానీ, సాహిత్య విషయాన్ని కానీ అశాస్త్రీయ, భ్రమాజనిత సిద్ధాంతాల నుంచీ విముక్తం చేస్తూ ప్రజల్లో సరియైన అవగాహనని కలిగించటం విమర్శ లక్ష్యం. సాహిత్య కళారంగంలో కంటే శాస్త్రంలో కంటే విమర్శలో వర్గ స్వభావం ఎక్కువగా వుంటుంది. సాహిత్యంలో వ్యక్తం అవుతున్న వర్గ పునాదిని విశ్లేషిస్తూ ప్రగతి శీలవర్గ పోరాటం వైపు సాహిత్యాన్ని మళ్ళించే కార్యక్రమాన్ని విమర్శ నిర్వహిస్తుంది. శాస్త్ర పరిశోధనలకి వస్తుతః వర్గ స్వభావం లేకపోయినా జీవి తానికి అన్వయించటంలో, వుత్పత్తి రంగంలో వుపయోగించటంలో వర్గస్వభావం వుంటుంది. ఆ వర్గ స్వభావాన్ని వివరిస్తూ శాస్త్రపరిశోధనల్ని ప్రజాపరం చేయటానికి విమర్శ ఆయుధంగా ప్రయోగించబడుతుంది. కళాసాహిత్య రంగాల్లో కంటే కూడా సామాజిక, విజ్ఞాన శాస్త్ర రంగాల్లో విమర్శ నిశిత ప్రచారసాధనంగా పనిచేస్తుంది. కొ. కు. తన విమర్శని ఈ విస్తృతార్థంలోనే ప్రచార సాధనంగా వుపయోగించాడు. ప్రచార సాధనంగా విమర్శ ఎలా వుండాలి?

"విమర్శలో కూడా నిజానికి కొన్ని లోపాలుండే అవకాశం వున్నది. ఆ సంగతి గుర్తించటం అవసరం. అందులో ఒకటి తెలిసినవాడికే తెలియ చెప్పటం. జీవితం తాలూకు అనేక రంగాలలో ఇలాంటివి చూస్తాం. మతం వారిని మాత్రమే మెప్పించే మతప్రచారం. కమ్యూనిస్టు భావాలను ఆమోదించిన వారిని మాత్రమే ఆనందపరిచే కమ్యూనిస్టు ప్రచారం. మార్క్సిస్టు దృక్పథం గలవారికి మాత్రమే అర్థమయ్యే కళావిమర్శ" (కొ. కు.) ఒక ప్రచారంగా విమర్శ వుద్దేశం ఏమిటి?

తాను ప్రచారం చేయదలచుకున్న విషయం తెలియని వాళ్ళకి తెలియచేయటం. తాను ప్రచారం చేయదలుచుకున్న విషయాన్ని ఆమోదించని వాళ్ళకూడా ఆమోదించే పద్ధతిలో చెప్పటానికి ప్రయత్నించటం. ఇది కమ్యూనిస్టులు తీవ్రంగా ఆలోచించ వలసిన విషయం. మార్క్సిస్టులకే మార్క్సిజాన్ని చెపుతూ కూర్చోవటం, మార్క్సిస్టులకే అర్థమయ్యే విధంగా మార్క్సిస్టు దృక్పథాన్ని గురించి రాయటంవల్ల ఏమి ప్రయోజనం వుంది? ఎంతవరకు ప్రయోజనం వుంది? బతుకంతా మార్క్సిస్టులకే పాఠశాలలుపెట్టి మార్క్సిజాన్ని చెప్పటం పనికివచ్చే పనేనా? కొ.కు. రచనా పద్ధతి మార్క్సిస్టులు కానివాళ్ళకి మార్క్సిజాన్ని చెప్పటానికి వీలుగా వుంటుంది. మార్క్సిస్టులు కానివాళ్ళు మార్క్సిజాన్ని ఆమోదించే తార్కిక పద్ధతిలో వుంటుంది.

"మానవ సమాజంలో రెండు తాత్త్విక దృక్పథాలున్నాయి. ఒకటి భౌతిక వాదం. రెండు ఆధ్యాత్మికవాదం. ఈ రెంటి మధ్యా వైరుధ్యం వున్నది" (కొ. కు.). కుటుంబరావు భౌతికవాది. భౌతకవాద కోణంనుంచీ జీవితాన్ని సాహిత్యాన్నీ చరిత్రనీ, విజ్ఞాన శాస్త్రాల్నీ పరిశీలించాడు. ప్రధానంగా కుటుంబరావు భౌతిక వాదానికి విజ్ఞాన శాస్త్రాలు పునాది, విజ్ఞాన శాస్త్రాలు భౌతికవాదానికి ప్రమాణాలు అయినప్పటికీ చాలా మంది శాస్త్రజ్ఞులు ఆధ్యాత్మికవాదులుగా వుండిన విషయం అందరికీ తెల్సిందే. సామాజిక సమస్యలకి విజ్ఞానశాస్త్ర పరిశోధనల్ని అన్వయించుకోలేక చాలామంది శాస్త్రజ్ఞులు ఆధ్యాత్మికవాద సుడిగుండంలో పడిపోయారు. కుటుంబరావు ఆదినుంచీ భౌతికవాది. ఆదినుంచీ అంటే సాహిత్యరచన ప్రారంభించినప్పటి నుంచీ. 1940 ప్రాంతంలోనే కుటుంబరావు మార్క్సిజాన్ని అధ్యయనం చేశాడు. సమాజానికీ, సాహిత్యానికీ వున్న సంబంధాన్ని విజ్ఞాన శాస్త్రాలనుంచీ గ్రహించి మార్క్సిస్టు దృక్పథంతో సుసంపన్నం చేసుకున్నాడు. నవలల్లో, కథల్లో ఒక సంఘటనని చిత్రించేటప్పుడు దానికి కారణమైన యంత్రాంగాన్ని వర్ణించటం, మానవ సంబంధాల్ని హేతుబద్ధంగా వర్ణించటం కుటుంబరావు శాస్త్రీయ దృక్పథానికి ప్రమాణాలు. కార్యకారణ యంత్రాంగాన్ని ప్రదర్శించకుండా రాసే అలవాటు కుటుంబరావుకి లేదు. పదార్థం అంటే మనిషి మనస్సుకి బాహ్యంగా స్వతంత్రంగా వుండేది మాత్రమే అని అర్థం కాదు. మనిషి ఇంద్రియాలమీద పని చేస్తూ ఆ యింద్రియాల నుంచీ ఇంద్రియజ్ఞానాల్ని పుట్టించే బాహ్యావాస్తవికత అని అర్థం. ఇలా నిర్వచించుకోలేకపోతే పదార్థానికీ మనుషులకీ సంబంధం వుందని చెప్పలేం. పదార్థం వున్నదనీ చెప్పలేం. పాత్రల చలనాలూ, సన్నివేశాలూ స్పష్టంగా పాఠకుని హేతువుని కదిలించేవిగా చిత్రించటం కుటుంబరావు సాహిత్యతత్త్వం. అభ్యుదయ సాహిత్య ఉద్యమంలో వున్నప్పటి నుంచీ సాహిత్యానికుండే విప్లవకర

శక్తిని వివరిస్తూనే వచ్చాడు. 1970 లో విరసంతో కలిసినప్పటి నుంచీ భౌతికవాదాన్ని, విప్లవాన్ని సాహిత్యానికి రెండు కళ్ళుగా చెపుతూ వచ్చాడు. మార్క్సిజాన్ని ఆమోదించని వాడు, మార్క్సిస్టు కానివాడు విప్లవ రచయిత కాజాలడని ప్రకటించాడు.

"విప్లవం అనేది భౌతికవాదం నుంచీ తప్ప పుట్టజాలదు. విప్లవం అంటే విరుచుకుపడిపోయి నోట నురుగులు కక్కేవాళ్ళు అజ్ఞానులు. ఎందుచేతనంటే ఎన్నో విప్లవ దశలు గడవకుండా మనం ఇక్కడిదాకా రాలేదు. గతసమాజంలోని విప్లవాల సత్ఫలితాలన్నిటినీ పుష్కలంగా అనుభవిస్తున్నవాళ్ళే భావి విప్లవాలను గురించి దడ దడలాడుతున్నారు. మనం ఇవాళ అత్యున్నతమైన సామాజిక దశకు వచ్చామనుకునే మూర్ఖులు, ఈ వ్యవస్థలో సుఖజీవనం గడుపుతున్నామనుకునేవాళ్ళు తప్ప ఎవరూ విప్లవపరిణామాలు రాకూడదని అనుకోరు" (కొ.కు.) భౌతికవాది కానివాడు విప్లవాన్ని సాధించలేడు. విప్లవాన్ని ఆమోదించలేడు. సామాజిక విప్లవాన్ని వ్యతిరేకించటానికి నిజానికి ఎవరికీ ఏమీ కారణంలేదు. అయితే ఈ వ్యవస్థలో సుఖజీవితం గడుపుతున్నామనుకునేవాళ్ళు ఈ వ్యవస్థతోబాటు తమ సుఖజీవితం కూడా పోతుందని విప్లవాన్ని నిరాకరిస్తున్నారు. నిజానికి విప్లవంవల్ల అందరూ ఇంకా సుఖజీవితం పొందవచ్చు.

"జీవిత పరిణామం, ప్రజాపోరాటం మీద ఆధారపడివున్నది. ఆ పోరాటంలో ప్రజల చేతిలో వజ్రాయుధంలా పనిచేసేదే నిజమైన సాహిత్యం. అదే విప్లవ సాహిత్యం. ఇందుకు అంగీకరించనివారు జీవితపరిణామం ప్రజాపోరాటం మీద ఆధారపడలేదని రుజువుచెయ్యాలి. చెయ్యలేదు" (కొ.కు.) విప్లవంలో సాహిత్యం విప్లవకారుల చేతుల్లో ఆయుధంగా వుండాలి అనే స్పష్టమైన వైఖరి కొ. కు. విరసం దశాబ్దంలోనే తీసుకున్నారు. కొ. కు. సాహిత్య విమర్శలో 1970 ముందూ తర్వాత చాలా మార్పువుంది. విరసానికి పూర్వం కొ. కు. సాహిత్య విమర్శ కొ. కు. సాహిత్యానికి విమర్శ వంటిదే. విరసం దశాబ్దిలో కొ. కు. సాహిత్య విమర్శ మార్క్సిస్టు సాహిత్య విమర్శగా స్పష్టంగా వుంది. విరసం తెలుగు సాహిత్య విమర్శలో సాధించిన విజయాలకి మార్గదర్శక సూత్రాల్ని నిర్మించింది కుటుంబరావే.

కుటుంబరావు అసాధారణశక్తుల కీకారణ్యంలోకూడా ప్రవేశించారు. ఈ విషయంలో మాత్రం అభిమానులు కూడా అనుసరించలేదు. కొ.కు. అభిమానులు భజన మందిరాలలో నిలయవిద్వాంసులుకాదు. భౌతికవాదాన్నీ, అభ్యుదయ సాహిత్యాన్నీ విజ్ఞానశాస్త్రాన్నీ విప్లవాన్నీ అభిమానించేవాళ్ళు కొ.కు. అభిమానులు. శ్రీశ్రీ అభి

ప్రాయాల్ని ఆమోదించనివాళ్ళు, శ్రీశ్రీ కవిత్వాన్ని అభినందించిన సందర్భాలు వున్నాయి. ఇది మోసమో, అమాయకత్వమో చెప్పలేం కానీ ఇది వాస్తవం. కొ.కు. అభిప్రాయాల్ని ఆమోదించేవాళ్ళే ఆయన సాహిత్యాన్నికూడా ఆమోదించారు. అందుకనే కుటుంబరావు బుద్ధికొలత సిద్ధాంతాన్ని కానీ అసాధారణ శక్తులమీద ఆసక్తినికానీ ఆయన అభిమానులు తీవ్రంగా వ్యతిరేకించారు. ఇన్‌ట్యూషన్. ప్రికాగ్నిషన్, సైకిక్ పవర్‌వంటి వాటిని గురించి కొ.కు. చాలాకాలంనుంచీ చెపుతూనే వున్నాడు. ఇదంతా ప్యారా సైకాలజీకి సంబంధించింది. అసలు సైకాలజీకి సబ్జక్టివ్ సైకాలజీకి ఇంకా శాస్త్ర ప్రతిష్ఠ రాలేదు. ఇక ప్యారా సైకాలజీని ఎక్కడ భరించేది. రష్యాలోనూ, అమెరికాలోనూ ఆ మాటకొస్తే ఇండియాలోనూ కూడా పేరా సైకాలజీని గురించి విస్తృతంగా పరిశోధనలు జరుగుతూనే వున్నాయి. ఎవరో వేద వ్యాసు డట (భారతం రాసిన ఆయనకాదు, ఐ. ఎ. ఎస్. వేదవ్యాసుడు) సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధనలు అనే పుస్తకం ఒకటి రాసాడు తెలుగులో. అదంతా ప్యారా సైకాలజీకి సంబంధించిందే. కానీ ఇక్కడ 'ఆధ్యాత్మిక' అనే మాట వాడడం తప్పు. అసాధారణ లేదా ఇంద్రియేతర శక్తుల పరిశోధనలు అనాలి. మత విషయాలతో ఆధునిక విజ్ఞాన శాస్త్ర పరిశోధనల్ని హాస్యాస్పదంగా అన్వయించే చిన్మయానందస్వామిలాంటి వాళ్ళకి ప్యారా సైకాలజీ పేరుతో జరుగుతున్న పరిశోధనలు ఇంకా విందు చేస్తాయి. ప్యారా సైకాలజీలో కూడా కొ. కు. Extra sensory perception (E.S.P.) కి సంబంధించిన పరిశోధనల్ని మాత్రమే చర్చలోకి తీసుకున్నాడు. ఈ విషయంలో J. B. S. Haldane నుంచీ కొ. కు. స్ఫూర్తి తీసుకున్నట్టు కనిపిస్తుంది.

"I do not see why a dialectical materialist should reject a priori the possibility of such alleged phenomena as telepathy and clairvoyance" టెలిపతి దూరదృష్టి దూరశ్రవణాలవంటి విషయాలు సంభవతని గతితార్కిక భౌతికవాదిముందే ఎందుకు నిరాకరించాలో నా కర్థం కావడంలేదు" అన్నాడు హాల్డేన్. ఏ విషయంమీద పరిశోధనని అయినా గతితార్కిక భౌతికవాది నిరాకరించడు. పరిశోధనలో, పరిశీలనలో, ఆచరణలో రుజువుకాకుండా గతితార్కిక భౌతికవాది దేన్నీ అంగీకరించడు. "Whoever believes that the only important reality is the realm of ideas of the spirit, should not occupy himself with science ('Born?')" "భావాలు మాత్రమే ఆత్మమాత్రమే వాస్తవం అని విశ్వసించేవాడు విజ్ఞానశాస్త్రంతో వ్యవహరించటం అనవసరం" అని

ఒక శాస్త్రజ్ఞుడు స్పష్టంగా చెప్పాడు. మార్క్సిజాన్ని అవగాహన చేసుకోవటంలో హాల్డేన్ చాలా సందర్భాల్లో దారితప్పిపోయాడు. ఏ విషయాన్ని అయినా భౌతిక జీవితంనుంచీ పదార్థక్రమంనుంచీ వివరించటానికి పూనుకోవాలికానీ భావాలనుంచీ, ఆత్మనుంచీకాదు. కొ. కు. పాశ్చాత్యదేశాల్లో జరిగిన పరిశోధనల్ని చదివి వెయ్యాల్టీ భూతాల్నీ తన వాదానికి ఉదాహరణగా చెప్పటం జరిగింది కానీ ఆయన వాదం వాటికే పరిమితంగాలేదు. పరలోకాల్నీ, అతీతశక్తుల్నీ, ఆత్మనీ కొ.కు. అంగీకరించాడనటం వాస్తవం కాదు. మనిషి మెదడునుంచే బుద్ధికొలత సిద్ధాంతాన్ని చెప్పాడు. Quantum mechanics, సాపేక్షసిద్ధాంతం వెలుగులో బుద్ధికొలతని గురించి వివరించటానికి ప్రయత్నించాడు. మానసిక ఘటనలు ఒక కాలానికి ఒక స్థలానికి బద్ధంగా వుండవు. "The ability or memory was not located in any special place" (J. B. S. Haldane). క్వాంటమ్ మెకానిక్స్‌లోని Field theory తో కొ.కు. బుద్ధికొలత సిద్ధాంతాన్ని అన్వయించాడు. జామ చెట్టునుంచి జామకాయలు పడుతున్నప్పుడు దాని చలనం పదార్థ అంశమే. దానికి ఆ సమయంలో స్థల కాల చలనం విడిగా వుండదు. స్థల కాలాలు యేకమైన సూక్ష్మచలన రూపం అది. అలాగే బుద్ధికొలత సిద్ధాంతం స్థల కాలాలతో అధీనంకాని మెదడుతో సంబంధం వుండిన నైపుణ్యాన్ని బుద్ధికొలత అన్నాడు. ఈ నైపుణ్యం అసాధారణంగా కొంతమందికే ఎందుకు వుంటుంది, అందరికీ ఎందుకు వుండదు అనేదానికి కొ. కు. దగ్గర సమాధానం లేదు. నిజానికి కొ.కు. ఈ బుద్ధికొలత సిద్ధాంతంతో బాధపడివుండటం అనవసరం. తనకే స్పష్టంకాని విషయాన్ని చెప్పటానికి ప్రయత్నిస్తే మిగిలేది గందరగోళమే. శకుంతల లెక్కలు వేగంగా పరిష్కరించటంలో ఆశ్చర్యం యేముంది? సాధనతో అది సాధ్యం ఎందుకు కాదు? మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావోల్లో కూడా అసాధారణశక్తులు వున్నాయని కొ.కు. అనడం మరీ దిగ్భ్రమ కలిగించే విషయం. శకుంతలని గణితశాస్త్రంమీద నాలుగు పుస్తకాలు రాయమనండి తేలిపోతుంది అసాధారణశక్తి. అవధాన కవిత్వంలో కవిత్వం ఎంత గొప్పదో శకుంతల గణితశాస్త్ర అవధానంలో గణితశాస్త్రంకూడా అంతే గొప్పది. గణితశాస్త్రానికి ఆమె చేసిన దోహదం యేమీలేదు. కొ.కు. యెన్ని మార్గాల్లో శ్రమపడినా బుద్ధికొలత సిద్ధాంతం అసలు పునాది మార్మిక, యౌగికవాదంలోనే వుంది. అది intuitionism. ఏమన్నా తేడావుందో తెలీదుకాని దేశపాండే పుస్తకానికి డాంగే రాసిన పీఠిక గుర్తుకు వస్తోంది. "Intuition as an instrument of superior knowledge, is a condition of matter in its process of thinking, to which human body

can be conditioned" (The universe of vedanta. page 15). నిజానికి ఈ "అసాధారణ సృజనాత్మక ప్రతిభ"ని గురించి వాల్కోవ్ అనే సోవియట్ శాస్త్రజ్ఞుడు 'Man and the challenge of Technology' అనే పుస్తకంలో చర్చించి నిరాకరించాడు. ఇంద్రియాల్తో సంబంధం లేకుండా మెదడు జ్ఞానాన్ని సంపాదించుకునే అవకాశం వుందనే E S P సిద్ధాంతాన్ని కూడా వాల్కోవ్ ఖండించాడు. "Like every other human faculty, intuition is not entirely inborn, but by training and developing the more general faculty of phantasy, the play of imagination" (Volkov pp. 195–96) అని ప్రతిభ సాధనద్వారా వచ్చేదే అని చెప్పాడు. కాస్త అజాగ్రత్తగా చదివితే వాల్కోవ్ వాక్యాల్లో బుద్ధి కొలత సిద్ధాంతానికి పునాదులు కనిపించే మాట వాస్తవమే. రష్యావాళ్ళు మానసికమైన, శారీరకమైన అసాధారణ శక్తుల్ని (mystic powers) అధ్యయనం చేయటానికి 'Psychotronics' అనే కుహనా శాస్త్రాన్ని ప్రచారం చేశారు. కుటుంబరావు బుద్ధికొలత సిద్ధాంతానికి పతంజలి యోగశాస్త్రం నుంచీ ఈ రష్యా వికారుల కుహనా శాస్త్రం దాకా అన్నీ అనారోగ్యకరమైన మత్తుపదార్థాలుగా వుపయోగపడ్డాయి. ఆలివర్ లాడ్జ్ లోకాంతర విషయాల్ని మీడియంద్వారా విన్నాడని కొ.కు. పరవశించిపోయాడు. తన సిద్ధాంతానికి అనుకూలమైనవిగా వుండే వాటిని నిర్విచక్షణగా వుపయోగించటానికి కూడా చివరిదశలో కొ.కు. వెనుదీయలేదు.

"మెదడులో Cerebral Cortex కి మాత్రమే సంబంధంలేని విషయాలు వున్నాయి. ఇంద్రియాల ద్వారా జ్ఞానం పొందటం అనేది ఈ Cortex ద్వారా సాధ్యం అవుతున్నమాట నిజమే. Nonsensory functioning కూ మెదడుకీ వుండే Space-Time rules బుద్ధి కొలతకి వర్తించవు" (కొ.కు.) మెదడులో Cerebral Cortex కి మాత్రమే సంబంధంలేని విషయాలు కూడా వున్నమాట నిజమే. కానీ వాటికి ఇంద్రియాల్తో సంబంధం లేదని చెప్పటానికి ప్రమాణాలు లేవు. బుద్ధికొలత సిద్ధాంతం శాస్త్రీయం అనీ భౌతికవాద పరిధిలోకి వస్తుందనీ కొ.కు. రుజువు చేయటంలో విఫలం అయ్యాడు. అయితే ఈ సిద్ధాంత ప్రభావం కొ.కు. ఇతర రచనల మీద లేదు. ఉద్దేశపూర్వకంగానే లేకుండా చూసుకున్నాడు. అజ్ఞాత విషయాలు వుంటాయి కానీ అతీత విషయాలు వుండవనే తన విశ్వాసంతోనే కొ.కు. బుద్ధికొలత సిద్ధాంతాన్ని వివరించటానికి ప్రయత్నించాడు.

దేశకాలావసరాలకు అనుగుణంగా ఎంచుకున్న

# రచనా ప్రక్రియలు

వరవరరావు

తను చేస్తున్న పనియొక్క స్థూల ప్రయోజనాన్ని
ఏ కళాకారుడూ సంపూర్ణంగా తోసివెయ్యరాదు......
కవి తన రచనయొక్క ఆశయాన్ని తృణీకరించరాదు.
భోజనం దగ్గర ఎంత నాజూకూ, అభిరుచీ వున్నా
అభ్యంతరం లేదు — భోజనం చెయ్యటం యొక్క
ఉద్దేశాన్ని ఏమరకుండా ఉంటే సరి.

—కొ.కు., 1940

సమాజం గురించి నిర్దిష్టమైన అభిప్రాయాలు ఉండి. సమాజానికి తాము అందివ్వ వలసిన సందేశం ఉన్నదనుకొన్నప్పుడు లేదా, సమాజంలో తాము నిర్వహించ వలసిన తక్షణ, అనివార్య కర్తవ్యం ఉన్నదనుకొన్నప్పుడు—రచయితలు ఎక్కువ కాలం కాల్పనిక కళారూపాలకే అంటిపెట్టుకొని ఉండడం సాధ్యంకాదు. రచయితలు ఆలోచనాపరులూ—తాత్వికులూ అయేకొద్దీ లేదా, రచయితలుగా కన్న తమ పాత్ర ప్రచారకులుగా గురుతరమైందని గుర్తించే కొద్దీ, వాళ్ళ దృష్టిలో కల్పనకన్నా కర్త

వ్యానికి ప్రాధాన్యత పెరుగుతుంది. ఆ కర్తవ్యం విశ్వనాథ సత్యనారాయణకు 'హిందూ ధర్మ పునరుత్థానం' కావచ్చు. చలానికి 'ఈశ్వరాన్వేషణ' కావచ్చు. కొడవటిగంటి కుటుంబరావుకు సామ్యవాద చైతన్య ఆవిష్కరణ కావచ్చు. ఎవరైనా తాము నమ్మిన రచనా ప్రయోజనంకోసం కల్పన అనే కుబుసాన్ని విడువక తప్పలేదు.

సుంకర 'మాభూమి' నాటకాన్ని మెచ్చి, గిడుగును పొగడి, శ్రీశ్రీని యుగకర్తగా కొనియాడిన విశ్వనాథ — తన 'కిన్నెరసాని పాటలు', 'కోకిలమ్మ పెళ్లి' వంటి పాటలను, 'వీరవల్లడు', 'పరీక్ష' వంటి నవలలను, ఇంకెన్నెన్నో సాహిత్య ప్రక్రియలను వదిలి 'పురాణ వైర గ్రంథమాల'లో తనను తాను తెలుసుకున్నాడు. ఎక్కడ రాయడం ప్రారంభించినా, తాత్కాలికంగా ఏ జీవిత సత్యాలకు స్పందించినా ఒకానొక ఆవేశపూర్వ ఘట్టంలో ఏ జాతీయోద్యమంతోనో, వాడుకభాషావాదంతోనో కొట్టుకపోయినా, చివరకు 'అరసం' సభలకు అధ్యక్షత వహించినా, తాను సంరక్షించవలసింది ఏ వర్ణ, ఏ వర్గ ప్రయోజనాన్నో గ్రహించినతర్వాత రచనకు సంబంధించిన నాజూకుతనం ఇంక ఆయనకు పట్టలేదు.

ఎప్పుడూ అనుభవించింది పలవరించడమే తన పనిగా చెప్పుకొని కథలు, నవలలు, నాటికలు, ప్రేమలేఖలు, మ్యూజింగ్స్‌వంటి ఎన్నెన్నో సాహిత్య ప్రక్రియలను ప్రయత్నించిన చలం, తన అన్వేషణలోని—నిజాయితీలోని—తపనలోని శక్తి వల్ల రచనకు బలమైన శైలి అబ్బిందని తేల్చిచెప్పిన చలం, 'ఈశ్వరాశీర్వాదాలు ఇహలోకానికి' అందించడమే తన కర్తవ్యంగా తేల్చుకున్న తర్వాత రాసినవి 'వంటింట్లో భగవాన్', బైబిల్, భగవద్గీత అనువాదాలు, "ఈశ్వరాశీర్వాదాలతో" ఉత్తరాలు.

కొడవటిగంటికి సాహిత్య ప్రయోజనంగురించి స్పష్టమైన అభిప్రాయాలున్నాయి. సాహిత్యానికి విశ్వజనీనమైన, సార్వకాలీనమైన విలువలు ఉంటాయని ఆయన ఏనాడూ భ్రమపడలేదు. తన రచనలు శాశ్వతంగా నిలవాలని తాను కోరుకోవటం లేదని ఆయన చెప్పింది వినయం (modesty) వల్ల కాదు, విజ్ఞత (wisdom) వల్ల. ఎందుకంటే ఆయన పదార్థానికున్న మార్పు స్వభావాన్ని ఒంటబట్టించుకున్నాడు. మన కళ్ళ ముందు కనిపిస్తున్న ఈ ప్రపంచం అంతా నిరంతర చలనంలో ఉండి మార్పుకు గురి అవుతూంటే సాహిత్యం ఒక్కటే సర్వకాలీనతను ఎట్లా సంతరించుకుంటుందనేది సైంటిస్టుగా ఆయనకు కలిగిన సందేహం. ఈ సందేహంతో ఆయన భారత, రామాయణాలనే కాదు, వేదాలను, ఉపనిషత్తులను కూడా అధ్యయనం చేసాడు. వేదకాలంనాటి సమాజాన్ని అధ్యయనం చేసాడు. అప్పటికీ, ఇప్పటికీ సామాజిక విలువల్లో

పోల్చుకోవడానికి వీల్లేనంతగా మార్పులు వచ్చాయి. వేదకాలపు సమాజం "నిర్వేదమై" పోయిన స్థితిలో వేదాలు ఈనాటికీ 'వేదవాక్కు'గా మనకెట్లా దిక్కవుతాయి! ఆ నాటి విలువలు ఎంతో రూపాంతరం చెంది కొత్త కొత్త రూపాల్లో ఈనాటి సామాజిక శక్తులకు వారి వారి ప్రయోజనాలకు వినియోగపడవచ్చు. అందుకే ఆయన వాల్మీకి రామాయణంమీద కాదు 'రామాయణ కల్పవృక్షం' మీద దాడి చేయమన్నాడు. వాల్మీకి రామాయణంలోని విలువలు 'కల్ప వృక్షం' లాగా నేటికీ వినియోగపడుతాయని చెప్పే గత వాదాన్ని ఖండించమన్నాడు. "చేసిన స్నానమే మరల చేసినట్లు, తిన్న అన్నమే మరల తిన్నట్లు" అనే పరమ యాంత్రిక భౌతికవాద తర్కంతో గతాన్ని పునరుద్ధరించాలని చేస్తున్న కుట్రమీద దాడి చేయమన్నాడు. కన్ఫ్యూషియస్‌ను పెట్టుబడిదారీ పునరుద్ధరణకు వాడుకో జూసిన రివిజనిజాన్ని ఎండగట్టడానికి చైనాలో మహత్తర శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం వచ్చినట్టుగా మన సమాజంలోని మార్పులను నిరోధించడానికి గతాన్ని ఆశ్రయించిన వారిని, గతాన్ని పునరావిష్కరించదలచిన వారిని ఎదుర్కోవాలన్నది ఆయన ఆకాంక్ష.

సాహిత్య ప్రయోజనం గురించి నిర్దిష్టమైన అభిప్రాయా లున్నట్టే, సాహిత్య ప్రక్రియల గురించి కూడా కుటుంబరావుకు నిర్దిష్టమైన అభిప్రాయాలున్నాయి. సమాజానికి ఎటువంటి సాహిత్యం కావాలి, సమాజానికి కావలసిన సాహిత్యంలో తాను ఏ మేరకు ఏ కర్తవ్యాన్ని నిర్వహించగలడనే విషయంలో కూడ ఆయనకు తన రచనా పరిమితులు తెలుసు. అలాగే సాహిత్యానికున్న పరిమితులు తెలుసు, అపరిమిత ప్రయోజనమూ తెలుసు. తనకున్న సామర్థ్యము, దాన్ని పూరాగా వినియోగించగల రంగమూ తెలుసు.

ఆయన అన్నగారైన వెంకటసుబ్బయ్యగారు బతికుండగా తన ఇంట్లో 'సాహితీ సమితి' సమావేశాలయిన రోజుల్లో శివశంకరస్వామినో, నోరి నరసింహశాస్త్రినో చూసి నోరూరినపుడు కవిత్వం రాసి పత్రికలకు పంపాడేమో గాని, "అదృష్టవశాత్తూ" అవి తిరిగివచ్చి, పద్యమంటే ఛందస్సా, అభ్యాసమా, మరొకటా అని వెతుక్కుంటూన్న రోజుల్లోనే—కవిత్వమంటే "మరో ప్రపంచాన్ని" ఆవిష్కరించే కొత్త చూపు, కొత్త ఊపు అని శ్రీశ్రీ 'దేశ చరిత్రలు' గేయం ద్వారా కొ.కు. గ్రహించగలిగాడు. "కదిలేదీ కదిలించేదీ పెను నిద్దుర వదిలించేదీ మునుముందుకు నడిపించేదీ" అయిన కవిత్వం శ్రీశ్రీ కలం నుంచి అప్పటికే వస్తున్నది. అట్టి స్థితిలో, తన సృజనాత్మక శక్తిని సామాజిక ప్రయోజనం కొరకు వినియోగించే ఉద్దేశంతో, ఆధునిక

యుగ స్వభావానికి ఆలోచనా రంగంలో అవసరమైన వచన రచనా ప్రక్రియలను తాను చేపట్టి శ్రీశ్రీకి బాసటగా, దోహదంగా ఉండాలనుకున్నాడు ఆయన. కవిత్వంలో ఆ పని తనకన్న సమర్థవంతంగా శ్రీశ్రీ చేసాడని చాటడమే కొ.కు. కవిత్వం రాయక పోవడం.

కథ, నవలను తన సాహిత్య ప్రక్రియలుగా 1930 ప్రాంతంలో ఎంచుకున్న తర్వాత వాటి ద్వారా ఆయన శక్తివంతంగా చెప్పగలిగింది వలస పరిపాలనా దుష్పరిణామాలను మార్కెట్, సరుకు, డబ్బు, ఆర్థిక మాంద్యం, వలస విద్యా విధానం తెలుగు గ్రామీణవ్యవస్థపై, జీవన విధానంపై వేసిన ప్రభావాన్నీ, అలాగే విజ్ఞానశాస్త్ర విజయాలు అప్పటికున్న విశ్వాసాల కూకటివేళ్ళను సడలించిన సరళినీ, ఆయన తానింకా మద్రాసు జీవితంలో స్థిరపడక పూర్వం చిత్రించాడు. తర్వాత 1950కి కొద్ది ముందు మద్రాసులో మొదలైన జీవితం, కుటుంబరావుకు అప్పటికున్న జీవితానుభవానికి, లోకజ్ఞతకూ పదును పెట్టుకునే విశాలమైన అధ్యయన ఆకాశాలను అందించింది. అయితే, మరొకవైపు, ఆయనకు అప్పటికే పరిచయమున్న గ్రామాల్లోని, మాగాణుల్లోని భూమిని క్రమంగా దూరం చేసింది.

వలసపాలన వెళ్ళిపోతూ ఈ దేశంలోని బడా బూర్జువా, బడా భూస్వామ్య వర్గంతో చేసిన స్నేహాన్నీ, తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటపు ఉప్పెనకు తట్టుకోలేక "స్వతంత్ర భారతం" తెచ్చిన "భూసంస్కరణల"నూ సన్నిహితంగా అర్థం చేసుకోవాలంటే పల్లెపట్టును అర్థం చేసుకోవాలి. 1947 తర్వాత తెలుగుదేశంలోని గ్రామాల స్వరూపాలు ఎట్లా మారుతూ వచ్చాయో, ప్రణాళికల పేరుతో ఎంత పెద్ద ఆర్థిక, రాజకీయ కుట్ర జరుగుతున్నదో కాశీపట్నం రామారావు కథలు 'యజ్ఞం', 'కుట్ర' లలో చదివి ఆశ్చర్యపోయాడు కొ.కు. ఇక్కడ ఆయనకు ఆశ్చర్యం కలిగించిన విషయాలు రెండు. తాను 'చదువు' నవల రచించిన కాలంలో అవగాహన చేసుకున్నంత లోతుగా, ఈ శతాబ్దపు ఆరు, ఏడు దశాబ్దాలలోని ఉత్పత్తి సంబంధాలను కా.రా. అర్థం చేసుకున్నాడు. ఈ అర్థం చేసుకోవడం కా.రా. స్పృహతో చేయలేదు. ప్రజాజీవితంలో ఉన్నందున, ఎంగెల్స్ చెప్పినట్టు, అసంకల్పిత కళాకారుడుగానే ఆ జీవితాన్ని తన కథల్లో చిత్రించాడు.

కళాకారుడు కవిత్వంలోనో, కల్పనలోనో జీవిత వాస్తవాలను అసంకల్పితంగా చెప్పినంతకాలం కల్పనాసాహిత్యాన్ని రచించగలడు. తాను చెపుతున్న జీవిత వాస్తవాల విశ్లేషణ ఆవేశపూరితం కానప్పుడు, పూర్తిగా వైజ్ఞానిక దృష్టితో శాస్త్రీయమైనప్పుడు ఇక అతని సాహిత్య ప్రక్రియ మారక తప్పదు.

"కాళీపట్నం రామారావు హనుమంతుని వంటివాడు. ఆయన శక్తి ఆయనకు తెలియదు" అన్నాడు 1968 లో కొ.కు. ఈ సమాజానికి ఈ కాలంలో ఎటువంటి కథలు కావాలని కొ.కు. అనుకున్నాడో అటువంటి కథలు తన శక్తి తనకు తెలియనంత కాలం కా.రా. రాసాడు. ఆయన కన్న ముందే అట్టడుగు వర్గాల జీవితాల గురించి, ఆ జీవితాలపై పోలీసు, కోర్టులవంటి రాజ్యాంగ యంత్రాంగం చేస్తున్న దోపిడీ గురించి శక్తివంతంగా రాచకొండ విశ్వనాథశాస్త్రి రాసాడు.

ఇప్పుడు రాయవలసిన జీవితం ఇది. ఈ జీవితంతో తనకు ప్రత్యక్ష పరిచయం లేదు. అందువల్లనే కథాసాహిత్యంలో రావిశాస్త్రి, కా.రా.ల ప్రవేశంతో కొ.కు. తాను కథ రాయవలసిన అవసరం తీరిందనుకొన్నాడు. తానాశించిన ప్రయోజనాన్ని కథల ద్వారా నెరవేర్చడానికి తనకన్నా ప్రత్యక్షమైన, ఆవేశపూర్వకమైన యువకోత్సాహమైన శక్తితో, శైలితో వాళ్ళు ముందుకొచ్చారు.

ఒకవైపు మద్రాసు జీవితం కుటుంబరావుకు ఒక ప్రత్యేకమైన జీవన విధానాన్ని అలవరచింది. అక్కడినుండి పత్రికల ద్వారా మాత్రమే ఆయనకు తెలుగుదేశంలోని ప్రజాజీవన ప్రధానవాహిని (mainstream) తో సంబంధం. మనుషులతో ఉన్నా, ఈ మనుషులు చరిత్ర నిర్మాతలు కారు; పరిశీలకులో, వ్యాఖ్యాతలో కావచ్చు. అధ్యయనం, చింతన పెరిగింది. ఆయనే ఒకచోట చెప్పుకున్నట్లు, సామ్యవాదం ఒక సుదూరమైన ఆశగా ఉన్నప్పుడు మార్క్సిజం అనే దీపాన్ని ఎంత మిణుకు మిణుకు మంటున్నా కాపాడుకొని ముందుతరాలకు అందించడమే మార్క్సిస్టు రచయిత బాధ్యత. అనుకూలంకాని పరిస్థితుల్లో కూడా ఆయన తన చైతన్యాన్ని కాపాడుకోవడమే కాదు - పరిశీలన, లోకానుశీలనల ద్వారా పదును పెట్టుకున్నాడు. అయితే ఈ అధ్యయనం, శాస్త్రీయదృష్టి, అవగాహన, విజ్ఞానశాస్త్రంలో ఆయనకున్న గాఢమైన అభినివేశం, కళాకారునిలో లేశమాత్రంగా ఉండవలసిన భ్రాంతి (illusion)ని ఆయన నుంచి తొలగించాయి. కనుక ఇంక ఆయన రాస్తే వాస్తవాలే రాయాలి. ఇవి గతితార్కిక వాస్తవాలు. ఈ వాస్తవాలు తొడుగు లేనివి, అలంకారం లేనివి.

ఆయన ఇతర సాహిత్య ప్రక్రియలన్నీ వదలి అందుకే వ్యాసాన్ని ఎంచుకున్నాడు. ఈ వ్యాసంలో మిగిలిన "సాహిత్య" గుణం వ్యంగ్యం ఒక్కటే. ఆ వ్యంగ్యం కూడ లూ షున్ వ్యాసాలలోని వ్యంగ్యంలాగా మనం పోల్చుకోవడానికి వీలు లేకుండా మామూలు మాటల్లో కలిసి ఉంటుంది.

డెభ్భై సంవత్సరాల జీవితానుభవం, యాభై సంవత్సరాల ఎడతెగని రచన. ఆయనకు హాస్యం, వ్యంగ్యం నిత్యజీవితంలో ఎట్లా స్వభావసిద్ధమైనాయో రచనలో కూడ అలాగే అయ్యాయి. ఆయన చివరి రోజుల్లో 'యువ'లో రాసిన వ్యాసాల్లో కూడా శిథిలమవుతున్న విలువలపట్ల నిజమూ, నిష్ఠురమూ, వ్యంగ్యమూ కలగలిసి ఉండటాన్ని గమనించవచ్చు. ప్రజల్ని ఆలోచింపజేయడానికి సులభశైలిని సూటియైన వ్యాసాన్ని ఎంచుకున్న కుటుంబరావు—అధ్యయన పరిణతివల్ల, నిశిత పరిశీలనవల్ల ఒకోసారి, ఆలోచనాపరులను ఆలోచింపజేయడానికి మాత్రమే రాస్తున్నాడా అన్నట్లుగా ఉంటుంది.

ప్రజాజీవన ప్రధానవాహిని నుంచి, రైతాంగ పోరాటరంగం నుంచి దూరంగా ఉండటంవల్ల కొన్నిసార్లు కొ.కు. గతితర్కం—చారిత్రక భౌతికవాదంపై ఆధార పడటం కాక, కామన్ సెన్స్‌పై లేదా, తనకందిన సమాచారంపై ఆధారపడవలసి వచ్చేది. అందుకే ప్రజాపోరాటాల గురించి, ఆ పోరాటాలు సృష్టిస్తున్న సాహిత్యం గురించి తెలుసుకోవడానికి ఆయన ఎంతో శ్రద్ధ చూపాడు. ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాల్లో పుడమితల్లి పురిటి నొప్పుల చప్పుడు అల్లం రాజయ్య మాటల్లో అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేశాడు. గద్దర్ పాటలకు మద్రాసు నుంచే చెవి రిక్కించాడు.

ఏ సమయానికి దేనికి కాలం చెల్లిపోయిందో, ఏ దేశకాలాలకు దేని అవసరం ఉందో కొ.కు. ఎప్పుడూ గుర్తించ గలగడానికి, వైయక్తికంగా (subjective) కాకుండా వస్తుగతంగా (objective) ఆలోచించే ఆయన శాస్త్రీయ దృక్పథమే కారణం.

చైనా సాంస్కృతిక విప్లవాన్ని ఆయన నవయువకునిగా ఆహ్వానించాడు. అట్లే నిష్కల్మషమైన యువమనస్కతతో దిగంబర కవులకు, తర్వాత కాలంలో విప్లవ సాహిత్య విమర్శకు స్వాగతం చెప్పాడు. వేయి నక్సల్బరీలు వికసించాలని ఆయన చెప్పిన మాటల్లో పొలాలు మేల్కొనా లన్న ఆకాంక్ష ఉన్నది. 'విరసం' ఏర్పడటం ఒక చారిత్రక అవసరమని, 'అరసం'కు కాలం చెల్లిపోయిందనీ, నిక్సల్‌బరీ—శ్రీకాకుళాల ప్రభావంతో ఆయన అర్థం చేసుకోవడమే కాదు, ఆనాడు చాలమంది యువరచయితలకన్న కూడ ఎంతో ముందు చూపుతో చెప్పేశాడు. ఇది తెలంగాణ రైతాంగ పోరాటానికే కాదు, తెలంగాణ మాండలికానికి కూడ మంచి కాలం అని గుర్తించాడు. జానపద కళారూపాలు ప్రజాకళారూపాలు కావాలవన్న తన

వాదాన్ని గద్దర్ పాటల అనుభవంతో వదులుకున్నాడు. ఈనాడు సాహిత్యం ఏ విప్లవ వర్గాలకు ఉద్దేశింపబడిందో ఆ వర్గాల వద్దకి, ఇదివరకెన్నడూ లేనంత బలంగానూ, సూటిగానూ ప్రజాకళారూపాల ద్వారా మోసుకుపోతున్నదని తనకు తెలిసిన మధ్య తరగతి మేధో ప్రపంచానికి విడమరచి చెప్పడానికి ప్రయత్నించాడు. ప్రజల పాటలతో ఒళ్ళు మండుతున్న 'మేతావులు' ఆ పాటలకు కొ.కు. సమర్థనతో తేలు కుట్టినట్లయి వాదనకు దిగారు.

ప్రజలకు ఏ కాలంలో ఏ కళారూపాలు కావాలో గ్రహించినట్లే తాను ఏ కాలంలో ప్రజల కేది అందివ్వగలడో కూడా ఆయన నిర్ణయించుకున్నాడు. కార్మిక వర్గం గెలుచుకోగల ప్రపంచంలో భావదారిద్ర్యం ఉండకూడదు. తాత్విక చింతనా రాహిత్యం చోటు చేసుకోగూడదు. "నూరు పూలు వికసించాలి. వేయి ఆలోచనలు సంఘర్షించాలి." వీటికి తోడు ఈ ప్రపంచపు ద్వారాలు తడుతున్న నూతన ప్రపంచం, సాంకేతిక విజ్ఞానం సాధించిన ప్రగతీ, జిజ్ఞాసాపరుడైన కొడవటిగంటిలో ఎన్నో ప్రశ్నలను, ఆలోచనలను రేకెత్తించాయి. ఇవన్నీ ప్రజలతో, ప్రజాజీవన ప్రధాన వాహినితో ఉన్నవాళ్ళతో పంచుకుంచే తప్ప తీరేవికావు. తీరడం అలా ఉంచి అవి చలనంలోకి రావాలి. ఘర్షణను పుట్టించాలి. భావాలను వేడెక్కించాలి. అందుకే చివరి రోజుల్లో తాను రాస్తున్న విషయాలు స్థిరమైన అభిప్రాయాలు కావని, బయటికి ఆలోచించడమేనని (loud thinking) ఆయన చెప్పుకున్నాడు. ఇంక వ్యవధిలేదు. జీవిత చరమసంధ్యలో ప్రవేశిస్తున్నాడు. కోశాంబిలో దొరికే సమాధానాలు చరిత్రకు సంబంధించినవి, దృక్పథానికి సంబంధించినవి. తనకు నిర్మాణమవుతున్న చరిత్ర నుంచి సమాధానాలు కావాలి.

కుటుంబరావు ఏనాడూ తాను చెప్పిందంతా ఇతరులు స్వీకరించడానికి చెప్పలేదు, చర్చించడానికి చెప్పాడు. మాటలు భౌతికశక్తిగా మారుతాయన్న మార్క్సిస్టు దృక్పథం ఆయనది. మాటలు ఘర్షణ పడకుండా, ఘర్షణకు కారణం కాకుండా మౌనంగా అంగీకరింపబడితే ఇంక భౌతికశక్తి ఎలా అవుతాయి? అట్లని రెచ్చగొట్టడం కోసమో, షాక్ కోసమో, సెన్సేషన్ కోసమో, తనవైపు చర్చను ఆకర్షించుకోవడానికో ఆయన రాయలేదు. చందమామను చూసిన పసివానికి కలిగిన సందేహాల్లాగా, ఆయనకు కలిగిన సందేహాలన్నీ సైన్సునూ, ప్రపంచాన్నీ, సమాజాన్నీ చూడగా చూడగా చదవగా చదవగా కలిగిన సందేహాలు. ఉత్పత్తి కార్యక్రమంలో పాల్గొని ఈ సైన్సునూ, చరిత్ర నిర్మాణంలో పాల్గొని ఈ ప్రపంచాన్నీ, వర్గపోరాటంలో పాల్గొని

ఈ సమాజాన్ని రూపొందిస్తూ, మార్చుతూ, తాము స్వయంగా మారుతున్న ప్రజలు మాత్రమే ఈ సందేహాలను తమకు ఎదురయే ఇతర సందేహాలను నివృత్తి చేయగలరు.

కుటుంబరావు యాభై సంవత్సరాల పాటు ఎన్నో ప్రశ్నలకు జవాబులిచ్చి, మరెన్నో ప్రశ్నలు వేసి వెళ్ళిపోయాడు. తను ఇచ్చిన జవాబులకన్నా, వేసిన ప్రశ్నలపై ఆలోచించడం ద్వారానే తెలుగు సాహిత్యమైనా, తెలుగు సమాజమైనా ఆరోగ్యకరంగా, నిత్యనూతనంగా ఉంటుందని ఆయన ఆశించాడు. ఆయన ప్రశ్నించడం కోసం రచన చేసాడు. జ్ఞాన రహస్యం ప్రశ్నించడంలో ఉందని తెలుసుకున్న చాల కొద్దిమంది రచయితలలో ఆయన ఒకరు. ఆయన మేధావి. తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు రచయిత స్థాయినుంచి మేధావి స్థాయికి ఎదిగిన అరుదైన ఆలోచనాపరుడు. రచన అంటే భాషణ కాదు సంభాషణ అని పాఠకుని పాత్రను గుర్తింపజేసిన పాఠకుడు.

భావవిప్లవకారుడు

జీవితకోణాలన్నీ విశ్లేషించి నూతన చైతన్యమిచ్చే

# కథలు

శ్రీపతి

విద్యావంతులలో సంస్కరణాభిలాష, సామాజిక చైతన్యం, శాస్త్రీయ దృక్పథం, జాతీయ పోరాటదీక్ష, కొత్త సంస్కృతిపట్ల ఆసక్తి పెంపొందుతున్న 1930 ల నాటి సామాజిక వాతావరణంలో కొడవటిగంటి కుటుంబరావు కథా రచన ప్రారంభమయింది. తెలుగుదేశంలో కందుకూరి, గురజాడ, రఘుపతి వెంకటరత్నం నాయుడు వంటి వైతాళికుల నాయకత్వంలో సాగిన సామాజిక, సాహిత్యోద్యమాలు కుటుంబరావును ఎంతో ఆకర్షించాయి. సమాజ పురోగతికి ఆ ఉద్యమాలు తోడ్పడ్డాయని, ఆ సంస్కరణల ప్రయోజనాన్ని మరింత పటిష్టం చేయటం అవసరమని ఆయనకు నమ్మకం ఏర్పడింది. ఆ పునాదుల మీదనే కుటుంబరావు తన సత్యాన్వేషణ కృషి ప్రారంభించారు. అప్పట్లో తన కళ్ళముందు అమానుషమైన చిత్రహింసలకూ, ఆగడాలకూ బలయిపోతున్న బాలవితంతువులూ, మొత్తం సమాజంలో ఘోరమైన అవమానాలకు గురవుతున్న ఆడవారి నికృష్ట పరిస్థితీ, మూఢవిశ్వాసాలూ, మూర్ఖ సంప్రదాయాలూ, మగవాడి దౌర్జన్యాలూ ఆయనకు కథావస్తువులయాయి. గ్రామ ప్రాంతాలలో మధ్య తరగతికి చెందిన—ముఖ్యంగా బ్రాహ్మణ కుటుంబాలలో—యువకులు కుల

వృత్తిని, వ్యవసాయాన్ని విడిచిపెట్టేసి కొత్త చదువుల వ్యామోహంతోను, ఉద్యోగాల కోసమనీ పట్టణాలకు తరలిపోవడం, పట్టణాలలో కొత్త సంస్కృతి తోడి సంపర్కంతో పాత సంప్రదాయాలకీ, కొత్త విలువలకీ మధ్య సామరస్య—వైరుధ్యాలూ, సంఘర్ష ఇలూ ఆయనకు కావలసినంత ముడిసరుకును సమకూర్చాయి. తిరుగుబాటు ఆదర్శంగా పాత సమాజంమీద ధ్వజమెత్తాడాయన. సామాజిక రుగ్మతలుగా పీడిస్తున్న సమస్య లను ఇతివృత్తంగా తీసుకుని సైద్ధాంతిక చర్చ ప్రారంభించటం కుటుంబరావు తొలి రచనలలో సైతం బలంగా, స్పష్టంగా ఉండటం చూస్తే, సంస్కరణాభిలాషే ఆయన సాహిత్యానికి పునాది అయిందని రుజువవుతుంది.

కథావ్యాసం అనదగ్గ కుటుంబరావు మొట్టమొదటి కథ 'ప్రాణాధికం' ఏప్రిల్, 1931 'గృహలక్ష్మి' లో అచ్చయిన నాటికి ఆయన వయస్సు ఇరవై ఒక్క సంవత్స రాలు. మూఢవిశ్వాసాల మూలంగా ఎదురయ్యే సమస్యల పరిష్కారానికి అవలం బించిన సాహితీవ్యూహం ఈ కథలో పాఠకునికి ఆసక్తి కలిగించే అంశం. గుండె జబ్బుతో బాధపడుతున్న శకుంతల చచ్చిపోవటానికైనా సిద్ధపడుతుంది గాని, డాక్టరు తనను తాకి వైద్యపరీక్ష చేయటానికి ఒప్పుకోదు. ఆ మొండితనం భర్త రంగారావుకు సొంత అన్న రామ్మూర్తికి పెద్ద తలనొప్పిగా తయారవుతుంది. చివరికి మందు తాగ టానికి ఒప్పిస్తారు. అయితే ఖచ్చితంగా తాగుతుందన్న నమ్మకం లేదు. భర్త రంగా రావు తనకు కూడా గుండెనొప్పి వచ్చినట్టూ, ఊళ్ళో పెద్ద డాక్టరయిన శేషాచలపతి దగ్గర తాను పరీక్ష చేయించుకుని మందు తెచ్చుకున్నట్టూ చెబుతాడు. శకుంతల తాను కూడా మందు తాగుతానని మాటయిచ్చి బతిమాలిన తర్వాత రంగారావు తాగుతాడు. శకుంతల జబ్బు నయమవుతుంది. దాంతో రంగారావు దొంగరోగంకూడా నయమవు తుంది. తాము ఆడిన నాటకం గురించి రంగారావు చివర్లో భార్యకు చెప్పేస్తాడు.

'గృహలక్ష్మి' సంపాదకుడు ఆంధ్ర శేషగిరిరావు ఈ 'కథావ్యాసం' గురించి రాసిన పరిచయ వాక్యాలలో, భారతమహిళ "సతీత్వపు" సంప్రదాయక విలువలను ప్రశంసించారు. అంతేకాదు. ఆ కథకు అగ్రస్థానం ఇవ్వటం జరిగింది. కథా రచనలో తనకు ఆంధ్ర శేషగిరిరావు యిచ్చిన ప్రోత్సాహం అంతా ఇంతా కాదని పేర్కొంటూ, కుటుంబరావు ఆయనపట్ల తన గౌరవాభిమానాలు ప్రకటించుకున్నారు. అయితే, భారత మహిళ "సతీత్వపు" సంప్రదాయక విలువలు తీపి పూత మాత్రమే. అందుచేతనే ఆంధ్ర శేషగిరిరావు అవగాహన రాచమల్లు రామచంద్రారెడ్డికి సమంజసంగా తోచ లేదు. డాక్టరు తనను తాకి వైద్య పరీక్ష చేయటం తన పాతివ్రత్య ధర్మానికి కళంకం

అని భావించే శకుంతల సెంటిమెంట్‌కు కారణం మూఢవిశ్వాసమే. ప్రాణాధికంగా భావించే పాతివ్రత్యం మూలంగానే వైద్య చికిత్సను తిరస్కరించే ఆత్మహత్యా ప్రవృత్తి ఏర్పడింది. "నేను చచ్చిపోయినా మీ దగ్గరే వుంటా" ననే శకుంతల అమాయకపు మూర్ఖత్వం పట్లా, ఆ మూర్ఖత్వానికి కారణమైన సామాజిక సంప్రదాయాల పట్లా పాఠకులకు అసహనం, ఆగ్రహం కలుగుతాయి. ఆ నీతి నియమాల గుప్పిట్లో నలిగిపోతున్న శకుంతల పట్ల సానుభూతితో, నవదంపతులయిన శకుంతల రంగారావులతో పాఠకుడు మమైక్యమై తీవ్ర ఆందోళన చెందుతాడు. రెండువేపులా పదునైన కత్తిలాగ, చార్లీ చాప్లిన్ హాస్యంలోని కరుణార్ద్రతని తన శిల్ప చమత్కారంతో కుటుంబరావు తన 'ప్రాణాధికం'లో సాధించారు. "అనేక ఏళ్ళపాటు నేను కథలు రాయటంలో శిల్పాన్ని తప్ప మరేమీ లక్ష్యపెట్టలేదు" అని రచయిత ఒకచోట చెప్పుకోవటంలో అర్థం ఇదే. కథా వస్తువులో పుట్టెడు బాధ దాగి ఉన్నప్పటికీ, దానిని అంతర్వాహినిగానే ఉంచి, సన్నివేశపరమైన చవుకబారు ఆవేశాలను, ఉద్రేకాలను పాఠకులకు ఆమడ దూరంలో ఉంచటం, ఈ కథాశిల్పంలో రచయిత ప్రదర్శించిన చమత్కృతి. అందుమూలంగా రచయిత సాధించిన సృజనాత్మక ప్రమాణాల ఔన్నత్యం అర్థమవుతుంది.

కుటుంబరావు కథారచన తొలిదశలో సైతం బహుముఖమైన సమస్యలను కథా వస్తువుగా తీసుకోవటం ఆయన సామాజిక దృష్టికి మరొక సాక్ష్యం. గ్రామ పునర్నిర్మాణం, సూరి సిద్ధాంతం (ఈ పేరుతో మొత్తం నాలుగు కథలు వెలువడ్డాయి వరసగా), తల్లిచాటు పిల్లవాడు, పనిమనిషి, పతిభక్తి, మాయరోగం, నమూనా కథ, బొమ్మల పెళ్ళిళ్ళు మొదలయిన కథలను పరిశీలిస్తే, కుటుంబరావు కథారచన ప్రారంభించిన నాటికే అభ్యుదయ సామాజిక దృక్పథం గట్టి పునాదులమీద స్థిరపడిందని స్పష్టమవుతుంది. 'గ్రామ పునర్నిర్మాణం'లో విద్యా సంస్కారాలు గల యువకులు పల్లెటూళ్ళలో చేపట్టే గ్రామాభ్యుదయ కృషికి ప్రతిబంధకంగా నిలచిన కుల సంకుచితత్వం, 'సూరి సిద్ధాంతం' కథలలో హరిజనోద్ధరణ, స్త్రీ పునర్ వివాహం వంటి సమస్యలు, 'తల్లిచాటు పిల్లవాడు'లో బోగంపిల్లతో బ్రాహ్మణ యువకుని స్నేహ సంబంధాలను ప్రోత్సహించటం, 'పతిభక్తి'లో పాతివ్రత్య వాదస్తాన్ని ఎద్దేవాచేయటం, 'నమూనాకథ'లో కొత్తగా కథారచన చేపట్టిన కథకునికి చిట్కాలు చెప్పి కథ ముగింపు శిల్పం గురించి కథ కూర్చటం, 'బొమ్మల పెళ్ళిళ్ళు'లో మేనరికాన్ని విమర్శించటం, 'మాయరోగం'లో పూర్వజన్మ, పునర్‌జన్మ నమ్మకాలను చర్చించటం వంటి

వివిధ సమస్యలను ఇతివృత్తంగా మలుచుకోవటం, 'పనిమనిషి'లో శ్రమజీవుల ప్రేమాభిమానాల చిత్తశుద్ధిని చాటి, వారి పక్షాన నిలబడటం - ఇవన్నీ ఆ రోజులలో పెద్ద తిరుగుబాటే. సంస్కార భావాలూ, తిరుగుబాటు ధోరణులూ, తార్కిక హేతువాదమూ, అభ్యుదయ దృక్పథంతోపాటు శిల్ప విలక్షణత కుటుంబరావు కథలలో సాధారణ లక్షణం. సరళమైన వాక్యాలలో భావస్పష్టత, నిశిత పరిశీలన, సూటిగా—నిర్ద్వంద్వంగా - నిర్దుష్టంగా - ఉన్నదున్నట్టు చెప్పటంద్వారా, కథారచన తొలిదశ నాటికే కుటుంబరావు స్వంతముద్రను ఏర్పరచుకోవటం గమనించదగ్గ అంశం. ఆ రోజులలోనే వెలువడిన సత్యాన్వేషణ, అసత్యమూ—నాగరికత, కథారచన వంటి వ్యాసాలలోని ఆలోచనాపరంపర, ఆవేదన, సామాజిక అవగాహనల గురించి పరిశీలించినా— కుటుంబరావు సాహితీ ప్రయోజన లక్ష్యశుద్ధీ, ఏకాగ్రతా, సంకల్ప తీవ్రతా—అన్నీ ఆయన కథలలోని అభ్యుదయ, సంస్కార ధోరణులను సమర్థించటం స్పష్టంగా కనిపిస్తుంది.

ఈ దశలో కుటుంబరావు తన కథలలో వ్యక్తుల బలహీనతల గురించి, లోపాల గురించి, స్వీయ రాగద్వేషాలకు బలికాకుండా రాయటం ఇట్టి సాహిత్య సంస్కారం మూలంగానే సాధ్యమయింది. అందుకే "జీవితంలో నేను చూసిన మనస్తత్వాలలోని లోపాలు విమర్శిస్తూ పాత్రలను సృష్టించి"నట్టు, 'నా కథారచన' అనే వ్యాసంలో ఆయన చెప్పుకున్నారు. ఆ పోకడలో వ్యక్తివాదం ఉందనికూడా ఆయన తన లోపాన్ని విమర్శించుకున్నారు. వ్యక్తివాదంలో సైతం మొదటినించీ ఆయన 'సంస్కారాన్ని' మౌలికమైన అభ్యుదయాంశగా, తాత్కాలిక తక్షణ సమస్యల పరిష్కారానికి సాధనగా పరిగణిస్తూ, సమర్థిస్తూ రచనలు కొనసాగించారు. ఆశయ శుద్ధితో సమన్వయం కాని ఆచరణనీ, సంస్కరణనీ ఆయన ఎద్దేవా చేశారు. చిత్తశుద్ధి లోపించిన వారికి, కుహనా సంస్కారులకి తన నిశిత వ్యంగ్యంతో వాతలు పెట్టారు. నిజాయితీలేని ఆదర్శవాదులనూ, కపటులనూ దుయ్యబట్టారు. కుటుంబరావు కథలలో అంతర్లీనంగా ఉన్న ఈ సామాజిక బాధ్యత, నిజాయితీ, ఈ సైద్ధాంతిక ప్రాతిపదిక—మానవత్వానికి పతాక ఎత్తాయి. ఈ మహాసంకల్పం మూలంగానే కుటుంబరావు సాహిత్యం కాలంతోపాటు ఎదుగుతూ, మరింత ప్రాశస్త్యం పొందుతూ, మరింత ప్రయోజనాత్మకంగా ప్రాచుర్యం పొందుతూ, ఉత్తమ సాహిత్య లక్షణమైన నిత్య నూతనత్వాన్ని సంతరించుకున్నది.

స్వీయకథ లక్షణాలు విస్తారంగా కనిపిస్తున్న 'అనుభవం' నవలలో నారాయణ వెలువరించిన అభిప్రాయాలు — కథారచన చేపట్టే పూర్వదశలో కుటుంబరావు అభి

ప్రాయాల గురించీ, సామాజిక అవగాహన గురించీ చాలమటుకు స్పష్టంచేస్తాయి. "నారాయణ మటుకు కథకుడు కావటానికే నిశ్చయించాడు. తనకు ప్రత్యేక ప్రావీణ్యం ఉన్నదని కాదు. కథలు రాయటం ద్వారా తన జీవితానుభవం సార్థక మవుతుందని. కథావస్తువు గురించి కూడా వాడు ఒక నిర్ణయానికి వచ్చాడు. జీవితానికి కేంద్రం ఆడది. సాహిత్యానికి కూడా ఆడదే కేంద్రం కావాలి. ప్రస్తుత సమాజంలో మగవాడు ఆడదాన్ని కట్టేసి వుంచుతున్నాడన్నది నారాయణ ఏమాత్రం సందేహించలేదు. చదువు విషయంలో, ఆచారాలలో ఆడదాన్ని అణగదొక్కటమైతే జరిగిందిగాని, ఆ ఆడదాన్ని వెనకపడనిచ్చి మగవాడు ఎంత ముందుకు పోగలడు? ఏం ముందుకు వచ్చాడు? తల్లులుగానూ, పెళ్ళాలుగానూ ఆడవాళ్ళు మగవాళ్ళమీద తమ ప్రభావం చూప కుండా ఉండరు. ఆడవాళ్ళ అజ్ఞానమూ, అసహాయత్వమూ, మూఢనమ్మకాలూ మగవాణ్ణి బాధించకుండా ఉన్నాయా? మగవాడు అలా నష్టపోనన్నా నష్టపోతాడుగాని ఆడదాన్ని ముందుకు రానివ్వడు—ఇవైనా మధ్యతరగతిలోనే. పాటకపు జనం ఇంత అన్యాయంగా లేరు." అజ్ఞానానికీ, అసహాయ పరిస్థితికీ, మూఢనమ్మకాలకీ, బానిసత్వానికీ కేంద్ర బిందువుగా, సంకేతంగా, సమాజపు అంతరాత్మగా స్త్రీని రూపొందించుకోవటంతో కుటుంబరావు సాహిత్యానికి 'జీవితం' గట్టి పునాది అయింది.

కథారచన ప్రారంభించిన పది సంవత్సరాల తర్వాత రాసిన 'తాతయ్య' కథలో తాను వాస్తవిక ప్రపంచంలో అడుగుపెట్టడం జరిగిందనీ, అంతకు ముందు సాగించిన సాహితీకృషి అంతా ఊహాప్రపంచంలోనే నడిచిందనీ కుటుంబరావు చెప్పుకున్నారు. 'తాతయ్య' ఆయన కథారచనలోనే కాక, తెలుగు కథా సాహిత్యంలోనే ఒక మైలు రాయి వంటిది. బ్రాహ్మణ కులంలో, అందులోనూ వైదిక శాఖలో పుట్టిన ఏడెనిమి దేళ్ళ పిల్లవాడి దృష్టిలో, అతడి చుట్టూవున్న ప్రపంచం గురించి కుదిరిన అభిప్రాయాలు, సమాజం గురించి ఏర్పడిన భావాలు, సామాజిక సంబంధాల గురించి కలిగిన విశ్వాసాలు, ఆలోచనలు మనల్ని మన బాల్యానికి తీసుకుపోతాయి. పాఠకుడిని ఎనిమిదేళ్ళ పిల్లవాడినిచేసి, ఆ ప్రపంచంలో—తన బుద్ధికి దూరమైపోయిన అమాయికపు అందాలని కవిత్వమయం చేయటంలో పసితనపు దివ్యత్వం స్పర్శించి తన్మయుని చేస్తుంది. నలభైయ్యేళ్ళ తర్వాత కూడా 'తాతయ్య' కథ పరిస్థితులు మన పల్లెటూళ్ళలో యథాతథంగా కనిపిస్తున్నాయంటే, ఇంకా ఆ కథలోని సామాజిక వ్యవస్థకు కాలదోషం పట్టలేదన్న మాట. తెలుగు కథా సాహిత్యంలో మొదటి మైలురాయి గురజాడ అప్పారావు 'మీ పేరేమిటి?' అయితే రెండో మైలురాయి 'తాతయ్య'.

సామాజిక సాంస్కృతిక సంబంధాలను కావ్యస్థాయిలో ఇంత వాస్తవికంగా కళ్ళ ముందుంచిన కథలను వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. శిల్పప్రమాణ ఔన్నత్యం దృష్టితో పరిశీలించితే ఈ కథకు దీటురాగల కథలు ఇంకా తక్కువ. రచయితే చెప్పినట్లు, 'తాతయ్య' కథలోని సామాజిక వాతావరణం తెలుగుదేశంలో తప్ప మరొకచోట సాధ్యం కాదు. తన కథ చూసి తనకు తృప్తి కలగటం ఈ కథ రాసిన తర్వాతే మొదటిసారి జరిగిందని ఆయన చెప్పుకున్నారు.

"ఈ నాటి సమాజంలో దారిద్ర్యమూ, ఆకలీ, నిరుద్యోగమూ వగైరాలు కృత్రిమమైనవి. ఆడపిల్లల తల్లిదండ్రులు అల్లుళ్ళకు కట్నాలు పొయ్యలేకపోవటము, రాక్షసులవంటి భర్తలతో భార్యలు తప్పనిసరిగా నరకయాతనలను అనుభవించటమూ మొదలయినవి జీవితంలో ఎంత వాస్తవ సమస్యలుగా ఉన్నప్పటికీ అవి కృత్రిమ మైనవే. వాటికి పరిష్కార మార్గాలున్నాయి. ఆ మార్గాలను అనుసరించకపోవటం ఆ యా వ్యక్తుల బలహీనత. సమాజంలో విధిగా రావలసిన మార్పులకోసం పాటు పడనివాళ్ళ (మూలంగా జరుగుతున్న) తప్పు." కుటుంబరావు ఈ అవగాహనతోనే సామాజిక సమస్యలను వ్యక్తుల దృక్కోణంనించి పరిశీలించారు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సంపూర్ణ వికాసం కోసం సత్యాన్వేషణనీ, ఆచరణ శీలమైన సంస్కారాన్ని జనం ఆలోచనల్లో, నెత్తుర్లో ఇంకించాలన్న పట్టుదలతోనే కుటుంబరావు సాహితీ సాధన కొనసాగింది.

కథావస్తువు పరంగా కుటుంబరావు కథలను మూడు ప్రధాన రీతులుగా వర్గీకరించవచ్చును. 1. కుటుంబ వ్యవస్థ, 2. వివాహ వ్యవస్థ, 3. సామాజిక సమస్యలు. ఆయన కథలలోని సాహిత్య ప్రయోజనాన్ని అర్థం చేసుకునేందుకు ఈ వర్గీకరణ దోహదపడే అవకాశం వుంది. ఈ మూడింటిలో ఆయన వివాహ వ్యవస్థకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చినట్టు కన్పిస్తోంది. వాస్తవ జీవితమే తన సాహిత్యానికి పునాది అని విశ్వసించటంవల్ల, వాస్తవతావాది కావటంవల్ల, సామాజిక సమస్యల కూడలిగా వివాహ వ్యవస్థను తన కవి సమయం చేసుకోవటం, సమాజ రుగ్మతకు కీలెరిగి వాత పెట్టడం లాంటిదే.

కుటుంబంలోని సభ్యులమధ్య మానవతా సంబంధాలు ధ్వంసమై, లేదా అసహజమై, వ్యక్తులు జీవితంలోని సుఖాలనీ, సౌందర్యాలనీ, అపేక్షలనీ, అంతఃకరణలనీ కోల్పోయి జీవచ్ఛవాలుగా సాగించే బతుకుల నిరర్థకతను చూపించి అర్థవంతమైన నిండు జీవితంవేపు కళ్ళు తెరిపించేందుకోసం - కుటుంబ సభ్యులమధ్య మానవతా

సంబంధాలూ, ఆ వెనక ఆర్థిక శక్తుల కీలకపాత్రను, వ్యక్తుల సంస్కారాన్ని, సమాజ సంస్కృతి ప్రభావాన్ని, ఈ ఉమ్మడి సమస్యలతో వ్యక్తుల జీవన్మరణ పోరాటాన్ని అనేక కోణాలనించి పరిశీలించడం ఈ కథలలో కన్పిస్తుంది. జీవితపు విలువలను సరిగా అర్థం చేసుకోకపోవటం మూలంగానే చేజేతులా జీవితం కష్ట భూయిష్టం చేసుకుని, వ్యక్తి పెనంలోంచి పొయ్యిలోకి దూకుతున్నాడని, అసలే నికృష్టంగా ఉన్న సామాజిక వ్యవస్థలో వ్యక్తుల ప్రవర్తనలోని ఈ పోకడతో జీవితం మరింత దిగజారిపోతున్నదనీ, బతుకులు అయోమయంగా తయారవుతున్నాయనీ, చెపుతూ, ఈ ఇతివృత్తాలు సమాజ సంక్షోభంలో ప్రవేశించి జీవిత సత్యాలను వెలికి తీసాయి.

ఆడజన్మ, తల్లిలేని పిల్ల, అంతరాత్మ, రంగయ్యా తాతగారి పరువు మర్యాదలు, రెఖ్ఖా—మూఖ్ఖా, శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః, దుక్కి—పెద్దు మొదలయిన కథలలో అపేక్షలూ, అంతఃకరణలూ, అభిమానాలూ కోల్పోయిన కుటుంబసభ్యుల మధ్య పెరిగిన శత్రుసంబంధాలు—కుటుంబ వ్యవస్థ నైతిక పునాదిమీద దెబ్బ తీస్తాయి. 'తల్లిలేని పిల్ల'లో భార్యపోయిన తర్వాత శివయ్య రెండోపెళ్ళి చేసుకోవటంతో కొడుకు నరసు, కూతురు చిట్టి జీవితాలు దుఃఖభాజనమవుతాయి. పిల్లలకూ తండ్రికీ మధ్య ప్రేమ వాత్సల్యాలు సవతితల్లి మూలంగా ధ్వంసమై తండ్రిని తిరస్కారభావంతో క్షమించలేని దశకు క్షీణిస్తుంది పరిస్థితి. శివయ్యలో ఒకప్పుడున్న సంస్కారమంతా హరించుకుపోతుంది. పిల్లలకోసం అవసరమైన త్యాగాలు సంతోషపూర్వకంగా చేసి, అందులో ఆనందంతో జీవించగల అపురూప మానవతా సౌందర్యాన్ని, పితృ హృద యాన్ని శివయ్య నష్టపోతాడు. 'అంతరాత్మ'లో కుటుంబ సభ్యులే ఒకరికొకరు శత్రువు లయి పగ సాధించుకుంటారు. ఈర్ష్యాసూయల మూలంగా స్వవర్గ శత్రువుల సంస్కారహీనత రాక్షసంగా తయారవుతుంది. మనుషులు తమచుట్టు తామే శత్రు త్వాన్ని సృష్టించుకుంటున్న అజ్ఞానం, మూర్ఖత్వం పతనావస్థలో ఉన్న కుటుంబ వ్యవస్థకు తోడై సామాజిక మనుగడను మరింత దుర్భరం చేస్తుంది. డబ్బు పెత్తనా నికి బలికాకుండా, డబ్బు వ్యామోహానికి దూరంగా ఉంటూ తండ్రి సంస్కారాన్ని వారసత్వంగా స్వీకరించి గర్వించే చిన్న కొడుకూ, చిన్న కూతురూ సంస్కారానికి ఆదర్శప్రాయంగా వ్యవహరిస్తారు. 'రంగయ్యా తాతగారి పరువు మర్యాదలు' కథలో ఆడితప్పని మనిషి, పేరుపడ్డ దాత, ఆతిథ్యమివ్వటంలో అసమాన గృహస్థు అని పేరు పడ్డ రంగయ్యా తాత దోపిడీ—నిరంకుశత్వాలు స్వంత మనుమలను సైతం శత్రువు

లుగా చేస్తాయి. దోపిడీచేసే దొంగవెధవలకు పరువు ప్రతిష్ట లేమిటి అని ప్రశ్నించి, రంగయ్యతాత మనుమలమని చెప్పకోవటానికి సిగ్గుపడతారు. అంతేకాదు. శ్రమజీవు లుగా బతికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను స్వీకరిస్తారు. రంగయ్య తాత ప్రాతినిధ్యం వహించే భూస్వామ్య వ్యవస్థ నీతి నియమాలను ధిక్కరించి, శ్రమజీవన నైతిక విలువలను సాదరంగా స్వీకరిస్తారు. రంగయ్య తాత మనుషులతో తెగతెంపులు చేసు కోవడం—భూస్వామ్య వ్యవస్థలో కుటుంబసభ్యుల మధ్య ఆర్థిక సంబంధాలకు తప్పించి మానవతా సంబంధాలకు చోటు వుండదని ధృవపరుస్తుంది. 'రెఖ్ఖా - ముఖ్ఖా'లో తల్లి—కొడుకు—కోడలు ఈ ముగ్గురి మధ్య సంబంధాలు తల్లి ఆత్మహత్యకే కారణ మవుతాయి. 'తిండి దొంగ'లో కూతురింట, కూతురు జన్మదినోత్సవం వేడుక రోజున, స్వంత తల్లి, దొంగతనం చేయవలసిన దైన్యస్థితికి దిగజారుతుంది. సంపన్న కుటుంబంతో చెల్లెలికి సంబంధం కుదర్చటానికి అన్నయ్య చేసిన త్యాగానికి కృతజ్ఞత కూడా చూపలేని వర్గ ఉన్మాదం ఇతివృత్తంగా రాసిన ఈ కథలో, తల్లీ కూతుళ్ళ మధ్య ఏర్పడిన పేద ధనిక సంబంధాల వైరుధ్యం, విచ్ఛిన్నదశలో ఉన్న కుటుంబ వ్యవస్థకు మరొక నిదర్శనంగా కనిపిస్తుంది. 'దుక్కి-టెద్దు'లో పిల్లలకోసం కష్టపడి, వాళ్ళను సోమరిపోతులుగా చేసి, తనకు వారంతా రుణపడి ఉన్నారని భావించి, వారు తనపట్ల కృతజ్ఞత చూపనందుకు బాధపడే కిష్టయ్యకు, జీవితం అంటే ఆస్తిగానే కనిపి స్తుంది. 'శ్రీ కృష్ణార్పణమస్తు'లో డబ్బు సంపాదనే ఘనంగా భావించిన తండ్రి భైరవశాస్త్రులు సంప్రదాయకత, పెద్ద చదువులు చదివిన చిన్నకొడుకు సత్యంలో వచ్చిన కొత్తసంస్కారం ఉత్తర — దక్షిణ ధృవాలుగా నిలుస్తాయి.

వివాహ వ్యవస్థని, ముఖ్యంగా అగ్రజాతి బ్రాహ్మణ కులంలోని నీతి నియమా లనూ, ఆచార వ్యవహారాలనూ కుటుంబరావు పరిశీలించినంత సమగ్రంగా, శాస్త్రీయంగా సృజనాత్మక సాహిత్యంలో మరొకరు పరిశీలించలేదని అన్పిస్తోంది. అందులోనూ మధ్యతరగతి గురించి. భార్యాభర్తలు వివాహబంధానికి కట్టుబడి ఉంటున్నారు కాని, ప్రేమబంధానికి కాదనీ, ఈ వివాహబంధం ఆడదాన్ని కట్టినంత బలంగా మగవాణ్ణి కట్టటంలేదనీ, మగవాడు స్వేచ్ఛగా నీతిని ధిక్కరిస్తున్నాడనీ 'పచ్చకాగితం' కథలో వ్యాఖ్యానిస్తారు రచయిత. ఆయన కథలలో పెద్ద చర్చకు, కమ్యూనిష్టుల తీవ్ర విమర్శకు గురయిన ఈ కథలో నాయిక ఇందిరకు పెళ్ళయిన తర్వాత వివాహేతర ప్రణయానుభవం కలుగుతుంది. పెళ్ళితంతుతోపాటే చుట్టుకునే పాతి వ్రత్య నీతినియమాలు ఇందిర విషయంలో ఎంతో అసహజంగా, పెళ్ళితంతులోని

మంత్రాల మోస్తరుగానే గాలిలో కలిసిపోతాయి. పొరుగింటి పార్వతమ్మగారి అన్న కొడుకు ముప్ఫయి ఏళ్ళ సోమయాజులుతో ప్రేమానుభవ సౌందర్య ఆవిష్కరణతో ఆమె భవిష్యత్ ప్రేమమయమయిందనీ, మొగుడుమీద ప్రేమ చూపటం ఆమెకి చేత నయిందనీ, ప్రేమచూపే పద్ధతులను అతనికి నేర్పడం ఆమెకి తెలిసిందనీ, ఆ రకంగా ఇందిర పవిత్రత మరింత తేజోవంతమయిందనీ రచయిత చెప్పబూనటం— కమ్యూనిష్టు అభిమానులైన పాఠకులకు, సంప్రదాయ నీతి అడ్డమొచ్చి, పెద్ద ఆందోళన కలిగించింది. సిద్ధాంతాల ప్రచారంకోసం జీవితాన్ని వక్రీకరించ సమ్మతించని కుటుంబ రావు, 'పచ్చకాగితం' విషయంలో రాజీపడలేదు. తన కథను కథా సంపుటాలనించి ఉపసంహరించుకోలేదు. శిల్ప ప్రమాణాలపరంగా ఈ కథ మరింత అగ్రశ్రేణికి చెందుతుంది. జీవిత సౌందర్యం వేపు మనసును వికసింపజేయటంకన్న కళలు సాధించగల పరమార్థం వేరే ఏముంటుందో చెప్పటం కష్టం.

'స్వేచ్ఛ'లో సత్యం వదిన కృతజ్ఞతాభిమానం—పాతివ్రత్యపు సంకెళ్ళలో స్వేచ్ఛా స్వాతంత్ర్యా లెరుగని జీవచ్ఛవాలకు పెద్ద కనువిప్పు. మరిది సత్యం రాసిన ఉత్తరం ఆమెలో సంతోషాతిశయం కలిగించింది. "నాకోసం పాపం ఆ కుర్రవాడు, తన మానవత్వం విసర్జించి, దేవత్వం పొందాడేమో అనుకుంటాను. నా అంధకార మయ జీవితానికి ఆ ఉత్తరం చల్లని చంద్రకిరణం. నాకొక అపూర్వ సంఘటన. ఒక జీవితాన్ని పవిత్రం చేయటానికి అటువంటి సంఘటనలు నాలుగు చాలవా?" "నా జీవితానికి స్నేహితుడూ, కొడుకూ, భర్తా సత్యం ఒక్కడే. అతనికోసమే నేను ఏ బాధ అయినా సంతోషంతో పడ్డాను. అతని ఒక్కడి శాసనమే నేను ఇష్టపడి పాటిం చాను. ఎందుకంటే అతని హృదయంలో నాకన్న దగ్గర మనిషి లేదు. నా అహంకా రాన్ని ఆ కుర్రవాడెంత తృప్తిపరచాడు! నన్ను తన తల్లికన్న ఎక్కువ గౌరవంగానూ, ప్రేమగానూ చూశాడు." పాతివ్రత్యంగా చెలామణి అవుతున్న బానిసత్వం నుంచి విముక్తికోసం, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకోసం తహతహలాడిపోతున్న తనను నరకం నుంచి బయటికి తీసుకురావటానికి సాహసించినందుకు శేషాచలం పట్ల సత్యం వదిన శాశ్వత కృతజ్ఞతాభిమానాలు ప్రకటిస్తుంది. "నేను ప్రేమకోసం తహతహలాడలేదు. స్వేచ్ఛకోసం తహతహలాడాను" అంటుంది. "నా శరీరం దివ్యపురుషుడికి నివేదన అయి గర్వించింది" అని, విమోచన మూలంగా కలిగిన ఆనందోత్సాహాలతో ఉప్పొంగి పోతుందామె. చలం 'మైదానం' లోని రాజేశ్వరి తిరుగుబాటులో, స్వేచ్ఛాప్రవృత్తిలో మోహావేశపు వెల్లువ కనిపించగా, సత్యం వదినలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో

వ్యక్తిత్వ వికాసంకోసం తహతహలాడటం అనేది ప్రాధాన్యత పొందడం కన్పిస్తుంది. 'పాపఫలం'లో రోగిష్టి సమాజపు పాపాల ప్రతినిధి అయిన భర్త లక్ష్మీనారాయణమీద పాతివ్రత్యాన్ని విసిరేసి డిప్టీ కలెక్టర్‌తో లేచిపోయిన పంకజాక్షి, 'అనాది రక్షణ'లో తన ప్రేమని వెన్నెలలా పంచిపెట్టే ఇందిర, 'నిలననీరు'లో సంప్రదాయ వ్యవస్థమీద కసి పెంచుకున్న మాణిక్యం—వీరంతా స్త్రీ పురుష సంబంధాల విషయంలో తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కాపాడుకోవటంలో సంఘ నీతినియమాలను ధిక్కరించిన వారే. ఇందిర మగవాడే అయినా ఆ మనిషిని ఎరగడం ఓ అద్భుతమైన అనుభవంగా స్వీకరిస్తాడు కథానాయకుడు.

సమాజంలోని అగ్రజాతులలో కనిపించే వైధవ్యం సమస్య వివాహ వ్యవస్థను నవ్వులపాలు చేసింది. మానవతా విలువలను కాల రాచింది. సమాజ వికాసానికి, చైతన్యానికి ప్రతిబంధకమైంది. వ్యక్తి జీవితేచ్ఛనూ, హక్కునూ అవమానించి ఆత్మ హత్యలకు దారితీసింది. ఈ అత్యాచారాన్ని నిర్మూలించటానికి నైతిక సమర్థన ఒక్కటే సరిపోదు. ఇందిరలనూ, పంకజాక్షులనూ, సత్యం వదినెలనూ, మాణిక్యాలనూ సమాజం గౌరవాదరాలతో మన్నించేట్టు, స్వీకరించేట్టు చూడాలి. సమాజ సంస్కారాన్ని వికసింపజేసే ఈ కృషిలో ఇట్లాంటి కథలు సమకూర్చే నైతికబలం నిర్మాణాత్మకమైన పాత్రను నిర్వహిస్తుంది.

ఆనాటి సమాజంలో ఒక వర్గంగా ఏర్పడిన భోగంస్త్రీల నికృష్ట పరిస్థితి పట్ల కూడా కుటుంబరావు సంస్కరణ పరిష్కారాన్ని సమర్థించారు. 'నీకేం కావాలి'లో బ్రాహ్మణ తండ్రికి పుట్టిన భోగంపిల్ల కస్తూరి ఉద్ధరణకోసం కథానాయకుడు తన సంస్కరణాభిలాషను ఆచరణాత్మకంగా ప్రదర్శిస్తాడు. 'తల్లిచాటు పిల్లవాడు'లో లోకం చెండుకుతింటుందని హెచ్చరించినా ప్రసాదరావు, భోగంపిల్ల కాంతంను తల్లి ప్రోత్సాహంతో స్వీకరిస్తాడు. మానవాభ్యుదయ కృషితో, విప్లవాత్మక ఉద్యమాలతో పోల్చి చూసినట్టయితే ఇటువంటి వ్యక్తిగత సంస్కరణాత్మక చర్యల ప్రభావం స్వల్ప మయినదే అయినప్పటికీ, వ్యక్తి నైతిక ప్రమాణాలను మెరుగుపరచేందుకు, సామాజిక ధర్మాన్ని మరింత పటిష్టపరచేందుకు, జీవితంలో దాన్ని అన్వయింపజేయటాన్ని గురించి తార్కిక సిద్ధాంత చర్చను ప్రోత్సహించేందుకు—ఈ సాహిత్యం గట్టి పునాదిగా ఉపయోగపడుతుంది.

అందుకే, జీవిత సమస్యలను పరిష్కరించడానికి ప్రయత్నించే వాళ్ళ గురించి కథలు చిత్రించాలని కుటుంబరావు కోరారు. మానవ ప్రయత్నాలను మంటగలిపే

రచనలను ఈ దృష్టితోనే ఆయన నిరసించారు. సమాజంలోనూ, సమాజంతోనూ మనిషిపడే ఘర్షణ మన హృదయాలను పలింపజేస్తే ఆ చైతన్యం వల్ల శాశ్వతమైన మంచి ఫలితాలు చేకూరుతాయని ఆయన భావించారు. 'ప్రేమా-పెళ్ళి'లో ఆదర్శ ప్రేమకు నిదర్శనంగా రామారావుకు చెప్పిన కథలో, కథానాయికి బోగంపిల్ల అవ్యాజానురాగం అట్లాంటిదే. 'పశ్చాత్తప్తుడు'లో ఇందుమతి, 'సహనం'లో సుశీల బోగం పిల్లలే.

వివాహ వ్యవస్థకు సంబంధించి వేశ్యావృత్తి నిర్మూలన, స్త్రీ పునర్వివాహం, వరకట్న నిర్మూలన, ప్రేమ వివాహాలను ప్రోత్సహించడం, స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యం మొదలయిన సమస్యలనూ, వాటితో సంబంధమున్న ఆచార వ్యవహారాలనూ, మూఢ సంప్రదాయాలనూ, కుటుంబరావు సామాజిక శ్రేయస్సు లక్ష్యంగా, మానవతా దృక్పథంతో పరిశీలించారు. 'చెడిపోయిన మనిషి'లో వర్ధని, డాక్టర్ మిస్ స్నేహలతా రావు ఆర్థికంగా స్వతంత్రులు. స్త్రీ ఆర్థిక స్వాతంత్ర్యం వివాహ సమస్యకు కొత్త పరిష్కారాన్ని సూచించటాన్ని ఈ కథలో చర్చించటం జరిగింది. వర్ధని తండ్రి పార్వతీశం పడుపుకూడు సెంటిమెంట్‌తో కూతురు పెట్టే తిండిని నిరసించి, పట్నంలో బతకాలన్న ఆలోచనతో టికెట్టు లేకుండా రైలెక్కుతాడు. ఆకలితో శోషవచ్చి పడిపోయిన పార్వతీశంని, అదే రైలులో ప్రయాణంచేసిన డాక్టర్ మిస్ స్నేహలతారావు చికిత్సచేసి, ఆదరించి, తన స్నేహితుడు ప్రభాకర్ దగ్గర ఆశ్రయం చూపుతుంది. తనకు ఆశ్రయం చూపి ఆదుకున్న డాక్టర్ మిస్ స్నేహలతారావుకు ప్రభాకర్‌తో గల వివాహేతరమైన స్నేహసంబంధం గురించి పార్వతీశం తెలుసుకుని, ఓవర్‌సీర్‌తో కూతురు వర్ధని స్నేహాన్ని కొత్త దృక్కోణం నుంచి చూస్తాడు. ఒకప్పుడెప్పుడో అందరికీ ఒకే నియమాలుండే ఆదిమ సమాజ మనస్తత్వం నించి బయటపడే ప్రయత్నంగా, డాక్టర్ హితబోధతో పార్వతీశం తిరిగి కూతురును చేరుకుంటాడు.

'కురూపి'లో సరస్వతి ఉన్నత విద్య, ఆర్థిక స్వాతంత్ర్యంతోపాటు, తన ఆర్ద్రహృదయంతో, పిల్లలతో ఆడుకోగల మానసిక ఔన్నత్యంతో—కనకం దృష్టిలో గౌరవస్థానాన్ని సంపాదించుకుంటుంది. మానసిక సౌందర్యం భౌతిక సౌందర్యాన్ని మించిన శక్తిగా భావించి, ఆ సౌందర్యపు తేజస్సు, ఆకర్షణలో రచయిత కనకం—సరస్వతిని తన జీవిత భాగస్వామిగా స్వీకరిస్తాడు. మనిషినించి మనిషి పొందే అనుభూతులలో అందం ప్రభావం అతిస్వల్పమైనదనీ, అంతకంటె గాఢమైన అనుభూతులు చాలా ఉన్నాయనీ, వాటి ప్రభావంతో అల్లుకున్న ప్రేమకు శాశ్వతబంధం ఏర్పడు

తుందనీ, సరస్వతీ కనకంల స్నేహం రుజువు చేస్తుంది. ఓ స్థాయికి పెరిగిన వారికి పెళ్ళి తంతు, సామాజిక దృష్టితో చూసినా, చాలా కృతకమయిందన్న అవగాహన పాఠకుడికి కలుగుతుంది. 'కురూపి' ముగింపులో ఈ వివాహాన్ని ప్రస్తావించక పోవ టంతో రచయిత ప్రదర్శించిన చమత్కార మదే.

మూఢ విశ్వాసాలూ — మూర్ఖ సంప్రదాయాలూ వ్యక్తులకు సంబంధించిన జాడ్యాలుగా కాక సాముదాయక రుగ్మతలుగా గుర్తించటం అవసరమన్న దృష్టితో— సామాజిక వ్యవస్థలో వ్యక్తుల మధ్య సంబంధాలను, సంఘ సమస్యలను యితి వృత్తంగా తీసుకుని రాసిన కథలలో. శాస్త్రీయ - అభ్యుదయ - మానవతా దృక్పథా లను ప్రచారం చేయటమే లక్ష్యంగా కుటుంబరావు తన సాహితీ ఉద్యమాన్ని కొనసాగించారు. 'కురూపి' కథలో ప్రధానపాత్ర కనకం కథారచయిత. "జీవితాన్ని అర్థం చేసుకోవటమూ, అనుభవాన్ని జీర్ణించుకోవటమూ నిజమైన పరమార్థమని కన కానికి ఒక నమ్మకం వున్నది. అందుచేత జీవిత సమస్యలతో ప్రత్యక్షంగా ఒంటరిగా పోరాడటంకన్న, పరోక్షంగా (ఉమ్మడిగా అని భావం-ర.) పోరాటమూ, తద్వారా జీవితం మరింత బాగా అర్థమయే టందుకు తోడ్పడటమూ" మంచిపనిగా అతనికి తోచింది. కుటుంబరావు సాహిత్య సాధనలో సాహిత్యప్రయోజన లక్ష్యం ఈ భావ విప్లవమే.

'అనుభవం'లో కథానాయకుడు నారాయణ రచయిత. "నారాయణ రచయితగా- చాల చిన్న పరిమితిని దాటిపోదలచలేదు. ఏ వీరేశలింగం పంతులుగారిలాగానో సామా జిక జీవితాన్నంతా ఆపోశనపట్టి, జనంలోని విశ్వాసాలను కూకటివేళ్ళతో కదిలించే ఆశయం తన తలకు మించినది. తన కథలలోని నాయకులను ఉత్తమ కళాకారులు గానూ, గొప్ప సాహితీపరులుగానూ, ప్రతిభాసంపన్నులైన చిత్రకారులుగానూ, ఆకాశ మంత ఎత్తుండే మహోన్నతాశయాలు గలవాళ్ళుగానూ చిత్రించే ఉద్దేశం అతనికిలేదు. మామూలు మనుషులు, మామూలు జీవితం, మనుషులు చేసే చిన్నచిన్న పొరపాట్లు, జీవితంనించి సాధించలేకపోయే చిన్న చిన్న సుఖాలు, ఇవే అతను తన కథల్లో పెట్టాడు. చిన్న కారణాల నించి పెద్ద దుష్పరిణామాలు కలుగుతాయన్నది అతను పైకి చెప్పని నీతి." కుటుంబరావు నమ్మిన హోమియో వైద్యంలో చిన్న మోతాదుల చికిత్సా ప్రక్రియను తన సాహిత్య వ్యూహంగా ఎంచుకోవటం ఆయన రచనలలో సాధారణ లక్షణంగా కనిపిస్తుంది. మళ్ళీ 'కురూపి'లో—"నా దగ్గిర ధర్మం చెయ్యా టానికి ఒక దమ్మిడీ వుంటే దాన్ని నేను కేన్సర్ వ్యాధి చికిత్సకు దానం చెయ్యాలా?

లేక కేన్సర్ పరిశోధనకి ధర్మం చెయ్యాలా? అన్న ధోరణిలో ప్రొఫెసర్ హాల్డేన్ ఒక ప్రశ్నను ప్రతిపాదించాడు. వైద్యులకు కేన్సర్ వ్యాధి అంతుపట్టేదాకా పరిశోధనలకిచ్చే డబ్బే ఎక్కువ సద్వినియోగం అవుతుందని వేరే చెప్పనక్కర్లేదు" అన్న సూత్రంతో, కుటుంబరావు సమాజ రుగ్మతలను డయాగ్నైజ్ చేసేందుకు శాస్త్రీయ పరిశోధనను తన పోరాటమార్గంగా స్వీకరించారు. తన సహజ తర్కశక్తిమీద ఆధారపడి తన పోరాటాన్ని ఆయన ముమ్మరం చేశారు. తన రచనలలో మారువేషాలనీ, బురఖాలనీ దూరంగా వుంచి తీక్షణమైన నిజాయితీతో తన కృషిని నిర్విరామంగా, నిరంతరంగా కొనసాగించారు. అయితే, చలం మోస్తరుగా కుటుంబరావు తెలుగుదేశంమీద తన ఆగ్రహావేశాలు ప్రకటించలేదు. "సంఘంలో వున్న కుళ్ళను సారస్వతంలోకి రాకుండా చేసి ఎవరి కళ్ళు కప్పుదామని?.... వెంకటచలంగారు రాస్తున్న విషయాలు ఎవరో ఒకరు రాసి తీరాలంటాను" అని చలంని సమర్థించిన కుటుంబరావు, తన సాహిత్యంలో సామరస్య వ్యూహాన్ని, దీర్ఘకాలిక పోరాటం దృష్ట్యా, ప్రతిభావంతంగా ప్రదర్శించారు. వ్యక్తులమీద కాకుండా వ్యవస్థ పునాదులమీద తన దాడిని కేంద్రీకరించారు. 'నిలవ నీరు'లో దత్తు అన్నా చెల్లెళ్ళ మధ్య వివాహాన్ని ప్రోత్సహించటాన్ని, ఈ తార్కిక పునాదులమీద స్థాపించిన సామరస్య ధోరణి మూలంగానే తెలుగుజాతి కుటుంబరావునీ, ఆయన ఎదురుదాడినీ సమ్మతించి ఆమోదించింది.

'కులద్వేషం'లో దమయంతి బ్రాహ్మణ ద్వేషాన్ని ప్రకటిస్తూనే బ్రాహ్మణ యువకుని పెళ్ళి చేసుకుంటుంది. 'పార్వతీ కళ్యాణం'లో కులనిర్మూలన సంస్కారం ప్రకటించిన పార్వతి, హరిజన యువకుని పెళ్ళి చేసుకుని కూడా తన అగ్రజాతి దురహంకారాన్ని సంస్కరించుకోలేక జీవితాన్ని ధ్వంసం చేసుకుని, భర్త శంకరం జీవితాన్ని నరకం చేస్తుంది. కులోన్మాదాన్నీ, వైషమ్యాలనీ ఆయన ఎక్కడా క్షమించలేదు. 'కాలభైరవుడు'లో పునర్జన్మ సిద్ధాంతాన్నీ, అది ఆధారంగా ప్రజలలో ఉన్న మూఢవిశ్వాసాలనీ ఆయన తూర్పారబట్టారు. పిల్లల పెంపకంలో మూర్ఖత్వాన్ని ('వర ప్రసాదం'), పౌరోహిత్యం పేరుతో సాగుతున్న అడుక్కుతినే నైచ్యావస్థనీ ('అట్టడుగు'), 'దేవుడింకా ఉన్నాడు', 'దుష్టగ్రహం' కథలలో దేవుడి పేరుతో జరుగుతున్న అత్యాచారాలనీ, 'కొత్త జీవితం'లో భూస్వామ్య వ్యవస్థ నించి తెగతెంపులు చేసుకున్న శ్రామికుని కార్మిక జీవన పద్ధతులనీ, 'నువ్వులూ-తెలకపిండి'లో కళను రూపాయల్లోకి మార్చుకునే వ్యాపార తత్వాన్నీ, 'నిరుద్యోగం'లో మధ్య తరగతి పేదరికపు దుర్భర పరిస్థితులనీ, 'తీరని సమస్య'లో వయసుమళ్ళిన అమ్మాయికి పేద

రికం తోడైతే, పరిష్కారం కాకుండా కుళ్ళబెట్టే వివాహ సమస్యనీ, 'సద్యోగం'లో మగ భోగంబతుకునీ, 'ఆదాయ వ్యయాలు'లో సంస్కారంతో దారిద్ర్యాన్ని నెగ్గుకొచ్చిన డబ్బు కొటకం పరిస్థితిలోని దైన్యాన్నీ—ఇట్లా ఏ సమస్యనూ విడిచిపెట్టలేదన్నంత విస్తృత పరిధిలో సామాజిక పరిస్థితులను ఆయన తన కథలకు వాతావరణంగా తీసుకున్నారు. మధ్యతరగతి జీవితంలో ఎదురయ్యే అన్ని సమస్యలూ ఆయనకు కథా వస్తువయాయి.

నిజానికి కుటుంబరావు అనేక సమస్యలతో కథలను తాడు పేనినట్లు పేనటం సాధారణం. ప్రతిసమస్యకూ మూలంలో వున్న అనేక సామాజిక కారణాలతో విడదీయరాని సంబంధాలను వివరించటం, వాటి గుణగణాలను చర్చించటం ఆయన కథలలో మామూలు. మారిన జీవితం, స్నేహితులు, కురూపి, పెళ్ళి చెయ్యకుండా చూడు, శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః, సవతి తల్లి, పార్వతీ పరిణయం మొదలయిన కథలలో సామాజిక, వ్యక్తిగత సమస్యలు ఒకదానితో ఒకటి పోటీపడినట్టుగా సాగుతాయి. 'మారిన జీవితం'లో యుక్తవయసులో దత్తత వెళ్ళటం, సంస్కార భావాలుగల తండ్రి తలపెట్టిన కూతురుపెళ్ళి, వరకట్నం, జీవితంలో జ్యోతిష్యం—నాడీ గ్రంథాల ప్రభావం, పల్లెటూరి భూస్వామ్య వ్యవస్థ పట్టు, నగర సంస్కార వాతావరణంలో పెరిగిన విద్యావంతురాలైన యువతి పల్లెటూరి సనాతన సంప్రదాయ కుటుంబంలో అడుగు పెట్టినప్పుడు తటస్థపడే కోడరికం. కులం, ఆస్థి, హోదా, మూఢాచారాలు— అన్నీ కీకారణ్యంలా ఎదురవుతాయి. ఈ కీకారణ్యం నించి దారిచేసుకుని వెళ్ళటం— అరటిపండు వొలిచిపెట్టినంత సులభంగా కథనాన్ని సాగిస్తారు కుటుంబరావు. ఇట్లాంటి కథలద్వారా జీవిత సత్యాలను వెలికి తీయటంలో ఆయన చూపిన ప్రతిభ, జీవితానికి అద్దం పట్టేదిగానే వుంటుంది. ఉత్తమపురుష ఏకవచనంలో కథ సాగినపుడు సైతం అది ప్రథమ పురుష బహువచనంగానే సామాన్యీకరణ జరుగుతుంది. అనేక సందర్భాలలో రచయిత ప్రేక్షకుడుగా, వ్యాఖ్యాతగా, సాక్షీభూతుడుగా పాఠకుని ప్రత్యక్షానుభవం కలిగించటం, ఆయా సమస్యలను పాఠకులతో నేరుగా చర్చించటం, సామాజిక వ్యవస్థలో భాగస్వామిగా ఉంటున్న పాఠకునికి పరిష్కార బాధ్యత అప్పజెప్పినట్టుగా అతని ఆత్మీయత పొందటం—కుటుంబరావు శిల్పంలో ఎంతో సహజంగా ప్రతి వాక్యంలో కనిపిస్తుంది. ఈ సామరస్య పోకడ సాహిత్య ప్రయోజనాన్ని మరింత పటిష్టం చేస్తుంది.

కథారచనలో కుటుంబరావు ప్రయోగాల విషయానికి వస్తే, 'గల్పిక' సృష్టి ఆయనదే. ఆయన శైలిలోని వ్యంగ్యానికీ, హేళనకీ, విమర్శకీ అనువుగా ఈ ప్రక్రియ

అవతరించి రూపురేఖలు దిద్దుకుంది. వ్యాసాన్ని, కథను కలిపి అంటుతొక్కిన ఈ ప్రక్రియలో, కల్పనకు పరిమితులు లేని స్వేచ్ఛ దొరికింది. వర్తమాన దేశచరిత్రలో ఘటనల పరంపరమీద, పాలనాయంత్రాంగం మీద, మరుగుజ్జు నాయకుల పాలనా పోకడలమీద, మేధావుల విచిత్ర ధోరణులమీద ఈ గల్పికా శరాలను ఆయన పదునుగా ప్రయోగించారు. 'దిబ్బరాజ్యం' పరంపరలో వచ్చిన గల్పికలన్నీ ప్రధానంగా నిశిత వ్యంగ్యానికి ఆటపట్టుగా సాగిన రచనలే. డిటెక్టివ్ సాహిత్యయుగం మంచిపట్టులో ఉన్న రోజుల్లో, అది వేసిన వెర్రితలల మీద డిటెక్టివ్ కేయాస్ని జాగిలంలా విడిచి పెట్టడంతో కుటుంబరావు కల్పనా వైభవం పేరడీల రూపాంతరం పొందింది.

పురాణ కథలు ఆధారంగా రాసిన అశోకవనం, బకాసుర కథలలో సైతం కుటుంబరావు ఆనాటి సామాజిక వ్యవస్థ స్వరూప స్వభావాలను చిత్రించటమే కన్పి స్తుంది. ఆర్యజాతి అధికార ప్రాబల్యాన్ని ప్రతిఘటించవలసిన రాజకీయ ధర్మంలో భాగంగా, తన జనానికి జరిగిన అవమానానికి ప్రతీకారంగా జరిపిన సీతాపహరణలో రావణుడు ప్రదర్శించిన ఔదార్యంతో పోల్చిచూస్తే, 'అశోకవనం'లో సీత ప్రవర్తన ఎంతో అహంభావపూరితంగా కన్పిస్తుంది. ముసలితనం నెత్తినపడి, కిరాతకత్వపు గత కీర్తితో బతుకు నెట్టుకొస్తున్న బకాసురుని భీముడు చంపటంలో చారిత్రిక వాస్తవికతను ఆవిష్కరించే ప్రయత్నం 'బకాసుర'లో కన్పిస్తుంది. పురాణాల కట్టుకథల నించి చరిత్ర వాస్తవాలను రాబట్టేందుకూ, అతీతశక్తుల అభూత కల్పనలను బట్టబయలు చేసేందుకు, సృజనాత్మక సాహిత్యంలో శాస్త్రీయ అవగాహనను జోడించేందుకు ఈ ప్రయోగం దోహదపడుతుందని వేరే చెప్పనవసరంలేదు.

'గ్రహశకలం' కుటుంబరావు శాస్త్రవిజ్ఞాన కాల్పనిక కథ. తెలుగు కథా సాహి త్యంలో, ఆ మాటకొస్తే భారతీయ సృజనాత్మక సాహిత్యంలో, శాస్త్ర విజ్ఞానం ప్రాతి పదికగా ఈ స్థాయిలో వచ్చిన కథలు అసలు ఉండకపోవచ్చు. ప్రపంచ భవిష్యత్తులో మూడుపూవులు—ఆరుకాయలుగా వికసించే విజ్ఞానానికి దీటుగా, సామాజిక వ్యవస్థలో మానవాభ్యుదయానికి సామ్యవాద సౌభాగ్యం ఎంతగా దోహదపడుతుందో చర్చించటం ఈ కథలోని ఇతివృత్తం. 12 టన్నుల అంతరిక్షనౌక 'ఎస్పెరాంటో'ని వెర్మా, కురాజో లతో, అయస్కాంత క్షేత్రంలేని ఆస్టరాయిడ్ గ్రహశకలం మీదికి పంపించి, ఆదిత్య గ్రహ విచ్ఛిత్తి ఫలితంగా ఏర్పడిన ఖగోళ విజ్ఞానాన్ని ఆవిష్కరిస్తారు ఆ రచనలో కుటుంబరావు. దేవుడిచ్చిన వరం, సత్యసంధుని కథ, ఫోర్త్ డైమెన్షన్, నువ్వైతే ఏం జేస్తావు?, పట్నవాసం మొదలయిన కథలలో కుటుంబరావు సాహిత్య ప్రయోగాల



K 5

గురించి ప్రత్యేక పరిశోధనలే అవసరమవుతాయి. శిల్పపరంగానే కాక, సిద్ధాంతపరంగా కూడా తెలుగుసాహిత్యాన్ని ఉన్నతశిఖరాలకు ఎత్తిన రచనలవి.

కుటుంబరావు అనేక వందల కథలు రాశారు. దాదాపు అయిదువందలు వుండ వచ్చునని ఒక అంచనా. అయితే శిథిలాలు తవ్వితీసినా మూడువందల కన్నా ఎక్కువ దొరికేట్టుగా లేదు పరిస్థితి. పుస్తకరూపంలో వెలువడిన కథలు సైతం ఇవేళ దేశంలో ఎక్కడా అందుబాటులో లేని నిర్లక్ష్యవైఖరి మూలంగా కుటుంబరావు కథల గురించి రాసే వ్యాసం ఏదీ సమగ్రంగా ఉండే అవకాశంలేదు. అందుకు ఈ వ్యాసం ఒక నిదర్శనం.

చింతా దీక్షితులు, చలం, శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి, మల్లాది రామకృష్ణశాస్త్రి వంటి అగ్రశ్రేణి కథారచయితల కాలంలో కథారచన కొనసాగించి, తెలుగు కథమీద తన ముద్రవేసిన కుటుంబరావు సమాజ వికాసానికి, జాతి సంస్కార వికాసానికి సమ ర్పించిన ఈ సాహిత్యం, జాతి గర్వించే గొప్ప సంపదగా ముందు ముందు మరింత ప్రయోజనాత్మకం అవుతుంది.

## సమకాలీన మధ్యతరగతికి విమర్శనాత్మక ప్రతిబింబమైన

# నవలా కుటుంబం

కె. వి. ఆర్.

1939 నాటి మాట. తెలుగు కథకుల గురించి ఇంగ్లీషున 'త్రివేణి' పత్రికలో శ్రీశ్రీ ఒక వ్యాసం ప్రకటించారు. అప్పటికి ప్రఖ్యాతి పొందిన వారిని కొందరిని పేర్కొని, అప్పుడప్పుడే పైకి వస్తూ వుండిన కొడవటిగంటి కుటుంబరావు (కె.కె.)ని కొద్దిగా మెత్తగా మందలించటం జరిగింది. చలం ధ్వనికి కె.కె. ప్రతిధ్వనిగా శ్రీశ్రీకి కనిపించారు.

కె.కె. నవలలు పరీక్షగా చదవక ముందు నాకు గూడా అలాంటి అపోహ ఉండేది. వాస్తవానికి ఎవరి రచనా ప్రభావాలైనా ఆయనమీద ప్రసరించే ఉండినట్లయితే, అవి కంటికి కనిపించేవి కావు. ఈనాడు శ్రీశ్రీ కూడా ఆనాళ్ళలో తామన్న మాటలను ఉపసంహరించుకోవడానికి సిద్ధమే.

ఈ అంశం గురించి కె.కె. నాకు రాసిన ఒక లేఖలో ఇలా గన్నారు :

"నేను నవలలు రాయటానికి ఎవరి influence గాని ఉన్నట్టు తోచలేదు. చలంగారిది అసలే లేదు. మిగిలిన నవలాకారులు నాకు చలంగారికన్న కూడా దూరంగా ఉన్నవాళ్ళు. నేను అభిమానించే పాశ్చాత్య నవలాకారులు చాలామంది ఉన్నారుగాని వారి ప్రభావం నాకు ఏ విధంగానూ ఉపకరించలేదు."

మంచి రచయిత లక్షణాలలో ఇది ఒకటి కావడమేగాక, చాలా ముఖ్యమైనది. ఏమిటంటే గురువులకు ఆజన్మాంతమూ ఒక లఘుప్రాయుడుగా ఉండక, తనకు తానొక గురువు కావడమే రచయితకు ప్రాణవాయువు. గురువులు వుండకపోరు. అయితే వారు శిష్యుని రక్తంలో రక్తమై రూపాంతరం చెందుతారు. పాత్రల ఎంపిక లోనూ, కథ కట్టుబడిలోనూ కె.కె. రచనలకు మరొకరి రచనలతో పొత్తు వున్నట్లు కనిపించవచ్చునేమోగాని, వాటికవి నకళ్ళు మాత్రం కావు. భాష, భావం కె.కె. మొహరుతోటి విలక్షణంగా కనిపిస్తాయి.

పుంఖాను పుంఖంగా అడిగిన పత్రికలకు అడిగిన వెంటనే కథలు రాసిన కె.కె. నవలలనుకూడా బహుళంగానే వెలువరించారు. అయితే ఆయనకు భూతకాలం గురించి ఉన్న ఖాతరుకంటె వర్తమాన కాలంమీద ఉన్నట్టిదే ఎక్కువ అనిపిస్తుంది. మిగతా విషయాలటుంచినా, ఈ ఒక్క విశేషానికైనా కె.కె. కు తెలుగు నవలాలోకంలో పెద్ద పీట వెయ్యవచ్చు.

ఆయన పుస్తకాలకు ఉన్న గిరాకీని బట్టి, ఒక్కొక్క పుస్తకం పడిన కూర్పుల సంఖ్యనుబట్టీ చూస్తే, ప్రజాభిమానాన్ని బాగా చూరగొన్న తెలుగు నవలాకారులతో కె.కె. ఎవ్వరికీ తీసిపోరనాలి. కథలూ, నవలలూ రాయటం కె.కె.కి మంచినీళ్ళ మర్యాద అయిపోయింది. మొపాసా కూడా ఇంత వేగంతోటీ పరంపరగా రాసే వాడట. త్వరగానూ, ఎక్కువగానూ రాసినా, అప్రయత్నపూర్వక మనిపించేంతటి సహజంగానూ, స్పష్టతతోనూ ఇద్దరూ రాశారు. అయితే అనేక కథలకు, నవలలకు శాశ్వతత్వం చేకూరలేదు. సార్థక్యంకూడా అంతగా లభించలేదు. కానీ రచనా విధానంలో, దృక్పథంలో మొపాసాతో కె.కె. భేదిస్తాడు. చలంతోకూడా. వాళ్ళిద్దరికీ వాస్తవ విషయంలోకూడా కల్పన దర్శనమిస్తే, కె.కె.కి కల్పనలోగూడా వాస్తవ గుణం కనిపిస్తుంది. వాళ్ళు ముఖ్యంగా హృదయవాదులు. కె.కె. బుద్ధివాది. గొప్ప రచయితలో వాస్తవ వాదమూ, కాల్పనిక వాదమూ సహజీవనం చేస్తాయి. వాస్త వాన్ని చిత్రించడమంటే దానికి ప్రతిరూపాన్ని కల్పించడం కాకుండా, దానిని సౌందర్యంగా మార్చటమే అంటాడు జెరాల్డ్ గౌల్డ్. ఆ ఇంద్రజాలం కె.కె.కి చేత కాదనడం కంటె సరిపడదనడమే సబబైన మాట. ఏ నవల గొప్పదనానికైనా ఆధార మేమిటంటే, అందులో వర్ణితమైన వస్తువు యొక్క మేలిమి కాదు. యథార్థ జీవితాన్నే చిత్రించవచ్చు. ఆ చిత్రణలో అందం కొరవడవచ్చు. కాని తాను ఎంపిక చేసిన జీవిత భాగాన్ని నవలాకారుడు ఎంత లోతుకు దిగి తరచి ఎంత సత్యసంయు

తంగా వర్ణించాడు, ఏ అంశాలను వదిలి ఏ ఇతర అంశాలను స్వీకరించాడు, ఏ కళా వైఖరితో రచించాడు, ఇవి మాత్రమే ముఖ్యమైన విషయాలు.

జీవితంలో గాఢ పరిచయం లేనిదే, శిల్పమూ భాషా ఎంత సొంపులు దేరినా, ఎవరూ మంచి రచయిత కాజాలరని కె.కె. సూత్రం. తనకు సన్నిహితంగా ఉండే జీవితరంగం నుండే రచయిత తనకు కావలసిన పదార్థాన్ని స్వీకరించాలి గాని ఎటు పడితే అటు బండిని తోలగూడదు. ఇది చిత్తశుద్ధికి సంబంధించిన విషయం మాత్రమే కాదు. రచనలోని బిగువు విశ్వసనీయతపై ఆధారపడుతుంది కాబట్టి, దానిని సాధించేందుకై, తనకు బాగా అనుభూతమైన జీవితాన్నే రచయిత చిత్రించవలెనాలి. ఆ అనుభూతి ఆత్మీయతగా మారుతుంది. అయితే అది రచయిత స్వీయానుభవమే కానక్కరలేదు. అనుభవం అనుభవంగానూ చిత్రితం కాగూడదు. అది రచయిత మనస్సుకు పట్టి అస్థి మూలాల వరకు ఇంకి భావనలో లీనమైపోవాలి. అప్పుడే ఆత్మీయత అనేదాని ఆవిర్భూతి. అది చేకూరినప్పుడు రచనకు ముడిపదార్థం లభించినట్లే. శిల్పమూ, భాషా అనేవి ఆ ముడి పదార్థాన్ని అందమైన వస్తువుగా తీర్చిదిద్దే సాధనోపకరణాలు మాత్రమే అంటా రాయన.

సూక్ష్మరూపంలో కె.కె. రచనా తత్త్వం అది. తదనుగుణంగానే ఆయన తమ కథలలోనూ, నవలల్లోనూ తమకు సుపరిచితమైన సంఘ వాతావరణాన్నే చిత్రించారు. 1914-18 నాటి ప్రథమ ప్రపంచ యుద్ధానంతర కాలం ఆయనకు సుదూర భూతకాలం. పదేళ్ళ తర్వాత ప్రపంచ వ్యాప్తమైన ఆర్థిక మాంద్యం ఫలితంగా తెలుగుదేశపు మధ్యమ వర్గ జీవితంలో ఏర్పడిన ఆర్థిక సంక్షోభం, గృహచ్ఛిద్రాలు, దారిద్ర్యం, అతివాద రాజకీయాల తొలి తాకిళ్ళు వగైరా—బాగా తన ఎరుకలోనివి. ఇక రెండవ ప్రపంచ యుద్ధం, తదనంతర కల్లోల పరిస్థితులు వర్తమాన కాలానికి చెందినవి. కాబట్టి 1927 మొదలు 1935 వరకు రచయితగా అండదశ, 1937 మొదలు కీటక దశ. మరి స్థలం విషయం చూస్తే మొదట గుంటూరు మండలం తత్పరిసరాలు. తర్వాత మద్రాసు నగరం, అందులోనూ మధ్యమవర్గపు తెలుగు కుటుంబాల వలయం, అంచులంచుల్లో సినిమా జీవితం, ప్రెస్సు, పత్రికాప్రపంచం — కె.కె. పరిధి ఇది.

ఇది పరిమితమైన పరిధి మాత్రమే. అందుచేతనే ఒకే విధమైన పాత్రలు ఒకటికి పదిమార్లు కనిపించడమొకటే కాదు, ఒకే విధమైన వాతావరణం పునఃపునః కళ్ళెదుట నిలుస్తుంది. నిలవక తప్పదనే కె.కె. మతం. అంటే, కథలు రాయటం చేతగాక కాదు. ఎన్ని విధాలుగానో కథలు రాయగలిగిన హేమాహేమీలకు గూడా ఒకే

ఒక్క వస్తువుపై గుప్తంగా మక్కువ ఉంటుందని ఆంద్రే మార్వా అంటాడు. రక రకాల ముసుగుల క్రింద ఒకే పుస్తకాన్ని రాస్తూ పోవటానికి కారణం ఆ వస్తువుకూ, రచయిత అంతరాంతరాలలో అణగిమణగి మసలే వాంఛితాలకూ అదృశ్యమైన లంకె ఒకటి ఉండటమేనట. అసమర్థుడూ, ఒకే ఒక్క కథావస్తువును పట్టుకుని వేళ్ళాడే వాడూ అయిన ఒక పాత్ర గురించి చమత్కారంగా కె.కె. వాడిన మాటలకు గంభీరార్థం కూడా ఉంది. "ప్రతి గొప్ప కథకుడూ ఒకే ఒక కథ రాస్తాడు. కావలిస్తే దాన్నే మ ళ్ళీ రాస్తాడు" అంటారాయన 'అరుణోదయం' నవలలో.

అయితే ఏకతార సంగీతం లాంటి ఈ అభిన్నత్వపు వేసటను అటుంచి, ప్రతిభ పేరిట చలామణి అవుతున్న నిత్యనూతనత్వం మితిమీరినప్పుడు కలిగే దుష్పరిణామాలను గూడా విజ్ఞులైన విమర్శకులు గుర్తించారు. అది మాదక ద్రవ్యాలలో ఒకటట. దానికి బానిసైనవాడు మోతాదు పెంచుకుంటూ, జీవితానికే మోసం వచ్చేటంతవరకూ దాన్ని సేవించక మానడట. అలాంటి నోవెల్టీకి కె.కె. వెయ్యి యోజనాల దూరాన ఉన్నారు.

గ్రంథ సమీక్షకులే విమర్శకులు, విమర్శకులే సమీక్షకులైన దుర్దశలో ఉన్న మనకు దురభిప్రాయాలు కొన్ని గట్టిపడి ఉన్నాయి. ఒకరిని ఒకందుకూ, ఇంకొకరిని ఇంకొకందుకూ మన ప్రసిద్ధ నవలాకారులను మెచ్చుకోవలసిందిగా విమర్శకులు ఈ వరకే నిర్ణయాలు చేసి ఉన్నారు. గోపీచంద్ నవలల్లో పాండిత్యం, బుచ్చిబాబు నవలల్లో వైచిత్రి, చలం నవలల్లో నిర్భరత్వం ఇలాంటి ద్రవ్యాలు.

గోపీచంద్ నవలల్లోని పాండిత్యం ప్రదర్శన స్థాయికి చేరుకుంది. కళను ప్రకర్ష త్రోసిరాజన్నది. కె.కె. స్పర్శతోటి పాండిత్యం బటువును కోల్పోకుండానే సుళువును సమకూర్చుకుంది. అనేక శాస్త్ర గ్రంథాలను రాసికూడా నవలల్లో, కథల్లో అర్భకులనిపించేంత అమాయకత్వాన్ని ఆయన కనపరచగలరు. ఆయన బలమంతా లోకజ్ఞానమే (commonsense). అక్కడక్కడ తత్వసిద్ధాంతాల ప్రసక్తి వస్తుంది గాని, ఎక్కడా అది మేధావులకు మాత్రమే బోధపడే సంకుచిత బుద్ధి వ్యాపారం కాలేదు. ఈ విషయంలో కె.కె. సోమర్సెట్ మామ్‌తో సరిపోలుతారు. సర్వసాధారణ విషయాలను కళగా మార్చడంలో ఇద్దరి కిద్దరే.

ఇంకొక విషయంలో కూడా ఈ ఇద్దరికీ పోలిక కనిపిస్తుంది. అక్కడే బుచ్చిబాబుకీ, కె.కె. కీ తేడా. బుచ్చిబాబు రచనలలో విదేశీ పూలవాసనలు బలంగా, దట్టంగా వుండి ముక్కుపట్టి ఈడ్చుకుపోతాయి. ఆయన భాషకు కూడా ఈ exotic beauty

ఉంది. ఇంగ్లీషులో ఆలోచించి తెలుగున రాయటం అన్నది బుచ్చిబాబుకు బాగా నప్పే మాట. మరొకవైపు, మందమతికి కూడా అవగతమయ్యేంత తేటగా సంస్కారవంతులైన తెలుగు విద్యాధికుల వాడుక భాషను సాఫీగా, తరంగప్రాయంగా కె. కె. వాడుకున్నారు. ఆరుద్ర ఒకచోట వర్ణించినట్లు రేపపెండలా చురుకు చురుకున తగిలే శైలి, నిరలంకారమనిపించేంతటి సాదాతనం, ఎంత గొప్ప విషయాన్నయినా తగ్గించి చెప్పే పద్ధతి ఆయనది. కె.కె. అన్నగారు వెంకటసుబ్బయ్య చాలా చక్కటి భావకవి కావడమటుంచి, కె. కె. స్వయంగా భావకవులనూ, ప్రబంధకవులనూ బాగా చదువుకున్నవారు. వారి నవలల్లో పలుతావుల ఈ కావ్యచర్చ వస్తుంది. మరి కావ్యశైలి అంటని వచనాన్ని శుద్ధ మనోహరంగా రాయడమే ఆయన తరహా అనుకోవాలి. ప్రకృతిని ఎక్కడోగాని తొంగికూడా చూడనివ్వరు. మెతకదనం ఎక్కడాలేదు గాని మెత్తనవుంది — అదే పటుత్వం. గజిబిజి ఎందునా లేదు. సూటయిన భావప్రకటన వుంది. ఉద్రేకాలూ, గీతి ధోరణులూ కనిపించవు. వాటి తావున ఉండేది చమత్కారం. అదైనా అదుపుకు లోబడే ఉంటుంది. ఈ మాటలు సోమర్సెట్ మామ్ గురించి ఒక విమర్శకుడన్నవి. ఈ రచనా పద్ధతిని civilised writing at its best అని ఆయన వర్ణించాడు. కె.కె.ది ఆ పద్ధతి. 'ఎండమావులు' అనే కె. కె. నవల గురించి రాస్తూ, అందులోని శైలి 'జర్నలీజ్' అనబడేదాని లాగున్నదని అన్నాను. మంచి దినపత్రికా శైలికీ, నవలా శైలికీ మౌలికమైన భేదమేదో ఉంటుందని నేననుకోను.

భాషను వదిలి పాత్రల నడవడికను పరిశీలించినా కె.కె.ది విలక్షణమైన దృక్పథమనాలి. అవి కూడా పరమ సాధారణమైన స్వభావాలుగల వ్యక్తులవే. కె.కె. విహారభూమి స్వర్గమూ, పాతాళమూ కాదు. రెక్కలు అసలే మొలవలేదని కాదుగాని ఎత్తుకు ఎగిరి అబద్ధాల అందమైన ఆకాశాలలో ఉక్కిరి బిక్కిరి కావడం సరిపడలేదేమో, వాటిని చేజేతులా ఊడ్చివేసుకున్నారు. ఎత్తు లోపించగా ఏర్పడిన వెలితిని విరివి పూరించింది. విరివికి లోతు జతచేరి ఉంటే, నిస్సంశయంగా చాలా గొప్ప నవలాకారులలో ఆయన ఒకరయేవారు. స్వభావాన్ని తరిచే కొద్దీ సొగసులూ వికారాలూ బయల్పడి, పాఠకులమీద ఆ పాత్రలు గాఢముద్రను వేస్తాయి. స్థూలంగా, సూచనప్రాయంగా ఒకటి రెండు వాక్యాలతో స్వభావాన్ని, యావత్ మనోప్రపంచాన్ని సూచించగల శక్తి చాలా గొప్పసిద్ధి. అది కొంతవరకు కె.కె.కి పట్టుబడింది. ఇంకొక విశేషమేమిటంటే ఆయన పాత్రలు దెయ్యాలవలె వికృతమైనవీ, దేవతలవలె నిర్మలమైనవీ కావు. అలా అయినప్పుడు అవి మానవపాత్రలే కాజాలవు. వక్రించడమూ, వికటించడమూ; ముందు హెచ్చరిక యివ్వకుండా హఠాత్తుగా మారి విస్మయం కలి

గించటమూ మానవస్వభావానికీ, కె.కె. పాత్రలకూ సహజమే అయినా—సాదాతనమే వాటి ప్రధానగుణం. సూటినడకే వాటి తెన్ను. ఇది ఒక లోపమే ననాలి. సాదాతనం ఆసక్తి గొలపదు. వింతలకు మనస్సులు ఊరుతాయి. చిరస్మరణీయమైన పాత్రలు తమ నవలల్లో లేవని నేను చేసిన ఫిర్యాదు విని పైన చెప్పిన లేఖలోనే ఇంకొక చోట ఆయన ఇలా రాశారు: "నాకు పాత్రలకన్న పాత్రల మధ్య ఉండే సంబంధాలను గురించి శ్రద్ధ జాస్తి...." పాత్రలు ఒకటికన్న ఎక్కువ ముడిపడి వున్నపుడు అవి సామాజిక సంబంధాలవుతాయి. సామాజిక వాస్తవానికి పాత్రలు తమ తమ రీతుల్లో రూపకల్పన చేస్తాయి. కాని సమాజంలో మనుషులున్నట్లుగానే అప్పటంగా నవలల్లో పాత్ర లుండవు. ఉండలేవు.

కె.కె. సృష్టించిన పాత్రలలో ఎక్కువ కాలం మనస్సును అంటిపెట్టుకుని వుండేవి అట్టే లేవనేందుకు నాకు ఇంకొక కారణం కనిపిస్తున్నది. ఈ మధ్యమవర్గ పాత్రల స్వభావాలలో సాఫీతనమున్నంతగా ఆకస్మిక పరివర్తనలుండవు. కాబట్టి మనకు విస్మయం బలంగా కలగదు. అసహజమైనదీ, అక్రమమైనదీ అంతగా వాళ్ళ ఆలోచనలోకే రాదు. అచరణకెట్లాగూ రాదు—ఎక్కడో అరుదుగా తప్ప. ఆ అరుదైన దానికీ స్పష్టమైన కారణం వుంటుంది. వారి ఆశయాలు జానెడు. లేదా మూరెడు. వారి బారలు ఇంటి గోడలను మీరవు. విజయాలు గురికి బెత్తెడు. ఫలితం నిరుద్రిక్త వాతావరణం. చలంకీ, కె.కె. కీ ఇక్కడే తేడా. నియమోల్లంఘనం, నెత్తురు ఎత్తిపోతలు కావడం, మనసులు గాంగ్రీంచడం, మంచాలు మూలగడం ఇక్కడ లేవు. మర్యాదా, మప్పితమూ కావలసినంత ఉంది. తిరిగి తిరిగి పెళ్ళిపీటల మీదకు చేరుకోవడమే ఎక్కువ.

కె.కె. గడించిన అనుభవాలనుబట్టి ఆయన జీవితం సంపన్మయమైనదని చెప్పవచ్చు. సంఘ సంస్కారోద్యమాల కొసతాకిడి అప్పటికింకా స్తబ్ధుపడని రోజులలో ఆయన మనస్సు పరిణతమైంది. స్టేజినాటకాల జోరులో బయస్కోపు మొదలవుతున్నప్పుడు, కింకవీంద్ర ఘటాపంచాననులు, మహామహోపాధ్యాయులూ పాలించే అక్షర రాజ్యంలో భావకవిత్వం మొగ్గలు తొడుగుతున్నప్పుడు, నీతి కావ్యాలకు తోడుగా కథానికలు బయల్పడుతున్నప్పుడు, సాహిత్యానికి పరిమితమైన గొప్ప పత్రికలు (అల్పాయుష్షువైనా సరే) వెలువడజొచ్చినప్పుడు, యువకుల మనస్సులలో 'సంఘ విద్రోహ' భావాలు పొటమరిస్తున్నప్పుడు, జాతీయోద్యమ స్తబ్ధతనూ, నిష్ఫలతనూ పురస్కరించుకుని వామ పక్షాభిప్రాయాలు గ్రీన్‌రూములో రంగులు పూసు

కుంటున్నప్పుడు, తెలుగువారి బ్రతుకు కొత్త మలుపు తిరుగుతున్నప్పుడు—ఆయన రచయితగా పునర్జన్మ నెత్తారు. మరొకవైపు 1930 నాటికి ఆయన చదువు ముగిసి బ్రతుకు మొదలైంది.

బతుకులు ప్రారంభించేందుకు అవి ఎంత దారుణమైన పరిస్థితులు! మధ్య తరగతి మనుషుల ఆస్తులు సన్నగిల్లి అంతరించిపోతున్నాయి. స్థిరత్వం, భద్రత లేవు. అదే సమయానికి గాంధీ సత్యాగ్రహోద్యమాల ఆటుపోట్లు. యువకుల హృదయాలలో స్వాస్థ్యాన్ని చేకూర్చుజాలని సందిగ్ధ దశ ఏర్పడింది. హిట్లర్ కారుసీడలు ప్రపంచ మంతటా వ్యాపించసాగాయి. హిట్లర్‌పట్ల అనుకూలత మన దేశంలో కొందరిని ఆవేశించినా, బుద్ధిమంతులందరికీ నెహ్రూ నాయకుడయ్యాడు. మరి కొంత కాలానికి ఇంకో ప్రపంచయుద్ధం. ఈ లోపల సోషలిస్టు ఉద్యమ విజృంభణం. జపాను విమాన దాడుల ఉపద్రవం. బ్రిటిష్ వ్యతిరేకత. యుద్ధ పరిస్థితిలో లాభాల బస్తాలు. ఇవి ఎంత దారుణ పరిస్థితులైనా, రచయిత కావాలని సంకల్పం చెప్పుకున్న మనిషికి మాత్రం కావలసినంత ముడిసరుకు.

తెనాలినుండి — బొంబాయి, మదరాసులవరకూ, వ్యక్తిమాత్రుల మొదలు— మహా సమూహాల పర్యంతం, దౌర్బల్యం నుండి—చరిత్రను కళ్ళముందు నిర్మించగల మహాశక్తి వరకూ కె.కె. జీవితం విస్తరించింది. అది అందించిన అశేషానుభవాన్ని ఆయన స్వీకరించారు. గ్రామసీమలో మొదలైన తమ బుద్ధి ఈ తదనంతరం దృశ్యాల కన్నిటికీ పూర్వరంగమైంది. శాస్త్ర విషయాల పరిజ్ఞానం ఈ అనుభవాలను తర్కించి సారాన్ని రాబట్టుకుంది. భౌతిక శాస్త్రాలకు, సాంఘికశాస్త్ర మనదగిన మార్క్సిజం తోడైంది. ఫలితంగా కె.కె. అవతరించారు.

ఈ జీవితానుభవాలను పురస్కరించుకున్న రచనలే కె.కె. కథలు, నవలలు. ఆంధ్రదేశంలో గుంటూరు, కృష్ణా మండలాల సాంఘిక వాతావరణమే ఎక్కువ నవలల్లో దర్శనమిస్తుంది. అదీ 1925-40 మధ్యకాలం నాటిది. అన్నీ మధ్యతరగతి కుటుంబాలే—ఒక్క 'ఎండమావులు'లోని రంగారావు (ప్రెస్ వర్కరుగా ప్రారంభించి నవలా రచనద్వారా సినిమాలకు చేరుకున్న కార్మికుడు) తప్ప. దాదాపు అన్నీ బ్రాహ్మణ కుటుంబాలే. తొలి నవలల్లో కథానాయకులు ఎక్కువమంది నిరుద్యోగులు, కథకులు, మద్రాసుకు ఎగబ్రాకి పత్రికలలోనో, సినిమాలలోనో కాలుమోపినవారు. బడ్డు బడుద్ధాయిలు కాకుండా అందరూ కె.కె.లా ఆలోచించగలిగినవారు — అభ్యుదయ పంథాలో. అయితే ఏ ఒక్కరూ రాజకీయాల సుడిగుండంలో ఎగిరి దూకగలిగిన

సాహసులు కారు—"సంధ్యా జీవులు, సందేహభావులు" (శ్రీశ్రీ) తల్లులు ఎక్కువగా మూర్ఖులు, తండ్రులు సాధువులు. ఇక చివరి నవలలలో బిడ్డల పెళ్ళిళ్ళకోసం తలి దండ్రుల బాధలు, యువతీ యువకుల కొత్త భావాలు, ఆలోచనలో ఎంతో వెనుకబడి పోయి అసమర్థతతో. లౌక్యంతో అతుకులబొంత బతుకుల నీడుస్తున్నవారూ కనిపిస్తారు. వ్యంగ్యమూ, హాస్యమూ ప్రబలాలవుతాయి. సినిమాల మోజు ఇంకా ఉంది. యువకులు కొందరు కుశాగ్రావులాగా హుషారుగా, షోకిల్లాగా కనిపించినా, సంప్రదాయబద్ధమైన ఆలోచనే వారిది. యువతులు మరింత సాహసాన్ని చూపగలుగు తారు. మొదటి నవలల్లో ఉన్న రాజకీయ పవనాలు తర్వాత వీచడం లేదు. కె.కె. నవలల్లో కొందరు వృద్ధులు వీరేశలింగం, రఘుపతి వెంకటరత్నంగార్ల అభిప్రాయాలకు వారసులమంటూ ఆచరణలోమాత్రం జిత్తులమారి నక్కలుగా కనిపిస్తారు. అక్క డక్కడ, చాలా అరుదుగా, అలగాజనపు బ్రతుకు కూడా తొంగి చూస్తుంది. అది కనిపించిన ప్రతిసారీ, పై తరగతులబోలు బ్రతుకులకంటె ఈ మురికివాడల బతుకు మరింత శుభ్రంగా, సుఖమయంగా, బాహాటంగా ఉన్నదని అంతరం చూపడానికే అన్నట్లుంటుంది.

కె.కె. నవలల (నేను చదవగలిగినవి) పట్టికను ఇక్కడ ఇవ్వడం బాగుంటుంది. మొదటి అయిదు నవలలకు ఆయనే వరుసక్రమం చెప్పారు. తర్వాతి పదునాలుగు రచనలను ముద్రణ కాలక్రమం బట్టి కాకుండా, వాటి వస్తువు కాలక్రమం బట్టి ఒక వరుసలో పెడుతున్నాను.

తొలి రచనలు: నీకేం కావాలి?, కులంలేని మనిషి, మారుపేర్లు, అరుణో దయం, గడ్డురోజులు.

నడిమి రచనలు: చదువు, జీవితం, లేచిపోయిన మనిషి, పంచకళ్యాణి, ప్రేమించిన మనిషి. ఎండమావులు, వారసత్వం.

చివరి రచనలు: సరితాదేవి డైరీ, బెదిరిన మనుషులు, కొత్త అల్లుడు, కొత్త కోడలు, తార, బ్రతుకు భయం, కురూపి.

ఇవి అన్నీ ఒకదాని కొకటి నకలు కాకపోయినా, ఏక కుటుంబీకుల నడుమ కొన్ని మొక్కట్లు (పోలికలు) ఉండినట్లే, వీటి నడుమ సామ్యాలు ఒకటీ రెండూ కాదు. ఈ వ్యాసానికి 'నవలా కుటుంబం' అని శీర్షిక పెట్టడంలో కుటుంబరావు నవల లనే అర్థం వచ్చేట్లయితే, ఆయన పేరుతో శ్లేష సాధించడం నా ఉద్దేశమై వుండలేదని మాత్రమే నేనివ్వుకోగల సమాధానం. అంతే కాదు. కుటుంబ సంబంధమైన ఇతి

వృత్తమే ఈ రచనలలో వివిధ దృక్కోణాలనుండి వర్ణితమైంది. తలిదండ్రులలో ఎవరో ఒకరు ప్రముఖంగా ఉన్న రచనలు కొన్ని, తలిదండ్రులకు పిల్లలకు గల ఆకర్షణ వికర్షణలు ఆధారంగా కొన్ని, దాంపత్య ప్రధానంగా వివాహేతర సంబంధాలు ఉపాంగంగా మరికొన్ని, బాల్యంలో వెర్రి వ్యామోహాలూ, ప్రాయంలో నిష్ఫల ప్రణయాలూ ప్రదర్శిస్తూ ఇంకొన్ని, వ్యభిచారం ఒక కొంత, వేశ్యావృత్తి ఇంకొంత. ఈ విధంగా స్త్రీ పురుషులకు సంబంధించి తరాలవారీగా, హృదయపరంగా ఒకే విధమైన ఇతివృత్తం "ఒక సూర్యుండు సమస్త జీవులకు తా నొక్కొక్కడై తోచు పోలిక" దర్శనమిస్తుంది. ఇది స్థూల పరిశీలనలోనే. దీనికి మినహాయింపులు లేవని కాదు. వైవిధ్యం లోపించిందనీ కాదు. భిన్నత లోపించింది. నైకత తక్కువైంది. అందుకనే ఈ శీర్షిక.

సాంఘిక చరిత్ర ప్రముఖంగా ఉన్న తొలి నవలలను మొదట స్పృశిస్తాను. అవి చదువు, అరుణోదయం, గడ్డురోజులు. "చదువులో అంతమైన వాతావరణాన్ని గడ్డురోజులులో పొడిగించాను" అని రచయితే ఒక లేఖలో వివరించారు. కాని ఈ రెంటి నడుమ 'అరుణోదయం' ఉన్నట్లు ఆంతరంగిక సాక్ష్యాన్ని బట్టి నిర్ధారణ చెయ్యవచ్చు. 'చదువు'లో దాదాపు ఇరవై ఏళ్ళ (1915-35) సాంఘిక చరిత్ర చిత్రం మనకు లభిస్తుంది. 'అరుణోదయం' కథాకాలం 1920 నుండి 1945 వరకు అనుకోవచ్చు. ఇక 'గడ్డురోజులు' ముఖ్యంగా ఆర్థిక మాంద్యపు రంపకోత దినాలకు—1934 ప్రాంతాలకు సంబంధించినది. సాంఘిక చరిత్ర ఆధారంగా నవలలు రచించడం, రచించి సఫలతనొందడం చాలా కష్టమైన పని, అరుదైన సంగతి. ఎందుకంటే కథ తన స్వభావాన్ని చరిత్రకు అర్పించివేస్తే చరిత్ర అబద్ధమైనట్లు కనిపించవచ్చు. సాంఘిక చరిత్ర గాకుండా కథగా ఉండవలెనంటే కాలక్రమంలో, పాత్రలలో వయస్సూ అనుభవమూ తెచ్చే మార్పులు చిత్రితం కావాలి. గోపిచంద్ 'చీకటి గదులు'లోలాగా చరిత్రగురించి సుదీర్ఘోపన్యాసాలు గాని, యథార్థ వ్యక్తుల ప్రతిరూపాలుగాని ఈ లోటును పూడ్చలేవు. కె.కె. ఈ జారుడు నేలమీద కాలు మోపకుండా మొదటనే జాగ్రత్తపడ్డారు. అయితే ఇలాంటి నవలలో ఉండవలిసింది కాలం ఒక్కటే కాదు. దానితోపాటు స్థలంకూడా బారుగా ఉన్నప్పుడు (time and space) దానికి రాణింపు వస్తుంది. కాల ప్రధానంగానే కాక మూల్య (value) ప్రధానంగా ఉండిన నవల మంచి నవల అనిపించుకుంటుందని ఇ.ఎం. ఫార్స్టర్ Aspects of the Novel లో అంటాడు.

కాలక్రమణికమీద కె.కె. వేసినది ఉల్లిపొర కాగితమేగాని చిక్కటి దుప్పటి కాదనిపిస్తుంది. తరాలు మారుతాయి, వ్యక్తులు ఎడకారు నుండి ముదురుకారుకు ఎదుగుతారు. అయినా వ్యంగ్యంగా ఉండిపోవలసింది వాచ్యమై, నవలకు చరిత్రగుణం ఎక్కువవుతుంది. అక్కడక్కడ సంవత్సరాలు ఫలానా అనో, ప్రసిద్ధమైన ఒక ఘటనను పేర్కొంటూ 'ఆ నపుయాన' అనో, ఈ కాలపురుషుడు తల వెళ్ళబెట్టుతాడు. ఈ అవలక్షణం బహుళం కాలేదు కాబట్టి సరిపోయింది. లేకుంటే చరిత్ర మిగిలి కథ అదృశ్యమై ఉండేది. 'చదువు'లో సుందరం, 'అరుణోదయం'లో రామమూర్తి, 'గడ్డురోజులు'లో సత్యం — చరిత్ర తోపులకు లోబడిన వ్యక్తులు. ఈ నవలలు వారి అనుభవాల సంపుటులు, ఆత్మల ఆవిష్కృతులు. 'చదువు' తప్ప తక్కిన వాటిలో విపుల విషయానికి సరిపడ్డ జాగా లేదు. పైగా వాటిని పాత్రల మూలంగానో, ఘటనల ద్వారానో కాకుండా—నేరుగానో, లేక 'ఒకరు', 'కొందరు' అంటూనో చెప్పేసరికి వాస్తవం మిగులు పడినంతగా కళ మిగులుపడలేదు. చరిత్ర నవలను లోబరచుకుంటున్నది. ఇది ఘోరాపరాధమో కాదో గాని, పట్టుకు రెండూ (అటు నవల, ఇటు చరిత్ర) దెబ్బతింటున్నవి. ఎందుచేత? వీటి పొలిమేరలు కన్నుల బడని విధంగా ఒక దానిలో ఒకటి లీనమైనట్లు అమరిపోవాలి. ఈ నవలలో ఇది నిజం, ఇది కల్పన అని విడివిడిగా నిలిచి ఒకదాని ప్రాబల్యం వల్ల మరొకటి దౌర్బల్యం పొందినట్లనిపిస్తుంది.

ఈ తొలినవలల్లోని కథానాయకులు ఒక్క మూసలోపోసిన కడ్డీలుగాకున్నా, ఎక్కువ పోలికలతో ఒకచేతి ఐదు వ్రేళ్ళవలె కనిపిస్తారు. దానినిబట్టి కె.కె.కు ప్రియమైన నాయకుడెలాంటివాడో తెలుసుకోవచ్చును. ఈ నాయక లక్షణాలు 1) మధ్య తరగతిలో జననం, 2) ఆర్థిక మాంద్యపు రోజుల్లో ఆస్తి హరించుకు పోవడమో లేక పుట్టు దరిద్రమో, 3) ఉన్నతాదర్శాలకు, కఠిన వాస్తవాలకు పొంతన కుదరక జీవితంలో ఎన్నో ఒడిదుడుకులతో రకరకాల వృత్తులకు పూనుకోవడం, 4) మిగతవారికంటె ఎక్కువ సాంఘిక చైతన్యమూ, ఎక్కువ తెలివితేటలు కలిగి ఉండటం. 5) అయితే మిగత వారికంటె ఎక్కువ బాగుపడలేక పోవడం — అనవచ్చు. ఆదర్శవాదియైన అభాగ్య యువకుని అసమర్థపు జీవయాత్ర ఈ నవలలకు ప్రాణం పోసి కథా వస్తువు నిచ్చింది.

'అరుణోదయం'లో రామ్మూర్తి చాలావరకు అలాంటివాడు. ఉన్న కొద్దిపాటి ఆస్తినీ బంధువులు వూడ్చివేస్తుంటే చూస్తూ వూరకుండి, బస్తీలోనూ తర్వాత మద్రాసు మహానగరంలోనూ నానాతిప్పలు పడ్డాడు. బి.ఏ. చదువుతో ఉద్యోగంలో దూరక,

స్వేచ్ఛను కోరి, ఆదర్శాలను పట్టుకొని జీవితాన్ని ఎదుర్కొని డక్కా మొక్కీలు తిన్నాడు. ఇది డిగ్రీలు లేని చదువు. జీవితమే పాఠశాల, ప్రయోగ మందిరంకూడా. ఒక్కొక్క మెట్టుగా ఈ చదువు విస్తరిస్తుంది. పాతవి కొత్తపాఠాల ముందు మరపున బడుతూ, కొత్తవి మెదటికి పట్టేలోపల సరికొత్తవి దాడిచేస్తూ, ఆలోచనల్లో అభిమానాల్లో స్థిరత్వం దూరమైపోతుంది. మార్పులకు మోర అడ్డంపెట్టి ప్రతిఘటించినా, మొరాయించినా, చివరకు వాటికి దాసోహ మనవలసి వస్తుంది. క్రితంలో వేటిని తాను నిరసించాడో వాటినే ఆశ్రయించి పైకెగబ్రాక జూస్తాడు. ఒక భావజాలం సంఘంలో కాలు నిలదొక్కుకుని మర్యాదగా మారిన తర్వాత—ఉదాహరణకు భావ కవిత్వ ధోరణి—దానిని సమర్థించబూనుకుంటాడు. ఈ విధంగా సంఘానికి ఎప్పుడూ రెండడుగుల వెనక ఉంటాడేగాని, దానితో కాలు కలపడు—కలపలేడు. ఒక మధ్య తరగతి విద్యావంతుడు తనకు తానై జీవితంనుండి విద్య నార్జించే క్రమం బాధామయంగా, సంకోచయుతంగా, అర్ధ మనస్కతతోటి ఈ రామ్మూర్తి పాత్రద్వారా బయల్పడుతుంది. ఇలాంటి నవల గొప్ప నవల అయే అవకాశం ఉందని 'చదువు' నవల నిరూపించింది. ఎందుకంటే ఇందులో భావ సంఘర్షణను సూక్ష్మాతిసూక్ష్మంగా చిత్రించే వీలు లభిస్తుంది. బాల్జాక్ గురించి రాస్తూ ప్రఖ్యాత ఫ్రెంచి విమర్శకుడు ఆంద్రే మార్వా ఇలాగంటాడు: "The greatest novels are those that tell of a young man's apprenticeship to life..., the essence of which is to be found in the conflict between the hopes of youth and the relentless facts of life."

'చదువు' కె.కె. నవలలు అన్నిటిలోకీ గొప్పదని నేననుకుంటాను. మాక్జిం గోర్కీ నవల 'Bystander' అనేది ఈ సందర్భంగా నాకు గుర్తు వస్తుంది. సుందరం అనే నాయక పాత్ర ఆత్మచరిత్ర ఈ నవల—అతని 'ఆత్మ' యొక్క క్రమక్రమా విష్కారం. 'Bystander'లో లాగా, 'చదువు'లో సుందరం, పరిసరాలలోని ఘటనలకు బానిసలాంటివాడు. ఆ ఘటనా చక్రానికి మధ్య ఉండనైతే ఉంటాడుగాని దానిని ఏ విధంగానూ తిప్పలేడు. ఇది సాధు ప్రవృత్తి అనేందుకంటె దౌర్బల్యమనుకోవడమే సబబు. అతని క్రియ యావత్తూ 'చదువు' అనే మూడక్షరాలకే ఒదిగి కూర్చుంది. అదీ అసమాపక క్రియగానే ముగిసింది. ఆర్థిక మాంద్యం రోజుల్లో వాటిల్లిన ఆస్తి నష్టం, బెనారసు చదువును కొనసాగనివ్వ లేదు. అనుభవాలను స్వీకరించడమేగాని, అనుభవాలను కలిగించడం సుందరానికి చేతకాలేదు. జీవిత ప్రవాహానికి దూరంగా కేటాపడి నిలుచున్నాడు. పిల్లల ఆటపాటలనుండీ, పెద్దల రాజకీయాలనుండీ, సమ

వయస్కుల వినోద ప్రియత్వంనుండీ, వయోధికుల వ్యవహారాల నుండీ సుందరం విడివడి సాక్షిప్రాయుడయ్యాడే గాని, భాగస్వామిగా పాల్గొనలేదు. నిజానికి అతనికి జీవితమంటే తగని భయంలాగుంది. ఆత్మవిశ్వాసం పూజ్యం. "వాడు ఏ పక్క తిరిగినా జీవిత సముద్రంలో పడి ఈదలేకుండా కొట్టుకుంటున్నవాళ్ళే కనిపించారు గాని, జీవిత శిఖరాన్నెక్కి నిర్మాణాలు చేసేవారు కనిపించలేదు." అందుచేతనే మెట్రిక్యులేషన్ కాగానే బ్రతుకు వాగులో దూకి నాగేశ్వరరావువలె నౌకరీ చూసుకోక, పై చదువుల నెపాన, జీవితం వేసిన ప్రశ్నకు సమాధానాన్ని వాయిదా వేశాడు.

'అరుణోదయం'లోని రామ్మూర్తి యిలాంటి ద్రాబకాదు. యుద్ధకాలంలో మూడో చెయ్యివుండే వుంటే, దానితో కూడా సంపాదించేవాడే. అతను బతకనేర్చిన వాడు. సుందరం బతక వెరచినవాడు. పూర్తిగా సుందరానికి నకలుగాకున్నా దాదాపు అలాంటివాడే 'గడ్డురోజులు'లో సత్యం. అతని ఆస్తి కూడా ఆర్థికమాంద్యంలో తుడిచి పెట్టుకుపోతుంది. అయితే సుందరంలో లోపించిన వ్యక్తిత్వం, సత్యంలో అతిశయించింది. కాని ఫలితం ఒక్కటే. తనకంటే తక్కువ చదువు చదివిన ఆంజనేయులు (ట్యుటోరియల్ కాలేజి), శ్రీరాములు (న్యూస్ ఏజంటు, పత్రికా యజమాని), వామనరావు (కిరాయి నాటక కంపెనీ నిర్వాహకుడు), వీర్రాజు (స్టేజినటుడు, సినిమా దర్శక-నిర్మాత), జీవిత స్రవంతిలోని పక్కపాయలలో చిట్టితెప్పలు నెట్టుకుని సాగిపోతున్నారు. తాను మాత్రం జీవితాన్ని ముఖాముఖీ ఎదుర్కొనకుండా, అది తోసిన చోట్లకెల్లా కొట్టుకునిపోతున్నాడు. లక్ష్యం ఇది అని తేల్చుకోకుండా లక్షవ్యాపకాలలో వేళ్ళు దూరుస్తాడు. పై పరిచయస్తులనే ఆశ్రయిస్తాడు. అయితే తనకేదో మహత్తర లక్ష్యం ఉన్నట్లు, దానికోసం తాను ప్రాపంచిక విజయాలను తృణీకరిస్తున్నట్లు ఆత్మవంచన చేసుకుంటాడు. జీవిత నాటకానికి తాను ప్రేక్షకునిలాంటి వాడై వుంటే, దానిని గుర్తించక, తానే అందులో కథానాయకుడిలాంటి వాడి ననుకుంటాడు. ప్రపంచాన్ని మార్చజాలని కారణంగా, మూర్ఖపుపట్టుతో ప్రపంచంనుండి వెలిపడినట్లు ఒంటరిగా నడవటానికి కూడా తయారయ్యాడు. డబ్బంటే లెక్కలేదుగాని డబ్బువినా పూట గడవదు. ఈ వైరుధ్యాన్ని దాటవేసేందుకే ఆ బహురూపిత్వమూ, తత్ఫలితమైన అరూపిత్వమున్నూ.

సత్యం చేతగానివాడు. డబ్బు వేసిన సవాలును అందుకోలేకపోయాడు. 'మారుపేర్లు' అనే నవలలోని సుబ్రహ్మణ్యం అనే మరొక బీద కుర్రవాడు అలా కాదు. "మనుష్య ప్రయత్నంలోనూ మార్క్సు సిద్ధాంతాల్లోనూ కొంత నమ్మకం

ఉంది." అసలు యిదొక విచిత్రమైన కథ. సుబ్రహ్మణ్యం సంపన్నుడైన ఒక విద్యాధిక యువకునితో (భూషణం) పందెం వేసుకుని, అతని పేరు తాను పెట్టుకుని, తనకు బొత్తిగా తెలియని వ్యాపారాన్ని నిర్వహించ బూనుకుంటాడు. పుట్టుకనుబట్టిగానీ, పెరుగుదలనుబట్టిగానీ వ్యక్తుల శక్తిసామర్థ్యాలు నిర్ణీతాలవుతాయా, కావా, అన్నది సమస్య. కావని చివరకు తేలినా, డబ్బు, జన్మ మానవజీవితక్రమాన్ని నిర్ణయస్తాయని, మలుస్తాయని ఈ నవల నిరూపిస్తుంది. డబ్బే మనుషుల మధ్య అంతస్తులను, అంతరాలను ఏర్పాటు చేస్తున్నది. ధనవంతుడి సుఖాలన్నీ ఇతరుల కష్టంమీద ఆధారపడి ఉన్నాయి కాబట్టి, ఆ మేరకు ధనం వాణ్ణి నైతికంగా భ్రష్టుపట్టిస్తున్నది. ధనం లేకుంటే తిండికి, బట్టకు కూడా గతిలేదు. కాబట్టి ధనహీనుణ్ణి అది భౌతికంగా దుర్గతిపాలు జేస్తున్నది. కేవలం ధనం వుండబట్టే ఎవడూ ఎక్కువ తెలివితేటలు గలవాడూ, సమర్థుడూ కాడు. ప్రయత్న మూలంగా ధనహీనులు కూడా పరిస్థితులను అదుపులో పెట్టుకోవచ్చును. ఈ నవలలో సుబ్రహ్మణ్యం చాటకచాటే సంఘతత్వం అలాంటిది.

మరొక్క అంశం అవశ్యం గుర్తించదగింది ఈ నవలల్లోని రాజకీయాల చిత్రణం—ముఖ్యంగా 'చదువు'లో. తెలుగుదేశపు గ్రామీణ వాతావరణాన్ని రాజకీయ ఘటనలు, చెరువులో రాయివేసినట్లుగా కల్లోలపరచడం సవివరంగా కె.కె. ఇందులో చిత్రించారు. వైస్రాయిగారి కారు ప్రయాణం మహాసంభ్రమాన్ని కలిగించే రోజులు.... బ్రిటిష్‌వాడు యుద్ధంలో (1914-18) గెలవకూడదనీ, కాని గెలుస్తాడనీ అనుకుంటున్న రోజులు.... తిలక్ ప్రాభవ కాలంలో గాంధీని తుస్కారిస్తున్న రోజులు.... ఇవన్నీ కథానాయకుడైన సుందరానికి ఒంటబట్టలేదంటే, అవి వ్యక్తుల రూపంలో అతని గుండెను తాకకపోవడమే కారణమనాలి. గాంధీజీ సహాయనిరాకరణోద్యమం మాత్రం అలాగాక—మేనమామ శేషగిరిగారి జైలుశిక్ష, పేదరికాల ద్వారా సుందరాన్ని కదిపింది. జైలునుంచి తిరిగివచ్చాక శేషగిరిలో వస్తుతః మార్పు వచ్చింది. తాను బాగుపడలేదు కాబట్టి ఇతరులు బాగుపడగలరనే నమ్మకం కూడా కదలబారింది. జాతీయ విద్యాలయం మూలబడడం, హరిజనులకు సవర్ణులతో సమానత్వం లభించకపోవడం అతన్ని కుంగదీశాయి. అయితే గాంధీ అతని తలకెక్కి దిగనన్నాడు. కాబట్టి కొత్తకారు జాతీయవాదులను అర్థం చేసుకోలేకపోయాడు. ఒకప్పుడు విధవా పునర్వివాహాలనూ, రజస్వలానంతర వివాహాలనూ సమర్థించేవాడే ఇప్పుడు తన కుమార్తెకు బాల్య వివాహం చేశాడు. అయితే అల్లుడు రంగారావు—జాతీయోద్యమంలో వచ్చిన

మలుపుకూ, జవహర్‌లాల్ నెహ్రూ ప్రభావానికీ మూర్తికట్టాడు. రాజకీయ విద్య సమాజపు అట్టడుగువరకు విస్తరించి రైతుకూలీల సంఘాలను నిర్మిస్తేగాని స్వరాజ్యం రాదని రంగారావు నమ్మిక. శేషగిరి వైరాగ్యం, రంగారావు ఆశామయ దృష్టి—ఇవి రెండు తరాలకు సంకేతాలు. మూడవతరం ఆంధ్రదేశంలో కాక, సుందరం పైచదువులకై వెళ్ళిన బెనారసు యూనివర్శిటీ హాస్టలు గదుల్లో రాత్రిపూట రహస్యంగా వెదజల్లబడిన కరపత్రాలలో దర్శనమిస్తుంది. నైతికబలానికి బాహాబలం తోడైతేగాని స్వరాజ్యం రాదనే 'టెర్రరిస్ట్' భావజాలం ఇది. మరి ఇంకొక నవలలో ఎక్కడా ఇంత విపులంగా ఒక మహోద్యమంలోని వివిధ దశలను వర్ణించే వీలు కె.కె.కి చిక్కలేదు. 'వారసత్వం' అనే నవలలో మాత్రం శాస్త్రి అనే అప్రధాన పాత్ర ద్వారానూ, సుదర్శనం అనే కథానాయకుడి ద్వారానూ, రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఒకవైపు సోషలిస్టు అభిప్రాయాల వ్యాప్తినీ, ఇంకొకవైపు ధనార్జనాపరుల విజృంభణనూ కె.కె. చూపారు. అయితే ఇంత విస్తృతంగా కాదు.

ఆర్థికమాంద్యం మొదలు ద్వితీయ ప్రపంచయుద్ధం వరకు, భావకవిత్వం మొదలు అభ్యుదయ కవిత్వం వరకు, స్థానం నరసింహారావు మొదలు సినిమా నటుల వరకు, గ్రామాలలో ప్రధానమైన వర్ణవ్యవస్థ మొదలు మహానగరాల వర్గవ్యవస్థ వరకు, జాతీయోద్యమం మొదలు కమ్యూనిస్టు ఉద్యమం వరకు — తెలుగు దేశపు పల్లెల్లో, బస్తీల్లో, పరిసర మహానగరంలో విద్యావంతులైన మధ్యమవర్గ యువకుల భావస్ఫూర్తికీ దాని దశాభేదాలకూ ఈ తొలి నవలలు సాహిత్య రూపాన్ని ఇవ్వటూనుకుని చాలవరకు కృతకృత్యాలయ్యాయి.

కందుకూరి వీరేశలింగం పంతులు, రఘుపతి వేంకటరత్నం నాయుడు చనిపోయింది నిజానికి వారి వారసులమని చెప్పుకునే అలసభావుల చేతుల్లోనే. ఆ మహనీయులిద్దరూ ఉద్యమప్రాయు లయ్యారనుకుంటే, సదరు ఉద్యమాలు వారి జీవిత కాలాన్ని దాటి సంఘాన్ని కదిలించలేదు. మిగిలి వుంటే, అవి కొత్త మతాలుగానో సంస్థలుగానో బిర్రబిగుసుకుని గిరిగీసుకున్నట్లుగా ఉండిపోయాయి. చిత్తశుద్ధిగల వ్యక్తులు కొందరు లేకపోలేదు. ఆ కొందరూ వేళ్ళమీద లెక్కింపదగినవారు. ఆషాఢభూతుల మందలో వారు కనుదగలకుండా పోయారు. పైగా సంఘ సంస్కారోద్యమాల గిరసలు తొక్కుకుంటూ, కొన్నిపట్ల పోటీపడుతూ మండల మహాసభలు, ఆంధ్ర మహాసభ, కాంగ్రెసు ఉద్యమాలు వచ్చి సంస్కరణకు అడ్డు తగిలేంతవరకూ పోయాయన్నది చారిత్రక యథార్థం.

కె. కె. నవయువ్వన కాలం నాటికే సంస్కరణోద్యమాలు దాదాపు ఊకదంపుడుగా, గాలిపేనుడుగా తయారై ఉండాలి. లేకుంటే ఆయన మనస్సును ఈ ఆషాఢభూతులు కదిపి నవలల్లో చోటుజేసుకుని వుండేవాడుకాదేమో ననుకుంటాను. 1939లోనే ఆయన రచించినట్లున్న 'కులంలేని మనిషి'లో మొదట ఈ ప్రసక్తి వస్తుంది. భోగంమేళాల నిషేధం, వడుపువృత్తి నిరసనం లేక ఈనాముల రద్దు వగైరా సంరంభాలు సద్దుమణిగాక. సమాజాన్ని దిక్కరించి సీతారామశాస్త్రి తాను వలచిన సానిపిల్లను పెళ్ళాడాడు. భార్య గతించగా, శాంతను పెంచి పెద్దజేశాడు. తనకు అవసానకాలం వచ్చిందని గ్రహించి, శాంతను తన తమ్ముడైన పురుషోత్తం చేతబెట్టి పోదామని పిలిపిస్తే వాడు అగ్గిరాముడై అన్నను నానాతిట్లు దిట్టి, కోపం తెప్పించి, చావును త్వరితం చేస్తాడు. పురుషోత్తం ఇంట శాంత ఖైదీ అవుతుంది. అక్కడి నుండి తప్పించుకుందామని పినతల్లి అనసూయ ఇల్లు చేరుతుంది. అది ఖైదు, ఇది రాదారి బంగళా. అక్కడ అచారం, ఇక్కడ దురాచారం. ఈ గోయినుండీ, ఆ బావి నుండీ విశ్వం అనే యువకుడు శాంతకు చేయి అందించి తప్పిస్తాడు. "నాకంటే అదృష్టవంతురాలీ క్షణాన ఈ ప్రపంచంలో ఎవతయినా ఉందేమో చూపించండి!" అని శాంత అన్నమాటలు ప్రత్యక్షర సత్యాలు. కులమే విలువలకు కొలబద్ద అయిన సమాజంలో కులంలేని పిల్లకు ఇంత సులభంగా వరుడు దొరకడం మాటలు కాదు. శాంత కూడా ఊగిసలాటలాడకపోలేదు. నాగభూషణమనే విధురుడైన పెద్ద (వయస్సులోనే) మనిషికి ఉంపుడుగత్తెగానైనా ఉంటిపోదామనుకున్నది. పురుషోత్తం యింటి కుంచేటిపిల్లగానో, అనసూయ ఇంటి కుక్కపిల్లగానో ఉండగోరలేదు. ఈ ధోరణి కె.కె. కథలో కూడా కనిపిస్తుంది.

'జీవితం' అనే నవలలో పదహారణాల సంస్కర్త — వీరావేశంతో వీరేశలింగం ముద్రతో దర్శనమిస్తాడు. దక్షిణామూర్తి ఉలిపికట్టె. ఊరివారికి "రాక్షసుడు". 'పంచకళ్యాణి'లోని విశ్వనాథంలా అల్లుడనే మిడతకోసం కూర్చున్న బల్లి మాదిరి కాకుండా 'బెదిరిన మనుషులు'లోని మరో తుహనా సంస్కర్తలా 'రత్నం' అనే పేరు కలిసి వచ్చేట్లు తన కుమార్తెకు సీతారత్నం అనే పేరుబెట్టి వేంకటరత్నం నాయుడు శిష్యుణ్ణనిపించుకోజూడకుండా, ఈ దక్షిణామూర్తి పదిహేనెకరాల పొలాన్నీ, ఇంటినీ ఈ సంస్కారపు జమకింద తగలేస్తాడు. అయితే కథల్లోని యువకులకు, తమ పెద్దల యుద్ధాలు అనవసరమనిపించేటంత మార్పు వచ్చింది. వితంతు వివాహాలకంటె సంఘం ఒకమెట్టు పైకెక్కి విడాకుల వరకు పోయింది. రెండు తరాల మనుషులకు

పోంతన కుదరక, పెద్దలకు పిల్లలు పితూరీదార్లుగానూ, పిల్లలకు పెద్దలు చాదస్తులుగానూ కనిపిస్తున్నారు. నిన్నటి సాహసి నేడు నవ్వులపాలవుతున్నాడు. ఈ సంఘపరిణామాన్ని 'జీవితం'లో దక్షిణామూర్తి గురించి ప్రకాశం, 'పంచకళ్యాణి'లో విశ్వనాథం గురించి లలితల ద్వారా కె.కె. సూచిస్తారు.

వేశ్యావృత్తికి సంబంధించిన పాత్రలు ముఖ్యంగా 'నీకేం కావాలి?', 'ఎండమావులు' అనే నవలల్లో చాల బలంగా చిత్రితాలయ్యాయి. గురజాడ అప్పారావు మధురవాణి ఏ కాపునైనా పెళ్ళాడి హాయిగా మిరపతోటను చూచుకుంటూ కాయకష్టం చేస్తూ బ్రతకగోరింది. మధురవాణికి లేనిది ఆర్థిక భద్రత. అయితే వేశ్యావృత్తికి మూలకారణం ఆర్థికమేనా? ధనం సమకూరాక వేశ్యలు వృత్తి మానుతున్నారా? వేశ్యావృత్తి లలితకళవంటిదైతే, పడుపువృత్తి యంత్రపరిశ్రమగా మారి, స్త్రీ అతిచవక వస్తువైంది. పడుపుగత్తెలను ఆ వృత్తికి ఆకర్షించి, ఆ నిరంతర ఆరోగ్య వ్యయానికి ఇష్టంతో కట్టివేసేదేమిటి? ఈ ప్రశ్నలకు జవాబుగా, క్షుద్రజీవితాన్ని వర్ణించే గొప్ప నవలలు చాలా వెలువడ్డాయి — కుప్రిన్ Yama the pit, ఎమిల్ జోలా Nana, డ్రీజర్ Sister carrie లాంటివి. ఆ స్థాయికి చేరుకున్నా చేరుకోకున్నా, గొప్ప పాత్రలు రెంటిని కె. కె. సృష్టించారు—కస్తూరి (నీకేం కావాలి?), సుందరం (ఎండమావులు).

'నీకేం కావాలి?' ఒక సమస్యకు పూరణం వంటిది. డబ్బు, ప్రేమ— ఇందులో మనిషికి ఏది ముఖ్యం? అనేది ఒక సమస్య. ఒక వాతావరణానికి మచ్చిక పడిన ప్రాణిని ఇంకొక వాతావరణంలోకి తదనుగుణమైన ఆలోచనా వైఖరులకూ— ఒకగాడిలో నుంచి పైకెత్తి ఇంకొక గాడిలోకి వెయ్యగలమా? ఇది రెండవ సమస్య.

రమామణి అనే వేశ్యకు ఎవడో పెద్దమనిషి పుట్టించిపోయిన పిల్ల కస్తూరి. ఆ పెద్దమనిషి కుమారుడు భావనారాయణకు చెల్లెలనే అందమైన పదార్థంతో అక్కర కలిగితే, అతని మిత్రుడు కస్తూరిని మచ్చికజేసుకుని మంచిబుద్ధులు నేర్పి భావనారాయణకు కానుకగా ఇవ్వాలని సంకల్పిస్తాడు. తనకు అనుకోని విధంగా సమకూరిన ధనంతో, బెజవాడ నుండి కలకత్తా వరకు సుందరితో రైలు ప్రయాణంచేసి, దారిలో కస్తూరి వెకిలిపనులకు మండిపడుతూ, నీతులు చెప్పుతూ భయపెట్టి లొంగదీసుకోవాలనుకుని నిష్ఫలుడవుతాడు. డబ్బుకూ డాబుకూ లొంగిరాని కస్తూరి మంచితనానికి లొంగిపోతుంది. ఒంటివేడికి కరిగిపోతుంది. మనస్సుకు మనస్సు సరియైన జవాబిస్తుంది. దయకు దయ! గురజాడ అప్పారావు 'సంస్కర్త హృదయం'లో రంగ

సాధయ్యేదులాగా, పైకెత్తేందుకు పోయిన ప్రబుద్ధుడు కిందపడుతాడు. అతనికి శీలం ఉన్నంతవరకూ ఆ దుశ్శీల ఎడంగా వుండి, అతను శీలాన్ని వదులుకున్నాడనీ తనను అపేక్షిస్తున్నాడనీ తెలుసుకున్నాక స్వార్పణం చేసుకుంటుంది. రమామణి ఇంటికి వచ్చి కుక్కల్లా కాచుకుని వుంటే 'ఖాతాదార్ల'లాంటి వాడుకాడు—మనస్సున్నవాడు, రసికుడు, నిజంగా తనను కోరాడు. అతని దృష్టిలో కస్తూరి మామూలు పడుపుగత్తె కాదు. అతని ప్రేమకు సరికి సరిగా తన ప్రేమనిచ్చే ప్రేయసి. ఇది వట్టి గాలిమేడ కాదు—శరీరాలు నిర్మించుకోగా హృదయం గచ్చువేసిన 'ఆత్మ' సౌధం! ఉన్మాదమో, మత్తో ఎక్కించక కళ్ళు తెరిచే ప్రేమ ఇది. దేహాల కలయికతో మొదలైనా మనస్సులను శుభ్రపరచింది. ఒకరి మంచితనాన్ని మరొకరికి చూపింది. ఆత్మాభిమానం, కులాహంకారం, సాంఘికాధిక్యం—ఇవి ఉన్నంతవరకూ జ్ఞానోదయం కలగలేదతనికి. ఒక గాడిలోనుంచి ఎత్తి ఇంకొక గాడిలోకి మనుషులను వేయవచ్చుగాని, అది ధనంతో అయ్యే పనికాదు. ధనం సాధనం మాత్రమే. పరివర్తనకు అది తోడ్పడవచ్చు. ముఖ్యం మనస్సు - దాని ద్రవీకరణ రూపమైన ప్రేమా. ప్రేమ అనేది పూర్తిగా దైహికమూ కాదు, మానసికమూ కాదు. దేహంతో మొదలుకాని ప్రేమ ఉండనట్లే దేహాన్ని మీరని ప్రేమ ఉండదు.

చలం కూడా యిలాంటి కథను యింకో విధంగా ఆదరించిన వారే. అయినా చలం రచనలోని అన్ని అభిప్రాయాలు కె.కె. సమ్మతి పొందవు. ఈ కథలోనూ, 'గడ్డు రోజులు'లో సత్యం ద్వారానూ చలం ప్రస్తావన వస్తుంది. కొంతవరకు మాత్రమే చలంతో ఏకీభావం. వివాహమనే సంఘసంస్థ లోపరహితంకాదు. గురజాడ కూడా ఈ లోపాలను ఎత్తిచూపారు. అయితే చలం సూచించే ప్రత్యామ్నాయాన్ని—స్వేచ్ఛాప్రణయం — కె.కె. అంగీకరించరు. మనస్ఫూర్తిగా పరస్పరం ద్వేషించుకుంటూనే గృహమే కారాగృహం కాగా భార్యాభర్తలు కొందరైనా వివాహ సంస్థలోని లోపాలకు సుఖాన్ని బలిపెట్టుకుంటున్నారని గుర్తించి, ఒద్దిక ద్వారానూ. స్త్రీ ఆర్థిక స్థితి సంస్కారస్థాయీ పెంపొందడం ద్వారానూ ఈ లోపాలు చాలావరకు పూడిపోవచ్చునని కె.కె. ఇతర రచనలు సూచిస్తాయి. దాంపత్యం ఇలా ఏడ్చింది గనకనే కస్తూరి ఎవడికీ భార్య కానొల్లదు. భార్యాత్వమంటేనే బానిసత్వమని వాచ్యంగానే అంటుంది.

అలాంటి మరొక 'స్వేచ్ఛాజీవి' సుందరం (ఎండమావులు). ఇక్కడ సంస్కారం లేని బజారు వాతావరణం ఉన్నా, మానవ స్వభావం ఉభయసామాన్యమే. భార్య గంగిని

చక్కబెట్టుకోలేక తన్ని పుట్టింటికి తోలేసిన రంగయ్య, అది సినిమా హాళ్ళవద్ద రెండో ఆటవేళ రోజూ హాజరై పడుపు పనికి పూనుకుంటే కోపంతో భగ్గుమంటాడు. కాని, ఆ వృత్తిలోనే పుట్టిన సుందరంను పల్లెత్తుమాటైనా అనడు. సుందరి నిత్యకన్య. చిన్ననాటి నుంచి చెలిమి చేసినా రంగయ్యకుకూడా పెళ్ళాం కావాలని కోరుకోదు. రాత్రి పూట రంగయ్యవద్ద గడిపి సుందరం ఇచ్చిన సుఖం త్రిలోకాధిపత్యమే. సుందరం 'సామాన్య' కావచ్చు. శేషు అనే తాగుబోతు నాలుగేళ్ళు దానినుంచుకొని జైలుకు పోయేముందు రంగయ్య 'ఆదా'లో పెట్టిపోయాడు. అయినా అతనికి అది 'స్వీయ' మాత్రమే. మధ్యమధ్య 'పరకీయ' అయినా ఖాతరు చెయ్యడు. ప్రేమ అనిపించుకోని, అనిపించుకోజాడని ప్రేమ — స్నేహమూలమైన అభిమానం — ఈ ఇద్దరికీ వున్న అనుబంధం. సుందరానికి "ప్రేమబంధం సహజంగా కనబడేది గాని నీతిబంధం చాలా అసహ్యంగా కనబడేది." రంగయ్య రంగారావుగా మారి కథకుడుగా పేరు గడించి మద్రాసుకు తనను తీసుకునిపోయాక గూడా అతనికి తాను భార్యగా మారిపోవాలనే కోరికను తోసివేస్తుంది. సినిమాలలో స్థానం దొరికాక, తనపట్ల రంగారావు ధోరణిలో మార్పు కనిపించి, అతను 'మర్యాద' కోసం పాకులాడ మొదలెట్టేసరికి, అతనిలో సహజ మానవత్వం బదులు కృత్రిమాడంబరత్వం వచ్చి చేరేసరికి, తాను ఒక చిన్న ఇంట వేరే కాపురం పెట్టింది. రంగారావు కట్టుకున్న పేకమేడలు కూలి అతనికి ఎండమావులలో దప్పిక తీరక తిరిగి ఎప్పుడు దారికి వచ్చాడో, అప్పుడు తనకు తానే వచ్చి కలిసింది. భార్య గంగి పీడకల, సినిమా అతిమంచికల. వీటిమధ్య యథార్థమైన, ఫలప్రదమైన బ్రతుకులోని మానవహృదయ శుభ్రతకు ఈ సానిపిల్లను కె.కె. విజయస్తంభంగా నిలిపారు. మంగళసూత్ర మొక్కటే స్త్రీకి పురుషుడిపై, పురుషుడికి స్త్రీపై జీవిత హక్కును కలిగించలేదు. అంతకంటె స్థిరమైన హక్కు హృదయానిది. హృదయంలేని భార్యలకంటె హృదయంగల వేశ్యలైనా మేలు. నిజానికి భర్తమీద ఇష్టం లేకుండా రోజూ అతనికి తన దేహాన్ని అర్పించుకునే ఆడది వ్యభిచారంకంటె ఘోరమైన అపరాధం చేస్తున్నది — మరెవరికో కాదు, తనకే. ఆ అపరాధం ఆత్మహత్యా సదృశం. ఈ నవలలో కనిపించే దృక్పథం ఇలాంటిదే.

బాల వితంతువుల సమస్య ఈశ్వరచంద్ర విద్యాసాగర్ హయాం నాటిది పొమ్మని, వీరేశలింగం పంతులు పరిష్కరించివేశాడు లెమ్మని ఉపేక్షించదగింది కాదు. కె.కె. నవలలు రాస్తున్న నాటికి అది అపరిష్కృతమైనదే. ఈ సంఘపరమైన అక్రమం కె. కె. ని చాలా పసితనంలోనే బటువుగా కదిపినట్లుంది. ఆ విషయం గురించి

నవలల్లోనూ, కథల్లోనూ ఆయన ప్రస్తావించినప్పుడెల్లా గుండెల్లో అలుగు దిగినట్లుం టుంది. 'చదువు'లో శకుంతల ఈ వరకే పరిచయమైంది. 'అమాయకురాలు' అనే కథలో భ్రమర, వెంకటేశ్వర్లనే తన బాల్యస్నేహితుడిని మెప్పించేందుకై, మళ్ళీ తలవెంట్రుకలు పెంచుకొంటుంది. అయితే అతనికి ఒక సంబంధం స్థిరపడిందని తెలిశాక, మనస్సు ముక్కలయ్యే నిస్పృహతో, తానే క్షురకర్మకు పూనుకుని మళ్ళీ వికృతరూపిణిగా మారుతుంది. సంఘంమీద పగ తీర్చుకోలేక, తన సౌందర్యం మీదనే అసహ్యం పెంచుకొంటుంది.

'వారసత్వం' అనే నవలలో అనూరాధగాని, 'తార' శ్యామలగాని అలా క్యా[illegible] [illegible]ళ్ళకు జీవితంమీది ఆపేక్ష చివరి వరకూ [illegible]వలేదు. భ్రమరవలె వా[illegible] పస వాళ్ళు కాదు. అంత మెత్తని స్వభావమూ లేదు. సుదర్శనం అనే బిడ్డల తండ్రి ప్రోద్బలంతో అనూరాధ, ప్రకాశరావనే మోసగానితో పెళ్ళికి (మళ్ళీ పెళ్ళి) శ్యామల- ఒకరు సంకోచంతోటీ, ఇంకొకరు ఆనందంతోటీ లోబడిపోతారు. సుదర్శనం భార్య దుర్గాంబ అక్షరాలా దుర్గాంబే కాబట్టి అనూరాధను నేరుగా కాకుండా భర్తను రాచి రంపాన పెడుతుంది. అనూరాధను పెళ్లాడే సాహసం సుదర్శనానికి లేదు. ఇల్లు కట్టించి ఇస్తాడు. వ్యాపారంలో వాటాలు కొని ఆమెపేర వేస్తాడు. కాని సంఘాన్ని కాదని పెళ్ళాడలేడు. అతను అలాగైతే, అనూరాధ కూడా పునిస్త్రీ కావడానికి సుముఖత చూపెట్టదు. తాను తినేది దొంగకూడు. చేసేది పాపకర్మ. కాబట్టి పెళ్ళాడి ఈ పాపాన్ని పుణ్యంగా మార్చుకోవాలనుకోవడం ఆత్మవంచన. అనూరాధ మనస్తత్వం ఇలాంటిది. సుదర్శనం తనను ఉద్ధరించాడు, నిలవ నీడనిచ్చాడు, సుఖమిచ్చాడు. అతని పట్ల కృతజ్ఞత ఉంది, గౌరవం వుంది. అంతేగాని పెళ్ళాడి అతని భార్యకావాలనే అత్యాశ లేదు.

పుస్తె కట్టీకట్టకముందే గుటుక్కుమన్న భర్త, శ్యామలకు లీలగానైనా గుర్తు లేడు. ఊగ తెలిశాక పేరంటాలకు, సంబరాలకు తాను పనికిరాకపోయాననే చింత మాత్రమే. శ్రీరామశాస్త్రి అనే సంస్కరణాభిలాషి ప్రోద్బలంవల్ల శ్యామల తండ్రి రెండోపెళ్ళి చేసి చేతులు కడుక్కున్నాడు. కంటికి నదురుగా కనిపించి చెవికి కూడా బురిడీ మాటలతో ఇంపుగొల్పే ప్రకాశరావు, శ్యామలకు భర్త అయాడు. ఎలాంటి భర్త! భార్యను పెట్టుబడిగా పెట్టి, సౌందర్యానికి ప్రలోభపడే ధనవంతుల నుంచి లాభాలు వసూలు చేసుకుందామనే వ్యాపారం అతనిది. తర్వాత, మద్రాసులో శ్యామ లకు సినిమా ఛాన్సు ఇప్పించి డబ్బు సంపాదించుకుని పైమెట్టు చేరుకుందామనే

కోరిక — శ్యామలకు అతనిమీద రోత కలిగించింది. ఒక చెట్టియారును మోసంచేసి గడించిన డబ్బుతో ప్రకాశరావు అంతర్ధానమయ్యాక, శ్యామల బతుకు బజారున పడి ఉండవలసిందే గాని, వాసుదేవరావు అనే సంపన్నుడు చేయి అందించబట్టి మళ్ళీ చిగురించింది. అయితే మాత్రం? శ్యామల వితంతువుల సమస్యను ఎలా పరిష్కరించి నట్లు? ఎవరికో ఒకరికి ఉంపుడుగత్తె కావటమేనా పరిష్కారం? సాని కాలేదు. అదే పదివేలు. తెగించి పెళ్ళాడినా ఇటువంటి భర్త దాపురించినపుడు, వయసులో ఉన్న ఆడదేం చేస్తుంది! శ్యామల అదే చేసింది. ఏం చేయాలి, ఏం చేస్తే మంచిది అన్న ఆదర్శాల, నీతుల ప్రసక్తి కాదిది. అనూరాధ కూడా ఈ ఉపపత్ని హోదానే పొందింది. 'కన్యాశుల్కం'లోని మీనాక్షి చేసిన చీకటి తప్పులూ. 'అమాయకురాలు'లో కె.కె. సృష్టించిన పాత్ర భ్రమర అఘాయిత్యం, 'చదువు'లో శకుంతలకు లభించిన ముండల ముఠాకోరు భర్త, శ్యామలకు నామమాత్రపు భర్త ప్రకాశరావు — ఏమి తెలుపు తున్నాయి ఈ కేసులు? పూర్ణమ్మలా ఆత్మాహుతికి పాల్పడకుండా విధవలు, ముఖ్యంగా యువతులు, చేతికందిన పామునుకూడా పట్టుకుని ప్రవాహాన్ని ఈదుదామనుకోవలసి వస్తున్నది. సుఖపడ్డవాళ్ళు లేకపోలేదు.

భర్తలోకం మీదికి పోగా, పునిస్త్రీ అయి ఉండీ దాంపత్యసుఖం లేక అనాథ రాలుగా అటమటించే స్త్రీ హృదయాన్ని యశోద అనే పాత్ర ద్వారా, 'లేచిపోయిన మనిషి' అనే 19 పేజీల చిన్న నవలలో కె.కె. ఆవిష్కరించాడు. ఎంత ఆస్తి ఉన్నా, కొత్త ఆస్తి వచ్చిపడినా, యశోద నిర్వేదానికి అంతులేదు. పైగా ఈ ఆస్తిని చూసి మేనమామ అయిన లక్ష్మీకాంతం అనే పైలాపచ్చీసుగాడు యశోదను బుట్టలో వేసు కోవాలని పిచ్చివేషాలు వేసి బుద్ధి చెప్పించుకున్నాడు. యశోదకి ప్రాయశ్చిత్తం చేయా లని, పూనాలో కనిపించిన ఒక తెలుగు కుర్రవాణ్ణి ఇంటికి పిలుచుకు వచ్చి, వీడే నీ మగడని చెప్పాడు. యశోద ఏం చేయాలి? నిగ్రహంతోటీ, స్వాభిమానంతోటీ ప్రవర్తించే దక్షిణామూర్తి, తానే యశోద భర్త నారాయణశాస్త్రి అయినంత స్వతం త్రంగా సొంతదారుగా ప్రవర్తించి, యశోదకు ఎంతో మనస్తాపాన్ని కలిగించాడు. అతన్ని భర్తగా భావించడమెట్లా? యశోద తండ్రి చలమయ్య మోచేతి నీళ్ళు తాగలేక, అతను అదే ఊరిలో ఒక హోటలులో సర్వరుగా చేరి, హోటలు యజమానిని కొట్టి జైలుకు పోవడం, ఆ దెబ్బలాటకు కారణమైన హోటలు పనిపిల్లను తీసుకువచ్చి ఈ ఇంట పనికి కుదర్చటం, యశోదకు సంకటమై పోయింది. తన భర్తే కాకుంటే అలిగి ఎందుకు వెళ్ళినట్లు? అయినా ఈ పరువు తక్కువ పని ఏమిటి? యశోద కన్నీళ్ళు

కార్చింది. ఆ కన్నీళ్ళ మూలంగానే ఆమె హృదయానికి దక్షిణామూర్తి ఎక్కి పోయాడు. చివరకు నారాయణశాస్త్రిని తానేనని నిరూపించుకున్నాడుకూడా. ఎంతో నాటకీయత ఉన్న ఈ నవలికలో, స్త్రీ మనస్తత్వంలో మరొక అంశాన్ని కె.కె. పైకెత్తి చూపారు. స్త్రీత్వం, భార్యాత్వం ఆపేక్షించే ఒక సంపన్న యువతికిగల అహంకారాన్ని, స్వాతిశయాన్ని ఆ ఆపేక్షలు ఎలా తొలగించివేశాయో ఈ నవలిక ప్రదర్శించింది.

'అరుణోదయం' నవలలో సుభద్రది కాకివన్నె, కాకి కంఠం. అయినా గాయని, నటి. రామ్మూర్తిని మెప్పించగలిగింది. ఇలా ప్రతి అనాకారీ గంతకు తగిన బొంతను పొందగలదా? అందచందాలే పెళ్ళి పెటాకులకు ముఖ్యమవుతున్నపుడు, ఒంటి చాయనుబట్టి మనిషి అందం నిర్ణయింపబడుతున్నప్పుడు, వికారం పట్ల సహనం, సానుభూతి లేని ఒక ఆధునిక యువకుడికి వికారియైన ఒక స్త్రీని పరిచయం చేసి, దాన్ని పెంచి, ఫలితాలెట్లాగుంటాయో చూడబూనుకొన్నట్లుగా 'కురూపి' అనే నవలికను కె.కె. రాశారు. అయితే ఈ వస్తువు ఆయనకు కొత్తదేమీ కాదు. 'ప్రేమించిన మనిషి' అనే నవలలో గోపాలం అనే యువకుడు పద్మ అనే యువతి దేహాన్ని మీరి మనస్సునెలా దర్శించాడో చూపెట్టారు. పద్మ ఎర్రగా బుర్రగా సరోజవలె ఉండక, "....వంటి చర్మం పదును పెట్టి చెప్పులు కుట్టటానికి తయారుచేసినట్టుగా వికారంగా ఉంది. అసలు మనిషిని చూస్తేనే గానుగాడిన చెరకు గడలా ఉంది." కాబట్టే సరోజ ఆకర్షణ. పద్మ వికర్షణ. చివరకు సరోజ మనస్సు చిన్నదీ, వికారమైనదీ అని, పద్మ మంచిదని, రంగు పూస్తే ముఖం చూడవచ్చునని గోపాలం గ్రహిస్తాడు. గోపాలం ఆడదానిని తప్ప మరిదేన్నీ ఆలోచించలేని వయసులో ఉన్నాడు. నలభై ఏళ్ళ స్త్రీనీ కోరగలడు, పదహారేళ్ళ మంగినీ ముద్దాడగలడు. కాని పెళ్ళి అనే భావం వచ్చేసరికే ఆలోచనకు పూనుకుంటాడు. తనవి ఎంతటి అభ్యుదయ సాంఘిక భావాలైనా, మంగి వంటి పనిపిల్లను పెళ్ళాడలేడు. పైగా మంగి సుఖపడదట! అతనికి అడ్డువచ్చింది స్వీయవర్గ సంస్కారం మాత్రమే. సరోజను ఎవడో పెద్ద ఉద్యోగి పెళ్ళాడాడు. అది అటుంచి, సరోజ స్వభావం తనకు సరిపడదు. పద్మ తనపైన కన్నువేసింది. వాళ్ళది బీద కుటుంబమైనా ఒకప్పుడు బాగా బతికినవాళ్ళు. పైగా సినిమా నటిగా పైకి వస్తున్నది. ఇన్ని కారణాలున్నాయి — పద్మను తన భార్యగా గోపాలం ఎట్టకేలకు ఎంపిక చేయడానికి. ఈ హంగులేవీ లేక పద్మ వట్టి అనాకారి మాత్రమే అయివుంటే పెళ్ళాడేవాడో లేదో చెప్పటం కష్టమే.

'కురూపి'లో సరస్వతి సొగసరీ కాదు, అనాకారీ కాదు. ఒకవేళ అనాకారి అయినా దాన్ని కప్పివేయగల తెలివితేటలున్నాయి. తననెవరూ ప్రేమించి పెళ్ళాడరు లెమ్మనే నిస్పృహ, ప్రేమను గురించి మరొకదాన్ని గురించి ఆమెచేత కఠినపు మాటలనిపిస్తుంది. పెళ్ళేవద్దు పొమ్మంటుంది. కోరికలేక కాదు—వరుడు రాడనే బాధ వల్ల మాత్రమే. కనకం అనే కథకుడితో సరస్వతికి కలిగిన పరిచయం స్నేహమై, ప్రేమగా పక్వం చెందటానికి ఏదో ఒక ఉత్పాతం అవసరమైంది. సరస్వతికి ఆరవ ప్రాణం వంటి అన్న చావురూపంలో వచ్చిందది. అపుడు కనకం ఓదార్పు మాటల కంటె అతని ఒంటి వేడీ, కంటి తడీ సరస్వతిని గట్టెక్కించాయి. ఇంతకు ముందు బిర్రబిగుసుకుని, అయాచితంగా వచ్చిన ముద్దుకుకూడా కదలబారని శిలవంటి సరస్వతి, ఇప్పుడు సహానుభూతి కలగవలసిన దేహస్పర్శకు ప్రవాహప్రాయమైంది. ముగింపు కృత్రిమమని అనిపించినా, సమస్య విడిపోయింది. కథలోనూ, జీవితకథలోనూ కురూపులకుగూడా స్థానం ఉందని మాత్రమేగాక, అందంగాలేని పాత్రలకుగూడా స్థానం ఉందని మాత్రమేగాక, అందంగాలేని పాత్రలకుగూడా ప్రాధాన్యం ఉందని తేలింది. కాకుంటే, అలాంటి పాత్రలవల్ల అసాధారణ సమస్యలు ఏర్పడవచ్చునంతే. అవి పరిష్కారం కానివేమీ కాదు.

పెళ్ళిళ్ళకు సంబంధించిందే మరొక కోణం. ప్రేమ వివాహాలు ఇంకా బహు కొద్ది సంఖ్యలోనే జరుగుతున్నాయి. పెద్దవాళ్ళు ఏర్పాటుచేసిన సంబంధాలే ఎక్కువ. కట్నాలు, కానుకలు, చదువు, నౌకరీ, ఆస్తి, కులమూ—ఇవే ప్రధానాంశాలు. వీటి మీద కాంతిని ప్రసరింపజేస్తూ కె.కె. కొన్ని నవలలు రచించారు. వాటిలో పంచకళ్యాణి, సరితాదేవి డైరీ, కొత్త అల్లుడు, కొత్త కోడలు ముఖ్యమైనవి.

మొదటిదానిలో తప్ప తక్కిన వాటన్నిటిలోనూ పెళ్ళి తాపత్రయం కూతుళ్ళ కంటె వారి తల్లులలోనే ఎక్కువగా కనిపిస్తుంది. 'పంచకళ్యాణి'లో లలిత తల్లి సౌభాగ్యమ్మ ఆత్రం బయటపడదు. ఇక సరితాదేవి, కమలమ్మ ('కొత్త అల్లుడు'), హనుమాయమ్మ ('కొత్త కోడలు'), సమర్థులమనుకునే అసమర్థపు, అస్తవ్యస్తపు వ్యక్తులు. తమ కుమార్తెలకు పెళ్ళి కావాలనే దుగ్ధ ఒక్కటే వాళ్ళకు తెలిసింది. వాళ్ళ దృష్టికి కుమార్తెలు అర్భకురాళ్ళు. తమ మంచి ఏమిటో తమకే తెలియదు కాబట్టి ఈ తల్లులు ఆ పిల్లలకు అనువైన మగళ్ళను సంపాదించిపెట్టగోరుతారు. భర్తలను, కుమాళ్ళను ఖాతరు చెయ్యరు. ఎంతో విషాదాన్ని కలిగించే వాళ్ళేగాని—పిల్లలు బుద్ధి మంతులు కావడంవల్లనూ, అబ్బలు నిదానస్థులు కావడం వల్లనూ చివరకు వాళ్ళ

ఆటలు కట్టి, ఈ నవలల కథలన్నీ సంతోషంతో ముగుస్తాయి. మరి ఈ ఉద్ధత వ్యక్తులు బోర్లాపడుతారు. ఆ పడడంలో ఒక్కసారిగా పడి, చదివే వాళ్ళకు హాస్యాన్నీ కరుణనూ కలిగించి మరీ పడుతారు. ఈ పాత్రలన్నీ ఒకేవిధంగా ఆలోచించి ఒకే పద్ధతికి లోబడిన పాత్రలు కావడంబట్టి, హాస్యానికి పనికి వచ్చినంతగా మరొకందుకు పనికి రావు.

కూతుళ్ళూ, అల్లుళ్లూ కొత్తతరం మనుషులైనందుచేత పెద్దలతో ఘర్షిస్తూనో, వారి కళ్ళు కప్పుతూనో చివరకు తమ అభీష్టాలను నెరవేర్చుకొంటారు. లొంగిపోవడ మనే ప్రశ్న లేనేలేదు. వాస్తవజీవితంలో ఉన్నంతకంటె మెరుగ్గా, తెలివిగా కనిపిస్తూ స్వేచ్ఛను నిలబెట్టుకుంటారు. అమ్మలవి హాస్యప్రధానపాత్రలైతే, వీళ్ళవి ఆదర్శ పాత్రీకరణలు. వెరసి, రెండూ వాస్తవాన్ని ఎక్కువగా మన్నించినట్లు కనిపించదు. 'సరితాదేవి డైరీ' ఒక్కటే ఆధారమైతే, సరిత కుమార్తె సరోజ తెలివితక్కువ పిల్ల అనుకోవలసి వచ్చేది. నిజానికి అలా కాదని 'సరోజ డైరీ' తెలుపుతుంది. తల్లి తనను రంజన్‌తో తార్చడానికి కూడా పూనుకొన్నా, సరోజ నిభాయించుకుంది. ఆత్మగౌరవం గల ఒక వ్యక్తి మరో వ్యక్తిని కోరేటట్టుగా రంజన్‌ను కోరింది. అతను తాకినా, ముద్దా డినా ఛీకొట్టలేదు గాని, ప్రోత్సహించలేదు కూడా. సుముఖత చూపిందేగాని లొంగి పోలేదు. సరోజ సంస్కారి. అందుచేతనే వెకిలితనానికి దిగిన సావిత్రిని కాదని, సరో జను గౌరవించి ప్రేమించి పెళ్ళాడాడు. తన తలిదండ్రులు సావిత్రితో పెళ్ళి నిశ్చ యించి శుభలేఖలు వేయించినా లెక్కచెయ్యక. సరోజను రిజిస్టరీ పెళ్ళి చేసుకున్నాడు. 'కొత్త అల్లుడు'లో కమలమ్మను ఖాతరు చెయ్యకుండా చంద్రావతి నేరుగా కుశాల్రావు హోటలు గదికి వెళ్ళి, అతన్ని పెళ్ళాడేందుకు పూర్ణాంగీకారం తెలిపి, తల్లని ఎదు ర్కొంది: "మీ అందరి ఇష్టాలూ విని విని తలపట్టిపోయింది. ఇకముందు నా యిష్ట మేమిటో మీరు వినండి." 'కొత్త కోడలు'లో సరోజిని నేరుగా హనుమాయమ్మ యింటికే వచ్చి చలపతితో ధారాళంగా మాట్లాడుతూ, ఇంటిల్లపాదినీ (హనుమా యమ్మను తప్ప) మంచి చేసుకుంటుంది. ఇక్కడా రిజిస్టరీ పెళ్ళి. కమలమ్మలూ, హనుమాయమ్మలూ, సరితలూ ఓడిపోక తప్పదు. తాము వెనకబడి, మునుసాగిన వారిని వెనక్కు లాగేందుకు ప్రయత్నించడంలో బోర్లాపడి, తాము బాధపడుతూ ఇతరు లను బాధపెట్టి, చివరకు నవ్వులపాలవుతున్నారు. అలనాటి అగ్నిహోత్రావధాన్లు వీళ్ళను ఆవేశించాడు. అయితే విషాదంగాక, ఈ కథలను హాస్యం ముగిస్తున్నది. అది సంఘవ్యాధులకు సున్నితమైన శస్త్రచికిత్సకై వినియుక్తమవుతున్నదిగాని వెకిలి

తనానికి కాదు. ఈ అమ్మలే గెలిచివుంటే బీభత్సమో, శోకమో ప్రముఖంగా భాసించి వుండేది. పేదరికానికీ, మట్టమైన ఆశలకూ మాత్రమే అలవాటుపడిపోయిన మధ్యమ వర్గపు కింది ఛాయావాళ్లూ, ప్రపంచపు పోకడ తెలియని కూపస్థ మండూకాలూ, ఆచార మర్యాదలంటూ పట్టింపులతో కన్నబిడ్డల సుఖాలను కాలరాచేవాళ్ళూ — ఈ గండాగొండి 'కులపాలికలు'.

'పంచకళ్యాణి'లో కూడా ఈ పెళ్ళి వ్యవహారాన్ని ఐదుగురు కన్యల జీవితాల ద్వారా భిన్నరూపాలతో ముచ్చటించినా, ఇందులో ఆ హాస్యంలేదు. మగవాళ్ళ పొడ నైనా సహించని వీరమహిళా స్వాతంత్ర్యవాది లలిత, మన్నుదిన్న పాముగా వుండి తండ్రి ఆమోదంతోగాని ఎవరినీ పెళ్ళాడనొల్లని తాయారు, తండ్రి ఎట్లాగూ తనకు సంబంధాలు తేలేడని రామకృష్ణ అనే ధనవంతుడైన బంధువును మెప్పించి సుఖమిచ్చి ఆతనికి రెండో భార్య అయి సంపదలతో తేలిపోయే సపర్ధురాలు సుశీల, సుధాకర మూర్తి అనే ఒక అడవి మనిషిని పెళ్ళాడి అత్తవారింటి అడవి పద్ధతులకు ముఖం వాచి భర్తచేత గెంటించుకుని వావీవరసా ఎంచక చలపతితో వ్యభిచరించి తిరిగి తండ్రి పంచకు వచ్చి సెక్రటేరియట్‌లో ఉద్యోగంచేసే జానకి, అన్నదమ్ముల మీద వాళ్ళు సంబంధాలు తెస్తారన్న గురిచచ్చి ఆడంగిరేకుల మగవాడని తెలిసినా ఏదో యింత ఆస్తి వుంది, పైగా చెప్పినట్లు నడుచుకుంటాడు లెమ్మని కమలాకరాన్ని పెళ్ళాడిన లక్ష్మి—వీళ్ళ పెళ్ళిళ్ళు, ప్రేమలు, వీళ్ళ తల్లిదండ్రుల అన్నదమ్ముల అవస్థలూ అభి ప్రాయాలూ—ఈ కలగాపులగాన్నంతటినీ ఒకచేతి విసనకర్ర వ్యూహంలో కుదించిన నవల 'పంచకళ్యాణి'. ఒక చిన్నసైజు సాంఘిక చిత్రమనదగింది. ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చేటంతవరకు స్త్రీకి ప్రేమ, దాంపత్య సుఖం, మగనితో సమస్థితి, హక్కులు, దాదాపు మృగ్యాలే. ఆ స్వాతంత్ర్యం నిమిత్తం లలిత పురుషజాతితో యుద్ధం చేయా లంటే, జానకి ఉద్యోగం చేస్తుంది. పెళ్ళి కాకముందు తండ్రికీ, అయిన తర్వాత మగనికీ మైనంలా వంగి లొంగే తాయారుకు పోటీగా, తనంతతానై ఏదో విధంగా మగణ్ణి సంపాదించుకుని, లోబరచుకుని, అతని సంపదననుభవించే సుశీల. ఈ ఇద్దరి మధ్య, రెక్కలులేని పిట్టవలె ఆశనూ, ఆత్మవిశ్వాసాన్నీ కోల్పోయి, స్త్రీసముడైన పురుషుణ్ణి బుట్టలో వేసుకుని గాఢంగా నిట్టూర్చిన లక్ష్మి.

గొప్ప సాంఘిక సమస్యలలో పెళ్ళి మనకింకా చాలా గడ్డుసమస్య. పెళ్ళికీ భావిజీవన సౌఖ్యానికీ పీటముడి పడివున్నప్పుడు, దాంపత్యంలో ఏకపక్షాధికారం ఆ సౌఖ్యాన్ని కుంటుపరుస్తుంది. సహిస్తూవున్నదని—స్త్రీ సంతుష్టి చెందుతున్నదనలేము.

వర్ణాల, వర్గాల అసమానత్వంకంటే దీర్ఘకాలికమైనదీ, దారుణ ఫలితాలు కలిగించేదీ ఈ స్త్రీ — పురుషుల అసమానత్వం.

ఆడవాళ్ళకు తెలివితేటలు తక్కువ అనే మాజీ సంస్కర్త విశ్వనాథం మొదలు, తాను మాత్రం తైనాతీ పనిచేస్తూ తన చెల్లెలు లక్ష్మి కళ్ళకు గంతలు కట్టుకోవాలనే నాగరిక నవయువకుడు సీతారాం వరకు, ఈ 'మగమహారాజులు' నయాన భయాన ఆడవాళ్ళను అదుపులో పెట్టగోరుతున్నారు. రంగారావువంటి స్త్రీ జనాభ్యుదయ వాదులు కొందరు Knight-Errant లక్షణాలు ఒంట బట్టించుకుని బస్సులలో లేచి సీటివ్వడం, వానలో గొడుగివ్వడం, ప్రమాదంలో వచ్చి చక్రం అడ్డు వెయ్యడం లాంటి చిట్టిపనులు చేస్తున్నారే గాని, సమస్యను మూలంవరకు తరచి అక్కడ గొడ్డలిపెట్టు పెట్టడం లేదు. చాలమంది స్త్రీలుకూడా తమ అనుభవంచేత మోసపోయి స్త్రీ సమస్యే లేదంటున్నారు. పాతకాలపు వాళ్ళు ఆడది మగవాడి కట్టుదిట్టాలలోనే ఉండిపోవాలంటున్నారు. విద్యావంతులైన యువతులలోగూడా తమస్థాయి గురించిన గుర్తింపేలేదు. ఎటువచ్చీ లలితలాంటి వీరనారీమణులు ఆవేశాన్ని చూపినంతగా ఆలోచనను సారించక, మగవారిమీది ద్వేషంతోటి తమ బతుకులలోనే నిప్పులు పోసుకుంటున్నారు. డిగ్రీలుండటం ఆడదానికి అదనపు బలాన్నివ్వటం పోయి, మరొక సమస్యను తెచ్చి పెడుతున్నది: "డిగ్రీలుగల పిల్ల శీలంలేనివానితో సమానం". ఇక కట్నాలమాట చెప్పడ మెందుకు?

ఈ చిత్రం, మర్యాదస్తులమనుకుంటున్న మధ్య తరగతిదేగాని, అటు సంపన్నులు, ఇటు నిత్యదరిద్రులు ఇంత అన్యాయం కాదు. ఈనాటి కాలేజీ విద్యార్థులను గురించి మాట్లాడుతూ లలిత చేసిన వ్యాఖ్యానంలో అతిశయోక్తి ఉందేమోగాని అబద్ధం లేదు: "ఆడవాళ్ళను గౌరవించాలి, వాళ్ళకు మగవాళ్ళతో సమాన హక్కులివ్వాలి, జీవితంలో పురుషుడికి సమమైన పాత్ర స్త్రీ కూడా నిర్వహించాలి అని అడ్డమైన వాళ్ళూ చెప్పే ధర్మపన్నాలలో ఆవగింజంతయినా విశ్వాసం లేనివాళ్ళు కాలేజీల్లో చదువుతున్నారు! వీళ్ళే రేపటి నాయకులు! వీళ్ళకన్న రిక్షాలు లాగేవాళ్ళూ, లాగుడుబళ్ళవాళ్ళూ, తమ స్త్రీలను ఎక్కువ గౌరవంగా చూస్తారు! ఆ మాటకు వస్తే వాళ్ళ ఆడవాళ్ళు తమ భర్తలతో సమాన హోదా అనుభవిస్తూనే ఉన్నారు."

లక్ష్మి అన్న సీతారాం దాకా ఎందుకు, జానకి అన్న కమలాకరం వంటి శిఖండి కూడా తన చెల్లెలు పదస్తుగా వుండాలని, ఏ ఇంజనీరో డాక్టరో దాని భర్త అయితే బాగుంటుందని ఒకవైపు అనుకుంటూనే, ఇంకోవైపు జానకి చెలికత్తెలలో ఎవతె

తనను మోహిస్తుందా అని వలలు వేస్తాడు. లక్ష్మి అన్న శంకరం ఆడ సినిమాస్టార్ల అందచందాలను అగ్గించి వర్ణించవచ్చుగాని, అతని భార్య సావిత్రి ఏ నటుడి అందం మెచ్చుకున్నా అతను అగ్గిరాము డవుతాడు.

పరిష్కార మార్గం ప్రేమా? ప్రేమకూ సంఘనీతికీ పొసుగుదల లేదు కాబట్టి అది ముసుగు వేసుకుని సందుల్లో గొందుల్లోనో, హృదయాల్లో మాత్రమేనో, "అరణ్యవాసమూ, అజ్ఞాతవాసమూ చేస్తుంది". అది అరుదేమోగాని అబద్ధమేమీ కాదు. ఈ విషయం చలపతి చెప్పగా జానకి తెలుసుకొంది. లలిత దృష్టిలో ప్రేమించే హక్కు గాని, ఆ హక్కును అమలు పెట్టుకునే అధికారంగాని మగవాళ్ళకే ఉంది. ప్రేమింప బడే హక్కును స్త్రీ అమలు చేసినప్పుడే తాను బాగుపడుతుంది. పూర్వం, ఈ హక్కును సానివాళ్ళు అమలు పరచుకున్నారు. "సానివృత్తి చట్టరీత్యా నిర్మూలమయి తేనేంగాక, ఆడవాళ్ళందరూ ఆనాటి ఉంపుడుకత్తెల వైఖరి అవలంబిస్తే ఆడదాని సమస్య అరక్షణంలో పరిష్కారమవుతుంది." సంసారాలు చేస్తూనే, ఉంపుడుకత్తెల వైఖరి! ఇది సమన్వయ సిద్ధాంతం. ఆడదానిమీద ఇప్పటి రోజుల్లో మోజు తగ్గిందా అంటే ఈ ఆడబొమ్మల ముఖచిత్రాలతో పత్రికలు, పోస్టర్లు, ఆడవాళ్ళ అలంకరణ వస్తువులతో పరిశ్రమలు ఇవన్నీ ఏమిటి మరి? ఆడదానికి నేటి మన్నన భోగవస్తువు గానే. అదీ ఇతరుల స్త్రీలు. సంసారాల్లో మాత్రం కుళ్ళు. కుళ్ళిన కాయగూరలను పారేస్తారు గాని కుళ్ళు సంసారాలను మాత్రం సాగిస్తారు. ఇంతకీ ఉన్నంతలో ఈ సమస్యకు విశ్వనాథం చూపినదే సాధ్యమైన పరిష్కారం. చట్టాలూ వగైరా రొష్టును తగ్గించగలవేమోగాని తుడిచిపెట్టలేవు. "సంసారాలు చక్కదిద్దుకోవటం కుటీర పరిశ్రమ. ఎవరి కసువు వాళ్ళు ఊడ్చుకోవాలి." కె.కె. అభిప్రాయం ఇదేనైనా ఆశ్చర్య పడే అవసరం కనిపించదు.

కాలాన్నిబట్టి నడకల్లోనూ, నడతల్లోనూ మార్పులు. అరుణోదయ మవుతూ ఉండిన రోజులలో, కొద్దిపాటి చదువూ సంస్కారమూ ఆస్తీ పాస్తీ కలిగిన రామ్మూర్తిలాంటి యువకులు పరిణామాలను గుర్తించి, తదనుగుణంగా తామూ రూపొందారు. ఆశయాలంటూ ఆదర్శాలంటూ సత్యంలాంటి వాళ్ళూ, ఉద్యమాలంటూ ఉత్సాహాలంటూ సుందరంలాంటి వాళ్ళూ బతకలేక చితికిపోయారు. రానురాను మార్పును గుర్తించి స్వీకరించే సూక్ష్మగ్రహణశక్తి యువకుల మనస్సులనుండి వైదొలగిందేమో, లేక సాంఘిక సంచలనాలమీద గురి తప్పిందేమో, బాహ్యాభ్యంతరా లలో ఇప్పుడు తీవ్రమైన వైరుధ్యం ఏర్పడి వుంది. వ్యక్తివాదం అతిశయించింది.

వేషభాషల నాగరికత హృదయ అపరిపక్వతను, మేధ అపరిణతినీ అణచివేయజూసి విఫలమవుతున్నది. అలనాటి సంస్కారం దూరమైంది. సాహిత్యం, కళలు వ్యాపార సాధనాలయ్యాయి. క్షుద్రాసక్తులు పెచ్చరిల్లాయి. ఇది స్థూలంగా 1917 తదనంతరం కలిగిన పెనుమార్పు.

కె.కె. నవలల్లో కూడా ఈ మార్పు ప్రతిబింబితమవుతుంది. ఇది హఠాత్పరిణామం కాదు కాబట్టి ఇందులోనూ ఒకటి రెండు తరాలు, వారిమధ్య అంతరాలు కనిపిస్తాయి. 'ప్రేమించిన మనిషి'లో గోపాలం, 'జీవితం'లో ప్రకాశం, మరీ ఇటీవలి వారిలాగె అప్రాప్యులు కారు. మునుపటి రోజుల కొనసవ్వళ్ళు వారిలో వినవస్తాయి.

గోపాలం 'డబ్బు జబ్బు' మనిషి కాడు. అహంభావులలో ఒకడు. అంటే, తానకు కావలసినట్టు ప్రపంచం వుండాలనుకుంటాడు. తాను బ్రతుకుతున్న బ్రతుకు తృప్తినివ్వదు. మనశ్శాంతి లేదు. ప్రేమ, నీతి వగైరా విషయాలలో స్వతంత్రించి ఆలోచించగలడు. పేదలను కనికరించగలడు. రక్తపాతమూ, బలప్రయోగమూ లేనంత మేరకు కమ్యూనిజాన్ని హర్షిస్తాడు. విప్లవం అంటే చూట్టూ చూస్తూనే, నేటి ఆర్థికవ్యవస్థకూ ప్రజాస్వామ్యానికీ ఉప్పు - నిప్పు అని భావించగలడు. గోపాలాన్ని రాజకీయ పరిభాషలో వర్ణించవలసివస్తే — లిబరల్, లేక రేడికల్, పోనీ సోషలిస్టు ప్రజాతంత్రవాది అనవలసివస్తుంది. అతను తప్పనిసరిగా వైరుధ్యాలపుట్ట. ఇది గుడ్డిలో మెల్ల. మంగివంటి పనిపిల్లను పెళ్ళి చేసుకుంటే బాగుంటుందని ఊహించి, అయినా తన కొత్తస్థితిలో మంగి సుఖపడలేదు లెమ్మనుకుని సమాధానం చెప్పుకుని, పెళ్ళి చేసుకోవచ్చేసరికి వర్ధమాన నటియైన పద్మను మాత్రమే చేసుకుంటాడు. సాహసమైన ఊహ, సామాన్యమైన పని—గోపాలానికే కాదు, నూటికి తొంభై తొమ్మిది మంది మధ్య తరగతి విద్యాధికుల నిజస్వరూపం యిలాంటిదే. కాయకష్టం ఒక్కటే 'హంబగ్' లేని పనిగదా అని ఆ పనికి పూనుకొంటాడా అంటే, హోదా అడ్డు వస్తుంది. కమ్యూనిజాన్ని శుద్ధ మానవకారుణ్యవాదంగా బోధపరచుకున్న క్రిశ్చియన్ సోషలిస్టులవలె గోపాలం కూడా స్వర్గమిచ్చే అదనపు సుఖాలను వదులుకుని కింది వర్గంతో మమేకం కాలేడు. "నేను మీ జాతిని నమ్మను" అని మంగి పెద్దన్న రాఘవులు (పని కోల్పోయిన ట్రాము డ్రయివరు) అంటే ఎంతో బాధపడ్డాడు. ఇడ్లీ ముక్కలతో అణా బేడలతో మంగిని తనకు కృతజ్ఞురాలిని చేసుకుని, దాని ఆసరాతో ఒక ముద్దు కూడా సంపాదించిన గోపాలానికి, ఈ మాటలు కనువిప్పు. "మే మీ

జీవితాన్ని మింగాలేము, కక్కాలేము; జీవితాలకు మనశ్శాంతీ, సుఖమూ, సంతోషమూ అంటూలేవు."

ఎన్ని లోపాలున్నా గోపాలం ప్రేమించదగిన స్వభావంగల పాత్ర. ఇక, సంఘంలో పైనుంచి కిందికి పోవడం ఎంత ప్రయాసాభరితమో కిందనుండి పైకి పోవడం ఇబ్బడి కష్టమని నిరూపించిన పాత్ర 'ఎండమావులు'లో రంగారావుది. కె. కె. కి ఒక అలవాటు వుంది. తన నాయకపాత్రలలో ఎక్కువమంది ఎప్పుడో ఒకప్పుడు, ఎంతో ఒకంతకాలం కథకులయినట్లు చూపించడం, తద్వారా కథలను గురించి, పత్రికలను గురించి,సినిమా కథలను గురించి విమర్శ చెయ్యడం. పత్రికలు, ప్రెస్సుపనులు కె. కె. అనుభవ పరిధిలోకి, దాదాపు కేంద్రస్థానానికి వచ్చినట్టివే. 'వీరాభిమన్యు' అనే చిత్రానికి 1930 లలోను, 'జ్యోతి' అనే దానికి 1950 లలోను ఆయన పని చేయడమే కాక, సినిమా కేంద్రాలకు దగ్గరగా వుండి సినిమా జీవులతో పరిచయాలున్నందుచేత, వీటిని గురించి కూడా కథల్లో, నవలల్లో ప్రస్తావించటం జరిగింది. అయితే ఈ సినిమాకు సంబంధించిన రచనా భాగాలలో — ఫిలిం జర్నలిస్టులు, కథకుల పాత్రల ద్వారా ఆయన హాస్యాన్నే ఎక్కువగా ఉద్దేశించినట్లుంది. ఎందుకంటే అవి కేరికేచర్లవంటివో, కార్టూన్లవంటివోగాని, గంభీరమైన పాత్రలు కాదు. సినిమా జీవితం కె.కె. అనుభవ పరిధికి సరిహద్దుల్లోనే ఉండిపోవడం ఇందుకు కారణమనుకోవచ్చు.

మరి రెండు కె. కె. నవలలను స్పృశించి ఈ వ్యాసాన్ని ముగిస్తాను. అవి 'బెదరిన మనుషులు', 'బ్రతుకు భయం'. ఈ రెండు నవలలూ ఒకే కథకు పూర్వాపర భాగాలు. కె. కె. నవలల్లో మునుపెన్నడూ లేనంతటి హాస్యధోరణి వీటికి ప్రాణం. రచయిత హాస్యమనుకొని ప్రారంభించిన దానిని, ఆయన వాస్తవవాద దృక్పథం అపహాస్యంగానూ, సంఘవిమర్శగానూ పరిణమింపజేసింది. బెదరిన మనిషిగా మొదలైన సీతప్ప బెదరగొట్టే మనిషిగా మారాడు. ఈ మార్పును గుర్తించినందుచేతనే, మొదటి నవలకు వేళాకోళపు పేరు (తిక్క వీరశంకరం) పెట్టి ప్రకటించిన కె.కె. రెండవ నవలకు తనపేరే వుంచారు.

సీతప్ప అనే గుమాస్తా గొగోల్ The Great Coat లోని గుమాస్తాలాగైనా సాహసం చెయ్యలేడు. ఉపోద్ఘాతంలో భానుమతీ రామకృష్ణ అన్నట్లు అతను "నాసి మాత్రమేగాక పిరికి సన్నాసి కూడా" కావచ్చుగాని, ఆ పిరికితనానికి తగుకారణం వుంది. అతనికి జీవితంలో భద్రత కావాలి. అదేలేదు. ఎందునా పనికిరాని పింఛనీ

దారకు అనాథశరణాలయంవంటి ఒక ప్రయివేటు కంపెనీలో నెలకు ఏభై రూపాయలకు మించని జీతంతో, తుమ్మితే ఊడేలాగున అస్థిత్తుగా వున్న ఉద్యోగంతో, చిత్తం బత్తెం అంటూ రామకోటిలో తారకం చూస్తూ, పక్క గుమస్తాలపై కొండేలు చెబుతూ, సీతప్ప సీతప్పగానే వుండగలడుగాని, గతానుగతికత్వాన్ని వదిలి, సాహసం చేసి ఏ ఘనకార్యమూ చెయ్యలేడు. నగరజీవితమనే ఘోరారణ్యంలో తాను తన బిడ్డలూ — సింహాలు, పివంగులు కాజాలరు గనుక నక్కతనం అలవరచుకోవాలని అతని మతం. జీవితం కొట్టిన దెబ్బలకు పారలౌకిక సమర్థనలిచ్చుకుంటూ ఆత్మవంచన ద్వారా ఆత్మసంతృప్తి పొందడమే చేతనైన పని. ఆదిమయుగంలో మనుషులింకా శాఖామృగాలై ఉండిన దినాల్లో — నేలను చూసి నిలువుగుడ్లువేసే వానరమూ, పిల్లి చేతికి చిక్కి తప్పించుకోవచ్చుననుకునే ఎలుకా — సీతప్పలో కనిపిస్తాయి. అతను పామును ముట్టుకొని, అది పామనీ తెలిసీ గుడ్డపేలికేనంటూ తనకు తాను ధైర్యం చెప్పుకొంటాడని, ఇతరులను నమ్మింపజూస్తాడని భానుమతి సరిగా వర్ణించారు.

ఈ పాత్రలో హాస్యం మాత్రమే వుంటే ఇది flat అయివుండేది. అలాంటి flat పాత్రలు హాస్యానికి మాత్రమే వినియుక్తమైనప్పుడు రాణించినంతగా, విషాదానికి వినియుక్తమైనప్పుడు రాణించజాలవని ఫార్స్టర్, Aspects of the Novel లో అంటాడు.

సీతప్ప ఇలాంటి పాత్రే అయినా, విషాదచ్ఛాయ తొంగి చూడకపోలేదు. ఆ విషాదం అతని దొక్కడిదే కాదు—అతని వర్గానిది. జీవితంలో అతనిలాంటి ఇతరులు అనేకులకు ఉన్నస్థానానిది. ఈ విషాద లక్షణం మూలంగానే సీతప్ప కేరికేచర్‌లా మిగిలిపోకుండా సజీవ వ్యక్తిగా మారుతున్నాడు. మనలో చాలమందిలో సీతప్ప లక్షణాలు ఉండటానికి ఇదే నిజమైన కారణమనాలి. ఆత్మవంచన అతనికి పథ్యం లాంటిది అయితే ఫరవాలేదు గాని, ముప్పూటలా గొంతు దిగక తప్పని పోషక పదార్థమైనప్పుడే అతని అవస్థ యొక్క తీవ్రత మనకు తెలిసి వస్తుంది. అష్టగ్రహ కూటమివల్ల జల ప్రళయం వస్తుందని విని నమ్మి, భార్యను నమ్మించి, మద్రాసునుంచి పరారీయై ఆ కారణంగా ఉద్యోగం ఊడగొట్టించుకున్నాడంటే — నవ్వ బుద్ధివేయదు.

ఈ పనికిమాలిన పిరికితనం వల్లనే, చాదస్తం వల్లనే సీతప్ప తనతోబాటు కుమారుడు సత్యాన్ని, కుమార్తె సోమిదేవిని పనికిమాలినవాళ్ళుగా తీర్చిదిద్ది, హితబోధ చేసి వాళ్ళ దాంపత్య జీవితంలో గౌరవమూ, సుఖమూ లేకుండా చేశాడు. చివరకు, అత్తగారింటి బంధిఖానానుండి స్వతంత్రించి, బావ (భద్రాచలం) చేయూతతోటి సత్యం

సికింద్రాబాదులో ఉద్యోగం సంపాదించి ప్రయోజకుడయ్యాడనీ, మంకుతనం వదిలి కోడలు సీతారత్నం భర్తతో వెళ్ళిందనీ, మనిషిననిపించుకుని కుమార్తె సోమిదేవి భర్త (భద్రాచలం) వద్ద మళ్ళీ పరువు సంపాదించుకున్నదనీ తెలిశాక కూడా "నే నమ్మనే నమ్మ" నంటాడేగాని, ఈ పరిణామాలను సీతప్ప హర్షించడు. పైగా, ఈ బాగుపడిన వారి తెలివితక్కువను విమర్శించబూనుకుని తన తెలివిని ప్రదర్శించుకుంటాడు. అతనిలో ఉన్న లక్షణం పేరు శాంతమూ కాదు, నిగ్రహమూ కాదు — అదురు. రచయితే కలగజేసుకుని ఇలా వర్ణిస్తారు: "సుడిగాలిలో కొట్టుకుపోయే పులివిస్తరాకుకు సంక్షోభం తప్ప సంఘర్షణ ఏముంటుంది?" జీవితంలో "కొట్టుకుపోవడమే" సీతప్పకు తెలిసిన విద్య.

ఈ రెండు నవలల్లో కె.కె. ప్రవేశపెట్టిన యువకుల పాత్రలుకూడా పరిశీలనార్హాలు. కొత్తతరం యువకుల ధనపక్షానికి చెందిన శేషు, రుణపక్షానికి చెందిన నరసు ఎన్నదగిన వ్యక్తులు. కాఫీ టీలైనా ముట్టుకోని, కుంకుమా పసుపూ పూయని ఆడదానిని మెచ్చజాలని, బజారుకు ఒంటరిగా పోయే ధైర్యంలేని సత్యం — ముమ్మూర్తులా సీతప్ప కుమారుడే అయినా చివరకు తన స్థితిని గమనించి, ఒకప్పుడు తాను ఈసడించి భయపడిన వాతావరణంలోకూడా ప్రెస్సు వర్కర్లు సమ్మెచేసినప్పుడు తానూ వారితో చేరి, బావమరిది నరసు చెంప తాటించి, భార్యను ఆజ్ఞలో పెట్టి, సత్యంకూడా ప్రయోజకుడయ్యాడు. సీతప్ప అన్న శివుడి కుమారుడు శేషు కొత్తతరానికి మేలిమి ప్రతినిధి అనదగిన పాత్ర. తగుమాత్రం లలిత కళాభిరుచి, తగు మాత్రం ఆదర్శాల మీద గురి, తగు మాత్రం సాహసం కలిగిన ఇలాంటి యువకులు నానాటికీ అల్పసంఖ్యాకులవుతున్నారు. పోగా, నరసులాంటి వారి సంఖ్య ప్రస్తుతానికి ఎక్కువగా ఉంది. నరసు సాహిత్యవ్యాసంగమంతా నగ్న ముఖచిత్రాలతోనో, హత్యాదృశ్య చిత్రాలతోనో పుస్తకాలచ్చువేయించి, వేనకువేల ప్రతులను అమ్మించి, పాటక జనం కంటె క్షుద్రమైన అభిరుచులు బలిసిన సాధారణ పాఠక మహాజనుల అభిమానాన్ని రూపాయణాపైసలుగా మార్చుకోవడమే. ఏదో ఒక విధంగా డబ్బు సంపాదించాలి. పైకి, ఇంకా పైకి, సంఘంలో అత్యున్నత స్థానానికి ఎగబాకి పోవాలి — ఇదే అతని ఆశయం. ఇలాంటి ఎగబాకుడు తత్వం ధర్మాధర్మాలను ఖాతరు చెయ్యదని 'తార' అనే నవలలోని ప్రకాశరావు ద్వారా కె.కె. నిరూపించారు. వాడు అభినవ గిరీశమై, భార్యనే తార్చి డబ్బు చేసుకోజూశాడు. తనకై తానొక తత్వాన్నికూడా ఏర్పాటు చేసుకున్నాడు: "ఎత్తు ఎక్కటం సుఖంగా ఉండదు, శాం! (శ్యామల). కళ్ళు తిరుగుతాయి.

ఎందుకొచ్చిన పీడ అనిపిస్తుంది. కాని ఎక్కాలి. ఎంతదూరం వెళ్ళగలమో చూడాలి. ప్రతి గడ్డిపరకా అదే జీవిత లక్ష్యంగా పెట్టుకుంటుంది.'' అతని అభిప్రాయంలో పాతివ్రత్యం "బోష్''. మనస్సు అనేకుల మీదకు మళ్ళటం "ప్రకృతి ధర్మం''. సెక్సు అనేది, ఉక్కపోస్తుంటే ఫాన్ పెట్టుకోవటం లాంటి పని. అదృష్టవశాత్తు. పరమ దారుణమైన అభిప్రాయాలు గల ఇలాంటి కలుపుమొక్కలు సంఘంలోగానీ, ఈ నవలా కుటుంబంలోగానీ అధిక సంఖ్యలో లేవు. సత్యంలాంటి అంబేదకూ, ప్రకాశరావు లాంటి కిరాతకుడికీ శేషువంటి యువకుడు దూరస్థుడు. కె.కె. తొలి నవలల్లోని నాయక వ్యక్తులతో ఇతనికే ఎక్కువ పోలిక.

దాదాపు నలభై ఏళ్ళ కాలంలో తెలుగుదేశంలోను, మద్రాసులోని తెలుగు కుటుంబాలలోనూ-ముఖ్యంగా మధ్యతరగతి పరిమితిలో విద్యావంతులూ, సంస్కారవంతులూ, సంస్కర్తలూ అయిన యువజనుల మనస్సులకు కె.కె. నవలలు అద్దమెత్తి పట్టాయి. ఈ అద్దంలో సంఘ పరిణామ దృశ్యాలు కనిపించాయి కనుకనే అద్దం గొప్పదని చెప్పలేము. చెప్పగూడదు. కాని హేతువాది, ఆలోచనా శీలి, స్థిమిత మనస్కుడు అయిన ఒక రచయిత, తనపై తాను విధించుకున్న పరిమితులలో ఎంత విశ్వసనీయంగానూ,పఠనీయంగానూ రచించగలడో—కె.కె నవలలు చూపుతున్నాయి. ఇంతకంటె శిల్పంలో చాకచక్యమూ, అభిప్రాయాలలో సాహసమూ చూపెట్టిన నవలాకారులున్నారు గాని, నిరంతరాయంగా సంఘజీవితాన్ని ఇంతటి చిత్తశుద్ధితో, సమర్థతతో నవలీకరించిన వారు ఒక్కరుకూడా తెలుగులో నాకు కానరారు. తెలుగు కథాకారులపై, నవలాకారులపై కె.కె. ముద్రను ఇదమిత్థంగా మనం చూడముగాని, ఆకులకు తిండిగా మారిన సూర్యరశ్మి వలె అది వారిలో లీనమై మనస్సుకు పట్టిపోయింది. గురు శిష్యులు లేనట్లున్న కె.కె. అసదృశుడు.

(ఫిబ్రవరి, 1966)

వివేచనను రేకెత్తించే

# వ్యంగ్య రచనలు

కె. రామమోహనరాయ్

ఆధునిక జీవితం అస్తవ్యస్తంగా.సంక్లిష్టంగా వుంది. దీన్ని విశ్లేషించి రచనలు చేసేవారు 'బోధ' చేస్తే చాలదు. జీవితపు కఠోర వాస్తవాల్ని ప్రతిబింబించాలి. పాఠకుల మనసుల్లో సంక్షోభం కలిగించాలి. ఎవరికి వారు చర్చించుకుని సరియైన మార్గమేదో తేల్చుకునే అవకాశం రచయిత కల్పించాలి. అసంఖ్యాకమైన కథానికలు, పెక్కు నవలలు, నాటికలు, స్కెచ్‌లు, గల్పికలు, వ్యాసాలు రచించి కొడవటిగంటి కుటుంబరావు యీ శతాబ్దంలో యీ మహత్కార్యాన్ని సమర్థవంతంగా నిర్వహించారు. మధ్య తరగతి అనేకమైన కుహనా విలువల్ని పట్టుకొని వేళ్ళాడుతోంది. రాజకీయాల్లో అవినీతే నీతిగా చలామణి అవుతోంది. కంపుగొట్టే నూనెసరుకు కళగా సినిమాల్లో ప్రచారమవుతున్నది. నాటకాల్లో, సంగీతంలో ఇతర కళల్లో విలువల్ని గురించి పట్టించుకోవలసిన వాళ్ళు, బాధ్యత మరచి అధికారానికి దాసోహమంటున్నారు. శ్రామికులు దోపిడీకి గురికాకుండా వారికి చైతన్యం కలిగించటంలో, సాహిత్యం చెప్పుకో తగిన పాత్రయేమీ నిర్వహించటంలేదు. అన్నివైపులా బీభత్సంగా అలుముకున్న యీ సమాజపు నడక తీరును విమర్శిస్తూ, మధ్యతరగతిని వివేకవంతం చెయ్యటంలో కొడవటిగంటి రచనలు మిక్కిలి తోడ్పడ్డాయి.

వ్యంగ్యశక్తి కొడవటిగంటి మహాయుధం. ఆయన కలం ఝళిపించి — రాజకీయాలు, సినిమాలు, మధ్యతరగతి వెర్రి తలపులు, మూఢనమ్మకాలు, ధనవంతుల విలాసమయమైన వ్యర్థజీవితం, 'శవసాహిత్యం,' ఇలా అన్ని రంగాలలోను రవ్వలు రాల్చారు. తెలుగు పాఠకుడి మేధోస్థాయి పెరిగి ఆధునిక సమాజ స్వరూపం అర్థం చేసుకోవటానికి ఆయన వ్యంగ్య రచనలు ఎంతైనా దోహదం చేసాయి. అధిక్షేప హాస్యం ఊరికే నవ్వించటానికి గాక, నవ్వించి గుండె గూడుపట్లు కదిలించి, చిక్కపట్టేట్లు చేసే విషాద గాంభీర్యం ఆయన హాస్యంలో వుంది. చార్లీ చాప్లిన్ కుటుంబరావు అభిమానాన్ని చూరగొన్న కళాకారుడు. 'చాప్లినియన్ హ్యూమర్'ను కుటుంబరావు తన వ్యంగ్య రచనల్లో ప్రవేశపెట్టి సమాజానికి ఎంతో మేలు చేశారు.

దిబ్బ పుట్టుక, దిబ్బ రాజ్యంలో స్వాతంత్ర్యం, దిబ్బ ప్రభువుగారితో ఇంటర్వ్యూ, కరువొచ్చింది, బకాసుర, అశోకవనం, దీపావళి రాజకీయాలు, కార్మిక విజయం, ఫాలౌట్, కొత్తజీవితం, ఆదర్శప్రభువు, గ్రహశకలం, ఎన్నికల ప్రచారం, విప్లవకారుడు, విప్లవమేధావి మొదలైన రచనలలో రాజకీయాలు, పురాణాలపై కుటుంబరావు ప్రయోగించిన వ్యంగ్యం, పాలనావ్యవస్థను గురించి సరికొత్త రీతిలో ఆలోచించేటట్లు చేసింది.

రాజభరణాలు రద్దుచేస్తే దేశంలో విప్లవం వస్తుందనుకొనే తత్వాన్ని 'దిబ్బ పుట్టుక'లో అవహేళన చేస్తూ, "అప్రయత్నంగా నా కళ్ళంట నీళ్ళొచ్చాయి. పాపం, ఈ రాజులందరూ ఏమవుతారు! రాజభరణాలే పోతే ఇక సోవియట్ పరిపాలన (సోషలిస్టు అని భావం—సం.) రావటం ఇంకెంతసేపు! విప్లవం దొడ్డిదారిన రావటంలేదు గదా!" అని రచయిత దిబ్బరాజుగారిని చూడటానికి ఢిల్లీ వెళతాడు.

అక్కడ రాజావారు చెవుల పిల్లుల్ని వేటాడబోతే ఎలక కరిచిందట. "పిచ్చెలుక కరిస్తేకూడ ప్రమాదమేమోనని ఎవరో అంటే, దిబ్బరాజావారు ఏరోఫ్లోట్ మీద మాస్కో వెళ్ళి చికిత్స పొందుతున్నారట. ప్రమాదం ఏమీ లేదని తెలిసింది." నాయకులు అనారోగ్యం నెపంతో విదేశాలకు వెళ్ళటంపై ఇదొక విసురు. అంతేకాదు. రాజావారు దేశాంతరం వెళితే ఒక్క అండరు సెక్రటరీకూడ ఢిల్లీలో లేరట!

దిబ్బ పుట్టుకకు పూర్వకథ చెప్తూ—మన చరిత్రకారులు, కవులూ చరిత్రను వక్రంగా చిత్రించటాన్ని కుటుంబరావు శక్తివంతంగా హేళనచేశారు. చిన్నచిన్న రాజుల దండయాత్రల్ని గురించి, ఆ రాజులను ఆశ్రయించుకున్న కవులు, చరిత్రకారులూ ప్రజలను ఎలా మభ్యపెట్టేదీ ఆయన వివరించారు:

శూరులు "పన్నెండామడ దూరంలో బిడారు వెళ్ళినా వీరో చితంగా జయించి ధనరాసులు సంపాదించారు. పొరుగు దేశాలలో ఉండే వర్తకులను రాత్రికి రాత్రే జయించి, తెల్ల వారే సరికల్లా రత్నాల రాసులు తెచ్చుకునే వారు."

"బందిపోటా ఏమిటి కొంపదీసి!" అన్నాను.

చరిత్రను సరిగా అవగాహన చేసుకున్నవారు ఆ మాటే అంటారు గాని, ఆ నాడు మాత్రం వారు తాము యోధులమనీ, తాము చేసినవి యుద్ధాలనీ చెప్పేవారు. ఇప్పటికీ మన చరిత్ర 'పాఠాలు' ఇదే ధోరణిలో నడుస్తాయి.

"ముండమల్లుడనేవాడికి అంకితంగా ముండమయమనే ప్రబంధం రాసిన కవి, తన పోషకుడు యుద్ధాలలో ఎంతమంది శత్రువులను చంపినదీ. ఎంతమంది స్త్రీలను తన కామకళా ప్రావీణ్యంతో మెప్పించినదీ పొగిడాడు. మనం ఈనాడు ముండమల్లుడు ఇంతమందిని హత్య చేశాడనీ, ఇంతమంది స్త్రీలను చెరిచాడనీ అనటం భావ్యంగా ఉంటుందా?" అని వ్యంగ్యంగా ప్రశ్నిస్తారు కొడవటిగంటి.

నరసభూపాలీయము, మనుచరిత్ర మొదలైన గ్రంథాల్లో రాజాశ్రితులైన కవుల రాతల్ని చదివితే, ఈ వ్యంగ్యంలో పదునెంతో బోధపడుతుంది. ఆయన దృష్టిలో యుద్ధాలకు, బందిపోట్లకు ఎక్కువ తేడా లేదు. చరిత్రకారులు మెరుగులు పూయకపోతే చాలా యుద్ధాలు బందిపోట్లే.

దారిద్ర్యంతో వచ్చే సమస్యల్ని పరిష్కరించటానికి బదులు దరిద్రులనే లేకుండ చేయజూసే శాసనాలలోని ఘోరాన్ని గుర్తించమంటారు కుటుంబరావు. "అధిక సంఖ్యాకులు ఆనాడూ, ఏనాడూకూడా రాజకీయంగా జడులే....(అట్టి పరిస్థితిలో) దారిద్ర్యాన్ని గాక దరిద్రుల్ని అంతమొందింప జూసే రాజశాసనాన్ని ప్రతిఘటించాలని అన్న ఒకే ఒక వ్యక్తిని ఆ రాత్రే కాళీదేవతకు బలి ఇచ్చేసి, వాడి మాంసాన్ని లాంఛనంగా తలా కాస్త ప్రసాదం కింద తిన్నారు." భగత్‌సింగ్, చారు మజుందార్, వెంపటాపు సత్యం — ఎవరైతేనేం, ప్రజలకోసం ప్రాణాలర్పించిన త్యాగధనుల్ని ఒకోసారి లోకం నిర్లక్ష్యంగా పక్కకు తోసేస్తుంది. జాతి వీర్యవంతమైన నాడు వారి త్యాగాలు ఆరని దీపాలై వెలుగుతాయి.

"దిబ్బ రాజ్యంలో దేశమంతటా కలిసి ఓ ముప్ఫయి లక్షలమంది పిల్లలూ, పెద్దలూ, స్త్రీలూ, పురుషులూ ఉరిశిక్ష పొందారు. వారి శవాలన్నిటినీ వరస దిబ్బలలో

పాతేశారు." హిట్లర్లు, ఇదీ అమీన్లు వున్న యీ శతాబ్దంలో కుటుంబరావు రాసిన వచ్చి వాస్తవాన్ని కాదనడమెట్లా? కష్టజీవులు లేని రాజ్యంలో ధన వస్తు వాహనాలు సంపద కావు. ఆ రాజ్యంలో ముందు చచ్చేవాళ్ళను తరువాత చచ్చేవాళ్ళు పాతేస్తారు. దిబ్బలే మిగులుతాయి. అందుకే మనం కళ్ళు తెరవాలి. రాజకీయ జడత్వం నుండి బయట పడాలి. మధ్య తరగతి మేధావులు కుటుంబరావు రచనల్లో వాస్తవాన్ని గుర్తించక పోతే తాముకూడ దోపిడీ శక్తులకే అనుకూలమై, పేదల్ని కాల్చుకు తినే జాతిగా, ధన వంతుల అడుగులకు మడుగులొత్తే జాతిగా తయారవుతారు.

దిబ్బ ప్రభువు దేశాన్ని స్వయం సమృద్ధిగల దేశంగా మార్చుకోవటం పోయి మతాన్ని, దైవబలాన్ని నమ్ముకునే బాపతు. మన దేశంలో కరువులొచ్చినపుడు, విపత్తులొచ్చినపుడు లక్షలాది రూపాయలు వ్యయంచేసి యజ్ఞాలుచేసే ప్రబుద్ధులు, వాటిని సమర్థించి ధనం దోచిపెట్టే నాయకులూ వుండటం అసత్యం కాదుగదా? విపత్కర పరిస్థితుల్లో దైవజ్ఞులను, బాబాలను ఆశ్రయిస్తున్న నాయకులు — కుటుంబరావు ఈ రచన చేసేనాటికీ (1947) నేటికీ మారలేదు.

దిబ్బ ప్రభువుగారికి సాహిత్యం పట్ల వున్న అభిప్రాయాలుకూడా ఇంత ఘనమైనవే. కొత్త రచనలు అక్కరలేదు వారికి. "చదువుకోవాలంటే ఇప్పటికే ఎన్నో మహాగ్రంథాలున్నాయి. ఒక్క భారతం చాలదా జన్మల్లా చదవటానికి. భారతం తెరిచే సరికి నాకు బ్రహ్మానందమైె సుషుప్తి కలుగుతుంది. మహాకావ్యం! మహాకావ్యం!" అని జపిస్తుంటాడు.

'కరువొచ్చింది' అనేది కొడవటిగంటి రచనల్లో ఒక ఆణిముత్యం. పంటలు పండినై. గింజలు కళ్ళాలు దాటగానే మాయమయినై. కరువొచ్చింది. రైతు కూలీల శ్రమ ఫలితాన్ని గద్దలు తన్నుకుపోయినై. కరువు నివారణ సభలో "ఒక కవిగారు లేచి ఆకలిని తిడుతూ కొన్ని పద్యాలు చదివాడు. మరో కవిగారు లేచి మృత్యువును తిడుతూ మరికొన్ని పద్యాలు చదివాడు. అందరూ హర్షించారు. కాని పేదల ప్రతినిధుల కిందులోని చమత్కారం అవగాహన కాలేదు. ఆకలిని తిట్టడం దేనికి? ఆకలి లేకపోతే ఎట్లా? చావును తిట్టడం మాత్రం దేనికి? మనుష్యులు చావకుండా ఎట్లా?" అభ్యుదయ రచయితలమని అనుకొనే వారిలో అవగాహనాలోపం ఎలా ఉంటుందో కుటుంబరావు ఇక్కడ చక్కగా ఎత్తి చూపారు.

"ఇది భగవంతుడు దేశానికి పెట్టిన విషమపరీక్ష" అంటూ ఆధ్యాత్మికోపన్యాసాలిచ్చే పెద్దమనుషుల్ని ఓ కంట కనిపెట్టాలని ఆయన అంటారు. కరువు సమ

స్యను ఎదుర్కోవటానికి ఏర్పాటయిన ఒకానొక సభలో ఇలాంటి తీర్మానాలు జరిగాయట:

1. దేశమంతటా రాంభజనలు జరగాలి.

2. దేశం నడిమధ్య ప్రాంతంలో ఒక ఎకరం హోమగుండం తవ్వి బ్రహ్మాండంగా యజ్ఞం చెయ్యాలి.

3. దేశభక్తు లెవరూ పూటకు పావుశేరు బియ్యంకన్న తినగూడదు. (దీన్ని అర్థశేరుకు పెంచమని తెచ్చిన సవరణ నెగ్గింది.)

4. పేద ప్రజలు మృష్టాన్నాలు మానాలి. ఎవరూ అన్నం పారెయ్యరాదు. (ఆ విధంగా పారేసిన అన్నాన్ని మాదాకాబళం వాళ్ళకి వెయ్యవచ్చుననే సవరణ ఆమోదించబడింది.)

5. పేదప్రజలు శరీర వ్యాయామం చేసి బలాఢ్యులుగా ఉండాలి.

కడుపు మాడినవాళ్ళు తిరుగుబాటు చేస్తే నాయకులు పేదల ప్రతినిధుల్ని నిందిస్తారు. "ప్రజలు చాలా మంచి వాళ్ళు. వారికి శాంతి భద్రతలు ఇష్టం. క్షామ నివారణార్థం వాళ్ళెన్నాళ్ళయినా త్యాగయుతంగా పస్తులుంటారు" అని ఉపన్యాసాలిస్తారు. ఈ నయవంచనను నిత్యం చూస్తూనే ఉన్నాం.

పెట్టుబడిదారీ దేశాల్లో నైతికవిలువల గురించి కుటుంబరావుకు ఎప్పుడూ సదభిప్రాయంలేదు. అక్కడ మనుష్యుల మధ్య బంధాలను ఏర్పరుస్తున్నది డబ్బు మాత్రమే అని ఆయన ఉద్దేశం. అవకాశం లభించినప్పుడల్లా ఆయన అమెరికాను, ఇతర పెట్టుబడిదారీ దేశాలను హేళనచేశారు. అలాగే, కమ్యూనిస్టు వ్యతిరేకత ప్రదర్శించేవాళ్ళను ఆయన బెదురుగొడ్లుగా భావించారు.

'ఫాలౌట్' కథలోని వనమయ్య, పెట్టుబడిదారీ దేశాల్లోని పత్రికా ప్రతినిధుల్లాగే ఆలోచిస్తాడు. అక్కడ పత్రికా విలేఖరులు అన్నిటిలోనూ న్యూస్ వాల్యూనే చూస్తారు. రాజకీయాల్లేని జీవితాన్ని ఊహించనైనాలేరు. ఇక్కడ పల్లెటూళ్ళో "ఏనాడూ పత్రికలు చదివి రాజకీయాలు చర్చించని వంగమొక్కలు అశాంతి అన్నది యెరగకుండా జీవితాన్ని తమలోని ప్రతిరంధ్రంతోనూ ఆస్వాదిస్తున్నాయి." అట్లా ప్రశాంతంగా వున్న ఆ పల్లెటూళ్లో "ఒక్క హైడ్రోజను బాంబు పేలితే" అన్న ఊహాపరంపర వనమయ్యను నిలవనీయదు. వంగతోటలో ఒక ఆకుమీద బూడిద కనిపిస్తే దాన్ని బాంబు పేలినప్పటి ఫాలౌట్ అనుకుని నానాబీభత్సం సృష్టిస్తాడు.

ఆ ఊళ్ళో చెప్పుకోదగిన రాజకీయవాదులు అయిదారుగురున్నారు. ఒకప్పుడు జస్టిస్ పార్టీ, తరువాత రాయిస్టు, ప్రస్తుతం ఘోరమిస్టూ అయిన ధనవంతుడొకరు. ఆయన మొదటినుంచి కడదాక మాంచి కమ్యూనిస్టు వ్యతిరేకి. మరొకరు కాంగ్రెస్ వాది. పేరు 'తిలక్ గాంధీ'. ఇంకొకరు కమ్యూనిస్టు నాయకుడు 'స్టాలిన్ లెనిన్'. నాయకుల భావాలనేగాక పేర్లను కూడా వికారపరచిగాని వీళ్ళు స్వీకరించరు. "కాంగ్రెస్ పదవిలోకి వచ్చినాక ప్రజలకు రాజకీయాలతో ఏం పని? పరాయివాళ్ళు పరిపాలిస్తుంటే నూటికి అయిదుగురు కూడా రాజకీయాలు మాట్లాడేవారు కారు. ప్రజా ప్రభుత్వాలు వచ్చినాక నూటికి తొంభై మంది రాజకీయాలు మాట్లాడేవాళ్ళే, ఎందుకంట?" అంటాడు 'తిలక్ గాంధీ'. ఈయన దృష్టిలో, స్వతంత్ర భారతంలో రాజకీయాలు మాట్లాడటమే నేరం. రాజకీయవాదుల వాక్కలహం కొట్లాట కింద మారి తలలు పగుల్తాయి. తాను తిన్న వంకాయకూరలో ఫాలౌట్ బూడిద వున్నదన్న భయం, పట్నం చేరాక కూడ వనమయ్యను వదలదు. నిశ్చలంగా వున్న ప్రజాజీవితంలో, పెట్టుబడిదారీ దేశాల పత్రికా విలేఖరుల సంచలన వార్తలవల్ల జరిగే హానిని గురించి హెచ్చరిస్తూ, సరసమైన వ్యంగ్యోక్తులతో రక్తికట్టేలాగ కొడవటిగంటి యీ కథ రచించారు.

ఆయన రాజకీయ భావాలు మార్క్సిస్టు తత్వాన్ని ఆశ్రయించినవి. అంతమాత్రాన కమ్యూనిస్టుపార్టీల ఎన్నికల ఎత్తుగడలను, పడికట్టు పదజాలాన్ని ఆయన యిష్టపడలేదు. అనేక రచనలలో సందర్భం వచ్చినప్పుడల్లా వాటిని తూర్పారబెట్టారు.

కొడవటిగంటి వ్యంగ్య రచనలలో అత్యంత శక్తివంతమైనది 'బకాసుర'. మహాభారతంలోని బకాసుర కథను తన భావాలకు అనుగుణంగా మార్చి, రాక్షసపీడను ఎదుర్కోలేని అర్చకులు ఎలా బెంబేలుపడేదీ హాస్యరీతిలో విశ్లేషించారాయన. "చూడు చయనులూ! వాడు రాక్షసుడయేది, పిశాచి అయేది. బ్రాహ్మణుల జోలికి వస్తాడుగా? యెన్ని గుండెలు! బ్రాహ్మణరక్తం కంఠందిగిందో హాలాహలమై భగ్గున కాల్చేస్తుంది. ఏమనుకున్నావోనూ!" నన్నయ్య ఆలోచనా రీతిపై చురుక్కుని తగిలే చురక ఇది. నన్నయ్య పదకొండో శతాబ్దివాడు గదా, ఇప్పటి ఆలోచనా రీతితో ఆయన్ను వెక్కిరించట మెందుకు అనటం సరికాదు. ఆ కాలంలో కూడా నన్నయ్యవంటి వాళ్ళే రాజాశ్రయంలో బ్రాహ్మణాధిక్యాన్ని ప్రజలమీద రుద్దారు. దాన్ని ఎద్దేవాచేసి, పరువు తీస్తేతప్ప వీల్లేదు.

దేశానికి విపత్కరపరిస్థితులలో పాలకుల పిరికితనంపై ఈ కథలో కుటుంబ రావు విసుర్లు మరపురావు. "కొందరు భటులను వెంట తీసుకొని నగరం వెలుపలికి రాజుగారు వెళ్ళివస్తే ప్రజలకు ధైర్యంగా వుంటుం"దన్నా రాజు ఏదోవంక చెప్తాడే గాని ముందుకురాడు. అప్పుడే కొందరికి పూనకాలు రావటమనే ఫార్సును చక్కగా వర్ణిస్తాడు రచయిత. బకాసురుడికి ఏ నరుడు బలికావాలో కూడా, పూనినవాడి నోటంట చెప్తుంది దేవత. "వాడు, పూనినవాడి దాయాది."

దేశంలో కరువుకాటకాలు, వరదలు మొదలైన బాధలను నాయకులు సొంతానికి ఉపయోగించుకుని డబ్బుచేసుకున్నట్లు, బకాసురుని పీడను రాజు స్వార్థానికి వినియోగించుకుంటాడు. పదిమందీ కలిసి రాక్షసుణ్ణి చంపవచ్చునని బలభద్రుడనే ప్రజానాయకుడు సవాలుచేస్తే, రాజుగారు అతడిని తిరుగుబాటుదారుగా నిందించి శిరచ్ఛేదం చేయిస్తాడు. అతడి అనుచరుల్ని బంధిస్తాడు. ప్రజల పక్షాన నిలబడి వారి కోసం పోరాడే నాయకులకు 'ప్రజాస్వామ్య' దేశాల్లో కూడా లభిస్తున్న ప్రతిఫలం ఇదేనని కుటుంబరావు భావన.

బకాసురుడు పొలిమేరల్లో వుండటంవల్ల శత్రురాజులు దండయాత్ర ప్రయత్నం విరమించారు. ఏకచక్రపుర రాజుకు కావలసిందీ అదే. అయితే, బకుడికి ఆహారంగా తన ప్రజల్లో రోజుకి ఒకడిని పంపటానికి రాజు సిద్ధమయ్యాడు! ఏదైనా అక్రమం జరిగితే దాన్ని అరికట్టటంపోయి, కట్టుదిట్టం చేసినట్లు నటించి, దాన్ని 'చట్టబద్ధం' చేసి లాభం పొందటం ప్రభుత్వాలకు పరిపాటే. విపత్కర పరిస్థితుల్లో కూడ వర్తకులు తమ వ్యాపారం సంగతే చూసుకొంటారు గాని ప్రజల ప్రాణాల సంగతి ఆలోచించరు. మెట్ట వేదాంతులు తమకు ఏ ముప్పు రాకుండా పెర్రిమొర్రి కబుర్లు చెప్తారు. ఖచ్చితమైన పరిష్కారం సూచించిన వ్యక్తిని అజ్ఞానికింద జమకడతారు. బకాసురుడికి పంపే ఆహారంలో విషం కలుపుదామంటే — రాజూ, ఆయన పరివారం ఉలిక్కిపడతారు, ఇష్టపడరు. "రాక్షసుల వారిని గురించి తూష్ణీభావంతో మాట్లాడడానికి వారికన్న మనం ఎందులో అధికులమని" అంటాడు ఒక సభికుడు.

బకాసురుడికి ఆహారంగా ఒకో యింటినుండి రోజుకు ఒకరిని పంపటానికి ఏర్పాటు చేస్తారు. "సంపన్నులు తమ యింటివంతు వచ్చినప్పుడు తమ బానిసలలో ఒకరిని పంపవచ్చు. లేదా మనుషులను కొని పంపవచ్చు"నని ఏర్పాటు జరుగుతుంది.

బకాసురుణ్ణి చూసి తిరిగొచ్చిన బండివాడు రాక్షసుణ్ణి, "ముసలి దొక్కు! నా కంటె రెండు గుప్పిళ్ళుంటాడులెండి. అణ్ణి చూసి నాకు బయమెయ్యలా! వొసి

కర్ర తీసుకుని నాలుగేస్తేస్తే పారిపోతాడనుకున్నా, సెప్పొద్దూ.... ఆడేం రాచ్చసుడండీ!" అని ఎగతాళి చేస్తాడు. బండివాడు చెప్పిన సత్యానికి మంత్రి తట్టుకోలేకపోతాడు. భటుణ్ణి పిలిచి బండివాడి నాలుక కోయిస్తాడు. రెండురెళ్ళు నాలుగని నిజం చెప్పే నోరుండటం దుర్మార్గుల పాలనకు నిజంగానే అపాయకరం.

మొత్తానికి బకాసురుడు బ్రాహ్మలను కూడా నిరాక్షేపణగా తింటాడు. వాడి ఆరోగ్యాని కేమీ భంగంరాదు. ఒక బ్రాహ్మణ కుటుంబంవంతు వచ్చినప్పుడు వారికి బదులు భీముణ్ణి పంపిస్తుంది కుంతి. భీముడు బకుణ్ణి ఒక్కేటున చంపుతాడు. భీముణ్ణి సత్కరించటానికి బదులు రాజూ, మంత్రీ కలిసి — "నగరంలో రోజుకొక్కణ్ణి చంపేసి, అది వీడిపనే అంటే సరి!" అని భీముణ్ణి అంతమొందించాలని యోచిస్తారు. ప్రభుత్వపు అండదండలతో జరిగే హత్యల్ని విప్లవకారుల మీదకు నెట్టే ధోరణిని కొడవటిగంటి ఇక్కడ జ్ఞప్తికి తెచ్చారు.

బకాసుర కథారీతిలో పురాణకథలు ఎన్నిటినో తిరుగరాయవలసిన అవసరం వున్నది. ప్రాచీనకాలపు కథల్ని యీ కాలపు ఆలోచనతో ముడిపెట్టకూడదనే మూర్ఖత్వాన్ని వదిలి, అజ్ఞానాన్ని ఛేదించటానికి పాతకథల్ని సరికొత్తరీతిలో చెప్పటం అవసరమేనని విజ్ఞులు గుర్తించాలి.

అలాగే రామాయణంలో సీతాపహరణం తర్వాత రావణునికి, సీతకు జరిగిన సంభాషణను కుటుంబరావు 'అశోకవనం'లో అద్భుతంగా రచించారు. మూర్ఛనుండి తెప్పరిల్లిన సీత రావణున్ని దూషిస్తూ, "మోహాంధకారం నీ కళ్ళకు ఎగదట్టి" అని యింకా ఏమో అనబోతుంది. అందుకు రావణుడు, "ఎందుకు నిష్కారణంగా నిన్ను నువు ప్రశంసించుకుంటావు? నీ అందం చూసి నేను మోహించానని నువ్వెట్లా వూహించావు? ఒకవేళ అది నిజమయినా నువ్వే చెప్పుకోవటం ఏమంత బాగాలేదు. నిన్ను చూసిన ప్రతివాడూ నీకోసం చూస్తున్నాడని నీకొక నమ్మకం వున్నట్టుంది, లేక అది కోరికా?" అన్నాడు. రామభక్తులకు వణుకు పుట్టించే తీవ్రత ఈ మాటల్లో వుంది. లక్ష్మణుని శంకించిన సీత మాటల్ని కూడా జ్ఞాపకం చేసుకుంటే, ఈ మాటల్లోని వ్యంగ్యం ఎంత శక్తివంతమో తెలుస్తుంది.

ఆంజనేయుడు అశోకవనాన్ని ఛిన్నాభిన్నం చేసిపోగా రావణుడు దుఃఖిస్తాడు. అప్పుడు సీత దెప్పిపొడుపుగా, "అయిపోయినదానికెందుకు చింతిస్తావు. కాగలదానిలో (ఇది) సహస్రాంశం లేదు" అంటుంది. "నేను నిన్నేమయినా చేయదలచుకుంటే

అంతే. కాని నేనేమీ చేయదలచుకోలేదు. కనుక అయిపోయినదానిలో కాగలది సహా ప్రాంశమైనా లేదు'' అంటూ రావణుడు తలవంచుకొని వెళ్ళిపోయాడు. కొడవటిగంటి 'అశోకవనం' చదివాక, రామాయణమంతా హేతువాద దృష్టితో చదివి అర్థం చేసుకో వాలనిపిస్తుంది.

కుటుంబరావుకు అత్యంత అభిమానపాత్రమైన అంశం, మధ్యతరగతి సమస్య లను వాస్తవికంగా చిత్రించటం. 'బెదరిన మనుష్యులు', 'బ్రతుకు భయం', 'కొత్త కోడలు' వంటి అనేక రచనలలో సీతప్ప, హనుమాయమ్మ వంటి పాత్రలద్వారా మధ్య తరగతి పిరికి జీవితాలను ఆయన అంకుశంతో పొడుస్తాడు. 'ఎక్కువ' కులం అమ్మాయి 'తక్కువ' కులం అబ్బాయిని పెళ్ళాడితే నష్టపోయేది అబ్బాయేనని 'పార్వతీ పరిణయం' కథలో ఆయన వర్ణించారు. ''మీరు హరిజనంటే ఎవరూ నమ్మరు. నన్ను ఫూల్ చెయ్యటానికి మా అన్నయ్య అబద్ధమాడుతున్నాడు మీ మాటలో కొంచెమైనా యాసలేందే!'' అని ఏ ఆడపిల్లయినా అన్నదంటే ఆ హరిజన యువకునికి మూడిం దన్న మాటే. అంతటితో అతడు తన జాతిని ఉద్ధరించటంపోయి, 'పై కులం' వాళ్ళ లాగ కనపడాలని కుక్కచావు చస్తాడు.

చిరకాలం సినిమా రంగానికి సన్నిహితంగా వుండటంచేత కుటుంబరావుకు సినిమారంగం లోతుపాతులు క్షుణ్ణంగా తెలుసు. కాని ఆయన సినిమా వ్యాపారపు ఊబిలో ఇరుక్కుపోకపోవటం సాహిత్యరంగం అదృష్టం. అరుణోదయం, ఎండ మావులు, జీవితం, తార మొదలైన నవలల్లో, సినిమా సరదా, సినిమా కథ, పాత్రలు కావలెను మొదలైన కథల్లో ఆయన సినిమా రంగాన్ని సజీవంగా చిత్రించారు. ''సీను గాడి సంభాషణ రెండున్నర నిమిషాలకన్న భరించటానికి టానిక్కులవసరం'' అని సినిమా నిర్మాత గురించి ఆయన ముప్ఫయి ఏళ్ళ క్రిందటే చెప్పినా యిప్పటికీ అది సత్యమే. నిర్మాతలకు తగినట్లే పోచికోలు కబుర్లు చెప్పే డైరెక్టర్లు, టెక్నీషియన్లతో సినిమారంగం అంకఛండాలంగా వుంది. అయితే పరిస్థితులు మారవనుకోవటం కుటుంబరావుకు ఎప్పుడూ నచ్చదు. ఆ విశ్వాసంతోనే ఆయన సినిమాలను విమ ర్శించారు.

డిటెక్టివ్ నవలలు కుప్పతెప్పలుగా వచ్చిపడుతున్న సమయంలో టి.వి. శంకరం (తిక్కా వీరశంకరం) పేరుతో కుటుంబరావు రాసిన 'డిటెక్టివ్ కేయాస్ కథలు' వ్యంగ్య రచనల్లో అమోఘమైనవి. ఏపాటి సంస్కారం వున్న డిటెక్టివ్ రచయి తయినా అవి చదివితే సిగ్గుతో చావాల్సిందే. డిటెక్టివ్ రచనలు అచ్చువేసే ప్రెస్‌లో

ఒక కంపోజిటర్ యజమాని దగ్గరకు వచ్చి తాను డిటెక్టివ్ నవలలు రాస్తానంటాడు. బాగా రాయమంటాడు యజమాని. "బాగుండవలసింది అట్ట" అని జవాబిసాడు గడుగ్గాయి.

మూఢనమ్మకాలను ఛేదించడానికి తన జీవితమంతా శ్రమించారు కొడవటిగంటి. వీరేశలింగం, చిలకమర్తి మొదలైన వారు ప్రహసనాలను ఆయుధాలుగా స్వీకరిస్తే కథలు, నవలలు, స్కెచ్‌లు, వ్యాసాలు, గల్పికలలో ఆయన ఈ పనిని సమర్థవంతంగా నిర్వహించారు. 'సూరి సిద్ధాంతం' కథల్లో ఆయన సనాతనత్వాన్ని చీల్చి చెండాడారు. మంచి జర్నలిస్టు అనేవాడెప్పుడైనా సోషల్ ఇన్‌హిబిషన్స్‌కు గొడ్డలిపెట్టు పెట్టాలని ఆయన తలచారు.

పవిత్రులిచ్చిన ధనం దాచిపెట్టి, ఆ డబ్బు ఖర్చయితే సదరు పవిత్రులకు కష్టాలు వస్తాయనుకునే ఒక విచిత్రమైన మూఢనమ్మకాన్ని 'అనుభవం' నవలలో కుటుంబరావు ఎద్దేవా చేశారు. ఆచార వ్యవహారాలు, పూనకాలు, అవతారాలు అన్నీ మోసమని ఆయన 'కాలభైరవుడు'లో నిరూపించారు. 'సత్యం'తో ప్రయోగం చెయ్య దలచుకున్న వాళ్ళను హేళనచేస్తూ సత్యసంధుడు అనే కథ యథార్థవాది అనే నాటిక రాశారు.

బ్రతుకు బరువును తగ్గించేది హాస్యం. అయితే అధిక్షేప హాస్యానికి రావలసినంత ఖ్యాతి రాకపోవడం సహజమే. చురుకుగా ఆలోచించగలిగినవారు అందుకున్నంత వేగంగా ఇతరులు కొడవటిగంటి వ్యంగ్యాన్ని అందుకోలేరు. సులభగ్రాహ్యం కావటం కోసం ఆయన భాషను సులభతరం చేశారు. కాని ఆయన ఆలోచనల్లో వున్న లోతు తరచి చూచేకొద్దీ, ఆయన మేధస్సు ఒక మహాసముద్రంలాగ కనిపిస్తుంది. ఆ మహాసముద్రంలోంచి నేను వెలికి తీయగలిగిన కొద్ది మంచిముత్యాలను సమర్పించాను. ఆలోచనాపరులకు ఆయన రచనల్లో అసంఖ్యాకమైన ఆణిముత్యాలు లభిస్తాయి.

## వైవాహిక వ్యవస్థ రుగ్మతల నెత్తిచూపిన

# నాటికలు

వాడ్రేవు పతంజలి

మనం సంతోషించదగిన విషయం ఒకటున్నది: సామాజిక ప్రయోజనం ఆశించి కలం వ్యాపారం కొనసాగించే తెలుగువారిలో చాలామంది అదృష్టవశాత్తూ 'కదన కుతూహలా'న్ని పై స్థాయిలోనూ, 'కళావతి'ని క్రింది స్థాయిలోనూ ఆలపించే ప్రమాదం నుంచి తప్పించుకున్నారు. సాహిత్య పరమ ప్రయోజనం ఉద్బోధమే అయినప్పటికీ, చేదుమందును పంచదార మాత్రలవలె తీయగా, సాహిత్య స్థాయిని ఉన్నతంగా నిలుపుకుంటూ రాయగలగడం గొప్ప విషయం. అంటే, సాహిత్యం వట్టి ప్రచారం కాకూడదని. ఎక్కడో చదివాను—సామ్యవాద నిర్మాతలైన మార్క్స్, ఎంగెల్సు, లెనినూ ఈ అభిప్రాయాన్నే ఘంటాపథంగా చెప్పారని; సమర్థుడైన రచయిత తన అమూల్యమైన కాలాన్ని వ్యర్థప్రచారానికి వినియోగించరాదన్నారని; రచనా వ్యాసంగంలో సజీవమైన పాత్రలు సృష్టించబడాలనీ, ఆ పాత్రల వ్యవహారంద్వారా సామాజిక చైతన్యం కలిగించాలన్నారని; ఇందులోనే రచయితకు గల సామాజిక దృక్పథం వెల్లడి కాగలదన్నారని. 'నా సాంఘిక పరమార్థం ఇదీ' అని వివరించి, సమస్యలు సమస్యలుగా వర్ణించ నక్కరలేదు; కళాస్పందన సజీవంగా, సంప

న్నంగా ఉండాలి. అట్లాంటి రచనలే సమాజానికి ప్రయోజనం కలిగించేవి — అన్నారట.

సామాజిక దృక్పథమే ప్రధానం కాగా, సామ్యవాద మూలవిరాట్టుల భావాలకు అనుగుణంగానే తన అభిప్రాయాలూ ఉన్న మన రచయితలలో కొడవటిగంటి కుటుంబ రావు ఒకరని ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. కథలూ, కావ్యాలూ రాయటాన్ని గూర్చి కొ.కు. కి మరో విశిష్టమైన భావం ఉన్నది—తమకు బాగా పరిచితమైన వాతావరణం గురించీ, తమకు బాగా ఎరిక ఐన మనస్తత్వాలను గురించీ మాత్రమే రచయితలు రాయాలీ — అని. ఆయన ఏమి రాసిన ఈ రెంటి పరిధినీ దాటి ఎన్నడూ పోలేదు; మరొకరు పోతే వప్పలేదు. దానికి కారణం: రచనకి సాధికారత (authenticity) ఉంటుందని; దీనివల్ల విశ్వసనీయత (credibility) ఉంటుందని. ఈ రెండూ ఉన్నందువల్ల రచనావ్యాసంగం ఏ ఉద్దేశంతో చేస్తామో, ఆ ప్రయోజనం సిద్ధిస్తుం దని. కొ.కు. రచనలకి ఆశించిన ప్రయోజనం వెంటనే లభించడం ఇందువల్లనే. పోతే, పైన చెప్పినట్లు, ప్రయోజనం ఆశించి చేసిన రచనే అయినా, రాసినది కళాహృదయం గలవాడు కనుక, సాహిత్య విలువలుకూడా చూసుకుంటూ ఉన్నవాడు కనుక, నాటికీ నేటికీ ఆయన రచనలు ఉభయతారకంగా ఉన్నాయి.

కొ.కు. కథారచయిత, నవలాకారుడు. అలాగునే ఆయన మన మనసుల్లో నిలిచాడు. అయితే కొన్నికొన్ని ఇతివృత్తాలు కథలలో, నవలల్లో కన్న నాటకాలుగా ఎక్కువ వొప్పుతాయి. యథార్థం, వాస్తవికత ఆధారంగా వికసించిన ఇతివృత్తాలు నాటకీయ సంభాషణల ద్వారానే ఎక్కువ రాణిస్తాయి; వాస్తవిక వర్తమాన దౌర్భాగ్య స్థితిని యథాతథంగా చిత్రించగలిగితే, సంఘంలోని కశ్మలాన్ని పూర్తిగా వెల్లడించడం సాధ్యమవుతుంది. కనుక కొన్ని నాటికలు రాశారు. అవి చాలా భాగం రేడియో నాటికల్లాగానే ఉన్నాయి. పోతే, మరికొన్ని ఒకే సన్నివేశం చుట్టూ అల్లిన రూపకా ల్లాగు వున్నాయి. ఈ ప్రక్రియకి ఆయనే ఆదిపురుషుడు. దీనికి 'గల్పిక' అని ఆయనే పేరు పెట్టాడు. నాటికలుగా చెలామణీ అయే ఆయన రచనలు కొన్ని నిజానికి 'గల్పిక'లు.

కొ.కు. నాటికలలో, గల్పికలలో మనచుట్టూ వున్న వాతావరణంలో మసిలిన వ్యక్తులు ముసుగులు తీసివేసి మనముందు ప్రత్యక్షమవుతారు. మనచుట్టూ వున్న వాతా వరణం అనడంలో, మధ్యతరగతి కుటుంబాలు, ఆ కుటుంబాలలోని స్త్రీ పురుషుల మనసుల్లో నిలిచిపోయిన ఆశలూ, ఆశయాలూ, పేరుకుపోయిన ఛాందసత్వం,

స్వార్థం, కుటిలత, ఈ లక్షణాల నుంచి బయటపడాలని తాపత్రయపడే కొద్దిపాటి యువజనం — అన్నమాట.

కొ.కు. నాటికల్లో సామాన్యలక్షణం ఒకటుంది — స్త్రీ పరంగా ఇతివృత్తాన్ని ఆవిష్కరించడం. ఇది చాలా సబబుగా కనబడుతుంది. ఎందుకంటే సమాజంలోని కురీతుల పుట్టకీళ్లు కదల్చాలెనంటే స్త్రీల స్థితిగతులమీదనే పరివర్తన ఉద్యమాలు కేంద్రీకరించబడాలి. స్త్రీలు, పెళ్ళిళ్ళు, స్త్రీ పురుష సంబంధాలు అందువల్లనే కొ.కు. నాటికలకీ, గల్పికలకీ ముఖ్యప్రేరణలయ్యాయి.

మరొక చెప్పుకోదగ్గ విషయమేమిటంటే—సామాన్యంగా కొ.కు. పాత్రలు లోకరీతికి భిన్నంగా కనిపిస్తూన్నట్టూ, ప్రవర్తిస్తూన్నట్లూ కనబడవచ్చు. దీనిలో రెండు అంశా లున్నాయి: ఒకటి ఊహకీ, ఆ ఊహ అక్షరరూపం దాల్చడానికీ మధ్యగల అంతరం. అంటే మనసులోనే మెదిలే ఇతివృత్తం నాటికరూపమెత్తేసరికి పొందే మార్పు. ఇక్కడ, ఎంత యథార్థమైన సన్నివేశమైనా కొంత అతిశయోక్తి లక్షణం పొందుతుంది. సాహిత్యం రచయితల 'కల్పన' అనడం అంటే యిదే. ఇక రెండవది- స్త్రీ పురుష సంబంధాలూ, సామాజిక గతీ అలా వుండాలనీ, ఆ విధంగా మారాలనీ కొ.కు. అభిప్రాయం కావచ్చు. సాంఘిక మూల్యం, రసమూల్యం అని వేరుగా ఉండవు. సంఘం మనుషులతో కూడినది. ఏ వ్యక్తి జీవితాన్ని సాహిత్యంలో ప్రతిబింబించినా, ఆ వ్యక్తి పొందే అవస్థలన్నీ వ్యక్తం కావాలి. ఆ వ్యక్తీకరణలోనే మార్పు, అభ్యుదయం ప్రతిపాదించబడాలి. తన పాత్రల నిర్మాణానికిగాను రచయిత ఎంతో శ్రమ పడతాడు. కళ్ళూ, చెవులూ మెలకువగా ఉంచుకొని సమాజాన్ని పరిశీలిస్తాడు. తన రచన సమాజప్రతిబింబమై నిలవాలనే ప్రతిరచయితా యిలా తాపత్రయ పడతాడు. 'కన్యాశుల్కం'లో సారాదుకాణం ఘట్టం రాయడంకోసం వరసగా కొన్ని రాత్రిళ్ళు ఆ దుకాణాల వైపుకి రహస్యంగా వెళ్ళి పరిశీలించారని గురజాడ వారిని గురించి వింటాం గదా. అలాగే కొ.కు. నాటికల్లోని వ్యక్తులపోకడ, మాటలు జీవితంలో నుంచి వచ్చినవి. పోతే యీ ధోరణి భిన్నంగా కనబడుతుందీ అంటే, ప్రగతిశీలి అయిన రచయిత సమాజంలోని వ్యక్తులను పరిశీలించగలిగినంత నిశితంగా సామాన్యులు పరిశీలించలేకపోవచ్చు కూడా. మరొక మాట ఏమిటంటే, ఒక్కసారి కాలిక్రింద మట్టిని పెళ్ళగించినట్టు తోచే సన్నివేశం, సంభాషణలు ఎదురయితే — తట్టుకోగల గుండెనిబ్బరం కూడా పాఠకులకు వుండాలి.

ఆశించిన ఎఫెక్టు రావాలని, అనుకున్న ప్రయోజనం నెరవేరాలని కొ.కు. fantasy కూడా వాడారు కొన్ని నాటికలలో. 'యథార్థవాది' అనే నాటికలో, వర్త

మాన నాగరికతలోని కుళ్ళును deodorize చేసి వాసనలేకుండా చూసుకోగల ఒక డ్రగ్గును ప్రవేశపెట్టాడు. ఈ డ్రగ్గు కలపిన కాఫీ త్రాగినవారు ఎదుటివారి ముందు మర్మం విడిచి మాట్లాడతారు. అలాగే 'అప్సరస' అనే మరో నాటికలో ఉన్నట్టుండి ఒక కల ప్రవేశపెట్టి, సమాజంలోని పెద్దమనుషుల మనస్తత్వాలు బట్టబయలు చేశాడు. ఆ సన్నివేశంలో పాల్గొన్న ముగ్గురు నలుగురికి ఒకేరకమైన కల ఒకే సమయంలో వచ్చినట్టు చెప్పడం, ఒకేరకమైన పరిస్థితిలో సామాజికులు ఎలా ఒకే విధంగా ప్రవర్తిస్తారో చూపించడానికేనని బోధపడుతుంది. ఈ నాటికలో చక్కని శిల్పం, శిల్పానికి తగ్గ పాత్రచిత్రణ, పాఠకుల్ని ఊపివేసే టెంపో వున్నాయి.

అంతస్థుల వ్యత్యాసాలు, సినీమాల వ్యామోహం, తిని కూర్చోలేక వదంతులు వ్యాపింపచేయడమే వ్యావృత్తిగాగల మనుషులు, తల బొప్పికట్టిన తరువాత నిజం గుర్తించి మానవులైన జనం, కూతురు బతుకు తమ బతుకులాగానే బతికేసే తల్లుల కూతుళ్ళు, చెల్లెలులాగా ముదిరిపోయే దాకా వచ్చిన సంబంధమల్లా తిరగ్గొట్టి, చివరకి ఆ ధర్మాలన్నీ మూటకట్టి సముద్రంలో పారేసి ఎవడినో ఒకణ్ణి కట్టుకోమని పట్టుబట్టే సోదరులూ—ఇలా ఎన్నో ఇతివృత్తాలు, ఎందరో మనుషులు కొ. నాటికలో' గల్పికల్లో కనబడతారు. 'సత్యవతి స్వీయకథ' అనే రచన ముగింపు గురించి కొ.కు. ఆ రచన ముగించిన తరువాత ఆలోచించి కొంత వ్యాఖ్యానం చేశాడు — ఆ ముగింపును సమర్థిస్తూ. ఇదిగో, యిలాంటి రచనల గురించే కొందరు పాఠకులకి "పాత్రలు భిన్నంగా వున్నాయి" అనే భావం కలగడం. ఆచరణలో పెట్టలేని ఆదర్శాలుగలవారినీ, ఒక్కో సంఘటనని ధైర్యంగా ఎదుర్కొనగల శక్తిలేనివారినీ ఎలా యథార్థం గమనించగలిగేలా చేయాలో చూపడానికేనన్నట్టు కొ.కు. తన వ్యాఖ్య రాశాడు. 'పెళ్ళి గొడవ' అనే నాటికలో, మనసులో పిచపిచలాడుతూ పైకి మంచిగా మసలుకొనే మనిషికన్న చెడ్డవాడని పేరు తెచ్చుకొన్న మనిషికే విలువ ఎక్కువ. ఎందుకంటే, అతను చపలచిత్తుడుకాడు, తలిదండ్రుల నిర్ణయాలే తన నిర్ణయాలుగా అంగీకరించే రకం కాడు - అని కొ.కు. ప్రతిపాదించాడు. ఈ మాటలు రాయటానికి ఆయనకు బలమైన ఆధారాలు ఉండివుండాలి. పోతే, ఒక విషయం చెప్పడానికి, సమాజంలో అరుదుగా కనబడే వ్యక్తులు కూడా రచయితకి వస్తువు కావచ్చును.

ఒక రచయిత రాసినవన్నీ ఉత్తమ రచనలని అనలేము. ఇది కొ.కు. విషయంలో కూడా నిజమే. కొ.కు. రాసిన నాటికలూ, గల్పికలూ అన్నీ మేలిమి బంగారమని ఎవరూ అనలేరు. అయితే పొల్లు పోతుంది, నెల్లు నిలుస్తుంది. అలా నిలిచిన

వాటి గురించే మనం మాట్లాడుకొనేది. ఏనాడో రాసినా, సార్వకాలికమైన రచనలను గురించే మనం మాట్లాడుకొనేది. అలాటి రచనల ద్వారానే రచయిత మన కళ్ళ ముందు నిత్యమూ ప్రత్యక్షమవుతాడు. మనం రచయితను గుర్తుచేసుకుంటూ ఉంటాము. చనిపోయినవారిని గుర్తుచేసుకోవడమంటే వారిని పునర్జీవితులను చేయడమేనని ఒక ఈజిప్షియన్ సామెత ఉన్నది. నేడు మనం కొ.కు.ను జ్ఞాపకం చేసుకుంటూ ఉన్నామంటే ఆయన మనమధ్య వున్నాడన్న మాట. ఆయన సజీవుడన్న మాట — ఆయన రచనల ద్వారా, కనీసం.

అనువాదమనిపించని

# అనువాదాలు

ఓల్గా

కొడవటిగంటి కుటుంబరావు మొత్తం ఇరవై ఒక్క నవలు రాసారు. వాటిలో 'మరో ప్రపంచం' అనే ప్రయోగాత్మక నవల ఒక ఇంగ్లీషు నవలకు అనుసరణ అని రచయితే చెప్పారు. ఇవికాక, రోమన్ కిమ్ నవల 'హిరోషిమా'ను అదే పేరు తోను, జాక్ లండన్ నవల 'కాల్ ఆఫ్ ద వైల్డ్'ను 'ప్రకృతి పిలుపు' అనే పేరు తోను అనువాదం చేసారు.

'మరో ప్రపంచం' జేమ్స్ హింటన్ రాసిన 'ది లాస్ట్ హారైజాన్'కు అనుసరణ. ఈ నవలలోని కథ ఒక అభూతకల్పన. గౌరాంగు డనే వ్యక్తి అనేక వందల సంవత్సరాలు జీవించి, బయటి ప్రపంచానికి తెలియకుండా హిమాలయాలలో ఒక పెద్ద ఆశ్రమాన్ని నిర్మించుకుని కొందరు శిష్యులతోపాటు నివసిస్తుంటాడు. అనేక దేశాల సంస్కృతిని అక్కడ పదిలపరుస్తుంటాడు. ప్రపంచంలో విజ్ఞానం అభివృద్ధి చెందటంకన్నా దౌర్జన్యం పెచ్చుపెరగటం అతను తన కాలంలో చూశాడు. మారణాయుధాలతో ప్రపంచంలోని విజ్ఞానం, సారస్వతం, శిల్పం, సంగీతం నాశనమయే పరిస్థితి అతనికి స్పష్టంగా కనిపించింది. అయితే ప్రపంచమంతా అణ్వస్త్రాల పోటీలో

దగ్ధమైపోయినా తాను నిర్మించిన ఈ ఆశ్రమం నిలచి ఉంటుందనీ, ప్రపంచ విజ్ఞానాన్ని, కళలను యిక్కడ భద్రపరిస్తే అవి తర్వాత ఉపయోగపడతాయనీ అతని విశ్వాసం.

ఇరవయ్యవ శతాబ్దంలో గౌరాంగుడు మరణించబోతూ విక్రమ్ అనే అతనిని ఆశ్రమానికి రప్పించి, తన ఆశయాన్ని చెప్పి, ఆశ్రమ బాధ్యత స్వీకరించమని కోరతాడు. కాని విక్రమ్ ఆ బాధ్యతను తిరస్కరిస్తాడు. ఆశ్రమాన్నించి పారిపోయి వచ్చేస్తాడు. ఆ ఆదర్శం గొప్పదని భావిస్తాడు గాని అక్కడ ఉండలేకపోతాడు. ఎందుకు అనే ప్రశ్నకు సమాధానాన్ని రచయిత సూటిగా మాటల్లో చెప్పలేదు గాని మనం తేలికగా ఊహించవచ్చు. సంస్కృతిని కాపాడటానికి అది సరైన పద్ధతి కాదని విక్రమ్‌కు అనిపించి ఉండాలి. తన ప్రపంచాన్ని, తాను సాధించిన విజయాల్ని మానవుడు నాశనం చేసికోడనీ, దౌర్జన్యాన్ని ఎదిరించి ముందుకే నడుస్తాడు గాని పశుప్రాయుడు కాడనీ విక్రమ్‌కు నమ్మకం ఉండి ఉండాలి. అందుకే అక్కడ నిలవలేకపోయాడు. గౌరాంగుడికి ఆ నమ్మకం లేనందువల్లే అటువంటి ఆశ్రమాన్ని అజ్ఞాతంగా నిర్మించాడు.

ప్రపంచ యుద్ధభయమూ, ఆ యుద్ధం వలన మానవ సంస్కృతే నాశనమవుతుందేమోననే బాధా ఈ రచనకు ప్రేరణలని చెప్పవచ్చు.

అమెరికా జపాన్‌మీద చేసిన బాంబు దాడికి గురైన పట్టణాలలో హిరోషిమా ఒకటి. ఆ దాడిలో వేలాది మంది మరణిస్తారు. మరి అనేకవేల మంది గాయపడీ, రకరకాల వ్యాధులకు లోనయ్యీ జీవచ్ఛవాల్లా బ్రతుకుతుంటారు. అలాంటి వేల మందిలో సుమికో అనే బాలిక ఒకతె. బాంబుదాడిలో సుమికో తన కుటుంబాన్నంతా కోల్పోతుంది. ఐతే నిరాశలో కుంగిపోకుండా కొత్త జీవితాన్ని ప్రారంభిస్తుంది. ఘోరమైన జబ్బును భరిస్తూనే కమ్యూనిస్టు పార్టీలో చేరి పనిచేస్తుంది. జపాన్ కమ్యూనిస్టు పార్టీ గురించి, యుద్ధానికి వ్యతిరేకంగా అక్కడి ప్రజల పోరాటాన్ని గురించి ఈ నవల వలన మనం తెలుసుకోగలుగుతాం.

"యంత్ర నాగరికత బర్బరత్వం యొక్క చరమదశ అందుకొన్నదని హిరోషిమా గురించి ఒక ఫ్రెంచి రచయిత అన్నాడు....లక్ష తత్వ గ్రంథాలు చదివినా తెలియని విషయాలను ఒక్క క్షణంలో పికదోనే (బాంబు) నాకు తెలియజెప్పింది. జీవితం యొక్క విలువ ఏమిటన్న ప్రశ్నకు అది సమాధానం చెప్పింది. ఆ రోజు

ఉదయం అనేక వేలమంది చావటం కంటే పెద్ద ఘోరమే జరిగింది. ఆ ఉదయం మానవజాతి అంతరాత్మ మసి అయిపోయింది. నేనున్నానని అది అనుకునే అర్హత లేకుండా పోయింది. ఏకదోనేను సృష్టించినవారు దానికి జవాబుదారీ వహించాలి—అది తయారుచేసినది మనిషి. భూమిమీద వుండే ఏ యితర జంతువూ కాదు. తప్పు మనిషి జాతిది. ఆ మాట అనుకుంటే మనిషి జాతిని చూసి సిగ్గేస్తుంది''—ఇట్లా ఆలోచించి నిరాశలో కూరుకుపోయిన వారూ జపాన్‌లో ఉన్నారు. "ఏకదోనే తప్పు అందరిదీ అనే వాడు పిచ్చివాడే. ఆ తప్పు అమెరికన్లది. మళ్ళీ హిరోషిమా లాటిది జరగకుండా చూడటానికి ప్రపంచంలో ఎంతో మంది కృషి చేస్తున్నారు. వాళ్ళు సాధిస్తారు కూడాను. ప్రపంచ మేమీ నిర్మూలనం కాదు''—అంటూ మానవత్వంమీద కొండంత ఆశలో పోరాడే ప్రజలూ జపాన్‌లో ఉన్నారు. జపాన్ ప్రజల రక్తంతో వ్యాపారం చేసీ, విషప్రయోగం చేసీ, బలవంతంగా చంపీ, వాళ్ళను తమ వైద్యశాస్త్ర పరిశోధనకు పశువుల్లా వాడుకున్న అమెరికన్ల కసాయితనాన్ని ఈ నవల బహిర్గతం చేస్తుంది.

కెనడా ఉత్తరప్రాంతంలో దొరికే బంగారం కోసం అక్కడకు వెళ్ళేవారు తమ ప్రయాణానికి స్లెడ్జ్ బళ్ళను ఉపయోగిస్తారు. ఆ బండ్లను కుక్కలచేత లాగిస్తారు. ముఖ్యంగా గత శతాబ్దంలో ఇది పెద్ద ఎత్తున సాగింది. ఆ కుక్కల బతుకునూ, వాటి కష్టసుఖాలను, రాగద్వేషాలను, తెలివితేటలను అద్భుతంగా చిత్రించిన నవల 'ప్రకృతి పిలుపు'. ఒకవంక జంతువుల గురించి రాస్తూనే మనుషుల గురించి వ్యంగ్య. వ్యాఖ్యానాలు చేస్తుంటాడు రచయిత. మనుషులకు, జంతువులకు మధ్య ఉండే అనుబంధాన్ని, మనుషుల్లోని మృగత్వాన్ని, మృగాల్లోని మానవత్వాన్ని రచయిత చాలా ప్రతిభావంతంగా చిత్రించాడు.

ఈ రెండు ఇంగ్లీషు నవలలకూ కుటుంబరావు అనువాదం చాలా సరళంగా ఉంటుంది. అనువాదమని అనిపించదు. ఇవికాక ఆయన ఇతరభాషలకు చెందిన అనేక కథలనుకూడా అనువదించారు.

ఆకాశంలో సగంకాని

# స్త్రీల పాత్రలు

టి. కృష్ణాబాయి
చలసాని ప్రసాద్

"మన సమాజంలో కొందరు తక్కువ కులాల్లో పుడతారు. మరికొందరు ఆడ వాళ్లుగా పుడతారు" అంటారు కొడవటిగంటి కుటుంబరావు తన 'ఆడజన్మ' కథలో. ముప్పయి ఏళ్ళనుంచీ రాజ్యాంగబద్ధంగా రిజర్వేషన్లు అమలు జరుపుతున్నారు. అయినా వెనుకబడ్డ కులాలు అవగింజలో ఆరోవంతయినా ముందుకు జరగలేదు. ఆవడి సోషలిజాలు, గరీబీ హటావోలు బీదలను బాగుచేయలేక పోయాయి. అలాగే ప్రధాన మంత్రిగా ఆడదే రాజ్యమేలుతున్నా రమీజా బీ లు, జిజియాబాయిలు, మథురలు, మాయా రే లు అగచాట్లకు గురికాక తప్పడం లేదు.

మన జనాభాలో సగానికి పైగా ఆడవాళ్ళే. వాళ్ళెందుకింత అధోగతిలో ఉండాలి? మన దేశంలో నూటికి నలభై అయిదు మందికి తిండీ తిప్పలు లేవు. వీళ్ళే అట్టడుగు జనం. కుటుంబరావుకి వీరిపట్ల సానుభూతి, ప్రేమ పూర్తిగా ఉన్నాయి. కాని వాళ్ళ జీవితాలతో ఆయనకు లోతైన పరిచయం ఉండే అవకాశం లేదు. కనుక వాళ్ళ గురించి అంతగా కథలు, నవలలు ఆయన రాయలేదు. మొదటినుంచి చివరి దాకా కొ.కు. మధ్యతరగతిలో మెసిలారు. ఆ తరగతి జీవితాలనే ఆయన కాచి వడపోశారు.

మధ్య తరగతి బ్రతుకుల్ని కొ.కు. మార్క్సిస్టు దృష్టినుంచి పరిశీలించారు. వాళ్ళ బాధలు, గాథలు, వాళ్ళ కష్టసుఖాలు — ఒకటేమిటి, తన కథలద్వారా అన్నీ రంగరించి పోశారు. మధ్య తరగతిలో స్త్రీ మరింత సతమతం కావలసి ఉంటుంది. పైకి ప్రాకలేక, కిందకు దిగలేక, దిగజారలేక ఒకరకంగా మధ్యతరగతి స్త్రీలు ఉట్టికి, స్వర్గానికి మధ్య వేళ్ళాడతారు. పై తరగతి వాళ్ళలా భోగాలమీద మోజుంటుంది. కాని, తమ ఆర్థిక పరిస్థితి అందుకు అనుకూలించదు. కింది తరగతి జనంలా కష్టపడి పనిచేయడం నామోషీ. నలుగురికి పనికివచ్చే పనులు వీళ్ళు చేయరు, చేయలేరు. సమాజంలో అంటీ ముట్టకుండా ఉంటారు. వీళ్ళవి బోలు బ్రతుకులు.

అయితే, మన దేశంలో మధ్య తరగతి పెద్ద సంఖ్యలో ఉంది. వీళ్ళ జీవితాలను విశ్లేషించి, సమస్యలను విడమరచి చెప్పి, వాళ్ళను చైతన్యవంతులుగా మార్చకపోతే సమాజ స్వరూపాన్ని మార్చగలగడం అసంభవం. సహజంగా మధ్యతరగతివారు గానుగెద్దుల్లాగా సంసార వలయాల్లో తిరుగుతూంటారు. ఇలాంటి వాళ్ళలో సామాజిక చైతన్యం కలిగించటం అంత సులువేమీ కాదు. ఈ పని సమర్థవంతంగా చేయగలిగిన తెలుగు రచయిత కొడవటిగంటి. వ్యక్తులనే కాక రచయితలెందరినో ప్రభావితం చేసి మార్చగలిగినవి ఆయన రచనలు.

"అసలు మధ్యతరగతి మగవాడే నాసి. ఆడవాళ్ళు మరింత నాసి. పాత విలువలూ, ప్రమాణాలూ, పద్ధతులూ నష్టదాయకంగా వున్నాయని తెలిసికూడా మగవాడు ఒదులుకోలేకుండా వుంటే, నష్టదాయకంగా వున్నాయని తెలియనైనా తెలియని స్థితిలో ఉన్నది ఆడది. కాని అందుకు మధ్య తరగతి ఆడవాళ్ళను తప్పు పట్టను. నేను ఎక్కువగా రాసేది మద్రాసువంటి నగరంలో వుండే మధ్యతరగతి కుటుంబాల గురించి. వాళ్ళు పల్లెటూళ్ళనుంచీ, చిన్న బస్తీల నుంచీ పట్నవాసానికి వచ్చిన మొదటి తరంవాళ్ళు. 25-30 ఏళ్ళుగా మద్రాసులో వున్నా వీళ్ళ ఆత్మలు—మాయల ఫకీరు ప్రాణంలాగా — తమతమ పల్లెల్లోనే, చిన్న బస్తీల్లోనే వుంటున్నాయి. వీళ్ళనూ, వీళ్ళ మూర్ఖత్వాన్నీ, దాన్ని ఎదిరించలేని భర్తల నిస్సహాయ స్థితిని నేను కళ్ళారా చూస్తున్నాను" అంటారు కొ.కు. ఒక ఉత్తరంలో. దీన్ని గీటురాయిగా తీసుకుని మధ్యతరగతి జీవితాలను నిగ్గుదేల్చా రాయన.

కొ.కు. నవలల్లో తనకు బాగా నచ్చింది 'వారసత్వం'. ఇది మూడు మధ్య తరగతి కుటుంబాలకు చెందిన రెండుతరాల కథ. ఈ నవలకి భాను పాత్ర ఇరుసు.

పెళ్ళికి బోలెడు ఖర్చుపెట్టి పదకొండవ ఏటే భానుకి లక్షాధికారుల సంబంధం చేసాడు వాళ్ళ నాన్న. పుట్టింటి వాళ్ళ ఆస్తి హారతి కర్పూరంలా హరించుకు పోయింది. భర్త చనిపోవడంతో అనాథ అయింది భాను. కూతురు పద్మ ఒక్కతే తనకి దక్కిన భాగ్యం. మరీ ఉమ్మడి కుటుంబాల్లో భర్త చనిపోయిన ఆడది నిజంగా దురదృష్టవంతురాలు. పెనిమిటి పోయాక భానుమీద ఆమె బావ కన్నేస్తాడు. కాని ఆమె లొంగదు. అత్తవారింట్లో ఆమె పడుతున్న అగచాట్లు చూసి దూరపు చుట్టం సుదర్శనం ఆమెను పట్నం తీసుకువెళతాడు. సుదర్శనం భార్య దుర్గాంబ పరమ గయ్యాళి. అనాకారి. కేవలం డబ్బు కోసమే పెళ్ళాడాడామెని. ఆతని జీవితంలో భాను ప్రవేశించగానే తనకి సరైన జోడీ ఆమేనని గ్రహించడానికి సుదర్శనానికి ఆట్టే కాలం పట్టలేదు. ఆమె పేర మంచి ఇల్లుకూడా కట్టించాడు. ఇదంతా పసికట్టి సాధిస్తుంది దుర్గాంబ. అయితే భార్యకి బెదిరిపోయి భానుని వదులుకోలే దతను.

సుదర్శనం కొడుకు రామదాసు పెద్దయాక తండ్రి దగ్గర నుండి ఆస్తి సంక్ర మింపజేసుకున్నాడు. అతని భార్య బాల కాపురానికి రాగానే భర్త నపుంసకుడని తెలుసు కుని పక్కదార్లు చూసుకుని పిల్లల్ని కన్నది. ఇది రామదాసుకీ తెలుసు. అయితే అతనికి వ్యాపారదక్షత పుష్కలంగా ఉంది. మొత్తం వ్యాపారం తన గుప్పిట్లో పెట్టుకుని తండ్రితో సహా అందరినీ కీలుబొమ్మల్లా ఆడించాడు. తన తండ్రి భానుకి ఆపేక్షతో పెట్టిన సొమ్మంతా వడ్డీతోసహా రాబట్టాడు.

కాలం మారినా దురాచారాలు మధ్యతరగతిని పట్టి పల్లారుస్తాయి. భానుది బాల్య వివాహం. కొద్ది సంవత్సరాలకే వితంతువయింది. మళ్ళీ పెళ్ళి చేసుకోగూడదు. తనని ఆదరిద్దామని తీసుకెళ్ళిన సుదర్శనం డబ్బుకోసమని ఇష్టంలేని పెళ్ళి చేసుకుంటాడు. మామూలు మానవసంబంధాలనుబట్టి చూస్తే భాను, సుదర్శనాలది సహజమైన కలయికే. కాని నీతి సూత్రాల ప్రకారం ఇది చెల్లదు. "ప్రేమలేని రంకుతో పెళ్ళాన్ని తెచ్చు కున్నందుకు యిది శిక్షలాగుంది — ప్రేమించిన దానితో రంకుపోవటం" అంటాడు సుదర్శనం.

సుదర్శనం కొడుకు, కోడలు పాత్రలు అచ్చంగా వ్యాపార తరగతికి చెందినవి. మొగుడు నపుంసకుడని తెలిసినాగాని డబ్బు ఉంది గనుక తన భద్రతకోసం, హోదా కోసం అతని భార్యగానే చలామణి అవుతుంది బాల. అందంగా, ఆరోగ్యంగా వున్న భాను తమ్ముడు శాస్త్రిని తన కోరిక తీర్చుకోవడానికి వాడుకుంటుంది. శాస్త్రిని శారీర కంగా బాల వాడుకుంటే, అతని శక్తియుక్తుల్ని రామదాసు సొమ్ము చేసుకుంటాడు.

సంఘం దృష్టిలో బాల పిల్లలు రామదాసు సంతానమే. అతని ఆస్తికి వారసులు వాళ్ళే. కాని అటు పిల్లల్ని కనడంలోను, ఇటు వ్యాపారానికి తన తెలివిని ధారపోయడంలోను శాస్త్రిదే నిజమైన శ్రమ. తనకు పెట్టుబడి లేదు గనుక, పుష్కలంగా పెట్టుబడి పెట్ట గలిగిన రామదాసు చేతిలో అతను పనిముట్టవుతాడు. రామదాసు వారసత్వం చెక్కు చెదరకుండా బాల పిల్లలకే వస్తుంది.

మానవసంబంధాల్లో వుండే మార్దవాన్ని వ్యాపార సంబంధాలు పీల్చివేస్తాయి. వాళ్ళు మనుషులుగా మిగలరు. వ్యాపార లావాదేవీలు లేవు గనుక (శాస్త్రి కొంతకాలం కలిసివున్న ఒక) బొంబాయి కుటుంబానికి ఈ దుర్గతి పట్టదు. ఆ కుటుంబం ప్రేమకు, ఆదరణకు ఆలవాలంగా వుండగలిగింది. శాస్త్రిలాంటి వ్యక్తిని సేదదీర్చి సంస్కార వంతుడిని చేయగలిగింది. ఆ కుటుంబసభ్యులు మామూలు మానవుల్లాగానే మనకు కని పిస్తారుగాని ఆడ మగ భేదాలు వుండవు. 'వారసత్వం'లో కుటుంబరావు ముఖ్యంగా చెప్పదలచుకున్నది మానవ విలువలను డబ్బు విధ్వంసం చేస్తుందని. ఎంతో సహ జంగా వుండాల్సిన స్త్రీ పురుష సంబంధాలు కూడా డబ్బువల్ల విషపూరితం అవు తున్నాయని. ఈ మాటే కార్ల్ మార్క్స్ తన Philosophical Manuscripts లో నొక్కి చెప్పాడు.

తెలుగువారికి తనయులేకాని
తనయలు బిడ్డలు కారమ్మా
ఆడపుట్టుకే అపరాధం
నీ గోడు వినేవారెవరమ్మా
పోవమ్మా బలి కావమ్మా

అని పాత తెలుగు సినిమాపాట ఒకటుంది. కొడవటిగంటి మరొక రచన 'ఆడజన్మ' కథలో ప్రధానపాత్ర లక్ష్మి అచ్చం అలాంటి అభాగ్యురాలే. "ఆడపుటక అపరాధ" మనే యింట్లో పుట్టింది లక్ష్మి. "పాపం, ఆ యింటివాళ్ళ మొహాలు చూస్తే యింట్లో ఒకపిల్ల పుట్టినట్టులేదు, పిల్ల పోయినట్టుందిగాని." లక్ష్మి కన్నతల్లి ఒకపక్క తన కడుపున పండంటి బిడ్డ పుట్టిందని కొండంత సంతోషపడింది. మరోపక్క ఆడపిల్ల పుట్టిందని అయినవాళ్ళూ, ఇరుగు పొరుగూ దెప్పినందుకు బాధపడింది. అందుకని ఆవిడకి "అమృతమూ, విషమూ కలిపి తాగినట్టయింది."

ఇలాంటి వాతావరణంలో పెరుగుతున్న లక్ష్మికి మూడో ఏట తమ్ముడు పుడ తాడు. ఏ కారణం చేతనో — తమ్ముడు తనకన్నా గొప్పవాడని, బాగా చదువుకుని

ఉద్యోగాలు చేస్తాడని, ఆడవాళ్ళు చదువుకుంటే చెడిపోతారని, తన తల్లీతండ్రి మంచి వాళ్ళు గనుక యింటిపనులన్నీ నేర్పి బోలెడంత కట్నంపోసి తనకొక మొగుణ్ణి తెస్తారనీ లక్ష్మి పసిమనసులో ఆలోచనలు పెరుగుతుంటాయి. తమ్ముడు పెద్దయాక, అతనొక్కడితోనే తన మనసులో మాట చెప్పేది ఆ పిల్ల.

లక్ష్మిది మంచిగొంతు. సంగీతంమీద అభిమానం. కాని అసలే ఆడపిల్ల, ఇంకా ఆదో ఖర్మా? లక్ష్మి గొంతెత్తి పాడితేనే తల్లికి తేళ్ళు, జెర్రులూ పాకినట్టుండి తిట్టేది. తమ్ముడు బడికివెళ్ళి చదువుకుంటూంటే, యింట్లో అంట్లు తోముతూ అంట్లగిన్నెల మీద పసితో అక్షరాలు దిద్దుకునేది లక్ష్మి.

పదేళ్ళ ఈడుకే పుట్టెడు చాకిరీ చేస్తూండే లక్ష్మిని చూసిన కొందరు, ఆమెను తమయింటి కోడలిని చేసుకుందామనుకునేవారు. మంచి పనిమనిషి ఎవరికైనా ఆకర్షిస్తుంది గదా! అయితే, మగపిల్లవాడికి అన్యాయంచేసి ఆడపిల్లకి బోలెడు కట్నం పోయడం యిష్టంలేక, ఆఖరికి లక్ష్మిని రెండో పెళ్ళివాడికి ముడేసి పీడ వదిలించుకున్నాడు తండ్రి.

తమ్ముడు కిష్టుడు "యీ పెళ్ళికి ఒప్పుకోకే అక్కా" అని బతిమాలాడు. చివరికి పెళ్ళికి వెళ్ళకుండా బాయ్‌కాట్ చేశాడు.

లక్ష్మి అత్తవారిది మండువాలోగిలి. అంటే ఉమ్మడికుటుంబం. పెత్తనమంతా యిల్లుబట్టిన విధవాడబడుచు వెంకాయమ్మది. తనే "అసలు మొగుడి"లా అధికారం చెలాయించేది. పెనిమిటి నాగభూషణం అన్నీ తెలిసినట్లే వుంటాడుగాని పైకి మాత్రం ఏమీతేలడు. లక్ష్మిమీద ప్రేమేగాని చనువివ్వడు. ఆడదాన్ని అలా యెడంగా వుంచకపోతే నెత్తికెక్కదూ? లక్ష్మి మనసులో మాటకూడ బైటికి చెప్పనివ్వడు. అలాంటిది తన భార్యమీద తమ్ముడు అఘాయిత్యం చేశాడని తెలియగానే మాత్రం తోకతొక్కిన తాచులాలేచి తమ్ముడిని బడితపూజ చేశాడు. భార్యను అతను వ్యక్తిగా భావించలేదు, సొత్తుగానే తప్ప. తన సొంతసొత్తుమీద చెయ్యివేశాడు గనుకనే తమ్ముడిమీద చెయ్యి చేసుకున్నాడు.

అగ్నికి వాయువు తోడైనట్లు, ఆడబిడ్డకు తోడు మరిది వెంకటేశ్వర్లు లక్ష్మిని వేధించుకు తినేవాడు. అతనితో వేగలేక అతని భార్య పుట్టింటికి పారిపోయింది. ఊళ్లో ఏ ఆడదాన్నీ శాంతంగా బతకనివ్వ డతను. కోటయ్యనే చిన్నరైతు మాత్రం అతనికి పక్కలోబల్లెంలా వుండి కొంత అదుపు చేస్తుంటాడు.

భ్రమర పుట్టిన అయిదారేళ్ళకే లక్ష్మిభర్త చనిపోయాడు. అతనుంటేనే అంతంత మాత్రం. ఇక ఇప్పుడామె మరీ దిక్కులేనిదయింది. బిడ్డని తీసుకుపోవడానికి కూడా అత్తవారు మడతపేచీలు పెడతారు. కోటయ్య సాయంతో, కిష్టడి చొరవతో లక్ష్మి చివరకు ఆ నరకాన్నుంచి బయటపడుతుంది.

తన గతి తన కూతురుకి పట్టగూడదని భ్రమరకు బాగా చదువు, సంగీతం చెప్పిస్తుంది లక్ష్మి—ఉన్నంతలోనే. కాని కూతురు తనని తోటకూరలో పురుగులాగా తీసేసేది. ఆనాడు తను కన్నతల్లికి పనికిరాలేదు. ఇప్పుడు కన్నకూతురికీ అక్కరలేక పోయింది. చిన్నప్పుడు తన సంగీతాభిరుచిని తల్లి చంపేస్తే, ఇప్పుడు కూనిరాగం తీస్తేనే కూతురు ఈసడించింది. తనకు దొరకని స్వేచ్ఛ కూతురికి కల్పించింది లక్ష్మి. కాని దాన్ని సద్వినియోగం చేసుకునే శక్తిసామర్థ్యాలు భ్రమరకి లేక, సినిమా మోజులో ఎవరితోనో లేచిపోతుంది.

ఆ విధంగా జీవితంలోని వాస్తవికతకు దూరమయి, అక్కడి వ్యాపార నాగరికతలో శలభంలా మాడి, ఆఖరికి యిల్లు చేరుతుంది — నెల తప్పిన భ్రమర. ఆమెకి పుట్టేది ఆడపిల్లేనని లక్ష్మికి బాగా తెలుసు. తనకింకా ముప్పైఘమూడేళ్ళే. ఇంకా నడి వయసు దాటకముందే మూడుతరాల వాళ్ళు వీధిలో నిలబడతారు. "భగవంతుడా, మాకేది దిక్కు" అని ఏడుస్తుంది లక్ష్మి.

'ఆడజన్మ' కథలో ప్రధానపాత్రని ఇతర స్త్రీ పాత్రలన్నీ ఈసడించీ, పెత్తనం చేసీ, నిరాదరించీ పురుగేరాయి. లక్ష్మికి ఓదార్పు కలిగించినవారు ముగ్గురంటే ముగ్గురు. పుట్టింట్లో తమ్ముడు, అత్తింట్లో మారుటి కొడుకు, అత్తవారి ఊళ్ళో రైతు కోటయ్య. ఆడ మగ తేడాలు లేకుండా సామాజిక రుగ్మతలకు వ్యక్తులు ఎలా గురవుతారో కొ.కు. ఈ కథలో నిరూపించారు.

కుటుంబరావు నవలిక 'పంచకల్యాణి' అయిదుగురు స్నేహితురాళ్ళ కథ. చదువుకునే రోజుల్లో హాయిగా, స్వేచ్ఛగా పిట్టల్లా ఆడుతూ, పాడుతూండేవారు. అందరివీ మధ్యతరగతి జీవితాలే అయినా బోలెడు వైవిధ్యం వుంటుంది. ఎవరి పెళ్ళీ సజావుగా జరగదు. మంచి మొగుడు రావాలని, దాంపత్య జీవితం చక్కగా సాగాలని కలలు కంటారు కాని అవి ఫలించవు. ధనం అనే తరగతిలో మధ్యతరగతి జీవితాలు ఎలా నలిబిలి అవుతాయో యిందులో కనిపిస్తుంది. మధ్యతరగతిలో, అందులోనూ అంతో యింతో చదువుకుని సంస్కారంగల ఆడపిల్లకు పెళ్ళి గగనకుసుమం. సుశీల అంటుంది కూడా "డిగ్రీలుగల పిల్ల శీలం లేనిదానితో సమానం" అని. అలా అన్న

సుశీల కావాలని రెండో పెళ్ళివాడిని చేసుకుంటుంది. కాని చిత్రమేమిటంటే, మిగిలిన నలుగురికన్నా సంసార జీవితంలో తనే సుఖపడుతుంది. తక్కిన నలుగురు ఈడూ జోడూ అయిన వాళ్ళనే చేసుకుంటారు. కాని వివాహం అనగానే ధనం, ఉద్యోగం, హోదా, అంతస్థు—ఇవే చోటు చేసుకుంటాయి వారి దృష్టిలో. ప్రేమ, అనురాగం మచ్చుకి కూడా కనిపించవు. వాళ్ళు నలుగురూ జీవిత రథచక్రాల కిందపడి బ్రతుకులో మార్దవం, సున్నితత్వం కోల్పోయి ఎండుగా మోడువారిపోతారు. ఇదే మధ్యతరగతి వా సవికత.

'పంచకల్యాణి' ఇప్పటి సమాజానికి అద్దం పడితే, 'కురూపి' ఒకరకంగా రాబోయే సమాజపు కథ. ఎందుకంటే, వెనుకటి సమాజాల్లో అందవిహీనంవల్ల పెళ్ళిళ్ళు ఆగిపోయేవి కావు. మతాలు, కులాలు, ఆచారాలు, సంప్రదాయాలు — వీటికి అనుగుణంగా పెళ్ళిళ్ళు జరిగేవి. నేటి సమాజంలో డబ్బు ననుసరించి జరుగుతున్నాయి. అందవిహీనత అనేలోటును డబ్బు చాలా తేలికగా కప్పిపెడుతుంది. ముఖ్యంగా పై తరగతుల పెళ్ళిళ్ళలో ఆస్తులు, అంతస్థులు — వీటి ప్రమేయమే ఉంటుందిగాని, వ్యక్తి గుణగణాలకు ప్రాముఖ్యం వుండదు. కింద తరగతుల్లో జీవితావసరాలు, ఆచరణ, ఆర్థికంగా వేణ్ణీళ్ళకు చన్నీళ్ళు తోడుకావడం—ఇవే పెళ్ళిళ్ళలో ప్రాధానపాత్ర వహిస్తాయి. ఒకరకంగా మధ్యతరగతిలో మాత్రమే అందవిహీనత పెళ్ళిళ్ళకు అడ్డంకిగా కనిపిస్తోంది. ఇప్పుడు ఆ తరగతికి మాత్రమే పరిమితమై వున్న ఈ సమస్య రాబోయే సామ్యవాద వ్యవస్థలో మొత్తం సమాజానికి సమస్య అయికూచుంటుంది. నిజమైన మానవ సమస్యగా అప్పుడు ముందుకొస్తుంది. ప్రస్తుత సమాజంలోని వర్గాలు ఆ సమాజంలో ఉండవు. సామాజిక సమస్యలే ప్రధానంగా వుంటాయి గనుక అందరికీ సమస్యలు ఒకేరకంగా వుంటాయి. ఎంతో సామాజిక అవగాహన ఉంటేనే గాని యెవరూ యిలాంటి కథ రాయలేరు. రాబోయే సమాజంలో మాత్రమే ఉత్పన్నమయే ఒక సమస్య యీ సమాజంలో మధ్యతరగతిలో మాత్రమే యెలా వుంటుందో కొ.కు. విడమరచి చెప్పారు. పట్టణ మధ్యతరగతి వర్గాన్ని అన్ని కోణాలనుంచి పరిశీలించి, లోతుకు వెళ్ళి చిత్రించిన తెలుగు రచయిత ఆయన తప్ప మరొకరు లేరేమో. అంతేకాదు. స్త్రీ సమస్యను ఏనాడూ ఆయన స్త్రీకి మాత్రమే ప్రత్యేకించినదిగా చూడలేదు. స్త్రీ సమాజంలో అంతర్భాగమేననీ, ఆమె సమస్య సమాజ సమస్యే నని చాలా స్పష్టంగా 'కురూపి', 'పంచకల్యాణి' మొదలైన రచనలలో కొ.కు. చిత్రించారు.

'నీకేం కావాలి?' అన్నది ఒక కొత్త తరహా నవల. అందులోని కస్తూరి పాత్ర 'కన్యాశుల్కం'లోని మధురవాణిని తలపింపజేస్తుంది. చాలా అమాయకంగా కనిపించే కస్తూరికి తన బ్రతుకు గురించి, స్వేచ్ఛ గురించి కచ్చితమైన అభిప్రాయాలుంటాయి. వివాహ వ్యవస్థలోని బోలుతనాన్ని, కుళ్ళుని, బానిసత్వాన్ని బట్టబయలు చేస్తుంది. కేవలం పొట్టకూటి కోసమే వేశ్య ఒళ్ళు అమ్ముకుంటుందిగాని సంసార స్త్రీలలాగా మనసు అమ్ముకోదు, స్వేచ్ఛ ఒదులుకోదు.

'అనుభవం' కొ.కు. చివరి నవల. యాభై ఏళ్ళపాటు (1900-1950) తెలుగు దేశంలో వచ్చిన సామాజిక మార్పులు సంసార జీవితాలను ఎలా ప్రభావితం చేశాయో ఆయన యిందులో చూపారు. సంస్కరణోద్యమాలు, రాజకీయ పోరాటాలు, ఆర్థిక సంక్షోభం, సాంఘిక చైతన్యం—వీటి నేపథ్యం కూడా ఈ నవలలో కనిపిస్తుంది. 'అనుభవం' నవలను మూడు తరాల కథ అనవచ్చు. ప్రధాన పాత్ర పార్వతి. ఆమె తల్లితరంలో సమాజం భూస్వామ్య వ్యవస్థ గుప్పిట్లో ఉండేది. సానిమేళాలు పెట్టించడం, భోగంవాళ్ళను ఉంచుకోవటం, బడాయిలు చెప్పకోవడం. భోగాలు - విలాసాలు - దర్జాలు - విచ్చలవిడిగా ఖర్చుపెట్టుకోవడాలు, ఇవన్నీ ఆ తరం వాళ్ళలో ఎక్కువగా కనిపిస్తాయి.

పార్వతి మామగారు పైలాపచ్చీసుగా బ్రతికాడు. పార్వతి పెనిమిటి కాంతయ్య ఆస్థంతా హారతి కర్పూరం చేశాడు. భూస్వామ్య సంస్కృతి అవశేషాలు అతన్ని జలగల్లా పీల్చేశాయి. అటువంటి పెనిమిటితో కాపురం పార్వతి ఊహకు అందరానిది. ఆ రోజుల్లో అలాంటి ఆడవాళ్ళు గబ్బిలాయిల్లాగా జీవించారు. పాతసమాజంలోని దైన్యం, దుర్మార్గం, బానిసత్వం వ్యక్తి జీవితాన్ని, ముఖ్యంగా ఆడదాని బ్రతుకును ఎలా పట్టిపల్లారుస్తాయో ఈ నవలలో గొప్పగా చిత్రించారు కె.కె. మనం ఇపుడు కలలుకంటున్న స్వేచ్ఛ ఆనాడు గగన కుసుమం. వ్యక్తి స్వేచ్ఛలేకపోవడంవల్ల పార్వతి జీవితం గిడసబారిపోయింది. ఆమె మనసు వికసించలేదు.

తన ముందుతరం, తన తరం అనుభవాలను నరనరాన జీర్ణించుకున్న పార్వతి, తన కొడుకు అలా తయారు కాకుండా ఉండాలని గట్టిగా కోరుకుంది. అతన్ని వేరే మూసలో పోయ్యాలని కలలుకంది. కాని తన కొడుకు ముందుతరానికి చెందినవాడనీ, ఈ తరంలో నూతన చైతన్యం వెల్లివిరిసిందనీ పార్వతి ఆలోచించలేక పోయింది. అది ఆమెలో పెద లోటు. తన వెనకతరంలో ఇమడలేకపోయింది. తన తరంతో కలిసి

మెలిసి ఉండే అవకాశాలు లేకపోయాయి. తన తర్వాతి తరంతో పరుగెత్తలేక పోయింది. చిట్టచివరలో పార్వతి మాటలు పరిశీలిస్తే ఆమె జీవితంలోని ట్రాజెడీ మనకు గొప్పగా తెలుస్తుంది. "నా కొక్కటే విచారం నాయనా! నిన్నెట్లా పెంచాలో చాతకాక దూరం చేసుకున్నాను. మన అద్దెకున్న వాళ్ళబ్బాయి—ఆ తల్లీ, కొడుకు ఎంత ప్రేమగా ఉంటారో. వాళ్ళను చూస్తే ముచ్చటేస్తుంది." తన మనసులోని ఆవేదనంతా ఈ మాటల్లో మూటకట్టింది పార్వతమ్మ. ఇవాళ ప్రతి మధ్యతరగతి కుటుంబాన్ని వేధించే తరాల అంతరాన్ని, ఎంతో ముందుచూపుతో ఆనాడే పసికట్టి చిత్రించారు కొ.కు.

అంతేకాదు. మధ్య తరగతిలో మామూలుగా ఉండే వెనకచూపు, నిలవనీటి ఆలోచనలు, గబ్బిలాల్లా సంసారాల చూర్లు పట్టుకు వేళ్ళాడే స్వభావం 'అనుభవం'లో కనిపిస్తాయి. వ్యవస్థ తాలూకు కుళ్ళు చీడపురుగులా వ్యక్తిని తొలిచేస్తుంది. వ్యవస్థ మార్చాలంటే వ్యక్తిలో ఎంతో భావచైతన్యం రావాలి. అక్కడితో సరిపోదు. పాత వ్యవస్థ తాలూకు వాసనలు వ్యక్తులను ఒక పట్టాన వదలవు. యాభై శతాబ్దాలుగా మానవజాతిలో పేరుకున్న రోగాల విషస్వరూపం, కేవలం యాభై ఏళ్ళ జీవితాన్ని చిత్రించిన 'అనుభవం'లో వికటాట్టహాసం చేశాయి. పాత వ్యవస్థ వ్యక్తుల్ని విష పూరితం చేస్తే, పాతబూజు వదిలించుకోలేని వ్యక్తులు కొత్త వ్యవస్థకు తూట్లు పొడ వాలని చూస్తారు. ఆ బూజు వదలాలంటే నూతన మానవుడిని మూసపొయ్యాలి. దీని అవసరాన్ని రచయిత ఈ నవలలో ప్రతిభావంతంగా చూపారు.

కొడవటిగంటి చిత్రించిన మధ్యతరగతి స్త్రీల సమస్యలు అనేకం ఈ నాటికీ పరిష్కారం కాకుండా వున్నాయి. సమసమాజం ఏర్పడేవరకు, ఆ తర్వాత కొంతకాలం సైతం అవి కొనసాగుతూనే వుంటాయి. కనుకనే ఆయన విశ్లేషణ ఇప్పటికీ పరిశీల నార్హమైనది. అయితే ఈ తరగతి స్త్రీల జీవితం ఎన్నో మార్పులకు కూడా లోనయింది. ఉదాహరణకు 'పంచకళ్యాణి'లో "డిగ్రీలు గల పిల్ల శీలంలేని దానితో సమానం" అని సుశీల అంటుంది. ఆ నాటికి అట్టి భావన సమాజంలో ఉండటం నిజమే. కాని ఇవేళ మధ్యతరగతిలో చదువు, ఉద్యోగం అనేవి జీవితావసరాలుగా మారాయి.

కొందరు రచయితలవలె కొ.కు. కేవలం తన భావాలకు పాత్రల రూపాన్ని ఇవ్వలేదు. జీవిత వాస్తవికత నుంచే పాత్రల్ని చిత్రించారు. ఆయనే అన్నట్లు అన్ని

రకాల చైతన్యానికి జీవితమే పునాది. సాహిత్యానికి కూడా జీవితమే పునాదికావాలని ఆయన భావించారు. జీవితం వ్యవస్థలోని మార్పులకు అనుగుణంగా కాలక్రమాన మారుతుందని, అదేవిధంగా సాహిత్య విలువలు మారుతాయని ఆయన చెప్పారు. ఈ మార్పులు జరిగే క్రమంలో సాహిత్యం నిర్వహించగలిగిన, నిర్వహించవలసిన positive పాత్ర ఒకటున్నది. అట్టి మార్పులు జరుగుతుంటే కేవలం వాటికి అద్దం పట్టడం కాక, అభ్యుదయ దృక్పథంతో సాహిత్యం అందుకు దోహదం చేయాలి అని ఆయన గట్టిగా నమ్మారు. మధ్యతరగతి స్త్రీలకు సంబంధించి తన కథలు, నవలల ద్వారా కుటుంబరావు చేసిన కృషి అట్టిదే.

వ్యక్తిత్వ రూపకల్పనకు దోహదం చేసే

# ఆబాలగోపాల సాహిత్యం

దాసరి సుబ్రహ్మణ్యం

పిల్లల పత్రికగా ప్రసిద్ధిచెందిన 'చందమామ' పత్రికకు కొడవటిగంటి కుటుంబ రావు దాదాపు ముప్పై సంవత్సరాల కాలం సంపాదకుడుగా వున్నారు. అయితే, ఆ పత్రికకు అప్పటికే వున్న కొన్ని నియమ నిబంధనలు, సంప్రదాయాల కారణంగా ఆయన పేరు పత్రికలో ఎక్కడా కనిపించే అవకాశం లేకుండా పోయింది.

జానపద కథ పూర్తిగా బాలసాహిత్య విభాగానికే చెందుతుందా అన్న ప్రశ్న ఒకటుంది. దీనికి అవునని తేల్చి చెప్పడం పొసగే సంగతి కాదు. ఆ యా కాలాల్లోని జానపదులు (సమాజంలోని అట్టడుగు జనం) తమ కష్టసుఖాలకు—ముఖ్యంగా కష్టాలకు, కారణాలు అన్వేషించినప్పుడు వాళ్ళకు దుర్మార్గులైన రాజులో, మోసకారి వర్తకులో, లేక తమమధ్యనే వున్న వర్గ విద్రోహులో కనిపించేవారు. ఈ వాస్తవానికి, తమ హేతుబద్ధం కాని ఆలోచనలతో, ఊహలతో కథ లల్లేవారు. వాటిలో సర్వసాధారణంగా ప్రజాపీడకుడైనవాడు— వాడు రెండు తలల, నాలుగు చేతుల మహారాక్షసుడైనా సరే—తప్పక శిక్షింపబడేవాడు. ఈనాటి వరకూ మనకు లభ్యమవుతున్న ప్రపంచంలోని ఏ దేశ జానపద సాహిత్యమైనా, ఈ ధోరణిలోనే నడిచింది. ఈ

తరహా కథాసాహిత్యాన్ని వయోభేదం లేకుండా అందరూ వినీ చదివీ ఆనందించ గలరు.

అనాదిగా వస్తున్న పరోక్ష రకం కథా సాహిత్యం Fairy tales అనేవి— దేవతా కథలు. వీటిలో చాలా వాటి తలా, తోకా కూడా గుర్తించడం కష్టం. అరణ్యం మధ్య కాకి ముక్కు పోటుకు నానాహింస పడిపోతున్న పాము, ఎవడో దారే పోయే వాడు ఆగి కాకిని హూత్ అంటూ తరిమేయగానే దేవతగా మారి, తన పాలిటి ఆప ద్రక్షకుణ్ణి మహాపెడసరంగా, నీకేం వరం కావాలో కోరుకోమంటుంది. ఈ తరహా కథల్ని 'చందమామ' ఏనాడూ అంతగా ప్రోత్సహించలేదు.

బాలల కథలుగా చలామణీ అవుతున్న ఒక రకం సాహిత్యం గురించి 'చంద మామ' సంచాలకులైన చక్రపాణి ఒక సందర్భంలో మాట్లాడుతూ, అవి 'చనుబాల కథలు' అన్నారు. దాదాపు ప్రారంభదశ నుంచీ అలాంటి కథాసాహిత్యానికి 'చంద మామ' దూరంగానే వుంది. ఎలాంటి కథలు విజ్ఞానకారకాలు కాకపోయినా మంచి వినోదాన్ని కలిగించగలవో సంచాలకుడైన చక్రపాణికి, సంపాదకుడైన కుటుంబరావుకి బాగా తెలుసు. ఈ విషయంలో యిద్దరిదీ ఒకే అభిప్రాయం.

బాల సాహిత్య రంగంలో చిరకాలానుభవం గల కుటుంబరావు, ఈ సాహిత్యం ప్రయోజనం ఏమిటి, అది ఏ విధంగా ఉండాలి అన్న విషయాలను సిద్ధాంతీకరిస్తూ రెండు వ్యాసాలుకూడా రాశారు. "బాలల సాహిత్యం పిల్లల మెదడులో కొన్ని మౌలికమయిన భావాలను బలంగా నాటాలి. ధైర్య సాహసాలూ, నిజాయితీ, స్నేహపాత్రత, త్యాగబుద్ధీ, కార్యదీక్షా, న్యాయమూ మొదలైనవి జయించటం ద్వారా సంతృప్తిని కలిగించే కథలూ ఎంత అవాస్తవికంగా వున్నా పిల్లల మనసులకు చాలా మేలు చేస్తాయి. దురాశా, ఓర్చలేని తనమూ, అధికార గర్వమూ, క్రూరత్వమూ, కృతఘ్నతా, అధర్మమూ, స్వార్థమూ మొదలైనవి శిక్షించబడటం కూడా పిల్లలకు తృప్తి నివ్వాలి," అంటా రాయన.

అట్లాగే, మనోదౌర్బల్యం కలిగించే కథలు పిల్లలకు పనికిరావనీ, లక్ష్యసాధనలో ప్రమాదాలను లక్ష్యపెట్టక పనిచేసే వారి కథలు అవసరమనీ, ఆ విధంగా పిల్లలలో డబ్బు సుఖాలమీద కన్నా 'కారెక్టర్' మీద దృష్టి ఏర్పడుతుందనీ కుటుంబరావు అభిప్రాయం. వ్యక్తులలోని సద్గుణాలు ఒకోసారి దౌర్బల్యంగా పరిణమించటం గురించి పిల్లలను హెచ్చరించాలంటూ, పులిని కాపాడబోయిన బ్రాహ్మడి కథను ఈ సందర్భంగా

ఆయన ఉదహరిస్తారు. ఇటువంటి ప్రమాదాలనుండి తప్పించుకోవడం గురించి చెప్పే యుక్తి కథలకు కూడా బాలసాహిత్యంలో స్థానం వుందన్నా రాయన.

బాలల సాహిత్యం దేవుడి మీద భక్తిని, మత విశ్వాసాలను ప్రచారం చేయ రాదని కుటుంబరావు హెచ్చరిస్తారు. కథలలో అట్టి పాత్రలు ఉన్నప్పటికీ, దేవుణ్ణి నమ్ముకుంటే కష్టాలన్నీ పోతాయన్న భావన పిల్లలకు కలిగించరాదనీ, కథలో నెగ్గవల సింది మనుష్య ప్రయత్నమూ, సద్బుద్ధీ అనీ ఆయన వివరిస్తారు.

బాలసాహిత్యంలో వాస్తవికత అంటూ మొండిపట్టు పట్టడంలో అర్థంలేదని కుటుంబరావు అభిప్రాయం. చేపలు, కాకులు మాట్లాడటం అవాస్తవికతేననీ, అయితే కథలలోని సన్నివేశాలను పిల్లలు తమపరంగా అన్వయించుకోనక్కరలేదనీ, వాటికి ఎడంగా వుండే ఆనందం పొందాలని ఆయన భావించారు. "రాక్షసులను మనుషులు జయించటమూ, ధనికులను వాళ్ళ సేవకులు భంగపరచటమూ, అతిసామాన్యమైన వ్యక్తులలో అసాధారణ శక్తులుండటమూ లేదా వారికవి లభ్యం కావడమూ, ఇలాటి ఇతివృత్తాలుగల జానపద కథలు ప్రపంచమంతటా వున్నాయి. వాస్తవ సాంప్రదాయాలకు ఎదురువెళ్ళే ఈ కథలు చదవటంవల్ల కూడా పిల్లలకు కొంత లాభం వున్నది. ముఖ్యంగా చిన్న పిల్లలకు దొంగల భయమూ, దయ్యాల భయమూ లాంటివి తేలికగా అబ్బుతాయి. ఆ భయాలను తగ్గించే దొంగల కథలూ, దయ్యాల కథలూ పిల్లలు చదవడం మంచిది" అని ఒక వ్యాసంలో అంటా రాయన.

నీతికథలను ఆధునికం చేసే ధోరణి ఒకటి ఇటీవల కనిపిస్తున్నది. ఇది పొరపాటని కుటుంబరావు నిరసించారు. 'కాకి-మాంసంముక్క' కథలో ఆధునిక కాకి మాంసంముక్కను కాలికింద పెట్టుకుని పాటపాడి నక్కను ఫూల్ చేస్తుంది. ఇది జర్నలిజమే తప్ప నీతికథ కాదని ఆయన స్పష్టం చేశారు.

అయితే తన అభిప్రాయాలు కనీసం ఇప్పటివరకు సముచితమైనవేనని భావిస్తున్నాననీ, వాటికి తర్వాత కాలదోషం పట్టవచ్చుననీ ఆయన నిరభిమానంగా చెప్పుకొన్నారు.

బాలసాహిత్యం గురించి అట్టి అవగాహన పెంపొందించుకున్న కుటుంబరావు, 'చందమామ' సంపాదకులుగా, పుష్టి చేవాగల కథా సంవిధానంతో, ఇతర భాషలలోని బాలసాహిత్యాన్ని తెలుగులోకి తిరగరాయటం (అనువాదం కాదు, adaptation), పత్రికకు వచ్చిన రచనలను సరిదిద్ది మెరుగుపరచటం చేశారు. ఆయన రష్యన్,

జర్మన్ రచయితల కథలనే కాక, డ్యూమా, వోల్టేర్‌లాంటి వాళ్ళ రచనల నుంచి కూడా 'చందమామ'కు మామూలు కథలూ, కల్పిత బేతాళ కథలూ రాశారు.

ఈనాడు తెలుగులో బాలలకని ఉద్దేశింపబడిన మంచి కథా సాహిత్యం చాలా వస్తున్నది. దీనికి ఒరవడి దిద్దిన వ్యక్తి (ఇందులో చక్రపాణి ప్రతిభావంతుడైన సిద్ధాంతకర్త మాత్రమే) కుటుంబరావు అనేది నిర్వివాదం. అయితే, 'చందమామ' స్థాపనకు ముందే, తెలుగులో బాలసాహిత్యం కొంత వున్నది. ఇతరంగా ప్రసిద్ధులైన రచయితలు కొందరు కథలు, గేయాలు రాశారు. నే చెప్పేది ఆ సాహిత్యాన్ని గురించి కాదు, కుటుంబరావు అందుకు భిన్నమైన బాల కథాసాహిత్యాన్ని సృష్టించారని మాత్రమే. ఇప్పుడు బాలలకోసమని రచనలు చేస్తున్న వారందరూ, ఆ ఒరవడిలోనే- వినోదాత్మకమే కాక, మంచి విజ్ఞానదాయకమైన కథలు కూడా రాస్తున్నారు.

సాహిత్య లక్ష్యానుసారం వస్తువును మలిచిన

# రచనా శిల్పం

బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు

కొడవటిగంటి కుటుంబరావు కొన్ని వందల కథలు, చాలా నవలలు, నవలికలు రాసారు. కాని వారు కథానికలలో ప్రయోగించిన శిల్పాన్ని గురించే మనం చర్చిద్దాము. ఎందుకంటే ఆయన రాసిన నవలలు ('చదువు' మినహా) ఒక విధంగా పెద్ద కథలేగాని, నవలల కోవకు రావేమోనని నా అభిప్రాయం. ఆయన రాసిన నవలి కల్లో (లేదా పెద్ద కథలలో) ఏదో ఒక ప్రధాన పాత్రద్వారానే కథ చెప్పటం జరిగింది. మరికొన్ని పాత్రలు ఉన్నప్పటికీ ఆ పాత్రల దృక్పథం నుండి కథ నడవదు. అవి కథాగమనానికి కొంత సాయపడతాయంతే. వారి నవలికల్లో ప్రధాన పాత్ర మినహా తక్కిన అన్ని పాత్రలు పూర్తి పరిణితి చెందవు. 'కులం లేని మనిషి' లో కథంతా శాంత దృక్పథంలోంచే చెపుతారు రచయిత. 'బ్రతుకు భయం' నవలంతా సీతప్ప దృష్టిలోంచే నడుస్తుంది. అందుకని కొ.కు. కథానికా శిల్పాన్నే తీసుకుందాం.

శిల్పం విషయంలో కుటుంబరావుకు కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయాలు ఉన్నాయి. ఒకానొక సందర్భంలో (1953 లో) శిల్పాన్ని గురించి ఆయ నిలా అన్నారు: "ఒకప్పుడు, 'నా శిల్పం ఎంత బావుంటుందో చూడండి' అన్నట్టుగా కథ రాసేవాణ్ణి.

ఇప్పుడు కేవలం శిల్ప ప్రదర్శన కోసమే కథ రాయడం వట్టి దండుగగా కనిపిస్తోంది. కథకి శిల్పం ఆయువుపట్టు అని మాత్రం ఆనాడే కాదు ఈనాడుకూడా ఒప్పుకుంటాను. కథలో శిల్పం లేకపోయాక ఇంకెన్నున్నా దండుగే....ఎంత వాస్తవికమైన పాత్రలూ, సంఘటనలూ తీసుకున్నా శిల్పలోపం చేత అవి అవాస్తవికంగా కనపడే అవకాశం లేకపోలేదు....శిల్పానికీ, రచనయొక్క ప్రయోజనానికీ అవినాభావం ఉన్నదని గ్రహించినట్టయితే శిల్పంలో దోషాలన్నిటికీ మూలం కథ ప్రయోజనంలో దొరికిపోతుంది. కనీసం శిల్పం బాగుండి ప్రయోజనం పల్చబడవచ్చుగాని, శిల్పం పల్చబడి ప్రయోజనం విస్పష్టం కావడం సాధ్యంకాదు.”

ఉత్తమ కథానికకు ఉండవలసిన లక్షణాలలో కొ.కు. అన్నట్లు శిల్పం చాల ముఖ్యం. అది లేకపోతే ఎన్నున్నా ప్రయోజనం లేదు. ఎందుకంటే, కథానికా లక్షణాలలో—వాస్తవికత, జీవిత సత్యాన్ని తెలియజెయ్యడం, ఇవి రెండు మూడు స్థానాలకే వస్తాయి. శిల్పం కొరవడితే కథలోని వాస్తవిక సంఘటనలు, పాత్రలు అవాస్తవికంగా కనిపిస్తాయి. జీవిత సత్యం అసత్యంగా కనిపిస్తుంది.

కుటుంబరావు పాఠకుడికి జీవిత సత్యాన్ని చెప్పి ఆలోచనలు రేకెత్తించడం తన రచనల లక్ష్యంగా పెట్టుకున్నారు. ఆయన రచనలలో తన విజ్ఞానానిదే పైచేయిగా కనిపిస్తుంది. పాఠకులలో జిజ్ఞాసను రేకెత్తించడం ఆయన లక్ష్యం. ఉద్రేకాలు, హృదయ స్పందనాలు కలిగించడం మొదలైన వాటిమీద ఆయనకు గురిలేదు. “ఇది బుద్ధి జీవుల యుగం. ఈనాటి జీవితం ముందుకు సాగటానికి హృదయ స్పందనలు చాలా కొద్దిగా మాత్రమే సహకరిస్తాయి .... జీవితాన్ని విశ్లేషణ చేసుకునే శక్తి జన సామాన్యానికి అవసరం,” అన్నారాయన ఒకచోట. ఈ దృక్పథం ఆయన రచనా శిల్పాన్ని పూర్తిగా ప్రభావితం చేసింది.

కుటుంబరావు తన కథల్లో పాత్రల ప్రవర్తనను, సంఘటనలను తర్కించి వాటికి గల కార్యకారణ సంబంధాన్ని విశదీకరిస్తారు. పాత్రలలోని ఉద్రేకాలను వర్ణించరు. ఆ ఉద్రేకాలకు వెనుకనున్న కారణాలను స్పష్టం చేస్తారు. ఇందుకు తగినట్లుగా ఆయన రచనల్లో విషయ స్పష్టీకరణ, క్లుప్తత, భాషాసౌలభ్యం, సూటిదనం మనకు కనిపిస్తాయి. డొంక తిరుగుళ్ళు, తికమకలు, విపులమైన వర్ణనలు కనిపించవు. ఎంతటి విషయాన్నయినా సూటిగా, స్పష్టంగా చెప్పేస్తారు. పాత్ర స్వభావాన్ని రెండు మూడు వాక్యాల్లో రేఖాచిత్రం గీసినట్లు మన కళ్ళముందుంచుతారు.

'ఇల్లరికం' కథలో ఏకైక పుత్రుడు శంకర్రావును అతని తల్లితండ్రులు వెయ్యి కళ్ళతో కనిపెట్టి రక్షిస్తూ, ఆ పిల్లవాడికీ అనుభవానికీ మధ్య పెట్టని గోడల్లా నిలబడి అతన్ని ఎందుకూ పనికిరాని వాజమ్మగా తయారు చేస్తారు. శంకర్రావు ఎలా పనికిరాని వాజమ్మగా తయారయాడో కథలో చెప్తారు రచయిత. తల్లితండ్రుల ప్రేమను శంకర్రావు "తుచ్ఛమైన ప్రేమ" అని తెలుసుకుంటాడు క్రమంగా. "ఒకప్పుడు నేను ఎవరన్నా పలకరిస్తే చాలు ముడుచుకుపోయేవాణ్ని....అతను ఎటువంటి వాడితోనైనా నిముషంలో స్నేహం చేసుకునేవాడు." ఇలా పాత్రల స్వభావాలకు రేఖలు గీసి వాటి మీద కథ సాగిస్తారు. పాత్రల స్వభావంలో సామాజిక పరిస్థితులవల్ల వచ్చే మార్పును కూడా ఒక వాక్యంలో ముందు సూచించి దానిని కథాక్రమంలో విస్తరింపజేస్తారు ఆయన. "కోటేశ్వర్రావు దరిద్రమనుభవించినంత కాలమూ చలించలేదు....అతని ఉన్నతమైన ఆశయాలు చాలవరకు అతన్ని దారిద్ర్యంలో ఉంచడానికి తోడ్పడ్డ విషయం నిజమే కాని అతను దాన్ని గురించి చింతించలేదు. ముఖ్యంగా దారిద్ర్యం అతన్ని బాధించలేక పోవడానికి కూడా కారణం అదే." అలాంటి కోటేశ్వర్రావుకు ఉద్యోగమై మొదటి నెల జీతం వచ్చింది. జేబులోని కొత్త నోట్లు అతని మనసును మాటిమాటికీ ఆకర్షిస్తున్నాయి. ఇది "తనకు కలగవలసిన అనుభవం కాదు. తనకి నిజంగా డబ్బు మీద మమకారం లేదు....తాగుడంటే అసహ్య పడేవాడు మట్టుకు తాగితే నిషా ఎక్కదా?" నిజంగానే డబ్బుమీద మమకారం పెరిగింది. "డబ్బు వెధవదే కావచ్చు గాక ప్రపంచం మనని మన డబ్బునుబట్టే లక్ష్యపెడుతుంది" అనే నిర్ణయానికి వచ్చి రెండుచేతులా ఆర్జిస్తాడు — అక్రమమార్గంలో ('పిరికి గుండె' కథ).

కుటుంబరావు రాసిన 'బ్రతుకు భయం' నవలలో (నిజానికి ఇది పెద్ద కథ అనవచ్చును) చక్కటి శిల్పం కనిపిస్తుంది. అది రచయితకు శిల్పం మీదగల అధికారానికి మచ్చుతునక. అందులో పాత్రలు ఎలాంటి వ్యాఖ్యానాలు చేయవు. కథ అంతా అతి తీవ్రగతిని పరుగిడుతుంది. ఉత్సుకత కలిగించే సన్నివేశాలతో పాఠకులను ఆకట్టుకుంటుంది. కథ అంతటా సీతప్ప పాత్ర విస్తరించి ఉంటుంది. సీతప్ప తన చుట్టూ ఉన్న సంఘాన్ని, అది నిర్దేశించిన ధర్మాలను, సృష్టించిన భయాలను చూసి జడుసుకుని పతనమైపోతాడు. గోర్కీ రాసిన 'ఫోమా గోర్డియేవ్' కూడా భయస్థుడే కాని ఫోమా తన సమాజంలోని కల్మషాన్ని ప్రతిఘటించాలని ప్రయత్నించి, విఫలుడై, విషవలయంలో చిక్కి పతితుడై పోతాడు. కాని సీతప్పకు వ్యవస్థలో మార్పు కనిపించే సూచన లంటేనే భయం. దుష్టశక్తుల మీద తిరుగుబాటు చేయకపోవ

డమే మంచితన మనుకుంటాడు. అందుకే అతని అన్నగారు సీతప్పని చీవాట్లు పెడుతూ, "మంచితనానికైనా కోరలూ, గోళ్ళూ ఉండాలిరా. పొట్లకాయ మంచితనమూ, సొరకాయ మంచితనమూ కత్తిపీటలను పెద్దవి చేస్తాయిరా" అంటాడు. నిజానికి అంతేకదా. పీడితుని మంచితనం, అజ్ఞానం, అమాయకత్వమే పీడకుల దౌష్ట్యానికి ఆలంబన.

ఎంతటి క్లిష్ట విషయాన్ని అయినా అతి సునాయాసంగా తన రచనా శిల్పంలో యిమిడ్చే ప్రతిభ కుటుంబరావులో వుంది. ఆయన రచన పాఠకుడిని చివరంటా చదివించి ఆలోచింపజేస్తుంది. భార్యాభర్తల మధ్య సంబంధానికి అనురాగమే ప్రాతిపదికగా ఉండాలి. కాని ధనిక స్వామ్య సమాజంలో అనేక సందర్భాలలో ఆర్థికాంశం ఈ ప్రాతిపదికకు తూట్లు పొడుస్తుంది. మనస్తత్వాలమీద బాగా పని చేస్తుంది. 'ఇంతలో వుంది' కథానికలో భార్యాభర్తలు అన్యోన్యంగా ఉంటారు. భర్తకు ఉద్యోగంలేక భార్య ఆస్తిమీద బతుకుతున్నప్పటికీ అన్యోన్యంగానే ఉంటారు. కాని భర్త భార్యమీద బతుకుతున్నందుకు అంతరాంతరాల్లో బాధపడుతుంటాడు. చివరికి ఉద్యోగం సంపాదిస్తాడు. "అదివరకల్లా నాకు సరిగ్గా ఊపిరి సలపడం లేదని నేను యీ క్షణాన్నే గుర్తించాను" అనుకుంటాడు. కాని భర్త ఉద్యోగం చేయడం భార్యకు ఇష్టం లేదు. తనకు విధేయుడుగా ఉండకుండా పోతాడని ఆవిడ భయం. కాని, మరొకవేపు, "సీత నామీద చూపిన ప్రేమ యావత్తూ కుట్రగానూ, నేను సీతమీద చూపిన ప్రేమ గుడ్డితనంగానూ కనబడసాగింది" భర్తకు. అలా కథ నడిపించుకు వెళ్తారు పట్టుసడలకుండా.

అయితే 1950 తర్వాత కథానికా శిల్పం పట్ల కుటుంబరావు శ్రద్ధ తీసుకున్నట్టు కనబడదు. ఉత్సాహం తగ్గినట్టు తోస్తుంది. చెప్పదలచుకున్న విషయాలు ఎక్కువయిపోయి, చెప్పాలనే ఆతృత పెరిగి, శిల్పాన్ని లెక్కచేయడం మానేసినట్టు అనిపిస్తుంది. పాత్రల ముఖతా ఒక్కొక్కసారి రచయితే జోక్యం చేసుకుని వ్యాఖ్యానాలు చేయడం ఎక్కువయింది. ఆయన బుద్ధి, విజ్ఞానం ఎంతో విస్తరించి, లోకానుభవం పెరుగుతున్న దశలో ఎక్కువగా వ్యాసాలు రాయడం కొనసాగించారు. కథలు మానివేయడానికి ఆయన వ్యక్తిత్వమూ, సాహిత్యం విషయంలో తనకుగల విశ్వాసాలూ కారణం కావచ్చుననిపిస్తుంది. సాహిత్యంలో ప్రధానంగా ఉండవలసిన హృదయ ధర్మం పట్ల ఆయనకు అంతగా నమ్మకం లేకపోవడం, బుద్ధి వ్యాపారం, శాస్త్ర పరిజ్ఞానాలది ఆయన రచనలో పై చేయి కావడం, పాఠకులలో ఆలోచన రేపే గుణం సాహిత్యానికి ముఖ్య

మని భావించడం ఈ కారణాల్లో చేరతాయి. సాహిత్యం జీవితంనుంచే రావాలిగాని సిద్ధాంతాల నుండి, నమ్మకాల నుండి కాదని ఆయన అభిప్రాయం. "నేను యీనాటి జీవితానికి దూరమయాను. మనుషుల్ని పరిశీలించినప్పుడే కథ రాయగలమని నా నమ్మకం. నా కా అవకాశం ఎప్పుడైతే లేకుండా పోయిందో అప్పటినుంచీ రాయడం మానేశాను" అన్నారాయన ఒకసారి.

నిజాయితీ, నిష్కాపట్యం కుటుంబరావు వ్యక్తిత్వాన్ని మలిచినట్టుగానే, ఆయన రచనలను కూడా తీర్చిదిద్దాయి. "నేను మధ్యతరగతి సంస్కారంగలవాణ్ణి....నా రచనలు ప్రజాసామాన్యాన్నీ, శ్రామికులనూ ఉత్తేజపరచలేవు. కాని మధ్యతరగతి వారిలో ప్రజాజీవితానికి అనుకూలించే పరివర్తన తెచ్చే అవకాశం వుంది. ఈ పని ఎంత విజయవంతంగా చెయ్యగలిగితే నేనంత ఉత్తమ కథకుడ్ని అనిపించుకుంటాను" అని రాసుకున్నారాయన. ఈ పని ఆయన విజయవంతంగా చేసి అగ్రశ్రేణి కథకుడు అనిపించుకున్నారు.

చర్చోపచర్చలకు నాంది పలికిన

# సినిమా రచన

బి. బి. జి. తిలక్

"కళలవల్ల సమాజంలో కలిగే చైతన్యం ఎంత ముఖ్యమైనదో జీవిత గతి ప్రభావంచేత కళలలో కలగవలసిన చైతన్యం కూడా అంత ముఖ్యమైనదే."

—(కొ.కు.)

సమాజంలోని వివిధ విషయాలకు మార్క్సిస్టు సామాజిక శాస్త్రాన్ని అన్వయించడంలో కుటుంబరావుకు ఎవరూ సాటిరారు. ఆయన తన అభిప్రాయం వివరించని సామాజిక విషయం లేదు. గతితార్కిక భౌతికవాదం అన్వయ శాస్త్రమని ఆచరణలో చూపిన తత్త్వవేత్త కుటుంబరావు. ఆయన ఆచరణ సాహిత్యాచరణ. కథ, నవల, వ్యాసం, విమర్శ — ఇవి ఈయన ప్రధాన సాహిత్యరంగాలు. ఈ ప్రక్రియల ద్వారానే ఆయన మధ్య తరగతి జీవితాన్ని మార్క్సిజంతో, సైన్సుతో ప్రభావితం చేసారు. జీవిత యథార్థాలకీ, జీవిత సత్యాలకీ జరిగే అన్యోన్య సంపర్కాన్నీ, సమాజాన్ని వాని పెరుగుదలలో, మారుతున్న దశల్లో పరిశీలించడాన్నీ కుటుంబరావు తన రచనాంశాలుగా స్వీకరించారు. ఆయనకు సినిమామీద వున్న అభిప్రాయాల్నికూడా ఈ భూమికలోనే పరిశీలించాలి.

సినిమా ఏకపక్ష కళ కాదు. వివిధ కళల సమిష్టిరంగం. సాహిత్యం, నటన, సంగీతం, ఫొటోగ్రఫీ, దర్శకత్వం, ఎడిటింగ్, చిత్రలేఖనం, రంగస్థలాలంకరణ ఇందులో ముఖ్యమైనవి. ఇవన్నీ ఒక ఎత్తు, విమర్శ ఒక్కటీ ఒక ఎత్తు. విమర్శ అన్ని కళల్లో, ఆ కళలకు సంబంధించిన జీవితంలో గుణాత్మకమైన మార్పు తీసుకొస్తుంది. విమర్శ మిగిలిన సాహిత్య ప్రక్రియల్లానే జీవితంతో ముడిపడి వుంటుంది. ఆ సంబంధం ఏకదిశా సంబంధం కాదు, పరస్పర ప్రభావ సంబంధం. "సినిమా కళను గురించి శాస్త్రీయంగా తెలుసుకున్నవారు కళాత్మకమైన చిత్రాలను, సామాజిక స్పృహ, ప్రయోజనం గల చిత్రాలను నిర్మించసాగారు. కానీ వాటిని చూసి ఆనందించ గల కళాహృదయం ప్రేక్షక సామాన్యానికి ఇంకా అలవడలేదు. అది జరిగి, ప్రేక్షకుల అభిరుచులలో మంచి పరివర్తన రావాలంటే సినిమా రంగంలో చాలావరకు మృగ్యంగా ఉన్న విమర్శ విస్తారంగా సాగాలి" అంటారు కొ.కు. తెలుగు సినిమా రంగంలో విమర్శ అనేది దాదాపు లేనేలేదు. "సమీక్షలు" మాత్రం కొల్లలు. ఇవి వొట్టి ప్రచారానికి సంబంధించినవి. "పుస్తక సమీక్షలు సాహిత్య సముద్రంలో కాకిరెట్టలు - రకరకాల సామాజిక దృక్పథం గల రచనలను ఒకే జాతివని భ్రమ కలిగేలా గుండవచ్చు" (కొ.కు.) సినిమా సమీక్షల సంగతీ అదే. సమీక్షకుడు ప్రతి సినిమానూ పొగుడుతూ, కథను సంక్షిప్తంగా వివరించి, చివర్లో ఏవో చిల్లర విషయాలకు బాధ పడతాడు. ఆ సినిమా చూసే ప్రేక్షకులతో, కథా సారాంశాలతో సంబంధం లేకుండా, ఏయే విలువలు ఏయే వర్గాలకు సేవ చేస్తాయో తెలియకుండా వుంటాయి ఆ సమీక్షలు. కనుక ఈ సమీక్షల స్థానంలోనే శాస్త్రీయ విమర్శ చోటు చేసుకోవాలి.

అంతేకాదు. "విమర్శ కూడా విమర్శకు గురికావాలి. సాహిత్య సాంస్కృతిక విమర్శ కావలికుక్కలాగా పని చెయ్యందే సాహిత్యానికి వర్తమానం కానీ భవిష్యత్తుగానీ లేదు" (కొ.కు.). విమర్శ కూడా విమర్శకు గురికావడమన్నది విమర్శ ఎదుగుదలకూ, జీవితాన్ని మార్చే శక్తికీ సంపూర్ణ చిత్రం. సినిమాలు మిగిలిన కళల్లానే ప్రజాసంబంధ విధులను నిర్వర్తిస్తాయి. అభిరుచుల్ని ఏర్పరిచి, కళాభిలాష ద్వారా మనుషుల్ని ఏకం చేస్తాయి. జీవితంలోని సంఘర్షణల ఫలితం యిది.

"కళల ద్వారా కలిగే స్పందన సామూహికమైనది. దానివల్ల సద్యోఫలితం లేకపోయినా, భావి సామూహిక చైతన్యానికి పునాది వేస్తుంది" (కొ.కు.). కళాభిరుచి పెరగడానికి, కళలపట్ల కళావిమర్శపట్ల ఆదరణ పెరిగేట్లు చేయడానికి విమర్శదే

బాధ్యత. సినిమా విమర్శ కూడా సినిమాలానే 'భావి సామూహిక చైతన్యానికి' పునాది వేస్తుంది.

'సినిమాకళ-విమర్శ' అన్న వ్యాసంలో, సత్యజిత్‌రాయ్ తీసిన 'పథేర్ పాంచాలి' మీద తన అభిప్రాయాన్ని వివరిస్తూ 'మా భూమి' నాటకం ప్రస్తావన తెచ్చారు కొ.కు. "స్టంటులూ, డ్యూయట్లూ, రేప్ సీనులూ వగైరాలుంటేగానీ సినిమా చూడనివాణ్ణి 'పథేర్ పాంచాలి' చూసి ఆనందించేలా చేయగల విమర్శ అత్యుత్తమమైంది" అని విమర్శను నిర్వచించారు. "ఆ నాటకం (మా భూమి) పుట్టేనాటికి జమీందార్లపట్లా, భూస్వాములపట్లా, ఎవరికీ ప్రేమాభిమానాలు లేవు. అందుచేత 'మా భూమి'లో ప్రత్యక్షంగా కనిపించే సామాజిక సత్యాన్ని కమ్యూనిస్టు వ్యతిరేకులు కూడా కాదనే అవకాశం లేకపోయింది. ఆ విధంగా ఒక రాజకీయ దృక్పథానికి అంకితమయిందనిపించుకున్న కళాఖండం రాజకీయాలకు అతీతంగా ప్రజల అభిరుచులను పెంపొందించింది" అంటూ 'మా భూమి' గురించి, విమర్శ పాత్ర గురించి చెప్పారు ఆయన. ఇక్కడ నా అభిప్రాయం: 'పథేర్ పాంచాలి'లో దరిద్రాన్ని వాస్తవంగా 'కళా'త్మకంగా ప్రదర్శించాడు సత్యజిత్‌రాయ్. మధ్యతరగతి మేధావులనుంచీ, బూర్జువా మేధావుల నుంచీ, 'కళాభిలాష' (అదొక్కటి చాలు) వుండే ప్రతి వొక్కరి నించీ 'సానుభూతి' నాశించే సినిమా అది. వారి సానుభూతి దరిద్రంలో అలమటించే పేదల మీద కాదు. వొక్క ఆ సినిమా మీదే. దానికి ప్రత్యక్ష కారణం ఆ సినిమా ప్రత్యక్ష పోరాట సంస్కృతిలో భాగం కాకపోవడం. వొట్టి వాస్తవిక వాదంతో వుండటం. వాస్తవిక వాదం 'వర్గ యథార్థాన్ని' మాత్రమే స్వీకరిస్తుంది. ఆ పరిమితుల్లోనే 'విమర్శనాత్మక వాస్తవవాదం'లా అగుపిస్తుంది. వర్గ సంఘర్షణను చిత్రించని ఏ కళారూపమూ విధానంలో (treatment) విమర్శనాత్మక వాస్తవవాదం కాదు. 'స్థితుల్ని', అవి మారుతున్న తీరును చూసే శక్తి లేకనే వర్గసంఘర్షణను పథేర్ పాంచాలి చూపలేదు. ప్రేక్షకుడిని చిత్ర'హింస'కు గురిచేసి గణాంకిక సంవేదనల (methemtaical sensations) చేతబడి చేస్తుంది ఆ చిత్రం. ప్రేక్షకుడు కళ్ళల్లో మాత్రమే పేదల బాధలకు స్పందించగలిగే బలహీనతకు గురి అవుతాడు.

ఇట్టి విమర్శలను ప్రస్తావిస్తూ, "సత్యజిత్‌రాయ్ చిత్రాలు మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథం నుంచి సరిగా లేవని విమర్శించారు. ప్రజా జీవితాన్ని చైతన్యం చేస్తున్నది మార్క్సిస్టు-లెనినిస్టు రాజకీయాలలే అయితే ఈ విమర్శకు అర్థం వుంటుంది. అటువంటి పరిస్థితిలో మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథంగల కళల నుంచి ప్రజలు యెక్కువ

చైతన్యం పొందగలుగుతారు. కానీ అది లేనిపక్షంలో సత్యజిత్ రాయ్‌ని మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథానికి అనుగుణమైన చిత్రాలే తియ్యాలని విమర్శకులు నిర్బంధించటంలో వారి విమర్శ నిరుపయోగమైపోతున్నది'', అని అభిప్రాయపడుతున్నారు కొ.కు. మార్క్సిస్టు-లెనినిస్టులకు రాజకీయ దృక్పథం, సాహిత్య దృక్పథం లేక కళాదృక్పథం వేరుగా వుంటాయా? విమర్శ 'ఆ సినిమా' మీదే అయినా జీవిత వాస్తవికతకు చెందిన సామాజిక దృక్పథం నుంచి విమర్శ సాగాలి. మార్క్సిస్టు-లెనినిస్టులు తమ దృక్పథం నుంచే విమర్శ సాగిస్తారు. వారి దృక్పథానికి లక్ష్యం సాహిత్యాచరణ ద్వారా ప్రజా జీవితాన్ని చైతన్యవంతం చెయ్యడమే. రాజకీయ దృక్పథానికీ, సాహిత్య దృక్పథానికీ రూపంలో మాత్రమే వైవిధ్యం వుండాలి. సారాంశంలో కాదు. ఆ విమర్శ సత్యజిత్ రాయ్ చిత్రం మీదనయితే అక్షరాస్యులకు, అందులోనూ పరిమితమైన కళాభిలాషులకు యీ విమర్శ పరిమితం. ఈ ప్రచారం పరిమితం. కానీ నిరుపయోగం మాత్రం కాదు. మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథం రాజకీయంగా లేకపోయినప్పటికీ, జీవిత వాస్తవికతను బట్టి జీవిత దృక్పథంగా లేకపోయినప్పటికీ, 'పథేర్ పాంచాలి' లాంటి సినిమాలు ఎప్పటికీ చూడలేని, చూసినా అర్థం చేసుకోలేని అశేష ప్రజానీకం ముఖ్యం. సినిమాలు చూడగలిగి, వాటిపై విమర్శలు చదివేవాళ్ళు, జీవిత దృక్పథంగా మార్క్సిజం - లెనినిజం లేనివాళ్ళు ముఖ్యంకాదు.

కుటుంబరావు మరోచోట ఇట్లా అన్నారు. "మతం వారిని మాత్రమే మెప్పించే మతప్రచారం, కమ్యూనిస్టు భావాలను ఆమోదించిన వారిని మాత్రమే ఆనందపరిచే కమ్యూనిస్టు ప్రచారం, మార్క్సిస్టు దృక్పథంగల వారికి మాత్రమే అర్థమయ్యే కళా విమర్శ! ఇత్యాదులు సహజంగానే జీవితంలో కలుగుతాయి. వాటిని ఆపటం ఎవరి తరమూ కాదు. కానీ వాటివల్ల ఆయా భావాల పెంపూ, విస్తృతీ అంతగా వుండదు.'' విమర్శ ఎవరికోసరమో, దాని పాత్ర ఏమిటో ఇక్కడ తెలుస్తోంది. "విమర్శకుడు ఒక మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథంతో తయారుచేసిన చిత్రాన్ని అలాంటి దృక్పథం లేనివాడికి నచ్చేలా విమర్శించగలిగితే అది ఉత్తమ విమర్శే'' కొ.కు. మార్క్సిస్టు - లెనినిస్టులు మార్క్సిస్టు దృక్పథం లేనివాడికి నచ్చేలా విమర్శ ఎట్లా చెయ్యాలి? మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథంతో నిర్మించిన చిత్రాన్ని ఎట్లా విమర్శించాలి? రెంటినీ రెండు రకాలుగా విమర్శించాలా? ఇవి కుటుంబరావు అన్వేషణ నుంచి ఉదయించే ప్రశ్నలు. ప్రయత్నిస్తే జవాబులు, ఆయనే యింకో సందర్భంలో చెప్పిన మాటల్లో దొరకొచ్చు. "కళాస్వేచ్ఛ, వ్యక్తి స్వాతంత్ర్యం, కళాకారుడి ఉన్నత కళాభిరుచిలాటి

శుష్కపదాలు కళలనూ ఉద్ధరించవు, సమాజాన్నీ ఉద్ధరించవు. 'యాదృచ్ఛికంగా కూడా ఉత్తమకళలు జీవితానుభవం నుంచి రావచ్చు' అన్నది కుంటివాదం. జీవితానుభవం జీర్ణం కావడానికైనా సామాజిక తత్వం బోధపడాలి."

'సినిమా బాంబు' అనే వ్యాసంలో 'శంకరాభరణం' గురించి రాస్తూ, "ఈ నాడు దేశంలో వున్న సినిమా కళాభిరుచిలో ఉత్తమ ప్రమాణాలకు 'శంకరాభరణం' గీటురాయి అని ఒప్పుకోవాలి" అంటారు కొ.కు. "ఈ నాడు జీవితాన్ని ఆవరించి వున్న అతిశోచనీయమైన కుసంస్కారం నించి ఉదాత్తమైన విలువలు అందుకోవాలంటే ఇలాంటి ఉదాత్తమైన 'కళా' ఖండాలు అవసరమేమో" అని — "విశ్వనాథ్ తాను గౌరవించే అత్యున్నత సామాజిక విలువల్ని గురించి కలల్లాంటి చిత్రాలు మరి రెండు మూడు తీసి దేశంలో సినిమా పరిశ్రమను నిజంగా పెద్దమలుపు తిప్పి చరిత్ర సృష్టించవచ్చు"నని కూడా అంటారాయన. కుటుంబరావుకు 'శంకరాభరణం' చిత్రం మీదవున్న మమకారం పై మాటల్లో తెలుస్తుంది. మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథం లేకుండా నిర్మింపబడిన చిత్రాన్ని ఆ దృక్పథంవున్న వ్యక్తి విమర్శించినట్లుగా ఈ మాటల్ని స్వీకరించలేం. ఈ సినిమాను 'కళా'ఖండంగా విమర్శిస్తే సరిపోతుందా? ఆ సినిమాలోని కళావిలువలకీ, అదిచ్చే సందేశానికీ సంబంధం వుంది. ప్రేక్షకుడి మనసు మీద ఒకటి అధికారం సాధిస్తే రెండోదీ సాధించినట్లే. విమర్శకుడి విచక్షణ ప్రేక్షకుడికి ఉండదు. ఆ సినిమా సాధించిన ఆర్థిక విజయం, రేపిన వివాదాలు నిజం. కలకాదు. "ఈ చిత్రంవల్ల సామాజిక ప్రయోజనం లేదని మనస్ఫూర్తిగా నమ్మినవాళ్ళు సమాజానికి అపకారం చేస్తున్న అనేక 'విజయవంతమైన' చిత్రాలను ఈ చిత్రం ఎలా చావుదెబ్బ కొట్టిందో ఎరుగరు" అంటారాయన. 'విజయవంతం' అయిన వాటిని చావుదెబ్బ కొట్టడం ప్రమాణంగా తీసుకుంటే ఈ మధ్య నవలల్లో 'తులసిదళం' సాధించిన విజయం కూడా అటువంటిదే. 'తులసిదళం'తో యద్దనపూడి మార్కెట్ పడిపోయింది. ఇప్పుడు దాదాపు ప్రతి మాస, వార పత్రిక పైన 'తులసిదళం' ప్రభావమో, దానిలో యండమూరి రచనో వుంది. 'శంకరాభరణం' ప్రభావాలు తరవాత చిత్రాలమీద పడ్డాయి. ఇట్లా 'విజయవంతం' కావడాన్ని స్కేలుగా తీసుకోవడం రూపాన్ని వివరించటం మాత్రమే అవుతుంది. అది పూర్తిగా అనవసరమని కాదు. కాని రూప పరామర్శ సారాంశాన్ని విమర్శించడం కోసమే అయివుండాలి. కనుక ఇక్కడ కొ.కు. అభిప్రాయం సరైనది కాదు. మరొక వ్యాసంలో ఆయనే స్వయంగా చెప్పినట్లు, "ఒక విమర్శకుడు అభ్యుదయవాదులకు

ఫ్యూడల్ సంస్కృతితోనూ, పెట్టుబడిదారీ బూర్జువా సంస్కృతితోనూ గూడిన కళల మీద ఆదరణ కలిగేలా విమర్శ రాస్తే అది ఉత్తమ విమర్శ అవుతుందా? కాదని నా నమ్మకం. ఎందుచేత? ఇది సామాజిక పరిణామంతో ముడివడిన సమస్య. కళలూ, వాటికి సంబంధించిన అభిరుచి ముందుకు పోవాలిగానీ తిరోగమించరాదు.''

మనకు సినిమాల్లో అడపాదడపా 'అభ్యుదయవాదం' కన్పిస్తుంటుంది. ప్రతీ సినిమా 'మంచి' పాత్రలకీ, 'చెడ్డ' పాత్రలకీ సంఘర్షణ చూపుతుంది. ఆ చూపే విధానాల్లో తేడాలుండవచ్చు. కొంతమంది నిర్మాతలు 'అభ్యుదయాన్ని' గురించిన శాస్త్రీయ దృక్పథం లేక అస్పష్టమైన భావాలతో సినిమాలు తీస్తారు. ఇంకొంత మంది అభ్యుదయానికి మంచి గిరాకీ వుంది కాబట్టి తీస్తారు. ఈ రెండు రకాల చిత్రాలూ తప్పుడు చైతన్యాన్ని కలుగజేస్తాయి. సినిమా హీరో ఒక్కడే శత్రువుల్తో తలపడి శేషంలేకుండా చేస్తాడు. లేకపోతే ఏ పాత్రో 'అసాధారణమైన' మంచిని ప్రదర్శించడంతో చివర్న 'శుభం' జరుగుతుంది. ఇలా అనేక చిత్రాలు ప్రేక్షకులలో నిష్క్రియాత్మకమైన ప్రేరణలను కలిగిస్తాయి. 'సినిమాలలో వింత అభ్యుదయం వాదం' పేరిట కొ.కు. ఓ వ్యాసం రాసారు. 'ముందడుగు' అనే 'అభ్యుదయ' చిత్రం మీద విమర్శ అది. ఆ సినిమా యజమానులకు, కార్మికులకు మధ్య వర్గసామరస్యం బోధిస్తుంది. వర్గవిభేదాలు సృష్టించేవాళ్ళు ప్రతినాయక పాత్రలు అందులో. వర్గశత్రుత్వాన్ని ఎవరో కొందరు "సృష్టించిన'' భేదాలుగా ఆ సినిమా చిత్రిస్తుంది. ఈ తీరును విశ్లేషిస్తూ అట్టి చిత్రాలలోని కుహనా అభ్యుదయాన్ని బహిర్గతం చేసారు కొ.కు. 'అభ్యుదయ', 'విప్లవాత్మక' చిత్రాల పేరుతో ఇటీవల తామరతంపరగా తయారవుతున్న అనేక చిత్రాల గుట్టును ఈ వ్యాస స్ఫూర్తితో మనం తెలుసుకోవచ్చు.

వివాదాంశుడుగా, హాస్యగాడుగా ప్రఖ్యాతి పొందిన చార్లీ చాప్లిన్ సినిమాకళ కుటుంబరావుకు నచ్చిన కళ. చార్లీ చాప్లిన్, కొ.కు.—ఇద్దరూ మధ్యతరగతి జీవితాలను కళావస్తువులుగా స్వీకరించారు. చాప్లిన్ మీద కొ.కు. 1948 లోనే 'చార్లీ చాప్లిన్ సినిమా కళ' అనే వ్యాసం రాసారు. ఆయనను తెలుగు పాఠకులకు పరిచయం చేసిన మొదటి విమర్శకుడు కొ.కు.

"సినిమా చిత్రం నూటికి నూరుపాళ్ళు కళావస్తువు....ఏ వ్యాపార వస్తువుకైనా భౌతిక వినియోగం వుంటుంది. కళలకు ఉండదు. మానసికానందమే వాటి పరమావధి. ఒక అరకిలో సినిమాను ఎవడూ యింటికి పట్టుకుపోయి బిస్కట్లు తిన్నట్టు తినడు'' అంటారు కొ.కు. మరొక వ్యాసంలో. కాని యిది పూర్తిగా కళాభావవాదం.

సినిమాను బిస్కట్లలా వుపయోగించం. తినం. కానీ బిస్కట్లు కొన్నట్లే డబ్బును ఉపయోగించి కొంటాం. పాకెట్లో వున్నన్ని బిస్కట్లు తింటాం. సినిమా ఉన్నంత సమయం చూస్తాం. ఎప్పుడూ ఒకే సినిమా చూడం. రోజూ బిస్కట్లే తినం. బిస్కట్లు తినడానికీ, సినిమా చూడ్డానికీ రెండు రకాల భౌతిక వినియోగాలుంటాయి. ఒకటి 'భౌతిక' భౌతిక వినియోగం. రెండోది 'బౌద్ధిక' భౌతిక వినియోగం. ఉపయోగపు విలువ ఉన్న ప్రతిదీ వస్తువే. "వినియోగం మాత్రమే వస్తువు ఉపయోగవిలువ. అయితే వినియోగం ఆకాశవస్తువు కాదు....ఉపయోగపు విలువలు—ఉపయోగం, లేదా వినిమయం ద్వారా మాత్రమే యథార్థీకరించబడుతాయి. అవి మొత్తం సంపదకు చెందిన పదార్థం. అది ఆ సంపద యొక్క ఏ సామాజిక రూపమైనా అవ్వొచ్చు గాక." (మార్క్స్)

కళకు మానసికానందమే పరమావధి అయితే 'సామాజిక ప్రయోజనం' అనే మాటను ఆ ప్రత్యేక అర్థంలో వాడవలసి వస్తుంది. తక్కువ నిడివిగల వ్యాపార ప్రకటనల చిత్రాల్ని, ప్రబోధాత్మక చిత్రాల్ని, మానసికానందమే పరమావధిగా కలవి అనలేం కదా!

సినిమా కళపై నలభై ఏళ్ళపాటు రచయితగా, సంపాదకుడుగా కొ.కు. తన పేరుతోను, మారుపేర్లతోను వందలాది వ్యాసాలు, సమీక్షలు రాశారు. అందులో అయిదవ వంతయినా లభించని కారణంగా ప్రస్తుత వ్యాసాన్ని అసంపూర్తిగానే వదలి వేయవలసివస్తున్నది. అదెలా వున్నా, సినిమా మీద వాదవివాదాలు రేపిన మొదటి విమర్శకుడుగా, మార్గదర్శకుడుగా కొ.కు.ను గుర్తుపెట్టుకోక తప్పదు.

సామాజిక నేపథ్యంతో పరిచయం చేసిన

# విజ్ఞానశాస్త్రం

జె. మనోహర్‌రావు

పారిశ్రామిక విప్లవ కాలంలో అనేక కొత్త యంత్రాలు కనుగొన్న ఫలితంగా, పెట్టుబడిదారీ ఉత్పత్తులు భారీ ఎత్తున పెరిగాయి. ఇట్టి మహత్కార్యాన్ని సాధించటంతో శాస్త్రవిజ్ఞానం స్థాయి కూడా పెరిగిపోయింది. భూస్వామ్య వ్యవస్థను నిర్మూలించి పెట్టుబడిదారీ విధానాన్ని పటిష్టం చేయటానికి శాస్త్రవిజ్ఞానం అద్భుతమైన సాధనంగా పాలకవర్గాలకు కనిపించింది. అయితే, ఉత్పత్తుల పెరుగుదల మాట అట్లా ఉంచి, ఈ వర్గాలు శాస్త్రవిజ్ఞానాన్ని తమ స్వార్థానికి ఎట్లా దుర్వినియోగపరచ గలవో, దాని దుష్ఫలితాలు ఏమిటో, రెండవ ప్రపంచ యుద్ధం రుజువు చేసింది. ఆ దరిమిలా ప్రపంచవ్యాప్తంగా సాగిన చర్చోపచర్చలలో — శాస్త్రవిజ్ఞాన మూలసూత్రాలను, వాటి సత్ప్రయోజనాలు, దుష్ప్రయోజనాలనూ సామాన్య ప్రజలకు అర్థమయే రీతిలో శాంతి కాముకులు, మానవతావాదులు వివరించారు. ఈ వివరణ అటు పెట్టుబడిదారీ దృక్పథం నుండి, ఇటు సామ్యవాద అవగాహన నుండి కూడా సాగింది. అట్టి కృషిని తెలుగు దేశంలో సామ్యవాద దృక్కోణం నుండి జరిపిన వ్యక్తి కొడవటిగంటి కుటుంబరావు. ప్రకృతి, జీవజాలం, గ్రహాలు, మానవుని ఉనికి, పరిణామం, శాస్త్ర పరిశోధనలు, యంత్రాలు, అణుశక్తి, పెట్టుబడిదారీ వ్యవస్థలో—సామ్యవాద వ్యవస్థలో

శాస్త్రవిజ్ఞానం వినియోగమవుతున్న తీరు, అందువల్ల కలుగుతున్న ఫలితాలు—మొదలైన అంశాలపై ఆయన సరళమైన భాషలో విరివిగా వ్యాసాలు, పుస్తకాలు స్వయంగా రాయటం, అనువదించటం చేసాడు.

కుటుంబరావు తన రచనలకోసం ఎంచుకున్న అంశాల వలనా, తరచు ఇచ్చే నిర్వచనాలు. చేసే వ్యాఖ్యల వలనా—ఆయన గతితార్కిక భౌతికవాద వైఖరి విస్పష్టంగా కనిపిస్తుంది. ప్రకృతిలో కనిపించే అనేకత్వంలో ఏకత్వాన్ని కనుగొనటమే శాస్త్రవిజ్ఞాన లక్ష్యమని కుటుంబరావు గుర్తించాడు. ఆధ్యాత్మిక జ్ఞానమే జ్ఞానమంటూ—మత విశ్వాసాలకోసమో, ఆచారాలకోసమో అమానుషంగా ప్రవర్తించటమే జ్ఞానమని నమ్మేవారిని ఆయన తిరస్కరిస్తూ, ఐహిక జీవితంమీద, దాని వికాసంమీద విశ్వాసం గలవారికి శాస్త్రజ్ఞానమే వాస్తవ జ్ఞానమని స్పష్టం చేసాడు. నిజానికి, చారిత్రిక అవగాహనలేని శాస్త్రజ్ఞానం కుహనాశాస్త్రంగా మిగిలిపోతుంది. అట్టి అవగాహన గల గతితార్కిక విశ్లేషణ రెండు విషయాలను ప్రముఖంగా గుర్తిస్తుంది. ప్రకృతిలోని వివిధ అంశాలు దేనికవి విడిగా ఉండటం కాక వాటికి పరస్పర సంబంధం ఉంటూ, ఒకదాని ప్రభావం మరొకదానిపై ఉంటుందని అన్నది మొదటిది. ప్రకృతి, పరిసరాల క్రమాభివృద్ధిలో అనేక దశలు ఉంటాయని, ఆ యా దశలకు అనుగుణంగా భౌతిక, రసాయనిక, జీవశాస్త్రాలు కూడా అభివృద్ధి చెంది ఉన్నత స్థాయికి చేరుతాయి తప్ప, తిరోగమించవు అన్నది రెండవది. ఇట్టి పరస్పర సంబంధాలు, తదనుగుణమైన అభివృద్ధి క్రమాన్నే గతితార్కిక మని నిర్వచిస్తాం. అయితే ఈ సూత్రాలు ప్రకృతికి మాత్రమే పేమితమై, ఉండక, మానవ సముదాయానికి కూడా వర్తిస్తాయన్నది ఇక్కడ గుర్తించవలసిన విషయం. అందుకే కుటుంబరావు తన రచనలలో గ్రహాల ఆవిర్భావం నుండి, జీవపరిణామందాకా అన్నింటిపై సమైక్య పరిశీలన జరిపాడు. పదార్థం నుండి ప్రాణి ఆవిర్భావం, తర్వాత ప్రాణి వికాసం, నాగరికత ఆరంభం, సాంఘిక పరిణామం, శ్రమ విభజన, వర్గ విభజనను దశలవారీగా విశ్లేషించాడు. సమాజ పరిణామ క్రమంలో భారతదేశంలో కుల వ్యవస్థ ఎలా ఏర్పడిందో వివరిస్తూ, అధిభౌతిక దృష్టితో చేసే వాదనల్ని తీవ్రంగా ఖండించాడు. "బ్రాహ్మల ఇళ్ళల్లో పెళ్ళికి అగ్నిహోత్రం చేస్తారు శూద్రుల ఇళ్ళల్లో పెళ్ళికి దీపారాధన చేస్తారు. అగ్నిహోత్రం చేసే నాటికి శూద్ర కుల మంటూ లేదు. ఆ కులం యేర్పడే నాటికి దీపాలు వచ్చాయి."

కొడవటిగంటి శాస్త్రవిజ్ఞానాన్ని అందరికీ అర్థమయే శైలిలో సమర్థవంతంగా చెప్పడమే గాక, దాని అభివృద్ధిని శాస్త్రజ్ఞాన చరిత్రకారుని వలె వివరించగలిగాడు.

ఆధునిక శాస్త్రవిజ్ఞానానికి మూలాధారమైన అణు భౌతికశాస్త్రాన్నీ, ఆ తర్వాత క్రము ఖంగా వచ్చిన ఖగోళ భౌతికశాస్త్రాన్ని (Astro-physics) ఆయన ప్రత్యేకంగా విశదీకరించాడు. అణు, పరమాణు స్వరూపాల నిర్మితిని, అందులోని ప్రోటాన్లు, ఎలక్ట్రాన్ల చలనాల ఫలితంగా ఏర్పడే భౌతిక, రసాయనిక పరిణామాలు, ధన-రుణ విద్యుత్తువల్ల సంభవించే అయనీకరణము (Ionization), ఐసోటోపుల ఉపయోగాలు మొదలైనవి వివరించినప్పుడు, కొడవటిగంటి వాటి దుష్ఫలితాలను కూడా సంతులనాత్మకంగా ముందుకు తెచ్చాడు. అణుశక్తిపై కుటుంబరావు వివరణలలో, రెండవ ప్రపంచ యుద్ధం తాలూకు భయానక ఘటనల ప్రభావం విపరీతంగా కనిపిస్తుంది. అయితే, ఈ ప్రభావం ఆయనలోని శ్రామికవర్గ దృక్పథాన్ని మరింత దృఢపరచింది.

శాస్త్రజ్ఞాన పరిశోధనా ఫలితాల క్రోడీకరణలూ, వాటిపై వేసే అంచనాలూ మన మూలాత్మకమైన తీర్పులను (value judgments) కాకుండా, వాస్తవిక పరిస్థితిని, సామాజిక ఉత్పత్తి సంబంధాలను, వర్గ సంబంధాలను ప్రతిబింబించేవిగా ఉండాలి. అలా జరగనపుడు అది గతితర్కానికి అతీతంగాను, అధిభౌతికానికి సమీపంగాను కనిపిస్తుంది. అట్టి పొరపాటు కుటుంబరావు కూడా చేసాడు. అమెరికా, రష్యాలు 1960 ప్రాంతంలో జరుపుతుండిన అంతరిక్ష ప్రయోగాలను బేరీజు వేస్తూ, "అమెరికా రష్యాను అందుకోవటానికి అనేక సంవత్సరాలు పట్టవచ్చుననీ, రష్యాకన్న ముందుగా అమెరికనులు చంద్రమండలంమీద దిగే అవకాశాలు లేవనీ అమెరికావారు ఒప్పుకుంటున్నారు" అంటాడు ఒకచోట. కాని అట్లా జరగలేదు. ఒకవేళ అట్లా జరిగినా అదంత ముఖ్యమైన విషయం కాకపోవును. ఎందుకంటే, శాస్త్రవిజ్ఞానంలో ఒక దేశానికి గల ఆధిక్యత రుజువు అయేది ఈ విధంగా కాదు. గతితార్కిక దృష్టితో చూసినపుడు—కేవలం పరిశోధనలలో ఎవరు ముందున్నారు అన్నదాని కన్నా, అవి ఏ వ్యవస్థలో ఏ విధంగా ఉపయోగపడుతున్నాయి అన్నదానికి ప్రాముఖ్యత నిస్తాం. ఏ సమాజంలో అయినా శాస్త్ర విజ్ఞానదశను, దిశను నిర్ణయించేది ఆ సమాజంలోని సామాజిక ఉత్పత్తి సంబంధాలే. అందుకే శాస్త్రవిజ్ఞానానికి వర్గ స్వభావం ఉన్నదా అన్న ప్రశ్నకు ఇప్పుడు సమాధానాన్ని తరచి చూడవలసి ఉన్నది.

శాస్త్రవిజ్ఞానం అంటే ప్రకృతి రహస్యాలను కనుగొని, స్వార్థరహితమైన రీతిలో సమాజపరం చేయటమే గనుక, ఇది తటస్థమైనదని పలువురి నమ్మకం. అందులో కొంతమంది మార్క్సిస్టులు కూడా లేకపోలేదు. శాస్త్రవిజ్ఞానానికి వర్గ స్వభావం ఉంటుందన్న విషయం కుటుంబరావుకు తెలియదనుకోవటం కష్టం. కాని,

'శాస్త్రవిజ్ఞానం వర్గస్వభావానికి అతీతమైనది. కళలూ, మతాలూ కూ  సామాజికవ్యవస్థను ప్రతిబింబిస్తాయి; శాస్త్రజ్ఞాను  ప్రకృతి రహస్యాలను అన్వేషించి వ్యవస్థలో అభివృద్ధికరమైన మార్పులు తెస్తుంది''అని ఒకచోట ('శాస్త్రీయ విజ్ఞానం', 1953. పే. 31) అనడం, ఆ విధంగానే మరికొన్ని సందర్భాలలో రాయడం ఏ అభిప్రాయంతో చేసాడో గాని, తనకు ఈ వర్గస్వభావం మాట తెలియదేమోనని అపోహకలిగించే విధంగా ఉంది.

శాస్త్రవిజ్ఞానాన్ని మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించినపుడు, దానిని పునాదిలో భాగంగా గుర్తించాలా లేక ఉపరితలంలోనా? అన్న మౌలికమైన ప్రశ్న ఒకటున్నది. ఎందుకంటే, ఒకవేళ శాస్త్రజ్ఞుల్ని ఉపరితలంలో భాగంగా పరిగణిస్తే, వారి అంతర్గత వైరుధ్యాలు ఏవైనా, వారిని శ్రామికులుగా గుర్తించలేము. పైగా వారిని పాలక వర్గంలో భాగంగానో, ఆ వర్గపు అనుయాయులుగానో లెక్కించవలసి ఉంటుంది. అంటే వారు పెట్టుబడిదారీ రాజ్యాంగయంత్రంతో తమకు గల మౌలిక వైరుధ్యాల్ని గ్రహించటం లేదన్నమాట. ఒకవేళ శాస్త్రవిజ్ఞానం పునాదిలో భాగమనుకుంటే, మార్క్సిస్టు విలువ సిద్ధాంతం ప్రకారం, శాస్త్రజ్ఞులు కూడా శ్రామికులేనని, పెట్టుబడిదారులకు శ్రమశక్తిని అమ్ముకునే కార్మికవర్గం వంటివారని, ఆ విధంగా విప్లవశక్తులలో భాగమని గుర్తించవలసి వస్తుంది. కాని వ్యూహాత్మకంగా చెప్పాలంటే, సమకాలీన పెట్టుబడిదారీ వ్యవస్థలో శాస్త్రజ్ఞులు పునాదిలో, ఉపరితలంలో కూడా భాగంగా ఉన్నారని చెప్పడం సరియైన అవగాహన అవుతుంది. అందుకే శాస్త్రజ్ఞుల పరిశోధనలలో కేవల శాస్త్ర స్వభావం(Pure Science) ఎంతగా కనిపించినా అవి వర్గస్వభావానికి అతీతంకాలేవు.

శాస్త్రవిజ్ఞానాన్ని తెలుగు పాఠకలోకానికి శాస్త్రీయ దృక్పథంతో అందించటంలో కొడవటిగంటి అనన్యమైన కృషి చేసాడు. శాస్త్రవిజ్ఞానంపై తెలుగులో రచనలు చేసిన వారు పలువురు ఉన్నప్పటికీ, సామాజిక అవగాహన—బాధ్యతతో రాసిన బహుకొద్ది మందిలో ఆయన ఒకడు. అయితే, కొన్ని అపోహలవల్ల కొన్ని విషయాలపై సరైన దృక్పథం ఉండకపోవచ్చు. సరైన ఆలోచనలు, సిద్ధాంతమూ ఆచరణద్వారానే ఏర్పడతాయి. కొడవటిగంటి చెప్పిన రెండు వాక్యాలను పేర్కొంటూ ఈ వ్యాసం ముగిస్తాను. "సర్వేజనా స్సుఖినోభవంతు అని ఎవరైనా ఆశించవచ్చు. కాని అది సాధించటానికి—అందరి సుఖానికీ సరిపడినంత సంపదా, అది న్యాయంగా అందరికి అందటానికి అనువైన సామాజిక వ్యవస్థా రావాలి. అంతదాకా అది శుష్కమైన ఆశయమే." "కేవలం శాస్త్రజ్ఞానాభిలాషతో చూసినా, మానవులకు స్వర్ణయుగం ఆరంభం కావాలంటే, ప్రపంచమంతటా సోషలిస్టు వ్యవస్థ ఏర్పడాలి."

## పత్రికలను ఆధునీకరించిన

# జర్నలిస్టు

సూరంపూడి సీతారామ్

దాదాపు యాభై ఏళ్ళు నిరాఘాటంగా రచనా వ్యాసంగం సాగించిన కొడవటిగంటి కుటుంబరావు గురించి తెలుగు పాఠకలోకానికి కథకుడు, నవలాకారుడు, విమర్శనాత్మక వ్యాసరచయితగా తెలుసు గాని, తెలుగులో వార, మాస పత్రికలకు అధునాతనమైన రూపురేఖలు తీర్చిదిద్దిన సంపాదకునిగా తెలియదు. ఈనాడు కథ, సినిమా మొదలైన రంగాలకు సంబంధించిన ఇన్ని వార, పక్ష, మాస పత్రికలు వేలూ, లక్షలూ కాపీలు వేసి వర్ధిల్లుతున్నాయంటే, ఆయనకి వారెంత ఋణపడి ఉన్నారో, ఈ పత్రికల సంపాదకులలో కూడా అష్టేమందికి తెలియకపోవచ్చు.

రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు కాలంలో జాతీయోద్యమం, దేశభక్తి భావాల ప్రచారానికీ, సాంఘికాచార సంస్కరణలకూ, ఆధునిక సాహిత్య విధానాలు, చరిత్రపరమూ సాహిత్యపరమూ అయిన పరిశోధనాంశాల వివరణకూ పత్రికలు కృషి చేసే రోజుల్లో—సంపాదకులు, యజమానులు అనేక కష్టనష్టాలకు ఓర్చి పత్రికలు నడిపేవారు. అంతటి ఉన్నతాశయాలు లేకపోయినా, ప్రజలలో పఠనాశక్తిని పెంచి, అంతంత మాత్రమే చదువు నేర్చినవారు కూడా చదువుకునే విధంగా మరికొన్ని పత్రి

కలు—చిత్రగుప్త, వినోదిని. రూపవాణి, ఢంకా మొదలైనవి—ప్రచారంలోకి వచ్చాయి. వాటికి కథలు, హాస్యం, సినిమా ప్రధానాంశంగా ఉండేవి.

ఆ రోజుల్లోనే చక్రపాణి, కుటుంబరావు కలిసి మొట్టమొదటిసారిగా యువ తరం కోసం కొత్త తరహా సాహిత్యం—ముఖ్యంగా కథలు, నవలలు—అందించా లనే ఉద్దేశంతో 'ఆంధ్ర జ్యోతి', తరవాత 'యువ' అనే మాసపత్రికలను, 'యువ ప్రచురణలు' అనే పుస్తక ప్రచురణ సంస్థను నెలకొల్పారు. ఆ రోజుల్లో 'చిత్రగుప్త', 'వినోదిని', 'ఆనందవాణి' వంటి పత్రికలలో కథాసాహిత్యస్థాయి నానాటికి దిగజార సాగింది. దానితో వారు సరిపెట్టుకోలేకపోయారు. మరొకవైపు సామాజిక స్పృహ, హేతువాదం, మానవస్వభావ పరిశీలన గల కథా — నవలా సాహిత్యానికి అప్పుడు 'కృష్ణాపత్రిక', 'ఆంధ్రవారపత్రిక', 'భారతి', 'గృహలక్ష్మి' వంటి పత్రికలలో స్థానం లభించేది కాదు. అందువల్ల అట్టి సాహిత్యాన్ని ప్రజలకు అందచెయ్యడం కోసం వా రిద్దరు పూనుకొని, తమ పత్రికలు, ప్రచురణ సంస్థ ద్వారా కృషి చేశారు.

ఆ రోజుల్లో తెలుగు సినిమాలు అప్పుడే బాగా ప్రచారంలోకి రావడంతో వీరిద్దరి దృష్టి సినిమాలపైకి మళ్ళింది. మొదట కుటుంబరావు 'ఆంధ్ర వారపత్రిక' ద్వారా అటు సినిమా కళని, ఇటు పత్రికా ప్రచారాన్ని సామాన్య ప్రజలకు సన్ని హితంగా తీసుకుపోగలిగారు. ఆనాటి 'ఆంధ్ర వారపత్రిక' అమ్మకం పదివేలు దాటడం గొప్ప విజయాన్ని సాధించినట్టే అయింది. ఇందుకు కుటుంబరావు నిర్వ హించిన సినిమా శీర్షికలకు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి సంపాదకత్వం వహించిన వ్యంగ్య సాహిత్య విభాగం తోడయింది. ఆ పత్రికలోనే—రెండవ ప్రపంచయుద్ధానికి ముందు ఒకసారి, తర్వాత యుద్ధం జరుగుతుండగా 1942 లో రెండవసారి ఆ పత్రి కను దేశభక్తి సూచకంగా మూసివేసేటంత వరకూ, వీరిద్దరూ అనేక నూతన శీర్షికలు ప్రవేశపెట్టి, రచనలలో రక రకాల పోకడలు చూపి, పత్రికను సామాన్య ప్రజలు ఆసక్తితో, ఉత్కంఠతతో చదివేలా చెయ్యగలిగారు. ఆ నాడు ఆ పత్రికకు లభించి నంత ప్రచారం మరే వార, మాస పత్రికలకూ ఉండేది కాదు.

1943 లో 'ఆంధ్ర పత్రిక', 'ఆంధ్ర వారపత్రిక', 'భారతి' తిరిగి [illegible] నప్పుడు, కుటుంబరావు దినపత్రికలో చేరారు. హోమియోపతి వైద్యం [illegible] అర్థం అయ్యేలా దినపత్రికలో వ్యాసాలు రాశారు. అప్పుడు 'ఆంధ్ర [illegible] చక్కని ఫొటోలు, కథానికలు, రాజకీయ, సాహిత్య విమర్శలు, చారిత్రక [illegible] వ్యాసాలతో, చక్కని ముద్రణతో, పెద్ద సైజులో వచ్చినా ప్రజాదరణకు నోచుకోలేక

పోయింది. ఒకే వరవడిలో 'భారతి', 'కృష్ణా పత్రిక' వంటి పత్రికలు ఎన్ని వచ్చినా అన్నిటి స్థితీ అంతంతమాత్రంగానే ఉండేది. సుమారు ఎనిమిదేళ్ళు 'ఆంధ్ర వార పత్రిక' ఆ విధంగా నడిచి, చివరకు మూసివేసే స్థితికి వచ్చేసింది. అప్పుడు 1949 లోనో 1950 లోనో ఆ పత్రికని కుటుంబరావుకు అప్పగించడం జరిగింది. దాన్ని సైజు తగ్గించి (అపుడు అది ఇప్పటి 'జ్యోతిచిత్ర' సైజులో ఉండేది) నేటి వారపత్రిక స్వరూపం ఇచ్చినవాడు కుటుంబరావు. అలాగే అందులో కొత్త శీర్షికలు ప్రవేశపెట్టి, కొత్త రచయితలను ప్రోత్సహిస్తూ, దాన్ని ముఖ్యంగా కథల పత్రికగా రూపొందించారు. రాజకీయ విమర్శలకు, బాల సాహిత్యానికి, సినిమాకి వేర్వేరు విభాగాలు, కథలు, నవలల సీరియల్స్, హాస్యం—వ్యంగ్యం నిండిన లిమరిక్స్ ప్రవేశపెట్టి, త్రివర్ణ ముఖచిత్రాలు, సినిమా స్టిల్స్, కార్టూన్లతో పత్రికకు పూర్తిగా కొత్త స్వరూపం ఏర్పరచింది కుటుంబరావే. వాటితోపాటు ఇంగ్లీషునించి మార్క్ ట్వేన్ మొదలైన రచయితల నవలల అనువాదాల్ని ప్రవేశపెట్టింది ఆయనే. బాలల ప్రత్యేక సంచికలు దసరా పండగలకు అచ్చువేసేవారు. అందులో పిల్లల రచనలు, బొమ్మలు వేసి, అలాగే దసరాకి పోటీలు పెట్టి, ఎంతమంది రచయితలనో ప్రోత్సహించారు. ఈనాడు తెలుగు దేశంలో ఇన్ని వారపత్రికలు పెద్ద సర్క్యులేషన్‌తో కళకళలాడుతూ వస్తున్నాయంటే, అందుకు ఆయన రూపొందించిన ప్రక్రియలే కారణం. ఈనాడు రచయిత్రులు, రచయితలు పేరుపొందినవారు అనేకమంది తెలుగులో రాస్తున్నారు. వీరిలో చాలమంది కుటుంబరావు ప్రోత్సాహంతో రచన ఆరంభించినవారే. పోతే, విజ్ఞాన వీథులు అనే శీర్షిక కింద ఆధునిక విజ్ఞాన శాస్త్రాన్ని ప్రజలకు సులభమైన భాషలో అందించడానికి ఆయన ప్రయత్నించారు. కుటుంబరావు ఫిజిక్స్‌లో పోస్టుగ్రాడ్యుయేట్ (డిగ్రీ తీసుకోలేదు). అందువల్లనే ఆయన ఏ రచన చేసినా, ఏ భావాలు ప్రకటించినా శాస్త్రీయ దృక్పథం హేతువాదం నిక్కచ్చిగా వ్యక్తం అయేవి. భౌతికశాస్త్రాన్ని గురించి ఆయన రాసిన వ్యాసాలు యువలోకానికి శాస్త్రీయ దృక్పథం అలవడడానికి ఎంతగానో తోడ్పడ్డాయి.

'ఆంధ్ర వారపత్రిక'ని ఒక దారిలో పెట్టి, సర్క్యులేషన్ బాగా పెరుగుతూ ఉన్నప్పుడే కుటుంబరావు మళ్ళీ తన పాత మిత్రులు చక్రపాణితో చేరి 'చందమామ' ...డుగ ...కకు, సినిమా రచనకు దోహదం చేసారు. 1952 లో 'చందమామ'లో ...ష్ఠత (1952 నుండి 55 వరకు ఆయన 'కినిమా' పత్రికకు కూడా సంపాదకు ...వహరించారు.) అందులో ఎన్నో మార్పులు తెచ్చి జానపద కథలు, బేతాళ కథ... మాంత్రికుల కథలు, సీరియల్స్ ప్రవేశపెట్టారు. అయితే మాంత్రికులు,

రాక్షసుల కథలు ఎన్ని వేసినా మూఢవిశ్వాసాలు, ఆచారాలను ప్రచారం చేసే సాహిత్యాన్ని ఎన్నడూ ప్రోత్సహించలేదు. చిన్నపిల్లల కథలలో ఎన్ని రూపకల్పనలు చేసినా అన్నిటికీ అంతర్గతంగా హేతువాదం, మానవతావాదం బోధ అవుతూనే ఉండేవి. కుటుంబరావు చేరిన తర్వాతనే 'చందమామ' ఇంగ్లీషుతో సహా అనేక భాషల్లో ప్రచురణ కావడం ప్రారంభమయింది. అది పిల్లలేకాక పెద్దలు కూడా చదివే పత్రికగా రూపొందింది. 1952 మొదలు ఆయన చనిపోయేదాకా 'చందమామ'ను నిర్వహిస్తూనే వచ్చారు.

కుటుంబరావు పెట్టిన వరవడిలోనే మొదట ఆదివారం పత్రికలు, తరవాత వారపత్రికలు, ఆ తరవాత పిల్లల పత్రికలు అనేకం వచ్చేయి; ఆయన ఫార్ములాని అనుసరించే వృద్ధిలోకి వచ్చాయి.

కుటుంబరావు 'చందమామ'లో చేరిన తర్వాత అనేక ఇతర పత్రికలకు కూడా దోహదం చేసేవారు. అందులో ముఖ్యమైనవి 'తెలుగు స్వతంత్ర' కొమ్మూరి సాంబశివరావు 'సినిమా', 'ఆనందవాణి' 'యువ'.

తెలుగు పత్రికా ప్రపంచంలో కుటుంబరావు రచనలు పడని పత్రికగాని, ఆయన ప్రభావానికి లోనుగాని పత్రికగాని లేదని నా అభిప్రాయం. తెలుగు వార్తా పత్రికలకి నార్లవారు పెట్టిన వరవడి నేటికీ సాగుతున్నట్టే, వార, మాస పత్రికలకు, సినిమా పత్రికలకు ఆదిపురుషుడు కుటుంబరావే అని నా ఉద్దేశం.

# విమర్శాశాస్త్ర శస్త్రకారుడు

వి. చెంచయ్య

సాహిత్యం పుట్టినప్పటినుంచీ సాహిత్య విమర్శ ఏదో ఒక రూపంలో ఉంటూనే ఉంది. సాహిత్య స్వరూప స్వభావాల్ని సంఘ ప్రయోజనం దృష్ట్యా విశ్లేషించి, వివరించి, సాహిత్యానికి ఒక దీపంలా మార్గం చూపేది సాహిత్య విమర్శ. సాహిత్యం రోగగ్రస్తమైనప్పుడు వైద్యుడుగా పనిచేసి ఆరోగ్యాన్ని ప్రసాదించేది సాహిత్య విమర్శ. సాహిత్య విమర్శకు ఇంత శక్తి ఉందా? ఉంటేనే దానికి ఆ పేరు సార్ధకమవుతుంది. ఆధునిక యుగంలో సాహిత్య విమర్శకు ఇంత శక్తీ, పదునూ కలిగించిన వ్యక్తి కొడవటిగంటి కుటుంబరావు.

ప్రాచీన, ఆధునిక విమర్శనా ధోరణుల మధ్య స్పష్టమైన తేడా ఉంది. అయినా చాలామంది ఆధునిక సాహిత్య విమర్శకులలో కూడా కొన్ని సాంప్రదాయిక ఛాందస భావాలున్నాయి. వీటిని తొలగించి, నిజమయిన ఆధునిక సాహిత్య విమర్శకు రూపు రేఖలు దిద్ది, కండపుష్టినీ గుండెబలాన్నీ కలిగించింది కుటుంబరావే.

మనం మంచి సాహిత్యాన్ని కోరుకున్నట్టే, మంచి సాహిత్య విమర్శనుకూడా కోరుకోవాలి. అసలు మంచి విమర్శ లేనిదే మంచి సాహిత్యం రాదని కుటుంబరావు

గట్టి నమ్మకం. "చలంగారిని సంఘం సహృదయంతో మొదట్నుంచీ విమర్శిస్తూ ఉన్నట్టయితే ఆయన రచనలు యథార్థ సాంఘిక వ్యవస్థకు ఎడంగా వెళ్ళిపోయి పొట్టి తర్కంగానూ, శుష్క వేదాంతంగానూ పరిణమించటం జరిగి ఉండేదిగాదు" అంటూ, ఒక ప్రతిభావంతుడైన కథకుడు అభ్యుదయ సాహిత్యానికి దూరమైపోయినందుకు కుటుంబరావు ఎంతగానో వాపోయారు. అభ్యుదయ శక్తుల్ని సరిగా అవగాహన చేసుకున్న విమర్శకులు లేకపోవడం వల్ల గొప్ప రచయితలుకూడా వక్రమార్గం పడతారనడానికి చలాన్ని ఒక ఉదాహరణగా మాత్రమే ఆయన చూపారు. రచయితల్ని అభ్యుదయ రచయితలుగా మలచుకోడానికి సాహిత్య విమర్శ ఎలా ఉపకరిస్తుందో తొలిసారిగా శాస్త్రీయంగా వివరించిన ఘనత కుటుంబరావుదే. "రచయితను అర్థం చేసుకోకుండా విమర్శించరాదు" అన్న ప్రాథమిక సూత్రాన్ని విమర్శకులు అర్థం చేసుకుంటే పై పొరబాటు జరిగి ఉండేది కాదు. నన్ను మెచ్చుకునే వాళ్ళంతా నా రచనల్ని అర్థం చేసుకున్నారనుకున్నాను, అని చలం బాధగా అంటాడొకచోట.

'విశ్వశ్రేయః కావ్యమ్', 'హితేన సహితం సాహిత్యం' లాంటి మాటలెన్ని వినిపించినా, ప్రాచీన సాహిత్య విమర్శ కావ్యవస్తువుకన్నా ప్రధానంగా శిల్పాన్ని పట్టించుకున్నట్టు కనిపిస్తుంది. దాదాపు అంతా మత ప్రేరితమయిన సాహిత్యమే కావడంవల్ల, వాళ్ళకు ఏం చెప్తున్నారన్నది కాదు—ఎలా చెప్తున్నారన్నదే ప్రధానమయింది. రచయితలందరకూ వస్తువు విషయంలో దాదాపు ఏకాభిప్రాయం ఉన్నప్పుడు, విమర్శకుల దృష్టి శిల్పం మీదకే మళ్ళుతుంది. రసం, అలంకారాలు, రీతులు, గుణాలు, శబ్దసౌందర్యం, శ్లేషార్థాలు వగైరా శిల్ప సామగ్రిని ఆధారం చేసుకునే విమర్శ సాగేదిగాని — రచయిత దృక్పథం, రచనల నేపథ్యం, సంఘదృష్టి మొదలయిన వాటి ఆధారంగా విమర్శ సాగేది కాదు. అలా సాగనందుకు వాళ్ళను ఇప్పుడు నిందించి ప్రయోజనం లేదు. విమర్శ ధోరణి నేటికీ అలాగే కొనసాగాలనే వాళ్ళనే నిందించాలి. భావకవిత్వం రావడంతోటే ప్రాచీన విమర్శాధోరణి కొంత మారింది. అభ్యుదయ సాహిత్యోద్యమంతో, విమర్శకు సంబంధించి సమూలమయిన మార్పులు వచ్చాయి. అయినా శిల్పానికి సంబంధించి ఆధునిక విమర్శకులలో కూడా కొన్ని మూఢవిశ్వాసాలు ఇంకా పోలేదు. వాటిని తొలగించటానికి కుటుంబరావు విమర్శా వ్యాసాలు తప్పక దోహదం చేస్తాయి.

కవి భావనకు వివశుడైపోయి కవిత్వాన్ని సృష్టిస్తాడనుకోవడం ఒక భ్రమ. భావన అనేది కవిమీద పెత్తనం చలాయించకూడదు. భావనపైన కవి అధికారం

సంపాదించాలి. అప్పుడే ఆ భావనను పాఠకులకు అందించగలడు. ఏ కళాకారుడైనా కళలో తాను లీనమైనట్టు కనిపిస్తాడేగాని, నిజానికి లీనం కాడు, కాకూడదు. అలా లీన మయితే అది రసాభాస అవుతుంది. తాను బయటవుండి కళాస్వాదకుణ్ని కళలో లీన మయ్యేట్టు చేయాలి కళాకారుడు.

ఇలాగే రచయితల్లో ఉండే మరొక భ్రమ—'మూడ్' రానిదే రచన చెయ్యలే మనుకోవడం. 'మూడ్' అనేది ఒక మానవాతీతశక్తి అయినట్టు, కళాకారుడికి తెలియ కుండా హఠాత్తుగా ఎప్పుడో అతనిలో ప్రవేశిస్తున్నట్టూ అనుకోవడం కూడా ఒక మూఢవిశ్వాసమే. 'మూడ్' అనబడేది రావడానికి తగిన భౌతికపరిస్థితులు కొన్ని ఉంటా యనేది ఆధునికులు సైతం చాలామంది గుర్తించారు. తాను సృష్టించబోయే కళకు సంబంధించిన విషయపరిజ్ఞానం, తగిన మానసిక విశ్రాంతి, కళాసృష్టి చేయాలన్న పట్టుదల—ఇంతకు మించిన 'మూడ్' ఏమిటి? భౌతికాధారం గల విషయాన్ని కూడా అభౌతికం చెయ్యడం మనకలవాటు. అందుకనే విమర్శకుడికి భౌతికవాదదృష్టి ఉండా లని కుటుంబరావు అన్నారు. 'మూడ్' అంటే ఏమిటో తనకు తెలియదని కూడా నిక్కచ్చిగా చెప్పారు. ఇలాంటి మూఢవిశ్వాసాలు ఒకవేళ రచయితలో ఉన్నా, విమర్శకుడిలో వుండరాదు. కాబట్టి విమర్శకుడు రచయితకన్నా రెండాకులు ఎక్కువ చదివి వుండాలని కుటుంబరావు అభిప్రాయం.

సాహిత్య ప్రవాహంలో కొంత చెత్త ఎప్పుడూ కొట్టుకువస్తూనే ఉంటుంది. సాహిత్య విమర్శ ఆ చెత్తను తొలగించే వడపోతగా పని చెయ్యాలి. "సాహిత్య సాంస్కృతిక విమర్శ కావలికుక్కలాగా పనిచెయ్యందే సాహిత్యానికి వర్తమానంగాని భవిష్యత్తుగాని లేదు" (కొ.కు.) సాహిత్య విమర్శకుడిపైన అంత బరువైన బాధ్యత వుంది.

తెలిసినవాడికే తెలియజెప్పడం అనేది ఏ రకమయిన విమర్శలో అయినా సాధారణంగా వుండే లోపమని కుటుంబరావు గుర్తించారు. మతభావాల్ని నమ్మే వాళ్ళకు మాత్రమే నచ్చేట్టుగా మతప్రచారం చెయ్యటం, కమ్యూనిస్టు సిద్ధాంతం నచ్చిన వాళ్ళు ఇష్టపడే విధంగానే కమ్యూనిస్టు ప్రచారం చెయ్యడం ఇలాటివే. మార్క్సిస్టు దృక్పథంలో వున్న కళను మార్క్సిస్టు దృక్పథం లేనివాళ్ళకు నచ్చేలా వ్యాఖ్యానించ గలిగితే అది ఉత్తమ విమర్శ అవుతుంది. అసలు విమర్శ ఉద్దేశమే అది. ఆ పని చెయ్యలేనపుడు ఇక విమర్శతో పనేముంది? చాలామంది అభ్యుదయ విమర్శకులు కూడా విమర్శలోని ఈ లక్షణాన్ని గుర్తించినట్టు కనబడరు. అయితే ఇక్కడొక

తిరకాసుంది. ఒకవేళ ఏ విమర్శకుడయినా భూస్వామ్యభావాలుగల కళలను అభ్యుదయ వాదులకు నచ్చేలా విమర్శించగలిగితే అది ఉత్తమ విమర్శ అవుతుందా? కాదని కుటుంబరావు సమాధానం. సమాజం యెప్పుడూ పురోగమిస్తుందేగాని తిరోగమించదు. సాహిత్యమయినా, సాహిత్య విమర్శ అయినా అంతే.

సంఘం కళలద్వారా తేజోవంతమైనట్టే, అప్పుడప్పుడూ కళలద్వారా నిర్వీర్యం అయే అవకాశం కూడా వుంది. అలాంటి సమయంలోనే విమర్శ అవసరం ఎక్కువగా వుంటుంది. నిత్యజీవితంలో తమ అవసరాలు ఎలాంటివో గుర్తించినంత సులభంగా, తమకు ఎలాంటి కళలు కావాలో ప్రజలు గుర్తించటం కష్టం. తమకు అవసరమయిన కళలు లభిస్తే ఆనందించి ఉత్తేజం పొందగలరు. తమను తప్పుమార్గంలో నడిపించే కళలు ఎదురైతే వాటిని బహిష్కరించేంత విమర్శనా దృష్టి వారికుండదు. కాబట్టి సమాజానికి పనికిరాని కళల్ని బహిష్కరించే కార్యక్రమం తీసుకోవలసింది విమర్శకు లేనని కుటుంబరావు అంటారు.

అయితే విమర్శకు అన్ని సమయాల్లోనూ ఇంత పురోగమనశీల స్వభావం ఉంటుందా? ఉండకపోవచ్చు. పనికిమాలిన సాహిత్యం వచ్చినట్టే, పనికిమాలిన విమర్శ కూడా రావచ్చు. సాహిత్యాన్ని సంస్కరించడానికి విమర్శ ఉపయోగపడ్డట్టే, కువిమర్శను సద్విమర్శగా మార్చడానికి కూడా విమర్శ ఉపయోగపడాలి — "అందుచేత విమర్శ కూడా విమర్శకు గురికావాలి." (కొ.కు.).

విమర్శకు సంబంధించి కుటుంబరావు చేసిన సూత్రీకరణలు ఏవీ 'శిలా శాసనాలు'గా వుండవు. అసలు ఏ నియమాలూ ఎప్పటికీ మార్చడానికి వీలులేని స్థితిలో ఉండకూడదనే ఆయన ఉద్దేశం. సంఘం ఎప్పుడూ మారుతుంటుంది. కళలూ మారుతుంటాయి. ఆ కళలతోపాటు విమర్శ సూత్రాలు కూడా అవసరమయిన మేరకు మారక తప్పదని ఆయన నమ్మారు. అయితే, విమర్శ స్వరూపంలో మార్పులు వచ్చినా, విమర్శ స్వభావం మారదు. రచయితల్ని అభ్యుదయ పంథాల్లో నడిపిస్తూ, ఆ రచనల్ని అర్థం చేసుకునేటట్లుగా పాఠకుల్ని తయారుచేస్తూ పోవడం ఏ కాలంలోనయినా విమర్శ నిర్వహించవలసిన ధర్మం.

1937 నుంచి 1980 వరకు కుటుంబరావు రాసిన ఎనభైకి పైగా సాహిత్య వ్యాసాలలోంచి క్రోడీకరిస్తే, ఆధునిక సాహిత్యానికి సరిపోయే విమర్శాశాస్త్రం గోచరమవుతుంది. యాభై ఏళ్ళుగా తెలుగు సాహిత్యాన్ని పరిశీలిస్తూ, తాను సాహిత్యాన్ని

పరిశీలిస్తూ, తాను సాహిత్యాన్ని సృష్టిస్తూ, సమాజ పరిణామాలను గమనిస్తూ, తన సూత్రీకరణలు తప్పని తేలితే సవరించుకుంటూ, సాహిత్యంలో తా నొక గిరిగీసుకుని అందులోనే ఉండిపోక ఎప్పటికప్పుడు వస్తున్న సాహిత్యోద్యమాల వెంట నడుస్తూ, మార్క్సిస్టు దృక్పథాన్ని అడుగడుగునా జీవితానికి అన్వయిస్తూ, విమర్శా సాహిత్యాన్ని, శాస్త్రాన్నీ సృష్టించిన మేధావి కుటుంబరావు. సాహిత్యాన్ని అభ్యుదయ దృక్పథంతో విమర్శించిన విమర్శకులు చాలామంది ఉన్నారు గాని, విమర్శ నిర్వహించవలసిన పాత్రను గురించి ఇంత శాస్త్రీయంగా, విపులంగా చర్చించినవారు కుటుంబరావు గాక మరెవరయినా ఉన్నారా అని అడిగితే చుట్టూ తిరిగి వెతుక్కోవలసిన అగత్యం ఏర్పడుతుంది.

ఇంతవరకు విమర్శ స్వరూప, స్వభావ, ప్రయోజనాల పట్ల కుటుంబరావు దృక్పథం ఎలాంటిదో చూసాం. ఇక సాహిత్యం పట్ల ఆయన చేసిన సూత్రీకరణలు ఎలాంటివో సంగ్రహంగా పరిశీలిద్దాం.

ఒక వ్యక్తి రచయిత కావడానికి ప్రేరణ ఎక్కడినుంచి వస్తుంది? ఇదొక ప్రధానమైన అంశం. పూర్వజన్మ వాసన, లేదా సంస్కారం నుండి అన్నది సాంప్రదాయ విమర్శకుల సమాధానం. ఇది అబద్ధమని సులభంగానే గ్రహించగలం కాబట్టి దీనిని పట్టించుకోనక్కరలేదు. రచయితకు ప్రేరణ వర్తమాన జీవితంలోంచే వస్తుంది. "సాహిత్యం జీవిత వృక్షానికి పూసే పువ్వు. పువ్వుకు పువ్వులు పూయవు" (కొ.కు.). నాలుగు కథలు చదివి ఒక కథా, నాలుగు నవలలు చదివి ఒకే నవలా రాసేవాళ్ళకు కుటుంబరావు పై వాక్యం మంచి సమాధానం. చిత్ర మేమిటంటే ఈ సూత్రాన్ని సిద్ధాంతపరంగా అంగీకరించే ఆధునికులు కూడా చాలామంది జీవితం నుండి ప్రేరణ పొందకపోవడం. అందరికీ అన్ని రకాల జీవితం తెలియకపోవచ్చు. కాని తనకు తెలిసిన జీవితాన్నే చిత్తశుద్ధితో చిత్రించడం అవసరం. కుటుంబరావు తన రచనలలో తనకు తెలిసిన మధ్య తరగతి జీవితాన్నే చిత్రించారు. ఆయనకు ప్రేరణ అక్కడి నుంచే లభించింది.

అభ్యుదయ రచయిత, అభ్యుదయ రచన—వీటి నిర్వచనంలో ఈనాటికీ చాలా మందిలో అస్పష్టతలు, భ్రమలు ఉన్నాయి. హృదయవిదారకంగా పేదల కష్టాల్ని చిత్రించడం, పోరాటాల్ని వర్ణించడం చేస్తేనే అభ్యుదయ రచయితలు అవుతారని సాధారణంగా అనుకుంటారు. తనకు తెలిసిన జీవితాన్ని అవగాహన చేసుకుని, అందులోని సత్యాన్ని ప్రకటిస్తే, ఆ రచయిత అభ్యుదయ రచయితే అని—ఆ మాటకు ఒక

విశాలార్థాన్ని కల్పించారు కుటుంబరావు. జీవితాన్ని వాస్తవికంగా చిత్రించడం కూడా అంత ముఖ్యం కాదు. జీవిత సత్యాన్ని ప్రకటించా లంటారు. అప్పుడే అది అభ్యుదయ రచన అవుతుంది. పోతే, ఈనాడు అభ్యుదయ రచయిత అయినవాడికి మార్క్సిస్టు దృక్పథం ఉండి తీరాలంటారు కుటుంబరావు. మార్క్స్ పుట్టక ముందు ఎవరూ అభ్యుదయ రచనలు చేయలేదా అంటే చేశారు. కాని ఈనాటి పరిస్థితి వేరు. మార్క్సిస్టు దృక్పథం లేని రచయిత ఈనాడు కాకపోతే రేపయినా అభ్యుదయ వ్యతిరేక రచనలు చేయవచ్చు. కాబట్టి, మార్క్సిస్టు దృక్పథం లేని రచయిత కొన్ని అభ్యుదయ రచనలు చేయవచ్చేమో గాని, అభ్యుదయ రచయిత మాత్రం కాలేడని సారాంశం.

రచయితకు, ముఖ్యంగా అభ్యుదయ రచయితకు, జీవితానుభవం ఉండాల్సిందే గాని, అదొక్కటే చాలదు. జీవితానుభవం ద్వారా తానేమి చెప్పదలచుకున్నాడో అది చెప్పడానికి రాజకీయ పరిజ్ఞానం, సామాజిక తత్త్వం కూడా అవసరం. జీవితానుభవాన్ని సక్రమమార్గంలో నడిపించడానికి ఇవి తప్పనిసరి. "జీవితానుభవం జీర్ణం కావటానికైనా సామాజిక తత్త్వం బోధపడాలి." (కొ.కు.) జీవితానుభవం అందరికీ ఉంటుంది. దాన్ని విశ్లేషించుకుని, అందులోని సత్యాన్ని గుర్తించి, సమాజానికి అన్వయించే శక్తే అందరికీ ఉండదు. శక్తి ఉన్నంతమాత్రానా చాలదు. దానిని ఉపయోగించుకునే జ్ఞానం ఉండాలి. సంఘజీవిగా జీవితానుభవసారాన్ని అర్థం చేసుకునే శక్తి అందరికీ ఉంటే, అసలు కళల అవసరమే లేదంటారు కుటుంబరావు. జీవితంలోంచి ఏమి నేర్చుకోవాలి? ఎలా నేర్చుకోవాలి? ఎందుకు నేర్చుకోవాలి? ఈ ప్రశ్నలకు సమాధానాలు సామాజిక తత్త్వం బోధపడిన కళాకారులకే తెలుసు.

మార్క్సిస్టు రచయితలు సృష్టించే సాహిత్యమంతా రాజకీయ ప్రచార సాహిత్యమేననే దురభిప్రాయం చాలామందిలో ఉంది. పెట్టుబడిదారీవర్గ ప్రయోజనాలను కాపాడే సాహిత్యం వీళ్ళ దృష్టిలో రాజకీయ సాహిత్యం కాదు. కేవలం ఒక రాజకీయ సిద్ధాంతాన్ని ఎలాగయినా సరే బలపరచాలన్న దుగ్ధతో మార్క్సిస్టు రచయితలు ఉండరు. కాని ఒక స్పష్టమయిన రాజకీయావగాహనతోనే వారు సాహిత్యసృష్టి చేస్తారు. కొ.కు. మాటల్లోనే—"సాహిత్యం స్వచ్ఛందంగా ఒక రాజకీయ ధోరణిని బలపరిస్తే అది ఆ రాజకీయ ధోరణికి ఒక కాంప్లిమెంట్ అన్నమాట. కేవలమూ ఒక రాజకీయ ధోరణిని బలపరచటానికే సాహిత్యం సృష్టించే వాళ్ళు రాజకీయాలకు అమ్ముడుపోయినవాళ్ళే." సరదాకోసం మార్క్సిజం ప్రభావంతో ఎవరూ రచనలు చెయ్యరు. అలా చేస్తే ప్రభుత్వ 'సత్కారాలు' లభిస్తాయని వారికి తెలుసు.

సాహిత్య ప్రయోజనం ఏమిటి? అన్న ప్రశ్నకు రకరకాల సమాధానాలు విని పిస్తున్నాయి. ఆనందం, ఉపదేశం అన్నవి ప్రాచీన ఆలంకారికులు చెప్పారు. కొందరు ఈనాడూ చెబుతున్నారు. నిజానికి ఇవి అస్పష్టమైన మాటలు. ఆనందం, ఉపదేశం—ఈ మాటల అర్థం ఏమిటి? నవ్వడమే ఆనందమా? సమాజం బాగుపడాలని అనడమే ఉపదేశమా? బుద్ధి వికాసమే ఆనందమని కుటుంబరావు అంటారు. బుద్ధి వికాసంతో ప్రమేయంలేని ఆనందంకూడా ఉండవచ్చు. కాని అది సాహిత్యంవల్లనే రానక్కరలేదు ప్రాచీనుల 'అలౌకిక రసానందం' కూడా బుద్ధివికాసంతో ప్రమేయం లేకపోతే వ్యర్థం. మద్యపానంవల్ల కూడా అలౌకిక (ఈ లోకాన్ని మరపింపజేసే) ఆనందాన్ని పొందవచ్చు. పోతే, ఉపదేశం ఉండాలని అభ్యుదయవాదులందరూ కోరారు గాని, ఆ ఉపదేశం ఎలా ఉండాలో కుటుంబరావు బాగా వివరించారు. "ఉపదేశం మన వ్యక్తిత్వాన్ని పరాభవిస్తుంది. ఆలోచన రేపే గుణం వ్యక్తిత్వాన్ని నిద్ర లేపుతుంది." (కొ.కు.) ఒక్క ముక్కలో సాహిత్య ప్రయోజనం ఇది. ధర్మశాస్త్రాల్లో, న్యాయ శాస్త్రాల్లో ఉన్న సూత్రాల్ని ఏకరువు పెట్టడానికే అయితే సాహిత్యం అక్కరలేదు. అధర్మం, అన్యాయం వల్ల కలిగే నష్టాన్ని చిత్రించి దానికి పరిష్కారం స్పష్టంగా చెప్పడం కాదు. ఆలోచన రేపే విధంగా చిత్రించగలగాలి. ఒక సమస్య మూల కారణాల్ని వివరించి చూపినప్పుడుకూడా ఆ సమస్యపట్ల తమ కర్తవ్యం ఏమిటో నిర్ణయించుకోలేని స్థితిలో ఉండరు పాఠకులు. సాహిత్యం మనకు కలిగించాల్సిన సంస్కారం మరొకటి వుంది. స్వేచ్ఛను దుర్వినియోగం చేస్తే చట్టం శిక్షిస్తుంది. కాని స్వేచ్ఛను సద్వినియోగం చేసుకునే యోగ్యతను చట్టం కలిగించలేదు. ఆ పని సాహిత్యం చేయగలుగుతుందని కుటుంబరావు అంటారు.

సాహిత్యంలో శిల్పంకూడా కేవలం ఆనందం కలిగించడానికి కాదు. శిల్పంవల్ల రచయిత ఆశయం బయటపడాలి కాని, దాని ముసుగులో పాఠకులను మభ్యపెట్టరాదు. జీవితంలోని కష్టసుఖాల వెనుకగల కారణాల మీదికి దృష్టి మరల్చడమే శిల్పం ప్రయోజనంకూడా. శిల్పం, భాష రచనకు మూలపరికరాలయితే, జీవితం ముడిపదార్థ మని కుటుంబరావు అభిప్రాయం. అసలెప్పుడూ రచయితకు జీవితమే ప్రమాణం. రాజకీయ సిద్ధాంతాన్ని జీవితానికి అన్వయించి చెప్పాలేగాని, సిద్ధాంతానుగుణంగా జీవి తాన్ని వక్రీకరించరాదంటారు ఆయన. ఈ వ్యాఖ్యానం చాలామందికి నచ్చకపోవచ్చు గాని, ఇలా వ్యాఖ్యానించడంలోనే కుటుంబరావు ప్రత్యేకత, గొప్పదనం ఉన్నాయి. సాహిత్య సృష్టి గురించి ఆయన చేసిన సూత్రీకరణల్లో ఇది చాలా ముఖ్యమైంది.

మార్క్సిజం సిద్ధాంతం ప్రకారం జీవితాన్ని మలుచుకుంటూ పోయి చిత్రిస్తే అది మార్క్సిస్టులకే నచ్చుతుందిగాని, ఇతరులపై దాని ప్రభావం ఉండకపోవచ్చు. జీవితాన్ని వక్రీకరించకుండా దానికి మార్క్సిజాన్ని అన్వయిస్తే ఎవరయినా ఒప్పుకోక తప్పదు. కుటుంబరావు సృజనాత్మక సాహిత్యం ఇలాంటిదే. సాయుధ విప్లవానికి సాంస్కృతిక విప్లవం ఒక వాహనంలాంటిది. సమాజం పురోగమించడానికి అడ్డంగా ఉన్న సాంస్కృతిక బంధాల్ని తెంచడం సాహిత్యంతోపాటు అన్ని కళల ధ్యేయం.

అన్ని కాలాలలోనూ ఒకే రకమయిన అవసరాలుండవు. సంఘం మారుతుంటుంది. అవసరాలూ మారుతాయి. కాబట్టి, సంఘం ఇలా వుండాలి అని ఒక పథకాన్ని ఇవ్వనక్కర లేదు సాహిత్యం. ఇలా వుండాలని చెప్పుకుంటే, సంఘం ఇంకో విధంగా మారిపోవచ్చు. అందువల్ల, సాహిత్యం వివరించవలసింది సంఘం ఎలా వుండాలని కాదు, ఎలా మారాలని, అంటారు కుటుంబరావు. సంఘం ఫలాని విధంగా వుండాలని తాత్కాలికంగా అనుకున్నా, దాని సహజ గతిక్రమాన్ని గుర్తించడం రచయితకు తప్పనిసరి.

సాహిత్యంలో వాస్తవికత గురించి అవాస్తవిక ఆలోచనలు చాలామంది రచయితలలో కనిపిస్తాయి. వాస్తవికత గురించి కుటుంబరావు ప్రధానంగా మూడు విషయాలు చెప్పారు. ఒక రచయిత రాసిన పది కథల్లోకన్నా, పదిమంది రచయితలు రాసిన పది కథల్లో జీవిత వాస్తవికత ఎక్కువగా చోటు చేసుకుంటుంది అనటం మొదటిది. ఒక్కరి అనుభవాలలోకన్నా పదిమంది అనుభవాలలో వైవిధ్యం కనిపిస్తుందన్నది ఇక్కడ గమనించవలసిన విషయం. జీవితంలో జరిగిన విషయాలే కాకుండా జరగదగిన విషయాలను చిత్రించడం కూడా వాస్తవికతలో భాగమే అన్నది రెండవది. ఒకోసారి జీవిత వాస్తవాలను బాగా వ్యక్తం చెయ్యడానికి — జరిగిన విషయాలకన్నా, జరగకపోయినా జరగదగినవనిపించే విషయాలు బాగా పనికిరావచ్చు. వాస్తవ జీవితం చిత్రించడమే రచయిత ధ్యేయం కాకూడదు. ఆ జీవిత వాస్తవాన్ని ఒక దృక్పథంతో వ్యాఖ్యానించగలగాలి. ఆ వ్యాఖ్యానం సూచనాప్రాయంగా నయినా లేకపోతే అలాంటి వాస్తవికత వ్యర్థం. ఇది మూడవది, ముఖ్యమైందికూడా.

విప్లవ సాహిత్యం విప్లవాన్ని మాత్రమే కోరాలా లేక, మూఢ విశ్వాసాలు మొదలైన వాటినికూడా పట్టించుకోవాలా అన్న విషయంలో, విప్లవ సాహిత్యం సృష్టించేవారిలోకూడా భేదాభిప్రాయాలు కనిపిస్తుంటాయి. పెట్టుబడిదారీ వ్యవస్థతో

పాటు, దాని పూర్వ వ్యవస్థల సంస్కృతి కూడా మనను పీడిస్తుంటుందని, దానిని ఉపేక్షించరాదని అంటూ, కుటుంబరావు, పై సమస్యకొక పరిష్కారం చూపిస్తున్నారు. మానవజాతిని ఏదో రూపంలో పీడించే ప్రతి సమస్యను రచయిత పట్టించుకో వలసిందే.

చాలామంది సాహిత్య విమర్శకులు సాహిత్య స్వరూపాన్ని అర్థం చేసుకుంటారు, వివరిస్తారు. కాని సాహిత్య స్వభావాన్ని అర్థం చేసుకోలేరు. సాహిత్యం ఎప్పుడూ ఉద్యమ స్వభావాన్ని కలిగి వుండాలని కుటుంబరావు అభిప్రాయం. సాహిత్యోద్యమంలో భాగం పంచుకోలేని రచయితలు ఎంత అభ్యుదయ సాహిత్యం సృష్టిస్తున్నామని అనుకున్నా—ఊహాగానాలకు, తెచ్చిపెట్టుకున్న ఆదర్శవాదానికి గురి కాక తప్పదు. సిద్ధాంతం వెలుగులో జీవితాన్నికాక, జీవిత నేపథ్యంలో సిద్ధాంతాన్ని చూడగలిగినంతవరకూ—ఉద్యమ రూపంలో సాహిత్యం సాధించే విజయాలను వ్యక్తులుగా వుండి ఎందరు గొప్ప రచయితలుకూడా సాధించలేరు. సమాజం పూర్తిగా మారితే తప్ప కొందరి జీవితాలు బాగుపడవు. వాళ్ళే విప్లవ పోరాటంలో ప్రధాన పాత్ర వహిస్తారు. ఈ విషయాన్ని అర్థం చేసుకుని సాహిత్యాన్ని సృష్టించడం చెప్పు కున్నంత సులభం కాదు. రాజకీయోద్యమాలు అర్థంకానిదే ఉద్యమరూపంలో సాహిత్యాన్ని సృష్టించలేరు. విప్లవాన్ని కోరే చాలామంది యువరచయితలలో ఈనాడు కనిపిస్తున్న లోపం ఇదే. ఈ లోపం లేనప్పుడే అది విప్లవ సాహిత్యం అవుతుంది. విప్లవం, విప్లవ సాహిత్యం రెండూ జీవితంనుంచే పుట్టినా — విప్లవ సాహిత్యం విప్లవానికి ముందే పుట్టి, విప్లవానికి సాంస్కృతిక పరంగా వున్న అడ్డంకుల్ని తొలగిస్తుంది. విప్లవ సాహిత్యంవల్ల సాహిత్య పరిధి సంకుచితమైపోతుందని వాపోయే వాళ్ళు ముందు తమ మనసుల్ని విశాలం చేసుకోవడం మర్చిపోతారు. సాహిత్యాన్ని ఒక ఉద్యమంగా అర్థం చేసుకుంటే తప్ప వాళ్ళకు ఈ విషయాలు అర్థంకావు. సాహిత్యం ఉద్యమ స్వభావాన్ని కలిగి వుండాలని కుటుంబరావు అనడంలో ఇంత అర్థం ఇమిడి ఉంది.

కుటుంబరావు మరొక ముఖ్య సూత్రీకరణ సాహిత్యానికి సమిష్టితత్వం ఉండాలనడం. చదువుకోవడానికి మాత్రమే పనికివచ్చి, నలుగురిలో చర్చించడానికి పనికిరాని సాహిత్యం వ్యర్థమని ఆయన ఉద్దేశం. కళలో సామూహిక లక్షణాలు వుండాలి. పదిమంది ఆలోచనను ఒక మార్గంలో పయనింపజేసే శక్తి దానికి వుండాలి. సాహిత్యంలోని ఈ సామూహిక లక్షణం వర్గ స్వభావంలోకూడా మార్పులు తీసుకు

రాగలుగుతుంది. బుర్రకథలు. ఒగ్గుకథలు, పాటలు, నాటకాలు వగైరా ఈ సామూహిక లక్షణాన్ని ఎక్కువగా కలిగి వుంటాయి. అందుకే విప్లవ సాహిత్యం ఎవరికి వారు చదువుకునే సాహిత్యంగా కాక, పదిమంది వినే సాహిత్యంగా, రూపొందాలని కుటుంబ రావు అంటారు. 'నవ్య సాహిత్య పరిషత్తు'కు ఈ శక్తి లేకపోవటం వల్లనే అభ్యుదయ సాహిత్యోద్యమం వచ్చింది. అభ్యుదయ సాహిత్యోద్యమం ఈ శక్తిని కోల్పోయినందువల్లనే విప్లవ సాహిత్యం పుట్టింది. విప్లవ సాహిత్యం ఈ లక్షణాన్ని నిలుపుకోలేకపోతే మరో సాహిత్యోద్యమం పుట్టక తప్పదు. మార్క్సిజం ప్రభావం లోకి రాని పాఠకులు వ్యష్టిగా వెక్కు సాహిత్యాన్ని కోరుకున్నా, సమిష్టిగా విప్లవ సాహిత్యాన్నే కోరుతారు. దీనికి కారణం విప్లవ సాహిత్యంలో ఉన్న సమిష్టితత్వమే. సాహిత్య స్వభావానికి సంబంధించి ఇదొక ముఖ్యమైన అంశం.

ప్రాచీన సాహిత్యం పట్ల మన దృక్పథం ఎలా వుండాలో కుటుంబరావు ఒక సందర్భంలో వివరిస్తారు. పాత సాహిత్యాన్ని ఈనాటి విశ్వాసాలతో విమర్శించవచ్చా అన్నది సమస్య. పాత సాహిత్యాన్ని పాత విశ్వాసాలతోనే విమర్శిస్తే దానివల్ల ఈ నాటి సమాజానికి ప్రయోజనం వుండదని ఆయన భావిస్తారు. బానిసత్వం అన్నది బానిస సమాజంలో మంచిదై ఈనాడు చెడ్డదిగా మారిపోలేదు. బానిసత్వపు సంకెళ్ళను ఛేదించే శక్తి ఆనాటి సమాజానికి లేకపోవడంవల్ల బానిసత్వం ఆనాడు నిలిచిందిగాని, అది మంచిది కావడంవల్ల మాత్రం కాదు. అలాగే ప్రాచీన సాహిత్యంలో లోపాలుంచే అవి ఆనాడూ, ఈనాడూ లోపాలే. అయితే ఆ లోపాలను సవరించుకునే శక్తి, అవ కాశం ఆనాడు లేకపోవచ్చు. కుటుంబరావు దృష్టిలో వేమన ఆ నాటికి విప్లవ కవే. కాని వేమన ఆనాడు చెప్పిన విషయాలనే ఇప్పుడూ చెప్పటం నేటి విప్లవకవి లక్షణం కాదు. పాత సాహిత్యంపట్ల ఎట్టి దృక్పథం కలిగి వుండాలో కుటుంబరావు ఇచ్చిన వివరణ సాహిత్య విమర్శకులకు మార్గదర్శకం.

రచయితకు, విమర్శకుడికి మధ్య వుండవలసిన సంబంధం ఏమిటో రచయిత కంటే ఎక్కువగా విమర్శకుడికి తెలియాలి. రచయిత తన స్వేచ్ఛను దుర్వినియోగం చేసేటప్పుడు దాన్ని గుర్తు చేయవలసిన బాధ్యత విమర్శకుడిది. అయితే రచయితకు వుండే స్వేచ్ఛ ఎలాంటిది? తన సాహిత్యాన్ని సంఘ ప్రయోజనాలకు ఉపయోగించు కునే స్వేచ్ఛ ప్రతి రచయితకూ వుంటుందని కుటుంబరావు అంటారు. కాని చాలా మంది రచయితలు స్వేచ్ఛ అంటే ఇలా అనుకోరు. నాలుగు డబ్బులు సంపాదించి పెట్టే రచనలు చెయ్యడం, ఏ పత్రిక ఎలా కోరితే అలా రాసివ్వడం, ప్రభుత్వంనుండి

ఎట్టి ఒత్తిళ్ళు రాకుండా జాగ్రత్తపడటం స్వేచ్ఛ అని బుద్ధిపూర్వకంగానో, అజ్ఞానం వల్లనో అనుకుంటారు. ఈ విషయంలో అజ్ఞానాన్ని ప్రదర్శించుకునేవాళ్ళు తమ అజ్ఞానం తొలగిపోతే మంచి సాహిత్యాన్నే సృష్టిస్తారు. బుద్ధిపూర్వకంగా ప్రవర్తించే వాళ్ళు సాహిత్యంలో వర్గశత్రువులు. సమాజంలో వర్గశత్రువుల విషపు కోరల్ని తీసేసేది విప్లవశక్తులు. సాహిత్యంలో వర్గశత్రువులను రూపుమాపే బాధ్యత విమర్శకు లది. విమర్శ ఈ కార్యాన్ని నిర్వర్తించాలంటే విమర్శకు వర్గస్వభావం వుండా లంటారు కుటుంబరావు. వర్గస్వభావం వున్న విమర్శ, విమర్శలోని పెడధోరణులను కూడా నివారించగలుగుతుంది.

విమర్శ గురించి ఇంత సమగ్రంగా ఆలోచించిన తర్వాత అసలు విమర్శ ఉనికినే ప్రశ్నించారు కుటుంబరావు. విమర్శతో అవసరంలేని పద్ధతిలో సాహిత్యం రూపొందినప్పుడు విమర్శే అక్కరలేదంటారు ఆయన. సాహిత్యం ఆ స్థాయికి ఎదగ డానికి కొన్ని శతాబ్దాలు పడుతుంది. విమర్శ అక్కరలేదన్న మాట ఈనాడు చాలా మందికి అర్థం కాకపోవచ్చు. ఆ మాట అనే స్థాయికి సాహిత్య విమర్శకుడుగా కుటుంబరావు ఎదిగారు. ఆయనను అర్థం చేసుకోవడానికి మనం చాలా ఎదగాలి.

# జీవితపు వరవళ్లు

మా. గోఖలే

కుటుంబరావు కక్కయ్య మనకు, సాహిత్యలోకానికి భౌతికంగా అందకుండా దూరమైపోయినాడు. కాని మనలోను, సాహిత్యలోకంలోను, సమాజంలోనూ శాశ్వతంగా వుండిపోయింది ఆయన ప్రతిపాదించిన సాహిత్య శాస్త్రవిజ్ఞానం.

ఆయన మన ఊహాకందని ఒక నూతన పంథా మహారచయితగా తను బతికుండగానే అయినాడు. కనుక గతించినాక అదనంగా ఆయనకు ముట్టచెప్పవలసిందేం వుండదు.

మా అమ్మకు మేనత్త కొడుకు అవటంవల్ల ఆయన నాకు కక్కయ్య అయినాడు. నాకు బుద్ధి తెలుస్తున్న నా అయిదవ ఏట నుండి ఆయన చివరి రోజుల వరకూ తనని సన్నిహితంగా ఎరుగుదును. విమర్శనా దృష్టితో మాట్లాడటం, సామాజిక జ్ఞానం అప్పట్లోనే కనపరుస్తూండటంవల్ల తోటివారిలో ప్రత్యేకంగా కనపడుతూ ఆయన నన్ను చిన్నతనంలోనే ఆకర్షించాడు. తర్వాత మా చరిత్రలు దగ్గరగా నడవటం, ఆయన దృక్పథాలకు నేను సన్నిహితంగా ఉండటం ఇందుకు దోహదం చేసింది.

కుటుంబరావు పుట్టింది (1909) పెరిగింది, భవిష్యత్తుకు విలువలున్న బీజాలు వేసుకుందీ తెనాలిలో.

ఆయన అయిదవ ఏట తండ్రి, పదకొండవ ఏట తల్లి మరణించారు. తోటి సంతతివారు అన్న వెంకట సుబ్బయ్య (ఓవర్సీరు, కవి, 'సాహితి' పత్రిక సంపాదక వర్గం వాడు — సన్యసించి వెళ్ళాడు), చెల్లెలు అన్నపూర్ణ, తమ్ముడు కృష్ణమూర్తి (కథకుడు, బొంబాయి ఫిలింస్ డివిజన్‌లో వ్యాఖ్యాత)తో వారు నలుగురు. ఆయన తన పదహారవ ఏట గుంటూరులో ఇంటరు, పందొమ్మిదవ ఏట విజయనగరంలో బి.ఏ., ఇరవయ్యవ ఏట బెనారస్‌లో ఎం.ఎస్‌సి. (పూర్తి చేయలేదు) చదివాడు.

బాల్యంలోను, యవ్వనంలోను విమర్శనావాది తత్వం కుటుంబరావుది. బంధువుల్లో దుస్సంప్రదాయాల్ని, నాటకాల్లో అసభ్యతను, అసమర్థతను, సాహిత్యరంగంలో ప్రయోజనారహితమైన రచనలను, కుతర్క రాజకీయాలను ఎగతాళి, విమర్శ చేసేవాడు. కాని యీ రంగాల్లో ఆయన సన్నిహితంగా పాల్గొంటూ వాటిలోని మంచి విలువల్ని పాటించకపోలేదు. అట్టి సందర్భాల్లోనే ఆయనకు కథారచనపై ప్రేరణ కలిగింది.

కుటుంబరావు ఆ రోజుల్లో, తన 15వ ఏటికే, ప్రముఖ ఇంగ్లీషు రచయితలను, ఆధునిక సాహిత్యాన్ని అమితంగా చదివేవాడు. ఆయన విమర్శనాత్మక ధోరణి గిట్టని మా బంధువులు ఆయన్ని "వెర్రికుట్టె, కొరకరాని కొయ్య" అనేవారు. వాళ్ళే ఆయన కథలు ప్రథమంగా పత్రికల్లో అచ్చయినప్పుడు చచ్చినట్టు వారి ధోరణిని కొంత మార్చుకుని "మనవాడు పరవాలేదే!" అనేవారు, లోపల కొంత కన్నీరు వుంచుకునే.

1931 లో, నా పద్నాలుగవ ఏట, మద్రాసు ప్రభుత్వ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్—క్రాఫ్ట్స్‌లో కళాభ్యాసం కోసం చేరాను నేను. ఆ సమయంలో కక్కయ్య మద్రాసు వచ్చి తన కథలను మొదట ప్రచురించిన ఆంధ్ర శేషగిరిరావును (గృహలక్ష్మి), శ్రీనివాస శిరోమణిని (చిత్రగుప్త) కలిసినపుడు, నేనూ ఆయనతో ఉండి, వారు కక్కయ్యను చాలా గౌరవించటం, రచన చేయటం గురించి అడగటం చూశాను. ఆ నాడు చలం స్త్రీల దుస్థితిపై తన దృష్టి కేంద్రీకరిస్తే, కుటుంబరావు సమాజంలోని కుళ్ళు, పీడలు, తిరోగతి, పురోగతుల్ని తన రచనలకు ఇతివృత్తంగా తీసుకుని రచనలు చేయటం మొదలుపెట్టాడు.

సాహిత్యం, కళలు సమాజాన్నుంచి విడదీయలేనివని, సాంఘిక ప్రయోజనం లేని రచనలు నిర్జీవమైనవని, మానవ పురోగమనానికి సాహిత్యం ప్రేరణ కలుగజేయ

గలదని ఆనాడే ఆయన విశ్వసించాడు. ఆయన రచనలు ఈ లక్ష్యాలకే పరిమితమై, పదునైన సూక్ష్మవాక్యాలతో విమర్శనాత్మకంగా నడిచి ఒక బలమైన శైలిని ఏర్పరచుకున్నాయి.

ఆనాటి కుటుంబరావు రచనలు సమాజం ఆమోదిస్తున్న సంప్రదాయాలకు పూర్తిగా విరుద్ధమైనవి. వీడు నిరుద్యోగి, బడుద్ధాయి, వక్రమార్గాల్లోపడ్డాడు, వీడు రాస్తే అవాకులూ చవాకులూ అచ్చు వేసుకునేందుకు మనకు పత్రికలు తలవెంట్రుకలన్నీ—అని చుట్టూ వుండే సంప్రదాయవాదులు, ఛాందసులు, పాత గొప్పల వాళ్ళూ వారూ ఆనాడాయన్ని అనేవారు.

తన రచనలపై నిలతీసిన వాళ్ళి నిర్భయంగా, నిర్మొహమాటంగా ఎదిరించేవాడాయన. ఫలానా తన రచన ఏ విధంగా పనికిమాలిందో సహేతుకంగా రుజువు చేస్తే తను రచనలు చేయటం మానుకుంటానని కచ్చితంగా వాదించేవాడు.

మా అమ్మ పిల్లలమర్రి వారి ఆడబడుచు (కక్కయ్య లమ్మా అంతే.) ఆ వంశంలో నటకులు, కవులు, సాహితీపరులు వున్నారు. కక్కయ్య రచనలు చదివినపుడు—"మన ఆచారాలు, నీతినియమాలు ఇంతమందికె (సమాజానికి) గిట్టగా లేంది నీకేం మాయరోగంరా వాటిపై పేపర్లో రాయటానికి? మీ అమ్మా నాన్నలుంటే నువిలా చెడేవా?" అని మా దగ్గిర ఆడచుట్టాలు కక్కయ్యని అనడం ఎరుగుదును. "మన బుద్ధులు మన ఇళ్ళ గడపలు దాటవు గనక నా రాతలు మీకు గిట్టవు. మీ ఆచారాలు, నీతినియమాలకు మగ్గుతున్న ఓ నలుగుర్ని—మాట వరసకు—నన్ను బయటికి లాగనిస్తే, వారికి సుఖపడే గీత ఎలా వుంటుందో రుజువు చేస్తా" అని వారికి సమాధానం ఇచ్చేవాడు కక్కయ్య. ఆయన తన రచనలో చూపే ధోరణే నిత్యజీవితంలో కూడా అక్షరాలా కనపడేది.

కక్కయ్య కంఠం శ్రావ్యంగా వుండేది. సంగీతాభిలాష ఎక్కువ. శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించటం, స్వరం అల్లటం నేను తెనాల్లోనే చూశాను.

తెనాలి ఆ రోజుల్లో సాహిత్యానికి, నాటక రంగానికి, రాజకీయాలకు, విద్యావంతులకు, విమర్శకులకు కూడలి స్థలం. కక్కయ్యకు సమకాలికులు, సన్నిహితులైన ఆధునిక రచయితలు చలం, గోపీచంద్, జి. వి. కృష్ణారావు, చక్రపాణి, ధనికొండ, బాలకృష్ణశాస్త్రి తెనాలి వాస్తవ్యులే. కృష్ణశాస్త్రి, శివశంకర శాస్త్రి మొదలైన వారు తరచు తెనాలి వస్తూ బ్రహ్మసమాజ కార్యకలాపాలు, 'నవ్యసాహిత్య పరిషత్'

ఔత్సాహికులతో సమావేశాలు జరుపుతూ వుండేవారు. కక్కయ్యకు వారు పరిచితులేకాక, 'నవ్యసాహిత్య పరిషత్'లో ఆయన సభ్యుడు కూడా. (అయితే త్వరలోనే రాజీనామా చేశాడు.)

తెనాలి 'రామవిలాస సభ' నాటక సమాజం నటులు మాధవపెద్ది వెంకట్రామయ్య, స్థానం నరసింహారావు, గోవిందరాజుల సుబ్బారావు, అద్దంకి శ్రీరామమూర్తి, సి.ఎస్. ఆర్. ఆంజనేయులు, బలిజేపల్లి లక్ష్మీకాంత కవి మొదలైన వారి ఉమ్మడి నాటక కార్యకలాపాలు జరుగుతున్న ఆ కాలంలో, వారి పరిచయం కక్కయ్యకు వుండేది.

ఇట్టి సాహిత్య, నాటక, సంగీతాది కార్యక్రమాల వాతావరణంలో కక్కయ్య అభిరుచులు, రచనా దృక్పథానికి గట్టి పునాదులు ఏర్పడి ఆయన భవిష్యత్తుకు ఉపకరించినై.

1925లో తన పదహారవ ఏట కక్కయ్యకు వివాహం జరిగి, ఇంకో ఆరేళ్ళకు కొడుకు రామచంద్రరావు (పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో ఎడిటింగ్ ప్రొఫెసర్) పుట్టాడు. తర్వాత 1929లో బెనారస్ చదువు అనంతరం, 1931లో వరంగల్, హనుమకొండలలో టీచరుగా పనిచేసి, ట్యూషన్లు చెప్పి, మళ్ళీ తెనాలిచేరి సొంతగా ప్రెస్సు పెట్టుకున్నాడుగాని, అది ఎక్కువ రోజులు నడిచింది కాదు.

అయితే ఆనాడు కక్కయ్యకు, చక్రపాణికి ఏర్పడ్డ మైత్రి ఒక అపూర్వ విశేషంగా పెంపొంది, ఉభయుల అంత్యదశల వరకు ప్రాణపదంగా వీరివెంట వచ్చింది. ఇది ఒకరి మేధస్సులను ఒకరు తెలుసుకున్నందువల్లనే సాధ్యమైంది. చక్రపాణి గాఢమైన సాహిత్య ప్రియుడు, రచయిత. ఆయన శరత్, రవీంద్రనాథ మైత్రా, తారాశంకర బెనర్జీ తదితరుల రచనలు తర్జుమా చేసి 'యువ' ప్రచురణలనే పేర పుస్తకాలు ముద్రించటం సాగించాడు. కక్కయ్య కథల పుస్తకాలు కూడా చక్రపాణి ద్వారానే మొదట అచ్చయ్యాయి.

కక్కయ్య భార్య 1940లో మరణించటంతో, ఆయన తన కొడుకును బంధువులకు అప్పగించి తెనాలి నుండి సెలవు తీసుకున్నాడు.

అప్పటికి నాగేశ్వరరావు పంతులు గతించగా, ఆంధ్రపత్రిక ఆధిపత్యాన్ని శంభుప్రసాద్ స్వీకరించాడు. 1940లో కక్కయ్య ఆంధ్ర వారపత్రిక సంపాదక వర్గంలో చేరాడు. తర్వాత కొద్ది నెలలకే నేను కూడా ప్రధాన చిత్రకారుడిగా చేరాను.

సుమారు 1942 లో ప్రజానాట్యమండలి వారి 'మా భూమి' నాటకం, నాజరు 'బెంగాలు కరువు' బుర్రకథ ఆ రోజుల్లోనే మొదలై రూపురేఖలు దిద్దుకుంటున్న అభ్యుదయ రచయితల సంఘం కార్యకలాపాలూ మద్రాసులో పెద్ద సంచలనం కలుగ చేసినందువల్ల శ్రీశ్రీ, కొడవటిగంటి మొదలైన ప్రముఖ రచయితలు అభ్యుదయ రచయితల సంఘంలో చేరటం జరిగింది. ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ (భారతదేశం అంతటా కూడా) ప్రజా నాట్యమండలిని, అభ్యుదయ రచయితల సంఘాన్ని ఎక్కువగా ప్రోత్సహించి అండగా వుండేది.

'ఏది అభ్యుదయ సాహిత్యం?' అంటూ ఆనాడు చెలరేగిన గాలిదుమారాన్ని శ్రీశ్రీ, కొడవటిగంటి బలంగా ఎదుర్కొని అభ్యుదయ రచయితల సంఘం సాహిత్య పత్రిక 'అభ్యుదయ'లో గట్టి రచనలు చేశారు. ఈ సంఘం ఆధ్వర్యంలోనే, తెనాలి వద్ద పెదపూడి అనే పల్లెటూర్లో, చదలవాడ పిచ్చయ్య సహకారంతో, దాదాపు ఒక మాసంపాటు సాహిత్య పాఠశాల ఒకటి నడచింది. చరిత్ర పరిశోధకులు, భాషా పండితులు, ప్రముఖ రచయితలు, కళాకారులు ఇందులో పాల్గొన్నారు. పాఠశాల ప్రారంభకులుగా మద్రాస్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ ప్రిన్సిపాల్ దేవీ ప్రసాదరాయ చౌధరి, రోజుకు ఒక తరగతి నడిపేందుకు శ్రీశ్రీ, కొడవటిగంటి, కృష్ణశాస్త్రి, మల్లంపల్లి సోమశేఖరశర్మ, కోరాడ రామకృష్ణయ్య, నిడదవోలు వెంకటరావు, పంచాఙ్గుల ఆది నారాయణ శాస్త్రి, శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, జమ్మలమడక మాధవరాయ శర్మ, అయ్యల సోమయాజుల నరసింహం శర్మ, మద్దుకూరి చంద్రశేఖరరావు, నేను వగైరా పాల్గొన్నాము.

కక్కయ్య రచనల్లో ఆనాటి వరకు సామాజిక ప్రయోజనకర విధానం కనిపించినా, 'అరసం', కమ్యూనిస్టు పార్టీ సంపర్కం, మార్క్సిజం పఠనంవల్ల ఆయన రచనా విధానంలో, ఆ తర్వాత నుండి గతితార్కిక భౌతిక విధాన దృక్పథం కొట్ట వచ్చినట్లు కనుపించటం ప్రారంభమైంది. ఈ దృక్పథ పురోగమనం వల్లనే ఆయన మన వాతావరణానికి సాహిత్య శాస్త్ర విజ్ఞానాన్ని ప్రతిపాదించటం జరిగింది.

ఒక విధంగా 'ఆంధ్ర వారపత్రిక' నూతన విధానం, పెరుగుదల కొన్ని మాట పట్టింపులకు దారితీయటంవల్ల కక్కయ్య ఆ ఉద్యోగం వదిలి, 1942 ఆఖరులో— రెండవ ప్రపంచయుద్ధపు పనులకు—బొంబాయి, సిమ్లా, జయపూర్‌లలో పనిచేసి (బొంబాయిలో ఒక మిత్రుడి ప్రోద్బలంవల్ల అతని చెల్లెల్ని వివాహమాడి, జయపూర్

వెళ్ళిన కొద్ది రోజుల్లోనే ఆమెను పోగొట్టుకున్నాడు), 1945 ప్రాంతంలో మద్రాసు తిరిగి వచ్చాడు.

అప్పటికి నేను 1943 లో 'ఆంధ్రపత్రిక'ను వదల, చక్రపాణి ప్రోద్బలంతో, ఆయన నాగిరెడ్డితో కలిసి బి.ఎన్.కె. ప్రెస్సులో ప్రారంభించిన 'ఆంధ్రజ్యోతి' కథల మాసపత్రికలొ చేరాను. చక్రపాణి అదే ప్రెస్సులో తన 'యువ' ప్రచురణల పని కూడా చూచుకునేవాడు. ఆనాటి అభ్యుదయ సాహిత్యోద్యమంలో పడిన నేను 1944లో చక్రపాణివద్ద సెలవు తీసుకోకుండానే, విజయవాడలో అప్పుడే ప్రారంభమవుతుండిన కమ్యూనిస్టు పార్టీ దినపత్రిక 'ప్రజాశక్తి'లో చేరాను.

1945 లో మద్రాసులో వున్న కక్కయ్యకు కొమ్మూరి పద్మావతమ్మ ప్రథమ పుత్రిక వరూధిని చిన్నమ్మతో ఆయన తృతీయ వివాహం జరిపించాము—ఆ రిజిష్టరు పెళ్ళికి సాక్షి సంతకాలు చేసింది శ్రీశ్రీ, నేనూ అయితే, శుభాశీస్సులు బళ్లారి రాఘవాచార్యుల నుండి ముట్టినై.

తర్వాత, కమ్యూనిస్టు పార్టీని ప్రభుత్వం నిషేధించటంవల్ల నేను మద్రాసు మళ్ళీ వచ్చి, తిరిగి 'ఆంధ్రజ్యోతిలో' చేరాను. పిల్లల మాసపత్రిక 'చందమామ'ను కూడా చక్రపాణి అప్పుడే ప్రారంభించారు.

అప్పటికి ఇంకా ఏ ఉద్యోగమూ దొరకని కక్కయ్య 1949 లో ఈసారి 'ఆంధ్ర దినపత్రిక'లో చేరి, 1952 నాటికి 'చందమామ'కు ఎడిటరుగా చేరాడు. ఆయన జీవితంలో ఈ ఒక్క ఉద్యోగమే—1952 నుండి 1980 వరకు—స్థిరంగా నిలిచి పోయింది. ఆయన చాలా గట్టి స్వతంత్రభావాలు గలవాడు. తన రచనల విషయంలో ప్రత్యేకించి జీతం డబ్బులకోసం—ఏనాడూ తన అభ్యుదయ పంథా నుండి దిగజార లేదు. ఆయన భావాలు తన ఉద్యోగాలు ఊడేందుకు ఎక్కువచోట్ల పనిచేసినై. "నాకు ఉద్యోగాలు అచ్చిరావు" అని ఆయన అన్నాడంటే రచయితగా తన స్వాతంత్ర్యానికీ, చేసే ఉద్యోగాలకూ వైరుధ్యాలొస్తున్నాయని మనం అర్థం చేసుకోవచ్చు. ఉదాహరణకు, ఆయన సాధించిన సత్ఫలితాలకు 'ఆంధ్ర వారపత్రిక' తరఫున కక్కయ్యకో చిన్న యోగ్యతాపత్రం లభించింది. "మీ హయాంలో వారపత్రిక కవరు పేజీ చాలా ముచ్చటగా వుంటున్నదండీ" అన్నదే ఆ పత్రం. అంటే పత్రిక విలువా (పాఠకుల లేఖల్లో ఈ విషయం వ్యక్తమయేది.), సర్క్యులేషనూ పెరగటం పరిగణన లోకి రాక, ఆయన మెరుగుపరచింది కేవలం అట్టమీదబొమ్మ మటుకేనని చెప్పటం. కక్కయ్య వెంటనే తన ఉద్యోగానికి రాజీనామా చేశాడు.

కోడంబాకం ట్రస్టుపురంలో కక్కయ్యకు సొంతంగా ఇల్లు ఏర్పడి, వరూధిని చిన్నమ్మకు ఒక ఆడపిల్ల. ఇద్దరు కొడుకులు పుట్టారు. ఆడపిల్ల శాంతసుందరికి వివాహం, పెద్దవాడు రోహిణీ ప్రసాద్—న్యూక్లియర్ ఫిజీషియన్—ఉద్యోగంలో చేరి వివాహమాడటం జరిగినై. (రెండవ పిల్లవాడు 'బగ్గీ' గతించాడు.)

ఇప్పటికీ అచ్చయిన కక్కయ్య వేలాది రచనల్ని కొందరయినా చదివి ఉండటం అసాధ్యం అనుకుంటా. ఆయన దిట్ట అయిన బహుముఖ రచయిత అని—షుమారుగా—నాకు తెలుసు. ఆయన గతించిన కొద్ది కాలంలో అనేక పత్రికల్లో పడ్డ దాదాపు యాభై రచనల్లో కొన్ని అంది, చదివినాక ఒక వింత అనుభూతి పొంది. ఈయన మన సాహిత్యలోకానికి, సమాజానికి సాహిత్యశాస్త్ర విజ్ఞానం ప్రతిపాదించిన ఒక అసాధారణ రచయితగా మనమధ్య జీవించినవాడని నేను భావించాను.

# సిద్ధాంతాలు - నిత్య జీవితం

## కొడవటిగంటి రోహిణీ ప్రసాద్

నాకు ఊహ తెలిసినప్పటినుంచీ మా నాన్నగారిని, ఏ వ్యాపకమూ లేకుండా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోగా చూసినట్టు గుర్తులేదు. నిద్రపోయినప్పుడు తప్ప తక్కిన సమయంలో చదవడమో, రాయడమో, తోటపనో ఏదో ఒకటి చేస్తూనే ఉండే వారు. మనస్సుకూ, దేహానికీ సోమరితనం అనేది లేకపోవడం ఆయన వ్యక్తిత్వం లోని ముఖ్యలక్షణం అనుకుంటాను.

ప్రసిద్ధ వ్యక్తులు తమ ఆంతరంగిక జీవితంలో ఎలా ప్రవర్తిస్తారో తెలుసు కోవాలని సామాన్యంగా అందరికీ కుతూహలంగా ఉంటుంది. మా నాన్నగారి విష యంలో ఈ సంగతి చెప్పడం చాలా సులభం. రచయితగా ఆయనకు ఏ అభిప్రాయాలు ఉండేవో, వ్యక్తిగా కూడా అవే భావాలు ఉండేవి. ఈ విషయంలో ఆయన నిజాయితీ నూటికి నూరుపాళ్ళని చెప్పగలను. ప్రపంచంలో ఆయనకు ఆసక్తి కలిగించే విష యాలు ఎన్నో ఉండేవి. దాదాపుగా వాటన్నిటి గురించీ ఆయన అసంఖ్యాకమైన తన లేఖల్లోనో, వ్యాసాల్లోనో ప్రస్తావిస్తూనే ఉండేవారు. ఉత్తరాలకు ఆలస్యం చెయ్య కుండా శ్రద్ధగా జవాబు రాయడం ఆయనకు అలవాటు గనుక ఈ సంగతి చాలామందికి తెలిసినదే.

తక్కిన విషయాలలో కూడా ఆయన నమ్మకాలూ, అభిరుచులూ ఖచ్చితంగానే ఉండేవి. పూజలూ పునస్కారాలూ మా 'ఇంటా వంటా' ఉండే ఆస్కారం మొదటి నుంచీ లేదు. ఒకసారి మద్రాసులో మా పొరుగువాళ్ళు 'రాధా కల్యాణం' నిమిత్తమై చందాలు వసూలు చేద్దామని వస్తే మా నాన్న వాళ్ళని — రాధ ఎవరనీ, ఆమె కల్యాణం తమ రెందుకు చేయాలనీ అడిగారు. వచ్చినవాళ్ళు తెల్లబోయి తిరిగి వెళ్ళవలసి వచ్చింది. మద్రాసువంటి 'ఆస్తిక' నగరంలో ఈ రకం గొడవలు మామూలే అయినా, ఆ రోజునుంచీ మా కాలనీవాళ్ళు ఇటువంటి విషయాలలో మా ఇంటి జోలికి రావడం మానేశారు.

ఇన్స్యూరెన్స్ దరఖాస్తులు వగైరా నింపేటప్పుడు 'మతం' ప్రస్తావన వస్తే మా నాన్నగారికి బాగా చిరాకుగా ఉండేది. చివరి రోజులలో సోషల్ ఆంత్రొపాలజీ వంటి వాటిలో ఆసక్తి పెరిగి మూఢాచారాల మూలకారణాలు అర్థం చేసుకున్నాక, ఆయనకు ఈ భజన సమాజాలవాళ్ళని చూస్తే మరీ విసుగ్గా ఉండేది.

పెళ్ళి వగైరాల గురించిన ఆయన అభిప్రాయాల దృష్ట్యా, మా ఇంట జరిగిన రిజిస్టర్డ్ పెళ్ళిళ్లూ, కట్నాలు పుచ్చుకోకపోవడాలూ పెద్ద విశేషంగా కాకపోయినా అవి ఆయన వ్యక్తిత్వంలోని భాగాలే.

మా నాన్నగారి 'శాస్త్రీయ దృక్పథం' నిజంగానే సైంటిఫిక్‌గా ఉండేది. ప్రతిదీ శాస్త్రీయ పద్ధతిలో చదివి అవగాహన చేసుకుంటే తప్ప ఆయనకు తృప్తి ఉండేది కాదు. క్లిష్టమైన వాటిగురించి చదివి నప్పుడు వివరంగా నోట్సు రాసుకోవడం ఆయనకు అలవాటు. సైన్సులో ఆయనకు ఆసక్తి ఎక్కువ. తనకు ఉన్న వ్యవధిలో, ప్రపంచంలో జరుగుతున్న పరిశోధనల వివరాలన్నీ తెలుసుకుంటూ ఉండేవారు. ఆయనకు ప్రతిదీ తాను నేర్చుకుని ఇతరులకు చెప్పడం అలవాటు. ఆయన వ్యాసాలలో ఇది స్పష్టంగా కనిపిస్తుంది.

మా నాన్న ముఖ్యమైన వ్యాపకాలలో తోటపని ఒకటి. 1957 లో కోడంబాకంలోని స్వంత ఇంటిలో ప్రవేశించినప్పటి నుంచి చివరి రోజుదాకా తోటలో తిరిగి మొక్కలు పాతి, నీళ్ళు పోసి ఆ పనులలో మునిగి తేలడం ఆయన రోజువారీ కార్యక్రమం. జబ్బుపడ్డాక విశ్రాంతి తీసుకోమని డాక్టర్లు చెప్పినా, శరీరానికి వ్యాయామం ఉండాలని తోటలో తిరిగి చిన్న చెంబుతోనైనా మొక్కలకు నీళ్ళు పోసేవారు.

మా బాబాయి కృష్ణమూర్తిగారికీ, మా నాన్నకూ చాలా కాలంగా హోమియోపతి వైద్యంలో ప్రవేశం ఉండేది. ఫొటోగ్రఫీలో కూడా ఆయనకు చాలా దశాబ్దాలుగా ఆసక్తి ఉండేది. మనమరాళ్లూ, మనమలూ పుట్టినదాకా కూడా ఉత్సాహంతో స్వయంగా ఫొటోలు తీస్తూనే ఉండేవారు. 'కినిమా' మాసపత్రిక నడచినన్నాళ్లూ సినిమాటోగ్రఫీ, ట్రిక్ ఫొటోగ్రఫీ వగైరాలను గురించి పాఠకులకు ఆసక్తి కలిగించే వ్యాసాలు ప్రచురించారు. మా నాన్నగారి అతిముఖ్యమైన మరొక వ్యాపకం సంగీతం.

రచయితగా ఆయన గురించి నేను ప్రత్యేకంగా రాయగలిగిందేమీ లేకపోయినా, రాయడంలో ఆయన పద్ధతి అపూర్వమైనదిగా నా కనిపిస్తుంది. తెలుగులో అంత 'ప్రొఫెషనల్' రచయిత మరెవరూ లేరేమో. ఏ విషయం గురించి అయినా సులభమైన భాషలో, వ్యర్థమైన పదాలు లేకుండా రచనలు చెయ్యగలగడమే కాక, రాసినదానికి చిత్తుప్రతి అనేది కూడా తయారు చేసుకోకపోవడం విశేషమని నే ననుకుంటాను. ఏది రాసినా ఒకసారే రాసేవారు. రాసినదాన్ని దిద్దటంగాని, తిరగ రాయటంగాని చేసేవారు కాదు. అలాంటి అవసరమూ ఉండేది కాదు. 'ఇది ఎలా సాధ్యం' అని నే నడిగితే—రాసే వేగమూ, ఆలోచించే వేగమూ సమానంగా ఉండాలనీ, ఏది ఎక్కువైనా కష్టమేననీ అన్నారు. ఇది తాను అభ్యాసంలో సాధించిన ప్రజ్ఞ. ఆయన ఉత్తరాలు కూడా స్పష్టంగా సూటిగా ఉండేవి. ఆయన రాసిన 'చందమామ' కథలన్నింటిలోనూ ఈ లక్షణం కనిపిస్తుంది. ఏదైనా రాసేటప్పుడు మంచంమీద బోర్లాపడుకుని రాసేవారు. సిగరెట్లు కాల్చే రోజులలో చేతిలో సిగరెట్టుండేది.

మానసికంగా మా నాన్నగారికి 'ముసలి' లక్షణా లుండేవి కాదు. వయస్సువల్ల తన శరీరం పట్టుతప్పుతున్నదని గమనించి ఆయన ఆశ్చర్యపడేవారు. 1979 లో బాగా జబ్బు పడ్డప్పుడు బ్రెయిన్ స్పెషలిస్టు ఒకరు ఆయన రోగలక్షణాలను వివరిస్తూ 'ఎప్పటికైనా పోవలసిందేకదా' అన్న ధోరణిలో మాట్లాడితే అతన్ని కోప్పడి, అది కర్మవాదం (Fatalism) అవుతుందనీ, వైద్యం కాదని అన్నారు. చివరిదాకా ఎప్పుడూ పెద్ద జబ్బులతో తీసుకోకుండా జీవించగలగడం ఆయన వ్యక్తిత్వానికి సరిపోయిందని అనుకుంటాను. జబ్బు పడటమన్నా, సేవలు చేయించుకోవటమన్నా ఆయనకు విసుగుగా ఉండేది. వైరాగ్యం, వేదాంత ధోరణీ ఉండేవి కావు.

మా నాన్న తన జీవితంలోని ప్రతిదశలోనూ, తన బుద్ధినీ మనస్సునూ వికసింపజేసి ముందుకు తీసుకువెళ్ళే విషయాలవైపే మొగ్గు చూపారు. ఆయనకు సమకాలికు

లనూ, తర్వాతి తరాలవారినీ చూసినప్పుడు, ఆయన ఏ స్థితికి దిగజారి ఉండగలడో అర్థం అవుతుంది. నిరాశావాదం గానీ, పలాయన మిథ్యావాదాలు గానీ ఎప్పుడూ ఆయనను అంటలేదు. నిత్యజీవితంలో అల్పమైనవి అని ఆయన అనుకున్న విషయాలలో జోక్యం కలిగించుకునేవారు కాదు. పిల్లలుగా మేము ఆయన దగ్గిర ప్రత్యక్షంగా నేర్చుకున్నది ఏమీ లేకపోయినా, ఇంటి వాతావరణంలో పరోక్షంగా ఆయన 'మానసిక శక్తి' పని చేస్తూనే ఉండేది. రచయితగా కూడా ఆయన తన కథలలో ఇదే పద్ధతి అవలంబించినట్టు కనిపిస్తుంది.

# ప్రాక్ - పశ్చిమ సంఘర్షణలు

'చందమామ' రామారావు

"ఏమండీ రామారావుగారూ, నేను సడెన్‌గా చచ్చిపోయినా మీకు ఏమీ యిబ్బంది వుండదు, మార్చి నెల వరకూ కథలన్నీ తయారు చేశా," నన్నారు కుటుంబరావు, ఎవరో వర్ధమాన రచయితకు జవాబు వ్రాసి, అతగాడి వుత్తరం చింపేస్తూ.

ఈ రిమార్కులో నిస్పృహ, నిస్త్రాణ, రోత ధ్వనించినై. ఇది ఆయన నిష్క్రమణకు పదిరోజుల ముందు.

స్థలం: 'చందమామ' సంపాదకవర్గపు గదిలో, వారి బల్లవద్ద. సమయం: వారు యింటికి ప్రయాణమవుతున్న ఒంటి గంట. వారూ, నేనూ, మరొక ఉద్యోగీ మధ్యాహ్నం యిళ్ళకు కలిసి వెళ్ళటం రివాజు.

వెంటనే నా సహజ ధోరణిలో "ఎక్కడికి వెళ్ళుతారండి? ఎందుకా తొందర. యింకెంత సాహిత్య సేవ చేయాలో" అన్న నాతో, "ఎందుకండి యింకా బ్రతకటం. యీ వెధవ సాహిత్యంలో నా పేరు కూడా వుండాలి!" ఛళ్ళున అన్నారు.

కుటుంబరావు తన చిన్న మనుమరాల్ని ఎంతో ఆప్యాయతతో పెంచారు. ఇంచుమించు ఆయన పొట్టమీద ఆడుకుంటూ పెరిగింది ఆ పసిది. కుమార్తె, అల్లుడు దూరదేశాల్లో ఉండటం, ఆ పాప కూడా వారితోపాటే వెళ్ళటంజరిగినపుడు — మమకారం ఎరుగని కుటుంబరావు హృదయం ఎంతో తల్లడిల్లింది. "మా అమ్మాయివాళ్ళు వస్తున్నారండి. త్వరగా యింకా వారం ముందు రాగూడదూ!" అన్నారు ఒకరోజు. ఆయన కీర్తిశేషులైన సరిగా వారానికి కుమార్తె, పిల్లలు ఢిల్లీలో దిగారు. Premonition అనుకుంటా.

1945 లో మా 'ఆంధ్రజ్యోతి' పత్రికకు వ్యాసాలు రాయించటం, సేకరించటం చేస్తుండేవాడిని నేను. ఒకసారి, "ఏమండి కుటుంబరావుగారూ, మీరు మధ్యతరగతి శ్రోత్రియ కుటుంబంలో పుట్టారు. ఆ వ్యవస్థకు శాశ్వతమైన అక్షరరూపం యివ్వరాదూ?" అన్నాను. నా సూచనను మన్నించి, విమర్శనా దృష్టితో 'చదువు' నవల రాశారు. మరోమారు, "ఏమండీ, మీరు ఒక ట్రిక్కుకు సరిపడ్డ రచనలు చేసి వుంటారు. ఏదీ ఒక్క పాత్రనయినా రూపొందించలేదే. మీ రెందుకు చేయరు?" అన్నాను. ఆయనకు చురకలా తగిలింది. "ఏం, నా డిటెక్టివ్ కేయాస్ నిలుస్తాడేమో" అన్నారు చిరునవ్వుతో.

"మన స్టూడియో వాళ్లు Back Projection Instrument తెప్పించారు, చూసారా?" అని అడిగారు, ఒకరోజు నేను తన సీట్ వద్దకు వెళ్ళినపుడు. "ఏమండి కుటుంబరావుగారూ మనం మోసే తలకంటె మించిన Instrument ఎక్కడుందండీ! Multidimensions లో Project అవుతుందే" అన్నాను. అందుకు సమాధానంగా, ఎంతో తేజోవంతమైన కళ్ళతో, "అదేనండి నేను సాగిస్తున్న పరిశోధన. ఎన్నో అడ్డంకులు, సమాధానాలు, సందేహాలు ఎదురవుతున్నాయి. సాహిత్యంలో ఏముంది చచ్చు ఆనందం" అన్నారు.

ప్రముఖ చరిత్రకారుడు కోశాంబి పరిశోధనలు కుటుంబరావుకు యిష్టమైన విషయం. సుమేరియన్, బాబిలోనియన్, సిరియన్, ఈజిప్షియన్, హరప్పా - మొహంజొదారో నాగరికతల గురించి, హిందూ సమాజ పరిణామాల గురించి ఆయన సాధికారికంగా చెప్పేవారు. దీనిపై చిన్న చిన్న పుస్తకాలు కొన్ని వేయించారట కూడా.

కుటుంబరావు రచనలు రాశిలో, వాసిలో ఎన్నికగన్నవని అందరికీ తెలుసు. ఆయన ప్రతిదినం డైరీ రాసేవారు, సామ్యూల్ పెప్పీస్ లాగా. ఏం రాస్తారండీ

అంటే, ఎప్పుడైనా చూస్తారుగా అని సమాధానం ఇచ్చారు ఒకసారి. (శ్రీపతి వగైరాధిని ఈ పనికి పూనుకోవాలి.)

"రామారావుగారూ, ఇంక నేను Invalid నండీ. ఎందుకంటే యింకా బ్రదకటం" అనేవారు ఒక్కొక్క రోజు. కాని కలంవీరుడు. చనిపోవటానికి ముందు అరగంటవరకూ రాస్తూనే ఉన్నారు.

ఆయన 'చందమామ' ద్వారా పిల్లల కథలకు ఒక ఆకృతి, శైలీ రూపొందించారు. ఒకమారు విజయవాడలో విశ్వనాథను చూడటానికి వెళ్లాను. "ఏమయ్యా, 'చందమామ'ను నాచేత కూడా చదివిస్తున్నారు. హాయిగా బాగుంటుంది" అన్నారు. ఈ ఖ్యాతి అక్షరాలా కొడవటిగంటిది.

బుల్లి కథను నవలీకరిస్తున్నా, బృహత్కథను సంక్షిప్తపరుస్తున్నా ఆయన వ్రాతప్రతిలో ఒక్క కొట్టివేత, ఒక తుడుపు కనిపించదు. పూసల్లాంటి చిన్న అక్షరాలు దండ గుచ్చినట్లు వుంటాయి. ఆయన మనస్సు లాగే అక్షరాలూ సున్నితంగా వుంటై.

కుటుంబరావు ఎరుగని కళగాని, శాస్త్రంగాని లేదేమో. క్రమశిక్షణ, నియమ జీవనం, చిరుకోపం ఆయన ప్రత్యేకతలు. తోటపని, ఫొటోగ్రఫీ ఆయన హాబీలు. సంగీతం అంటే ప్రీతి. పువ్వులు ఆనందదాయకాలు.

నలభై మూడు సంవత్సరాలపాటు ఓ మహామేధావి నాకు దగ్గర కొండ. అయితే ఆయన విప్లవాత్మక దృక్పథం, రచనలు నాకు చుక్కెదురు. ఆయన ఆశయాలు, రచనలు నాపై ఏ ప్రభావాన్ని కలిగించ లేదు. నాకు కుటుంబరావుగానే కనిపించాడు. ఆయనలో నాకు ప్రాక్ - పశ్చిమాల సంఘర్షణలు కనిపించేవి. కుటుంబరావు అలౌకికుడు, అప్రాచ్యుడు గాదు (not a western).

# క్రమశిక్షణపట్ల ప్రీతి

బి. విశ్వనాథరెడ్డి

కుటుంబరావుగారితో నాకున్న సాన్నిహిత్యం చాలా కాలంగా ఉన్నట్లు నేను చెప్పుకోలేను. మమ్మల్ని సన్నిహితులుగా చేసింది 'చందమామ'. 'చందమామ'ను తీర్చి దిద్దడంలో మేము కృషి చేశాము. అప్పుడే ఆయనతో నాకు కొంత సాన్నిహిత్యం ఏర్పడింది.

మా పరిచయకాలంలో కుటుంబరావుగారిని గురించి - వ్యక్తిగానూ, బాల సాహిత్య రచయితగానూ తెలుసుకోవడానికి నేను ప్రయత్నించాను. బాలసాహిత్యంలో ఆయన మేధావి. 'చందమామ' కథల ద్వారా ఆయన ఎందరో బాలల మనోవికాసానికి తోడ్పడ్డారు. ఆయన జీవితంలోని ఇతర అంశాల గురించి కూడా తెలుసుకోవడానికి నేను ప్రయత్నించాను. కాని అందుకు నాకు తగినంత వ్యవధి, అవకాశమూ లేకుండా పోయాయి. ఆయనకు సాహిత్య, విజ్ఞాన రంగాలలోని అన్ని శాఖలలోనూ ప్రవేశ మున్నది. ప్రాచీన గ్రంథాలతో ఆయన కెంత పరిచయ మున్నదో, ఆధునిక విజ్ఞాన శాస్త్రంతోనూ అంతటి పరిచయం వున్నది. ఈ అంశాలలో ఆయన సాధించిన పరి పూర్ణత మాకు మార్గదర్శకమైంది.

కుటుంబరావు గారిలో అన్నిటికన్న నాకు నచ్చిన అంశాలు - క్రమశిక్షణపట్ల ఆయనకు గల ప్రీతి, "ఇది నాది" అనుకుని బాధ్యతలను స్వీకరించే మనస్తత్వం. చక్రపాణి గారి మరణానంతరం 'చందమామ' నిర్వహణ బాధ్యత నా మీద పడింది. అయినా కుటుంబరావుగారు నా నేతృత్వాన్ని వెంటనే అంగీకరించడమే కాక, చూపిన సహకారాన్ని నే నెన్నడూ మరువలేను. ఆయన వ్యక్తిగత నమ్మకాలు ఏవైనా కావచ్చును. కాని ఆయన, తాను బాలల కుటుంబమైన 'చందమామ' కుటుంబానికి చెందినవాడిననే అనుకునేవారు. ఆయన ఎన్నడూ కూడా తన వ్యక్తిగత అభిప్రాయాలను 'చందమామ' కోసం రాసిన కథలలో గాని, సంపాదకత్వ బాధ్యతలో గాని వ్యక్తం చేసేవారు కాదు.

కుటుంబరావు గొప్ప ఆశావాది. సరళ స్వభావుడు. తన ఆరోగ్యం క్షీణిస్తున్నా కూడా ఆయన ఎన్నడూ నిరాశతో కృంగిపోలేదు. చివరి వరకూ రచనా వ్యాసంగం కొనసాగిస్తూనే వచ్చారు. ఈ కారణంగానే "ఆయన ఇవాళ లేరు" అంటే నాకు నమ్మశక్యంగాకుండా వుంది. ఆయన మరణం నాకు ప్రచురణ కర్తగానే కాకుండా వ్యక్తిగతంగా కూడా ఎనలేని లోటు. కుటుంబరావుగారి విలువైన సాహచర్యాన్ని, సలహాలను నే నెన్నడూ మరువలేను.

# లెనిన్ అడుగుజాడల్లో.....

కె. జి. కృష్ణమూర్తి

1949 అక్టోబరులో అజ్ఞాతవాసం గడపడానికి మద్రాసు వచ్చాను. సెంట్రల్ స్టేషన్‌లో దిగగానే ప్రతివారూ నా వంకే చూస్తున్నారేమో నన్న ఆందోళన! చివర కెలాగో సందుగొందులు దాటి హైకోర్టు దగ్గరకు చేరాను.

నిద్రలేకపోవటం, దానికి తోడు ఆకలీ నన్ను నీరసస్థితిలోకి తీసుకువెడు తున్నాయి. ఏదన్నా తినాలని ఒక హోటల్‌కు వెళ్ళి, యేదాలాపంగా ఒక కుర్చీలో కూలబడ్డాను. అంతే! నా గుండె ఆగిపోయినట్లయింది, ఎదుటి వ్యక్తిని చూడగానే. ఆజానుబాహువువంటి ఆ వ్యక్తి నా వంక తదేకదృష్టితో చూచేసరికి వణుకు పుట్టింది. ఆకలి మాట మరచిపోయాను. ఆ క్షణం నాకు జీవన్మరణ సమస్య. ఏం చేయాలి, ఎలా తప్పించుకోవాలి అన్న ఆలోచనలు .... ఆ వ్యక్తే కొడవటిగంటి కుటుంబరావు అని తర్వాత తెలిసినపుడు నిట్టూర్చి, నాలో నేను నవ్వుకున్నాను. ఓ పెద్ద పోలీసు ఆఫీసరనుకున్న వ్యక్తి ఒక మహారచయిత కావటం, అందులోనూ మార్క్సిస్టు మేధావి కావటం వల్ల నా మనస్సులో ఆయనకు ప్రత్యేక స్థానం ఏర్పడింది.

1964 లో మద్రాసులో ఆయన పనిచేస్తున్న సంస్థలోనే చేరటం మొదలు, కుటుంబరావు చనిపోవటానికి రెండు రోజుల ముందు వరకు (1980) దాదాపు ప్రతి

రోజూ మేము ఏదో ఒకటి చర్చించటం జరుగుతుండేది. వివిధ విషయాలమీద నా సంశయాలకు ఆయన ఇచ్చే సమాధానాలు, నా తిరుగు ప్రశ్నలకు ఉద్రేకం, విసుగు లేకుండా ఆయన వివరణలు ఇచ్చే తీరు నా మనస్సును హత్తుకున్న విషయం. ఆయన ఆలోచనాధోరణి మనల్ని లోతులకు తీసుకుపోయి, మెదడుకు పదనుపెట్టి, భావోద్రేకం కలగజేయటమే గాక, అనేక ప్రశ్నలను లేవదీస్తుంది.

ఒకరోజున మే మిద్దరం కలసి వెళుతున్నప్పుడు సినిమాలమీద చర్చ సాగింది. అదీ 'శంకరాభరణం' గురించి. కథలో గొప్పతనమేమీ లేదు గాని తీసిన విధానం, లలిత - శాస్త్రీయ సంగీతాల సమ్మేళనం, యెకాయెకిన కొత్తనటుణ్ని - అదీ యువ కుడు కాని వాణ్ని కథానాయకుడుగా తీసుకోవటం, నడివయస్సు దాటిన పాత్ర ప్రేమ భావన — ఇలా చర్చ సాగింది. సినిమారంగంలోని స్టార్‌వాల్యూ సిస్టంను ఆ చిత్రం ధిక్కరించిందని, అలాగే చవకబారు సన్నివేశాలతో యువతరాన్ని పెడదారులు పట్టించే నిర్మాతలకు షాక్ ఇచ్చిందని కుటుంబరావు అభిప్రాయపడ్డారు. అయితే ఆ సినిమా భూస్వామ్య విలువలను ప్రతిబింబిస్తూ అందుకు హారతి పట్టడం లేదా అన్న నా సంశయంతో ఆయన ఏకీభవిస్తూ "అదే ఇందులో ఉన్న పెద్ద చిక్కు" అన్నారు.

సినిమా కథలను నిర్మాతలు తమ చిత్తం వచ్చినట్లు మార్చటం గురించిన ఒక ప్రశ్నకు మరొక సందర్భంలో సమాధాన మిస్తూ, రచయితలను ఆర్థిక వత్తిడితో అందుకు ఒప్పించటం వ్యభిచారం వంటిదని కుటుంబరావు విమర్శించారు.

ఎన్నికలలో పురుషుల కన్న స్త్రీలు ఎక్కువగా ఓటు చేయటం మాట ఒకరోజు చర్చకు రాగా, చట్టసభలలో స్త్రీలకు రిజర్వేషన్లు ఎందుకు ఉండగూడదని నేను సూచించాను. అది ఆయనకు వెంటనే నచ్చింది. అందువల్ల గొప్ప మార్పు లేవో వస్తాయని ఆయన అభిప్రాయపడలేదు గాని, మగవాళ్లు ఉపన్యాసాలు ఇవ్వటమే తప్ప తమ ఆధిక్యాన్ని వదులుకోవటానికి సిద్ధపడని స్థితిలో స్త్రీలు వీలయినంత ఎక్కువ సంఖ్యలో వివిధరంగాలలో బయటకు రావడం మంచిదని అన్నారు. సగం సీట్లు వాళ్ళకు రిజర్వు చేయాలని, దాంతో పార్లమెంటులో వారి బిల్లులు వారు పాస్ చేసు కుంటారని ఆయన నవ్వుతూ అన్నారు.

చైనాలో మావో తదనంతర పరిణామాల గురించి కుటుంబరావు తీవ్రంగా ఆలోచిస్తుండేవారు. హువా కువో ఫెంగ్, తెంగ్ శియావ్ పెంగ్ నాయకత్వం "గ్యాంగ్ ఆఫ్ ఫోర్"ను నిర్బంధించడం సరైన చర్యేనని ఆయన మొదట్లో భావిం

చారు. కాని తర్వాత కొద్ది నెలలకు ఆయన నన్ను ప్రత్యేకంగా పిలిపించి, "కృశ్చేవ్‌కు తెంగ్ శియావ్ పెంగ్‌కు తేడా లేదు" అన్నారు.

కుటుంబరావు కాల్పనిక సాహిత్యంలో మనకు కనిపించేది సంఘ సంస్కరణ ధోరణి, సమ సమాజ నిర్మాణానికి అడ్డుగోడలైన సాంఘిక మూఢాచారాలు, వాటి దుష్ఫలితాలపై ఆయన తన పాత్రల ద్వారా చేసే విమర్శ. కార్మిక - ధనిక వర్గాలకు నడుమ గల మధ్య తరగతిని కార్మిక వర్గానికి చేరువజేసి, సాయుధ విప్లవాన్ని విజయవంతం చేయడంలో కృతకృత్యుడైన లెనిన్ అడుగుజాడల్లో పయనించాడా అన్నట్లు ఆయన తన రచనల్లో ఎక్కువగా మధ్య తరగతిని ప్రభావితం చేయబూను కున్నారు.

దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం వచ్చి ఇప్పటికి మూడున్నర దశాబ్దాలు గడిచినా ప్రజల ఆర్థిక దుస్థితి, సామాజిక దురాచారాలు పెరుగుతున్నాయే తప్ప తగ్గటం లేదు. బీదలను ఉద్ధరిస్తామని వారి ఓట్లతో గెలిచి, ఆ తర్వాత ధనిక వర్గాలకే అనుకూలంగా పాలించటం మామూలయింది. మార్క్సిస్టు సిద్ధాంతాలకు వారసులమనే వారు పంచవర్ష ప్రణాళికా రచనకు కూర్చున్న మేధావులవలె - ఏ యే చిట్కాలు ప్రచారంలో పెడితే, ఏ యే పార్టీలతో పొత్తు కలుపుకుంటే ఎన్నికలలో అధికంగా లాభిస్తుంది అన్న చర్చతో తలమునకలవుతున్నారు. ఇట్టి పరిస్థితిలో, పీడిత ప్రజలను చైతన్యవంతులను చేసే ఆశయంతో మరి కొందరు రచయితలతో కలిసి కుటుంబరావు విప్లవరచయితల సంఘాన్ని స్థాపించారు. ఆయన రచనలను, భావధోరణిని, పరిణామాన్ని ఒకసారి నింపాదిగా పరిశీలిస్తే, తన ఆశయం మనకు స్ఫురించి కార్యోన్ముఖులను చేస్తుంది.

# నిగర్వి

రావి కొండలరావు

ఇద్దరు సవతులకు పడదంటారు—అందులో అబద్ధం కనిపించదు. మరి ఎందు కంటారోగాని, ఇద్దరు కవులకు కూడా పడదంటారు. ఇందులో కొంత నిజం వున్న ట్టనిపిస్తుంది. అలాగే కథకులకీ, రచయితలకీ కూడా పడదంటారు. ఈ విషయంలో ఎవరి మనసుల్లో ఏముంటాయో గాని, కుటుంబరావుకు మాత్రం ఎవరితోనూ 'పడక పోవడం' అన్నది ఎవరూ ఎరగని మాట.

ఆయన గొప్ప కథకుడు. అంతటి కథకుడు ఇతర రచయితలను ఇట్టే తిట్ట వచ్చు. విమర్శించవచ్చు. తూలనాడవచ్చు. కాని ఆయన దగ్గర అలాంటిదేమీ మచ్చుకు కూడ కనిపించదు. వాక్యాలు కూడా సరిగా రాయడం చేతకాని 'బడా' రచయితలు కొందరు, తక్కినవాళ్ళని 'ఏడిశాడు' అన్నట్లు మాట్లాడుతూ వుంటే, కుటుంబరావు అంతటివాడు — అంటే ఏం? — అనలేదెప్పుడేమీ.

ఎవరినైనా ప్రోత్సహించడమేగాని, నిరుత్సాహపరిచి ఎరగరు. తాను సంపాద కుడిగా కొన్ని పత్రికలకు పనిచేసినప్పుడు, ఎంతటి చిన్న—కొత్త రచయితయినా సరే, ఆ రచన ఏమాత్రం బాగున్నా సరే—ప్రోత్సహించేవారు. ఆయన ప్రోత్సా హంతో వెలుగులోకి వచ్చిన వాళ్ళెంతమందో....

తనవల్ల అయితే, ఏ సహాయమైనా చేసేవారు. లేకపోతే 'లేదు' అనేవారు. చేస్తాను—రేపు రా; ఎల్లుండి కనిపించు అన్న మాటలు ఎన్నడూ వినవచ్చేవి కావు.

తన స్థాయికి ఉండవలసిన కనీసపు అహంకారం కూడా లేని మనిషి ఆయన. ఉదాహరణ చెబుతాను. నేను కొడవటిగంటికి ఏకలవ్యుడిలాంటి శిష్యుణ్ణి. నేను రచన చెయ్యటం ఆరంభించిన తొలిరోజుల్లో ఆయనే ఆరాధ్యరచయిత. ఆయన ప్రతి రచనా చదవటం, ఆ ధోరణిలో రాయాలని ప్రయత్నించడం చేసేవాడిని. 'ఆంధ్ర పత్రిక' వీక్లీలో ఆయన వున్న రోజుల్లో, ఆయనతో పరిచయం చేసుకున్నాను - ఒక కథ ఇవ్వడం ద్వారా. అప్పటి కప్పుడే చూసేసి - 'అంతబాగులేదండీ' అని తిప్పి ఇచ్చేశారు! నేనేం బాధపడలేదు. నేను బాధపడతానేమో అని కూడ ఆయన అనుకో లేదు. అంతా ముక్కుసూటి వ్యవహారం. లౌక్యాలూ, దాపరికాలూ బొత్తిగా తెలియని మనిషి. ఆయనతో బాగా పరిచయం పెరిగిన తర్వాత, ఆయనరచనల్లో నేనూ వేలు పెట్టి - ఆయనతో రాయగలిగే అవకాశాలు కూడా వచ్చాయి. ఎంత భయం! 'ఎలా ఉందో ఏమిటో చూడండి' అని ఇస్తే, 'అద్భుతంగా వుంది. దీనికేం' అనేవారు. అలా ఆయనతో మూడు నాలుగు రచనలు 'జ్యోతి'కి చేశా(ను)ము.

'విజయచిత్ర' పత్రిక ఆరంభం కాబోతున్న రోజుల్లో, నేను 'ఆంధ్రజ్యోతి'కి సినిమా కాలం రాస్తూ వుండేవాడిని. "మా వాళ్ళు సినిమా పత్రిక ఆరంభిస్తున్నారు. మీరేమైనా రాస్తారా?" అని అడిగారు ఒకసారి. "తప్పకుండా" అన్నాను. ఆయనే నన్ను తీసుకెళ్ళి ప్రొప్రయిటర్లకి పరిచయం చేసి, చెప్పారు.

నేను 'చందమామ పబ్లికేషన్స్' లోకి రావడానికి ఆ విధంగా ఆయన కారకులైనారు. పదిహేను సంవత్సరాలపాటు, పక్కపక్కగా వున్న ఆఫీసులద్వారా మా పరిచయాలు, స్నేహాలు మరింత పెరిగాయి. 'చందమామ' ప్రధాన సంపాదకుడిగా ఆయనకున్న స్థాయి, గౌరవం ఎనలేనివి. అందరికీ ఆయనంటే గౌరవం, భక్తి. 'తన స్థాయికి వుండవలసిన కనీసపు అహంకారం లేని మనిషి' అన్నానే ముందు— దానికీ ఈ ఉపకరణలు. సినిమా మీద ఏదైనా వ్యాసం తడితే రాసుకొచ్చి నాకిస్తూ, "ఏమండీ, మీ పత్రికలో వేసుకుంటారా, చూడండి" అనేవారు-నాకు దిమ్మ తిరిగేలా. ఆయన దగ్గరకి కథలు పట్టుకుని వెళ్ళినవాడిని; ఆయన ద్వారానే ఇక్కడికి వచ్చిన వాడిని; ఎన్నో అడిగి తెలుసుకుంటున్న వాడిని. 'ఒకసారి కొండలరావును రమ్మను' అని కబురుచేసి, ఆ వ్యాసం నాకు ఇచ్చి, 'మీ పత్రికలో వెయ్యండి' అని చెప్పగల

హక్కు, అధికారం వున్న మనిషి ఆయన. రమ్మంటే వెళ్ళము! వెయ్యమంటే వెయ్యము!

కాని —

ఏమాత్రం అహంకారం ఎరగని వ్యక్తి చేసేది—నేరుగా వచ్చి, 'వేసుకుంటా రేమో చూడండి' అనడం! అలా అనగల వ్యక్తి కుటుంబరావు ఒక్కరే.

ఆయనకేదైనా 'గొప్పదనం' అని చెబితే, 'ఆఁ' అని చప్పరించేసేవారు. "మీరు రాసిన సీరియల్ కథ ఎంతో బావుందండీ" అంటే, "అదా! ఒక ఆదివారం కూచుని రాసింది అంత బావుందీ?" అనడం కొడవటిగంటికే చేతనవును.

ప్రతి కొత్త పత్రికలోనూ ఆయన కథో, గల్పికో, వ్యాసమో ఏదో ఒకటి వుండేది. పత్రిక ఆరంభిస్తున్న ప్రతివారూ ఆరంభ సంచికకు కథకోసం ఆయనకు రాసేవారు. ఈ పత్రిక వస్తుందా, చస్తుందా? అసలు ఎంత ఇస్తాడు? అని పెద్దవాళ్ళ(?) లాగా ఆక్షేపించకుండా, ఆలోచించకుండా—పోనీ పాపం అన్నట్టు ఏదో ఒకటి రాసి పంపేవారు. అడిగిన వాళ్ళ ఆనందానికి హద్దులుండేవి కాదు.

ఎప్పుడో ఎన్నేళ్ళక్రితమో చూసిన ఇంగ్లీషు సినిమాలూ, అంతకు ముందు మూకీలూ ఆయనకు జ్ఞాపకం గాని, తన కథల సంగతి జ్ఞాపకం వుండేది కాదు. పత్రిక పోస్టులో వచ్చి, అందులో తన రచన వున్నప్పుడు—'ఎప్పుడు పంపానా' అని ఆలోచించేవారు. ఏదైనా పారితోషికం వస్తే — 'ఈ పత్రికకు ఏం రాశాను చెప్మా' అని ఆలోచించేవారు.

ఆయన దేనికీ పొంగిపోలేదు. దేనికీ కుంగిపోలేదు. పెద్దవాళ్ళూ, చిన్నవాళ్లూ అందరూ ఒకటే. అందరితోనూ ఒకేరీతి సంభాషణ. కోపం వచ్చి కేకలు వేసిన క్షణాలు ఎవరూ ఎరగరు. కంపోజింగ్‌కు కథ పంపితే, 'ఎంత వెతికినా కనిపించలేదు' అన్న మాట విన్నప్పుడుకూడా ఆయనకి కోపం రాలేదు. 'పోన్లెండి, మళ్ళా రాస్తాను' అని ఎవరికీ 'ప్రమాదం' కలగనిచ్చేవారు కాదు.

ఆయన గొప్ప కథకుడు, విమర్శకుడు, పత్రికా రచయిత, వ్యాసకర్త, హేతువాది, మేధావి, ఎందరికో మార్గదర్శి. వీటిల్లో ఎంత గొప్పవాడో వ్యక్తిగా కూడా అంతటి గొప్పవాడాయన. ఆ వ్యక్తిత్వం చాలా అరుదైన వ్యక్తిత్వం. ముఖ్యంగా ఆ స్థాయి వ్యక్తుల్లో మరీ అరుదైనది.

# ఇంద్రధనుస్సు

బాలాంత్రపు రజనీకాంతరావు

రొమాంటిక్ కవుల మిత్రబృందంలో నక్షత్రాల మధ్య చంద్రుడిలా మసులు కొంటూ హఠాత్తుగా రొమాంటిక్‌గానే మనిషి ఏమయ్యాడో తెలియకుండా మాయమై పోయిన కొడవటిగంటి వెంకటసుబ్బయ్య తమ్ముడే కుటుంబరావు. అయినా అతిశయోక్తులతో, ఉత్ప్రేక్షలతో, ఉపమలతో దట్టించిన కవిత్వం కుటుంబరావుకి వ్యసనం కాలేదు. మార్క్సిజము, మానవతా ఆయన మతం. తర్కం లేదా హేతువాదం ఆయనకి మంచినీళ్ళప్రాయం. ఆ నీళ్ళూ, టీనీళ్ళూ తాగి కథలు చెప్పడం, రాయడం ఆయనకి వ్యసనం. హేతువాదంలో పొదివి, కథలు చెప్పడంలో, రాయడంలో ఆయన మనసూ, నోరూ, కలమూ బాగా సానదేరాయి. వాటిలో ఆయన చేసిన ప్రయోగాలు ఇన్నీ అన్నీ కాదు. కథానికలనబడే చిన్న కథలు, సీరియల్ కాదగ్గ పెద్ద కథలూగాక, ఆయన తొలి నలభయిల్లో 'ఆంధ్ర వార పత్రిక' లో పనిచేసేటప్పుడు కార్డు కథలు, గల్పికలు రాసి, మార్గదర్శకుడయి, అనేకమందిచేత రాయించేవాడు. ఒక పోస్టుకార్డులో పట్టేటంతటి కథకి కార్డుకథ లేక గల్పిక అనే పేరు ఆయనే పెట్టాడు.

1941-42 లో నిడుమోలు జగన్నాథ్ అనే యువక ఫిలిం డైరెక్టర్ - ప్రొడ్యూసర్, అంతకు ముందే బళ్ళారి రాఘవ, పద్మావతీదేవిలతో 'ద్రౌపదీ మాన సంరక్షణ'

సినిమా తీసినాయనే, 'తారుమారు', 'బలే పెళ్ళి' అనే రెండు పొట్టి హాస్య చిత్రాలను అప్రసిద్ధులైన తారలతో తీసాడు. వాటిలో 'తారుమారు' చిత్రానికి సంభాషణలు కుటుంబరావే రాసాడు. ఆ రెండు చిత్రాలు నా సంగీత దర్శకానుభవానికి నాందీ ప్రస్తావన. అవి ఎక్కువగా డబ్బు సంపాదించక పోయినా సినీమా పరిణామ చరిత్ర తొలిదశలో out of the beat విశిష్ట ప్రయోగాలు. ఆ రోజుల్లోనే నాకు తొలి పరిచయం కొడవటిగంటితో.

ఆయన యింతకీ సినిమ రచయితగా పేరు సంపాదించడానికి ఇష్టపడినట్లు తోచదు. వాహినీ, విజయావారికి అత్యంత సన్నిహితుడుగాను, 'చందమామ' 'యువ' సంపాదక వర్గంలో నాగిరెడ్డి-చక్రపాణిలతో సగౌరవంగా ఉంటూ వుండి కూడా ఆయన సినిమాలకు రాసినదానికన్నా ఆ పత్రికలకు, ఇంకా 'భారతి' వంటి ఇతర పత్రికలకు కూడా ఎన్నో కథలు రాసాడు. తన పేరుతోను, మారుపేర్లతోను రాసినా, కొడవటిగంటి తర్కబద్ధమైన వాక్యరచన, కథాకథన పద్ధతి, కొన్ని రకాల పాత్రల మూసపోత—ఇది కొడవటిగంటి రచనే అని తెలిసిపోయేటంతటి వ్యక్తిగత శైలి ఆయనది. ఆయన మార్క్సిస్టు దృక్పథంతో రాసిన మానవసమాజ పరిణామ చరిత్ర చాలా హేతుబద్ధంగాను, కాదనడానికి వీలులేనట్టుగాను ఉంటుంది.

నేను మద్రాసు రేడియో కార్యక్రమ నిర్వాహకుడుగా పనిచేస్తూ వున్నప్పుడు శరత్ చంద్ర ఛటర్జీ రాసిన రెండు, మూడు నవలలను రేడియోకు దీర్ఘనాటికలుగా కుటుంబరావుచేత రాయించుకుని ప్రసారం చేసాను. వాటిలో 'దేవదాసు' నాటకానికి సంభాషణలు ఆయనవీ, పాటలు నావీని. అప్పటికి 'దేవదాసు' తెలుగు సినీమా రాలేదు. 'కామమ్మ మొగుడు', 'లేచిపోయిన మనిషి'వంటి ఆయన పెద్ద కథలనుకూడా రేడియో నాటకాలుగా ప్రసారం చేయించాము. 'హాస్యవల్లరి' అనే ఆదివారం ఉదయం చౌ చౌ హాస్య కార్యక్రమాన్ని కూడా ఆయన ఒకటి, రెండు సార్లు రాసి, ప్రసార నిర్వహణలో సహాయం చేసాడు. ఏ వ్యక్తికీ సూటిగా తగలని పద్ధతిలో నేటి సాంఘిక రాజకీయార్థిక పరిస్థితులను, సమాజంలోని కొందరు వ్యక్తుల caricature స్వరూపాలను వ్యంగ్యంగా ప్రదర్శించి, ఆహ్లాదం కలిగించగల కొద్దిమంది తెలుగు హాస్య—వ్యంగ్య రచయితలలోను చెప్పుకోదగిన వాడు కొడవటిగంటి.

1963-64 లలో అనుకుంటాను, కేరళలో ఆళ్వాయ్ వద్ద ఉద్యోగమండల్ అనే చోట జరిగిన అఖిల భారత రచయితల సభలకు వెళ్ళినపుడు నేనూ కుటుంబ

రావూ పక్కపక్కనే బస. ఒకే బస్సులో దగ్గరగా కూర్చుని సంగీతం, సాహిత్యం, చరిత్ర, మానవజాతి పరిణామం, ఖగోళశాస్త్రం, విజ్ఞానశాస్త్ర పరిశోధనలు ఇత్యాదిగా ఎన్ని విషయాలనో చర్చించుకుంటూ, మధ్య మధ్య ఆయన నా చేత హిందూస్తానీ, కర్ణాటక రాగాలను. సంగీతానికీ ప్రకృతికీ వుండే సాన్నిహిత్య—సారూప్యాలను నిరూపించే విధంగా పాడిస్తూంటే, భరత ఖండపు దక్షిణాగ్రంలో వున్న కన్యాకుమారి చేరుకున్నాము. వివిధ విషయాలలో కొడవటిగంటి ఆసక్తి, ప్రవేశమూ అంతటివి. ఆ విశిష్ట సాహితీమూర్తికి నా హృదయపూర్వక శ్రద్ధాంజలి ఇది.

# శ్రోత - గాయకుడు

'వైణిక' విద్వాన్ చిట్టిబాబు

మద్రాసులో నా కచేరీ ఎక్కడ జరిగినా కొడవటిగంటి కుటుంబరావు, ఆయన సతీమణి శ్రీమతి వరూధిని, వారి అమ్మాయి, అబ్బాయి తప్పక వచ్చేవారు.

నాకు ఆయనతో బాగా పరిచయం అయ్యేక, ఆయన్ని, ప్రేక్షకులలో వెనకాల ఎక్కడో కూర్చుని వుండటం (నా కచేరీలోనే) చూసాను ఒకసారి. కచేరీ అయాక, నన్ను ఆయన వేదిక దగ్గరకు వచ్చి కలిసినపుడు నేనన్నాను: "అదేమిటండీ! మీరలా ఎక్కడో కూర్చొనడమేమిటి! ఈ సారి మా ఇంటికి వచ్చేయండి. కచేరీకి మనం కలిసి వెళదాం. మీరు ముందర కూర్చుంటే నాకు ప్రోత్సాహంగా వుంటుంది" అని. అందుకు కుటుంబరావు ఏమన్నారో తెలుసా! "అబ్బే, అలా కూర్చుంటే thrill వుండదు. మన స్నేహ విషయం తెలియనివ్వకుండా అలా శ్రోతలతో కలిసి పోయి, వాళ్ళ వ్యాఖ్యానాలు, ప్రశంసలు ఒక చెవినీ, మీ కచేరీ మరొక చెవినీ వింటోంటే గొప్ప thrilling గా వుంటుంది. అది పాడుచేయకండి" అన్నారు. అటువంటిది సంగీతంలో ఆయన ఆసక్తి.

మరొకసారి కలిసినపుడు, "ఏమండీ, నిన్న నేను ఇంకొకరి కచేరీకి వెళ్ళాను. నా కో సందేహం వచ్చింది, ఆ కచేరీ వింటోంటే" అన్నారు. ఏమిటని అడిగాను

నేను. "ఒకే రాగానికి రెండు versions ఉంటాయా?" అని ప్రశ్నించారాయన. "ఏ రాగానికయినా వేర్వేరు treatments వుండొచ్చు—కళాకారుని మూడ్ ని బట్టి. లేదా, ఒకే కళాకారుడు ఆ రాగాన్ని వేర్వేరు విధాలుగా treat చేయవచ్చు, అతని మూడ్ ని బట్టి. కాని మీకు సందేహం వచ్చినట్టు ఒకే రాగానికి రెండు versions వుండవు" అని వివరించాను. ఆయనకు ఆ సమాధానం చాలా నచ్చినట్టుంది. "కరెక్ట్" అన్నారు. అటు వంటిది ఆయన విమర్శనాత్మక పరిశీలన.

కుటుంబరావు తమ అమ్మాయి వివాహానికి రిసెప్షన్‌లో నా కచేరీ పెట్టారు. మరి అప్పుడు పెండ్లికుమార్తె తండ్రిగా అందరినీ ఆహ్వానిస్తూ, అటు వుండాలి కదా; హాయిగా వేదిక దగ్గరగా ఇంకొంత మంది సంగీతాభిమానులతో కలిసి, నా వీణ వింటూ ఇటు వుండిపోయారు! శ్రీమతి వరూధిని వచ్చి, "మీ కళారసన బంగారంగానూ. మీ రీ వేళ కూడా చిట్టిబాబుగారి వీణ వింటూ కచేరీకి వెళ్ళిన శ్రోతలాగ ఇక్కడే కూర్చుండిపోతే ఎలా? అతిథులను ఆహ్వానించవద్దూ" అని బుజ్జగించి తీసుకువెళ్ళేదాకా వెళ్ళలేదు. అటువంటి కళారసన కొడవటిగంటిది.

మేం ఇద్దరం ఎప్పుడు, ఎక్కడ కలిసినా సంగీతపరమైన ఏదో విషయం కద పందే ఊరుకొనేవారు కాదు.

కుటుంబరావుకు కర్ణాటకం, హిందుస్థానీ రెండూ అభిమానమైనవే. హిందూస్థానీలో కరీంఖాన్, ఫయాజ్‌ఖాన్, బడే గులాం అలీఖాన్‌లాంటి వారిని ఆరాధిస్తే, కర్ణాటకలో సెమ్మంగుడి, అరియకుడి, సుబ్బులక్ష్మి, చెంబై, మధురమణి, బాలమురళి మొదలయినవారిని అభిమానించేవారు. సినిమా సంగీతంలో సైగల్‌ను తప్ప ఎవరినీ అంతగా మెచ్చుకొనేవారు కాదు. లతా మంగేష్కర్ కన్న ఆశా భోంస్లే గొప్ప గాయని అని వాదించటం ఆయనకో సరదా. (సంగీతంలో లత, గానంలో ఆశా ఒకరి నొకరు మించుతారని కొ.కు. అభిప్రాయం—సం.)

కొడవటిగంటిది శ్రావ్యమైన గొంతు. సంగీతాన్ని స్వయంగా అభ్యసించేవారు. ప్రసిద్ధ హార్మోనియం వాయిద్యగాడు గోవిందరావు తెంబే వాయింపును ఆయన కరతలామలకం చేసుకున్నారు. (కొ.కు. రెండవ కుమారుడు ప్రసాద్ సితార్ బాగా వాయిస్తాడు.) మహారాష్ట్ర గాయకులైన బాలగంధర్వ, దీనానాథ్, మాస్టరు కృష్ణా రావుల పాటలకు ముగ్ధుడై ఒకప్పుడు బొంబాయిదాకా వెళ్ళి వారి పాటలు ప్రత్యక్షంగా వినివచ్చారు. ఆయన ఎంతో పాత రికార్డులు కూడా మొదటినుంచీ సేకరించేవారు.

ఒక రచయిత ఆ యా అంశాలకు తెచ్చే పోలికనుబట్టి ఆయన విషయ పరిజ్ఞానాన్ని, మేధాశక్తిని అంచనా గట్టవచ్చుననుకుంటే, కృష్ణశాస్త్రి కవితను సన్నాయి వాయిద్యానికీ, శ్రీశ్రీ కవితను డోలు వాద్యానికీ — సంగీతపరంగా కుటుంబరావు చెప్పే పోలికనుబట్టి ఆయనను అంచనా వేయవచ్చు. ఈ పోలికలో ఎంత విస్తృతమైన, నిగూఢమైన ఆలోచన ఉన్నదో యోచించినవారికి తెలుస్తుంది.

అంతటి రచయిత, మేధావి, భౌతికవాదికి నాటకాలవంటి ఇతర కళలతోపాటు సంగీతంపట్ల గొప్ప ఆసక్తి మాత్రమేగాక ప్రవేశం కూడా ఉండటం, ఆయన పరిపూర్ణ వ్యక్తిత్వానికి నిదర్శనం అని చెప్పాలి.

# తెలుగువారి చందమామ

## పురాణం సుబ్రహ్మణ్యశర్మ

కొడవటిగంటి కుటుంబరావుగారిని మొట్టమొదటిసారి కొత్తఢిల్లీలో పన్యాల రంగనాధరావుగారి ఇంటికి వచ్చినపుడు కలిశాను. అప్పుడాయన మెడలో కెమెరాతో చాలా అట్టహాసంగా ఉన్నారు. మడత నలగని బుష్‌షర్టు, తెల్లపాంటు, నిండైన భారీ విగ్రహం. ఆ కళ్ళజోడు, ఆ నవ్వు - ఏ విషయంలోనూ emotional కాకుండా చాలా సాదాసీదాగా informal గా మాట్లాడే తత్వం నన్ను ఆకర్షించాయి. అంతకు ముందే ఆయన కథలు, నవలలతో, వ్యాసాలతో, విమర్శలతో పరిచయం ఉన్నందున, ఆయన ఎలా ఉంటారో చూడాలనే కుతూహలం—అంతకంటే, ఆయన పరిచయం సంపాదించాలనే ఆశ — ఈ రెండూ నన్ను ఆయన వెంట తిప్పాయి.

మళ్ళీ ఆ తర్వాత 1966 లో అనుకుంటా ఆంధ్రా యూనివర్శిటిలో ఆయన ఏదో ప్రసంగానికి వచ్చినపుడు కాళీపట్నం రామారావుగారితో కలిసి యూనివర్శిటీ హాస్టల్లో ఆయన రూముకి వెళ్ళా. అప్పుడు అక్కడ తంబు వివేకానందమూర్తి కూడా ఉన్నారు. వాళ్ళు 'సంధ్య' అనే మాసపత్రికను విశాఖనుంచి ప్రారంభించబోతున్నారు అప్పుడు రామారావుగారికి కుటుంబరావుగారితో తమ 'యజ్ఞం' కథను ఒక

ఏడాదికి పైగా పెండింగ్‌లో పెట్టి ఎట్టకేలకు 'యువ' దీపావళి సంచికలో ప్రచురించడం గురించి మాటలు సాగాయి.

'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో 1967 లో నేను ప్రవేశించగానే తొలి సంచికలో ప్రచురణకు నా వద్దకు వచ్చిన కథలలో కుటుంబరావుగారివి రెండు కథలున్నాయి. అందులో ఒక కథలోని ఒక స్త్రీపాత్రకు 'తలోదరి' అనే పేరు పెట్టారు. అది మా కంపోజింగ్‌లో 'తలోదారి' అని పదేపదే అచ్చులో రావటం, నేను దిద్దుకుని, కుటుంబరావుగారు ఇటువంటి పేరు పెట్టిరేమా అని విసుక్కోవటం నా కింకా బాగా గుర్తు. అప్పుడు నాకు రాతప్రతులు చదివినా వాటి స్వారస్యం గ్రహించడం తెలీదు. ఏ కథ చదివినా రాతలో బావున్నట్లనిపించేది కాదు.

అప్పట్లో కొత్తగా పత్రికల్లో చేరిన నాకు కుటుంబరావు అండగా నిలుచున్నారని ఎందువల్లనోగాని అనిపించేది. పత్రికలో ఏదన్నా బావులేకపోతే వెంటనే ఒక పోస్టు కార్డు రాసేవారు. బావుంటే తమ అభిప్రాయం చెప్పేవారు. అయితే నేను జర్నలిస్టుగా అవతారం ఎత్తిన తర్వాత మేము ముఖాముఖీ కలుసుకోలేదు. అది ఎలా జరిగిందంటే, ఓసారి నేను మద్రాసు వెళ్ళినపుడు బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావుగారిని తీసుకొని కుటుంబరావుగారి ఇంటికి వెళ్లాను. అప్పుడు ఆయన లోపల్నుంచి వస్తూ, 'ఇల్లాలి ముచ్చట్లు' రాసేది ఈయనేనని ముందుగా వరూధిని గారికి పరిచయం చేసి, మనం ఇదే మొదటిసారి కలుసుకోవటమా, ఇంతకు ముందు కలుసుకున్నామా అని నన్నడిగారు. మనం కలుసుకున్నామని నేను పై సంగతులు గుర్తు చేసినా ఆయన నాకు జ్ఞాపకం లేదన్నారు. మీ మొదటి రచన నేనే వేశానా అని మరో ప్రశ్న అడిగారు. నేను సంపాదకుడుగా ఉండగా వారి మొదటి రచన నేనే వేస్తే, వారు పైకొచ్చాక ఆ విషయం వారి నోట విని సంతోషిస్తాను అని అన్నారు. నా మొదటి రచన ('గుండుసూదులు') ఆయన వెయ్యలేదు కానీ, 'ఆంధ్ర వార పత్రిక' పొడుగు పుస్తకంలో నా మొదటి కథ, వ్యంగ్య రచన మీరే వేశారని చెప్పాను. నా మొట్ట మొదటి రచన 'గుండుసూదులు' అనే వ్యంగ్య రచన 'ఆనందవాణి'లో వచ్చింది. దాని కారణంగా నా అప్పటి గుమాస్తా ఉద్యోగానికి ఉద్వాసన కూడా జరిగింది.

నేను 'ఆంధ్రజ్యోతి'లో చేరాక మేము ఇంకా కలుసుకోక ముందు, 'స్త్రీల గురించి' అనే శీర్షికలో కుటుంబరావుగారు ఒక వ్యాసం రాయగా, రంగనాయకమ్మ గారు దానిపై వివాదం లేవనెత్తుతూ మరొక వ్యాసం రాశారు. అవి రెండూ ప్రకటించిం తర్వాత అనేకమంది పాఠకులు, రచయితలు ఆ శీర్షికపై చాలా ఉత్తరాలు,

వ్యాసాలు రాశారు. ఈ వాదోపవాదాలు, కుటుంబరావుగారి వ్యాసాన్ని పురస్కరించు కొని రావటం వలన, దానిపై రంగనాయకమ్మగారు తమ విమర్శను ప్రకటించడం వలన - కొంపలంటుకున్నట్లు ఆ శీర్షిక షుమారు ఆరునెల్లకు పైగా పత్రికలో సాగి నట్లు గుర్తు. ఇలా వాదోపవాదాలను వారాల తరబడి ఆసక్తికరంగా నిర్వహించినవాణ్ణి మంచి జర్నలిస్ట్ అంటారని నాకు తెలియదు. ఆ కితాబు కూడా కుటుంబరావుగారు నాకు ఇచ్చేసరికి, మనం కూడా పనికివస్తాం అని నేను అనుకున్నాను.

ఇలా సాగిన మా స్నేహయాత్ర కుటుంబరావుగారు అస్తమించే వరకూ ఉత్తరాలు, కలవటాల ద్వారా గాఢంగా పెనవేసుకున్నట్లయింది 'విరసం'లో ఉంటూ కూడా ఆయన ఆ వ్యవహారాల్లోకి లోతుగా దిగలేదు. ఉత్తరాలు, వ్యాసాల ద్వారా వాక్యసహాయం మాత్రం చేస్తుండేవారు. అంతకుమించి ఆయన ఎక్కువగా ఏదీ ఒంటికి పూసుకోలేదు. విజయవాడ 'విరసం' సభలకు ఒకటి రెండు సార్లు ఆయన వచ్చినా, తర్వాత ఎక్కడకు పడితే అక్కడకు వారి వెంట తిరగలేకపోయారు. అయితే ఆయన ఆలోచనలను మాత్రం సవిమర్శకంగా, విశ్లేషణాత్మకంగా ఎప్పటి కప్పుడు తెలియపరుస్తూ ఉండేవారు. ఇలా ఒకరిద్దరితో కాదు - ఆయనకు ఉత్తరాలు రాసేవారందరితోనూ, వారు ఎవరైనా, ఏ వయసు వారైనా, ఏ మార్గానికి చెందినా పలకరిస్తూ అనేక విషయాలలో guide చేస్తూండేవారు. నాకు రాసిన అలాంటి ఉత్తరాల నుంచి కొన్ని అంశాలు మచ్చుతునకలుగా ఈ క్రింద పొందుపరుస్తున్నాను.

ఒక సందర్భంలో చిన్న నవల రాయమని 1967 లో అడిగాను "short novel మాటా. ప్రస్తుతం ఒక lengthy novel లో ఇరుక్కున్నాను" అన్నారు కుటుంబరావుగారు. ఆ నవలేమిటో, అది ఏమైందో తెలియదు. 1967 తర్వాత పెద్ద నవల ఏదీ ఆయన రాసినట్టు లేదు. 'కేయాస్' కథల్లాటివి రాయకూడదా అని అడిగి నప్పుడు "కేయాస్ అన్నా, ఆ రకం హాస్యం సృష్టించటం అన్నా నాకు వాంతి వచ్చే స్తున్నది. ఇక అటువంటివి రాయను" అన్నారు.

శాస్త్రిగారి 'అల్పజీవి' పుస్తకాన్ని పునర్ముద్రిస్తున్నప్పుడు దానికి ముందుమాట రాయమని ఆయన్ని కోరాను. అప్పుడు ఆయన ఏమన్నారంటే "శాస్త్రిగారిని pat చేసేందుకు నాకు guts లేవు. రాస్తే appreciation రాయాలి. అదయినా 'అల్పజీవి' గురించే అయితే బాగుంటుంది. దాన్ని నే నింతవరకు చదవలేదు. చదివినా సుదర్శనం గారి heights కు పోవటం నాకు సాధ్యం కాదు." శాస్త్రిగారి గురించి కుటుంబరావు గారికున్న అభిప్రాయం అది.

22-5-68 న నాకు ఉత్తరం రాస్తూ sex morality గురించి ప్రస్తావించారు. "చెడిపోయిన మనిషిలో మీరు చెప్పినదే పాయింటు. sex morality గురించి realistic గా ఉండాలి. spinster chastity అన్నది చాలా irritate చేస్తుంది. నేను 50 ఏళ్ల నుంచి చూస్తున్నాను. పల్లెటూళ్ళలో sex గురించి చాలా realistic గా ఉండేవాళ్లు. నా చిన్నతనంలో నా మిత్రు డొకడు ఎవరో ఆవిణ్ణి "అత్తయ్యా" అని పిలవటం చూసి, "ఆవిడ నీకు అత్తయ్య ఎట్లా అయ్యిందిరా" అని అడిగాను. వాడు చెప్పాడు. ఆవిడ భర్త నపుంసకుడుట. పబ్లిగ్గా ఆవిడ వీళ్ళ మేనమామతో sex సంబంధం పెట్టుకుని పిల్లల్ని కూడా కన్నది. గ్రామానికంతకూ ఈ సంగతి తెలుసు. ఎవరూ ఆవిడని వెలివెయ్యలేదు. పెళ్ళి చేసుకున్నవాళ్ళు sex morality కి కట్టుబడి ఉండటంలో అర్థం ఉన్నది. sex life కు పెళ్ళి అన్నది ఆధారం కాలేకపోయాక sex అవసరాలు ఆడది ఏ విధంగా తీర్చుకునేది పైవాళ్ళ కెందుకు? అందులో జోక్యం కలిగించుకోవటం damn foolish. మీరన్నట్టుగానే, ఆ కథలో progressive element ఉన్నదని కృష్ణాబాయిగారు కూడా ఇవాళే రాశారు."

నాగపూర్ విశ్వవిద్యాలయంవాళ్ళు 'ఇల్లాలి ముచ్చట్లు'ను text book గా పెట్టారని తెలియచేసినప్పుడు 8-10-69 ఉత్తరంలో ఆయన ఇలా అన్నారు: "....వాళ్ళు ఇల్లాలి ముచ్చట్లు పెట్టటంలో జోక్ ఏమీ లేదు. essay writing కు అవి బాగా పనికొస్తాయి. దాన్ని annotate చేస్తే ఇంకా మజాగా ఉంటుంది. Inter లో మా చేత Hallit (Hazlitt—ర.), Dryden మొదలైనవాళ్ళ essay లు చదివించి చావగొట్టారు. వాటిలో వున్న satire వగైరాలు ఇల్లాలి ముచ్చట్లులోనూ వుంది" అని నన్ను ఎంతగానో ఉత్సాహపరిచారు. మద్రాసులో శ్రీశ్రీకి షష్టిపూర్తి సందర్భంగా కాబోలు వేదోక్తంగా ఉత్సవం జరపబోతున్నారన్న సంగతి గురించి ఆ ఉత్తరంలోనే కె.కె. ఇలా రాస్తున్నారు — "రేపో ఎల్లుండో రావిశాస్త్రి వగైరాలు ఇక్కడకు దిగుతారు. 11 న 'నిజం' నాటకం వుంది. శ్రీశ్రీ మీద వేదమంత్రాలు చదివి పూర్ణకుంభం చూపిస్తారు! Damned tribalism. Pity Sri Sri."

కుటుంబరావుగారికి 1968-69 నాటికే కథలు రాయాలనే ఆసక్తి తగ్గిపోయింది. అప్పుడప్పుడు కథ రాయమని ఉత్తరాలు రాసినప్పుడు, ఇంక రాయను అని అంటూ వుండేవారు. ఒకమారు నేను కథ రాయమంటే రాసి, ఆ రాయడం గురించి ఇలా అంటున్నారు. "మీ పోరుపడలేక నిన్న రాత్రి కూర్చుని ఒక outrageous woman character తో కథరాసి ఇవాళ మీకు post చేశాను. ఆ పాత్రను పదిమందీ తిట్టితే

ఆ moral responsibility మీదే. ఆ పాత్రను సృష్టించటంలో నా moral turpitude వుందేమో. ఎందుకంటే ఆ పాత్రను నేను like చేస్తాను. నేను like చెయ్యనిది కథలు రాయటం మట్టుకే!"

ఓ సందర్భంలో కాళీపట్నం రామారావుగారి 'ఆర్తి' కథ ప్రచురిస్తున్నప్పుడు ఆయన ఇలా రాశారు. "....'ఆర్తి' చూశాను. ఎంత బాగా రాస్తాడు దేవుడు! కృష్ణంరాజు(పూసపాటి) కూడా పాతకథని చాలా మజాగా రాశాడు. సంచిక్కొక్క టయినా ఆ మాత్రం దరువుంటేనేగాని మజా లేదు. 'ఇల్లాలి ముచ్చట్లు' కూడా సరదాగానే వుందిగానీ, అంత రాజకీయంగా వుండకపోతే బావుండు. పొదిలో ఇంకా అస్త్రాలున్నాయిగదా, పైకి తీయండి."

ఆయన షష్టి పూర్తి సందర్భంలో తన గురించి అక్కడక్కడ వ్యాసాలు వచ్చి నందుకు తన రియాక్షన్ ఇలా చెప్పారు. "అక్కడక్కడ వచ్చిన నామీద వ్యాసాలు నన్ను చాలా depress చేశాయి. ఈ గొడవ అయిపోయాకగాని కోలుకోను. ఉంటాను." (30-10-69).

9-8-69న ఒక ఉత్తరంలో తమ స్వానుభవం వెల్లడిస్తున్నారు. "ఒక్క మాట—ఇన్నేళ్ళ జర్నలిజంలో నాని వుండి నేను నేర్చుకున్న దేమిటంటే వైజ్ఞానిక విషయాలు ఆకర్షించేది 1 in 1000 పాఠకులను. అటువంటి వాటితో సర్క్యులేషన్ పెరగదు. కాని కీర్తి వస్తుంది. (కీర్తి మామూలు పాఠకులు పత్రిక్కి ఏనాడూ కట్ట బెట్టలేరు. డబ్బులిచ్చుకుంటారు. circulation పెంచుతారు. కొంత అప్రతిష్ఠకూడా తెస్తారు) అదీ సంగతి. మీకయినా తెలిసే వుండొచ్చు. ఉంటాను." ఆ రోజుల్లో మా పత్రికలో నండూరి రామమోహనరావుగారి 'విశ్వరూపం' వస్తూ వుండేది. ఆ సందర్భంలో కె. రామమోహనరాయ్ గారు ఉత్తరం రాస్తూ, నక్షత్రాల పేర్లు తేడాగా రాయగా, కుటుంబరావుగారు ఆ విషయాన్ని దృష్టిలో వుంచుకొని ఇలా సవరించటానికి ప్రయత్నించారు. "రామమోహన్‌రాయ్‌గారికి ఒక చిన్న సూచన. స్వల్వా, సెంటరీ, సిగినీ, లిబ్రి అనగూడదనుకుంటాను. Cignus, Cigni, Libra, Libri — సెంటార్రై, లిబ్రై, సిగ్నై అనాలి. రేడియస్, లోకాస్—రేడియై, లోకై లాగా. ఆయన ఉదహరించే నక్షత్రాలకు తెలుగు పేర్లు దొరకవచ్చు....ఉదాహరణకు plesicles అంటే కృత్తికలు. spica — చిత్త. 27 నక్షత్రాలకూ ఇంగ్లీషు పేర్లు సంపాదించి రాసిపెట్టుకున్నా చాలు. మిగిలిన వాటికి తెలుగు పేర్లు దొరకవు."

రావిశాస్త్రిగారి 'నిజం' గురించి ఆ ప్రదర్శన చూశాక కుటుంబరావుగారు తమ అభిప్రాయాన్ని 13-10-69 నాటి ఉత్తరంలో ఇలా వ్యక్తపరచారు. "నిజం నాటకం story writer's stuff అనీ, dramatist's stuff గా లేదనీ చెప్పాను. చదువుకున్న వాళ్ళ నాటకం purpose miss అయ్యి, తిలాపాపం తలా పిడికెడు అన్న నీతి అందులో వుందనుకుంటున్నారు. వాళ్ళు అలా పొరపాటు పడటానికి కారణం శాస్త్రి గారిది కాదు. వాళ్ళు సినిమా విలెనుల్ని చూసి చూసి self justification చేతయిన villain మాటలకు బుట్టలో పడ్డారు! శాస్త్రిగారి నాటకంలో వున్న genius అంతా అక్కడే వుంది. సార్వభౌమారావు స్టేజిమీద పాత్రల్నే కాదు, ఆడియన్స్‌లో చాలా మందిని అంత తేలిగ్గా fool చేయగలిగాడు. నాటకం చదివినప్పుడు good drama అనుకున్నాను గాని, performance ద్వారా ఆడియన్స్ reaction చూసినదాకా ఇంత amazingly good drama అన్నది నాకు తట్టనేలేదు."

2-6-68 న కుటుంబరావుగారు రాసిన ఉత్తరంలో, ఆయన రాసిన 'మరో ప్రపంచం' అనే పుస్తకం గురించి వివరణ కోరినప్పుడు తను ఇలా అన్నారు. "మరో ప్రపంచం Lost Horizon కు కాపీ. అందులో తలకు ఎక్కదగినదేమీ లేదు. మళ్ళీ చదవవలసిందేమి లేదు. అదికూడా 'తార' లాగే 'కినిమా' లో పడ సీరియల్."

'తార'కి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమతి వచ్చిన సంగతి అందరికీ తెలుసు. ఆయన్ని ఎలాగో ఒకలాగా వదిలించుకోవాలని, ఏదో ఒక పుస్తకానికి బహుమతి ఇవ్వాలని, ఆ పుస్తకానికి అకాడమీవారు బహుమతి ఇచ్చి వుం[illegible]రని ఆయన అనుకున్నారు.

రావి[illegible] పీలికం' అనే కథ [illegible]శారు. 17-1-69 న దాన్ని చదివి, "పిపీలికంగా [illegible] వున్నా చాలా లోతులు తరిచింది. philosophy, sociology, politics వగైరాలన్నిటికీ అదొక పాణినీ సూత్రం! దాని మీద ఏమైనా ఉత్తరాలు వచ్చాయా? గిరీశం అన్నట్లు మనవాళ్ళు త్త—." పాఠకులలో, వాళ్ళ అభిరుచిలో అప్పటికీ, ఇప్పటికీ ఏమంత చెప్పుకోదగ్గ మార్పు లేదు. ఇంకా అడుక్కు వెళ్ళిపోతున్నారు—పోతాం పోతాం పైపైకి—అనకుండా! 'పిపీలికం' మీద పాఠకుల response తక్కువగా వున్నందుకు వాళ్ళను గిరీశం మాటతో కొట్టివేసిం తరవాత, 22-1-69 ఉత్తరంలో కుటుంబరావుగారు మళ్ళీ కొంత వివరణ ఇచ్చారు. "పిపీలికం లాంటి రచనకు mass reader respond కాడు. ఈ contradiction మీకు ఈపాటికి అనుభవం అయ్యే వుండాలి. circulation పెరగాలంటే మంచినీళ్ళ

లాటి stuff పడాలి. జనబాహుళ్యానికి banality ఇష్టం. (ఆంధ్ర) జ్యోతి వార పత్రికలో కథల standard కొంచెం తగ్గినట్లే నేను ఫీలవుతున్నాను. కాని readable nonsense రాసేవాళ్ళుకూడా తక్కువగానే వుండటం చిత్రం. వాటి మధ్యన ఓ పిపీలికాన్ని తోసి విడవ్వచ్చు. 'ఇల్లాలి ముచ్చట్లు' కూడా ఒక cross section కే appeal అవుతాయి."

చా.సో. గారి కథల పుస్తకం విశాలాంధ్ర ప్రచురణాలయం వారు వేశారు. చా.సో. గారు ఆ పుస్తకానికి నాచేత పీఠిక రాయించారు. తర్వాత ఆ పుస్తకం వచ్చినపుడు దానికి నేనే రివ్యూ రాశాననుకుంటాను. అలా రాయటం తప్పని అప్పట్లో నాకు తెలియదు. ఆ విషయంపై నన్ను మందలిస్తూ సూచనగా — "చా.సో. కథలమీద నా రెవ్యూ 'సంవేదన'—4 లో వచ్చింది. మీకు అందే వుంటుంది. చా.సో. మళ్ళీ కథలు రాయటం మొదలుపెడితే ఆ క్రెడిటంతా మీదే. preface రాసినవాడే రెవ్యూ చేయటం ఏమీ బాగుండదు. 'ఆంధ్రప్రభ' వాళ్ళు నా preface గల పుస్తకాలు గుడ్డిగా నాకు ఇప్పటికి 3 పంపారు: రెండు చిక్కులు. అట్టే క్రిటికల్‌గా వుండదు. అందుచేత review ని కాంట్రడిక్ట్ చెయ్యటం జరగవచ్చు. లేదా అదే మళ్ళీ ఏకరువు పెట్టవలసి వుంటుంది—for the sake of consistency."

ఆ రోజుల్లో మేము కన్యాశుల్కం మొదటి ఎడిషన్ ప్రతిని సంగ్రహించి దానిని మా వార పత్రికలో ధారావాహికంగా ప్రచురించాము. ఆ సందర్భంలో (22-1-69) — "కన్యాశుల్కం first edition reprint చెయ్యటం గొప్ప idea. దాన్ని వీలుంటే పుస్తకంగా కూడా అచ్చు వేయించండి....500 కాపీలు తీసినా చాలు. గురజాడ జీవితం కూడా అలాగే చెయ్యవచ్చు. ఇటువంటివి common or garden reader కు అంతగా పట్టవు. కాని students etc. కు ఆసక్తి కలిగించేటట్టుగా మీరు in advance కొంత ఊదరపెట్టినట్టయితే effect వుంటుంది.

నేను ఎక్కడికి వెళ్ళినా ఆడవాళ్ళ సమస్యల గురించి ఎత్తి, నేనేదో feat చేసినట్టు చెప్తున్నారు. Credit అంతా మీదేనని వాళ్ళకు చెప్పేస్తున్నాను. Weekly editor పాఠకుల tastes ని pamper చేస్తున్నట్లు కనిపిస్తూనే వాళ్ళ tastes ని కొంతవరకు మార్చవచ్చు."

ఆ రోజుల్లో నాకు వచ్చే జీతం ఏమంత ఎక్కువ కాకపోయినా ఇలాంటి ఉత్తరాల్లోని మజావల్ల గాలిలో తేలుతూ బతికాను.

ఇదే సమయంలో నెల్లూరు నించి 'కన్యాశుల్కం' మొదటి ఎడిషన్ పుస్తక రూపంలో శరవేగంతో తయారై వచ్చేస్తోంది. దాన్ని గురించి కూడా కుటుంబరావు గారు 22-3-69 ఉత్తరంలో యిలా అన్నారు. "కన్యాశుల్కం 1897 edition నెల్లూరు వారు foot notes తో సహా అచ్చేస్తున్నారు. body printing అయి పోయింది. Appendix మిగిలింది. చాలా శ్రమ పడుతున్నారు. కొన్ని వివరాల కోసం నన్నవన్నీ అడిగితే చెప్పలేకపోయాను. 'My Mother' poem మాత్రం టైప్ చేయించి యిచ్చాను." ఈ కన్యాశుల్కం మొదటి ఎడిషన్ ప్రచురణ వివరణల్లో అచ్చయినప్పటికీ ఆ సంపాదకుడి అసహనం వలన ఆదిలోనే కొన్ని దూడలు జేరాయి. 'కన్యాశుల్కం' ప్రారంభంలో గిరీశం "పూర్ రిచర్డ్ చెప్పినట్టు ఈ లోకంలో ఫేషన్స్ ఉంటేనేగాని నెగ్గలేం" అంటాడు. ఈ పూర్ రిచర్డ్ ఎవరో ఆ సంకలన కర్త చెప్పలేక పోయాడు. బెంజమిన్ ఫ్రాంక్లిన్, పూర్ రిచర్డ్ ఆల్మనిక్ అని అమెరికా నుంచి ప్రకటించాడు. అప్పారావుగారు ఆనాటికే అది చదివారు. పూర్ రిచర్డ్ చెప్పినట్టు అని అంటే బెంజమిన్ ఫ్రాంక్లిన్ చెప్పినట్టే!

మన రచనల్లో హ్యూమర్ తక్కువయిందని బాధపడేవారిలో కుటుంరావుగారు ఒకరు. ఈ విషయమై 26-3-69 న ఒక ఉత్తరంలో, "Lighter vein లో articles వేస్తే కథలకన్నా బావుంటుంది. మొత్తంమీద ఈ దశకంలో humour తక్కువ యిందనే చెప్పాలి" అన్నారు. ఇప్పటికీ అది తక్కువే.

అదే ఉత్తరంలో మొక్కపాటివారి 'బాతాఖానీ' అనే పుస్తకం గురించి ప్రస్తావిస్తూ—"నిన్ననే.... 'బాతాఖానీ' రెవ్యూ పంపాను. మీరు దానిమీద రాసింది చదివాను. కాని అందులో humour ఏమీలేదు — గ్రాంథికంలో మాట్లాడటం humour అనుకుంటే తప్పు." అప్పట్లో రావిశాస్త్రిగారు 'రాజు-మహిషి' 'జయశ్రీ'లో రాస్తున్నారు. ఈ సందర్భంలో దానిని గురించి ప్రస్తావిస్తూ—"రావిశాస్త్రిగారి పాతరైలు కదిలింది. 'జయశ్రీ'(లో) పేజీన్నరే రాసినా అందులో వున్న humour 'బాతాఖానీ' మొత్తంలో శతాంశం లేదు. ఆయనను రాయించేవాళ్ళు కావాలి."

23-7-69 ఉత్తరంలో అప్పుడాయన మైండ్ ఎలా వర్క్ చేస్తూందో తెలిపే పేరా యిది. "ఈ మధ్య ఒక రోలుకాదు నాలుగు రోళ్ళలో తలదూర్చి ఉక్కిరి బిక్కిరి అయ్యాను. అన్నీ ఒక్కొక్కటే వదిలిపోయాయి. నేను చేసిన బండపనుల్లో ఒకటి—'సృజన'కు బంగోరే పుస్తకంమీద రెవ్యూ. ఈ కన్యాశుల్కం ఏ నక్షత్రాన పుట్టిందో కాని రాసినకొద్దీ విషయం ఊరుతున్నది. తెలిసో తెలియకో, తెలివి తేటలు

ఎక్కువయ్యో ఎవరో ఒకరు ఏదో ఒకటి అనటమూ, దాంతో నాకు ఆవేశం రావట మూను. కన్యాశుల్కం వీరేశలింగం నాయకుడని రమణారెడ్డి! అటువంటి statements ను ఎట్లా పోనివ్వటం."

30-12-69 ఉత్తరంలో, ఆయన డాక్టర్ వద్దన్నా ఆఫీసుకు వెళ్తున్న పరిస్థితిలో ఇలా అంటున్నారు. "Brain work అసలే చెయ్యటంలేదు. అంటే చందమామ ప్రచురణకు వచ్చే కథలు చదవటం కోడిరామమూర్తి గుండెల మీద ఏనుగును ఎక్కించుకున్న పని అది." చందమామలాటి పత్రికకు కథలు ఎంపిక చేయటం ఎవరైనా చేయగలరనుకునే మహామేధావులకు చిన్న చురక అది.

కుటుంబరావుగారిది సినిమా బుర్ర కూడా. అందుకు ఉదాహరణ నా 'ఉప్పు బస్తాలు' కథమీద ఆయన అల్లిన సినిమా కథ. "జ్యోతి దీపావళి సంచికలో మీ ఉప్పు బస్తాలు చదివాను. న్యూ వేవ్ పిక్చరుకు బ్రహ్మాండమైన సబ్జెక్టు. దానికి ఒకటే లోటు క్లైమాక్స్. అది చిట్టచివరగాని, దానికొంచెం ముందుగాని వస్తే బొమ్మ తీసేందుకు మీ మిత్రుడు కృష్ణంరాజు వున్నాడు. మీ రిచ్చిన షార్టు స్టోరీ ఎండింగ్ resolution కింద సరిపోతుంది. దానికి పూర్వం ఒక చిన్న డ్రమెటిక్ క్రైసిస్ సృష్టించడం సాధ్యమౌతుందా. నేను ఈ లోపు వీలుంటే కృష్ణంరాజుతో మాట్లాడతాను. కథ చదువుతున్నంతసేపు నా కళ్ళముందు సినిమా ఆడుతూనే వుంది. Types చాలా బాగున్నాయి. మనుషులు దొరకటం చాల కష్టమే. మరీ లో షైప్స్ వెయ్యటానికి highly cultured అమ్మాయిలు కావాలి. దీన్ని గురించి ఆలోచించండి. 'సంస్కార' తీసిన పట్టాభి ఇంకో పిక్చర్ తీయడానికి రెడీగానే వున్నట్టున్నాడు." 'ఉప్పు బస్తాలు' గురించి ఆయన ఆలోచనాస్రవంతి అంతా పట్టాభి దాకా వెళ్ళిపోయింది. ఆయన అంత సిన్సియర్.

3-1-70 న ఉత్తరంలో ఒక విశేషమైన అంశం వుంది. అది ఏమిటంటే, కుటుంబరావుగారిని గురునానక్ మీద సెమినార్‌కి ఢిల్లీ పిలిచారు. ఆ సందర్భంలో ఆయన రియాక్షన్—"రేపు నాలుగున గురునానక్ సెమినార్ వున్నది. నన్ను రమ్మని ఢిల్లీ వాళ్ళు ఆహ్వానం పంపారు. నేను రానని, నాకు గురునానక్‌తో పరిచయం లేదని ఢిల్లీకి రాశాను. పోనీ అయితే మానెయ్యి అంటూ ఢిల్లీనించి రాశారు. ఇంతకీ సెమినార్ మద్రాసులో." ఇలా వుంటాయి మనవారి చేష్టలు!

3-1-70 ఉత్తరంలో సందర్భం గుర్తులేదుగాని శ్రీశ్రీ గురించి, తెలుగు కవిత్వం గురించి ప్రస్తావన వచ్చింది. ఆ సందర్భంలో ఆయన అన్న మాటలు—

"శ్రీశ్రీ పుట్టకపోతే ఈనాటి కవిత్వం ఎట్లా వుండేదో నాకు వచ్చినా తెలియదు. సంగీతంలోలాగే కవిత్వ విషయంలో కూడా నాకు very best అనిపించింది తప్ప తలకు పట్టదు. I am about the worst authority on poetry." కుటుంబరావు గారు పైకి అలా అంటారుగాని, ప్రాచీనాధునిక కవితా ధోరణులన్నీ బాగా చదివి అవహగాన చేసుకున్నవారే.

నిజానికి వెదికితే యింకా చాలా ఉత్తరాలు దొరుకుతాయి. కాని దొరికిన ఈ ఉత్తరాలలోంచి కొంత గ్రంథం నడిపించాము. చాలా కాలం ఈ వ్యాసం రాయక పోవడానికి కారణం ఉత్తరాలలోని వ్యక్తిగత విషయాలు బయటపెట్టడం ఇష్టంలేక. రెండో కారణం అవి చాలామటుకు నాకు సంబంధించి వుండటం. అందుచేత ఆయన పేరు చెప్పి నా గురించి రాసుకున్నట్టవుతుందేమోనని భయపడ్డాను. చివరకు అను కున్నంతా అయింది. ఇందుకు పాఠకులు సహృదయంతో క్షమిస్తారని ఆశిస్తాను.

# బహుముఖ ఔన్నత్యం

నండూరి రామమోహనరావు

చాలా ఏళ్ళనాడు కొడవటిగంటి కుటుంబరావును సన్నిహితంగా ఎరిగినవారిలో నేనూ ఒకడిని. ఆయన రెండవసారి 'ఆంధ్ర పత్రిక'లో ఉద్యోగానికి వచ్చినపుడు (1948) ఆయనా, నేనూ సహోద్యోగులమైనాము. రెండేళ్ళ తర్వాత ఆయనను శంభు ప్రసాద్ 'ఆంధ్ర వార పత్రిక'కు ఇన్-ఛార్జి సంపాదకుడుగా నియమించినపుడు నేనూ వారపత్రికలోకి మారాను. కుటుంబరావు, సూరంపూడి సీతారామ్, నేనూ — త్రీ మస్కెటీర్స్‌లాగా — అదీ మా టీము.

వారపత్రిక అభివృద్ధి చేయడానికి ఆయ నొక ఫార్ములా కనిపెట్టారు. All in one అనేది ఆ ఫార్ములా. అది మన నవలా సాహిత్యంలో సంధి దశ. స్వతంత్ర నవలలు వచ్చేవి కాని, అవి మేధావి వర్గానికే ఎక్కువ పరిమితమై వుండేవి. అందు చేత కుటుంబరావు వాటి జోలికి పోకుండా అనువాద నవలల ప్రచురణ మొదలు పెట్టారు. సీతారామ్‌చేత, నా చేత అనువాదాలు చేయించేవారు. సుమారు ఏడాదిన్నర తిరిగేసరికి వారపత్రిక అమ్మకాలు అయిదారు రెట్లు పెరిగాయి. ఒక్క అనువాద నవలలు మినహా ఇప్పటికీ తెలుగు వార, మాస పత్రికలకు ఇదే ఫార్ములా. ఆ తరువాత 'చందమామ'లో చేరాక తన సక్సెస్ స్టోరీని ఆయన రిపీట్ చేశారు.

దాదాపు అర్ధ శతాబ్దం పాటు ఆయన రచనా వ్యాసంగం సాగింది. రచన ఆయన ఊపిరి. ఆలోచన ఆయన జీవితం. ఆయన వ్రాయని విషయం, ప్రక్రియ లేవనిపిస్తుంది. ఏదో ఒక కొత్త విషయం చెప్పకుండా ఏదీ ఆయన వ్రాయలేదు.

తెలుగు కథా సాహిత్యంలో కుటుంబరావు స్థానం అద్వితీయమైనది. ఒక తరం రచయితలపై, ఒక తరం యువకుల ఆలోచనా ధోరణిపై ఆయన ప్రభావం అమేయమైనది.

తెలుగులో మనకింతవరకు సర్వాంగ పరిపుష్టమైన గొప్పనాటకం, గొప్పనవల రాలేదేమోనన్న సంశయానికి తావు లేకపోలేదు. కాని, ఆధునిక కవితలో, ఆధునిక కథలో మాత్రం తెలుగు సాహిత్యం ఏ ఇతర భారతీయ వాఙ్మయానికి తీసిపోదని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇందుకు దోహదం చేసిన కథా రచయితలలో కొడవటిగంటి ఒకరు.

గురజాడ తర్వాత చలం, చింతాదీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మొక్కపాటి, మల్లాది మొదలైనవారిది ఒక తరం. ఆ తర్వాత తరానికి కుటుంబరావే నాయకులు.

చలం తన ప్రపంచానికి కేంద్రంలో స్త్రీని నిలబెట్టాడు. స్త్రీ స్వాతంత్ర్యం, ముఖ్యంగా సెక్స్ స్వాతంత్ర్యం దృష్టినుంచి సకల సామాజిక సమస్యలను పరిశీలించాడు. కథారచనలో ఒక విధంగా ఆయన వారసుడు కొడవటిగంటి. కాని చలం ప్రారంభించిన భావ విప్లవాన్ని ఈయన విశ్వతోముఖంగా విస్తరింపజేశారు. మార్క్సిస్టు సామాజిక దృక్పథాన్ని సంపూర్ణంగా స్వీకరించారు. ఫ్రాయిడ్ మనో విశ్లేషణలోని—సంకుచితత్వాన్ని నిరాకరించి, ఆ ప్రక్రియను మానవుడి సామాజిక వ్యక్తిత్వావగాహనకు వర్తింపజేశారు. మానవుడి, ఆర్థిక, రాజకీయ, లైంగిక, తదితర సమస్యా సామస్త్యాన్ని తన సాహిత్య వస్తువుగా తీసుకుని తన హేతువాద దృక్పథం నుండి నిశితంగా, నిర్దాక్షిణ్యంగా విశ్లేషిస్తూ రచనలు సాగించారు.

ఆయన దృష్టి కథాశిల్పంపై కాదు, భాషా సౌందర్యంపై కాదు. ఆయనను ప్రభావితుడిని చేసిన రచయితలలో బెర్నార్డ్ షా ఒకడు. షా నాటకాలలో వలె కుటుంబరావు కథలలో కూడా భావాలు ప్రధానపాత్ర వహిస్తాయి. షా శైలీ విన్యాసంలోని వ్యంగ్య వైభవం, హాస్యం, అపహాస్యం, నైశిత్యం— ఇవన్నీ కుటుంబరావు తెలుగు శైలిని పరిపుష్టం చేశాయి. గొప్ప తెలుగు వచనం

వ్రాస్తున్నట్లు పైకి కనిపించకుండా తెలుగు వచన శైలిని తీర్చిదిద్దిన మన అగ్రరచయిత లలో కుటుంబరావు ఒకరు.

కుటుంబరావు అభిమాన విషయాల్లో సినిమా ఒకటి. సాధారణమైన సినిమా సమీక్షలను కూడా ఆయన ఫిలాసఫీ స్థాయిలో వ్రాసేవారు. పాతాళభైరవి, మల్లీశ్వరి విడుదల అయిన రోజులలో ఆ రెండింటిని పోలుస్తూ ఆయన ఆంధ్రపత్రికలో వ్రాసిన వ్యాసం అప్పటిలో చాలా సంచలనం కలిగించింది. దానిలో తోటరాముడు, దీనిలో నాగరాజు—వారి పాత్ర చిత్రణలోనే కె. వి. రెడ్డి, బి. ఎన్. రెడ్డిల మధ్య ఎంతో తేడా కనిపిస్తున్నదని, మల్లీశ్వరి కంటె పాతాళభైరవి గొప్ప చిత్రమని ఆయన అభిప్రాయపడ్డారు. ఇలాంటి అభిప్రాయాలతో చాలామంది ఏకీభవించవచ్చు, ఏకీభవించలేక పోవచ్చు. కాని, ఆయన ఏది చెప్పినా దానికి సిద్ధాంతపరంగా పునాది లేకుండా ఉండేది కాదు.

సాహిత్యంలో, రాజకీయ దృక్పథంలో అంత తీవ్రవాది అయిన కుటుంబరావుకు సంగీతం అంటే అంత విపరీతాభిమానం ఎలా కలిగిందో నాకు తెలియదు. స్వభావత ఆయన తత్వదృష్టి కలవాడు. తాత్వికత, సంగీతం రెండూ Abstract faculties కావడంవల్ల ఆ అభిరుచి ఏర్పడిందేమో.

కొడవటిగంటిలో ఒక ముఖ్య విశేషం — ఆయనవలె కరడుగట్టిన హేతువాదులుగానో, తీవ్రవాదులుగానో జీవితాన్ని ప్రారంభించిన అనేకులు జీవిత ద్వితీయార్థంలో ప్రవేశిస్తూనే కాలం తాకిడికి ఆధ్యాత్మికవాదులుగా, ఛాందస మితవాదులుగా తిరోగమించారు. కుటుంబరావు మాత్రం చివరివరకు హేతువాదిగా, వైజ్ఞానికవాదిగా, మార్క్సిస్టుగా కొనసాగారు. జీవిత చరమదశకంలో 'విప్లవ రచయితల సంఘం'లో ప్రముఖపాత్ర వహించడం వరకూ ఆయన విశ్వాస నైశ్చల్యం కొనసాగింది. తుది దశలో ఆయన దృష్టి అతీంద్రియ ప్రపంచంవైపు మళ్ళకపోలేదు. కాని, దాన్ని సయితం కుటుంబరావు ఒక హేతువాదిగా, తాత్వికుడుగా, మార్క్సిస్టుగా పరిశీలించడానికి, అట్టి అనుభవ జ్ఞానానికి పూర్తిగా ఆధునిక వైజ్ఞానికాధారాలను కనుగొనడానికి ప్రయత్నించారు.

వ్యక్తిగా ఆయనను పరమోత్తముడుగా నేను పరిగణిస్తాను. వాదంలో ఆయనతో నెగ్గడం కష్టం. ఏకీభవించడం కూడా కష్టమే. చాలా తీవ్రమైన భావాలు ఆయనవి. మొదటినుంచి వామపక్ష భావాలె. అవి పోను పోను మరీ తీవ్రమైనాయి. అయితే ఆయనతో మాట్లాడడం, ఆయనను వాదంలోకి దించడం చాలా సరదాగా

ఉండేది. ఆయనతో సంభాషణలో మామూలు కుశలప్రశ్నలకు, ఉబుసుపోక కబుర్లకు చాలా తక్కువ స్థానం ఉండేది. వాటిని కూడా ఆయన Philosophise చేసేవారు. దేన్ని గురించి సంభాషిస్తున్నా మౌలిక విషయాలలోకి తీసుకుపోయేవారు. అయితే ఛలోక్తులతో, తను చదివిన పుస్తకాలలోంచి కొటేషన్‌లతో, వాటి రచయితల Idiosyncracies తో సంభాషణ రసవత్తరంగా ఉండేది. ఆయన ఎప్పుడూ, ఎవరినీ ఎదురుగా గాని, పరోక్షంలో గాని వ్యక్తిగతంగా విమర్శించడం నేను వినలేదు. వారి రచనలపై మాత్రమే వ్యాఖ్యానించేవారు. ఎదురుగా ఉంటే మరీ ఘాటుగా అనేసేవారు. ఒక్క శ్రీశ్రీని తప్ప ఎవరినీ ఆయన మినహాయించలేదు. శ్రీశ్రీ అంటే దాదాపు ఆరాధనాభావం లాంటిది ఉండేది. కృష్ణశాస్త్రిది సన్నాయి వాద్య మయితే, శ్రీశ్రీది డోలు వాద్యం అనేవారు.

తుదివరకు ఆయన దైనందిన రాజకీయ, సాంస్కృతిక, సామాజిక సమస్యలకు ప్రతిస్పందిస్తూ, పత్రికలలో శరపరంపరగా వ్రాస్తూ, తన ఆలోచనలను ఇతరులతో పంచుకుంటూనే వెళ్ళిపోయారు. ఆయన మరణంతో తెలుగునాడు ఒక మేధావిని, గొప్ప రచయితను, మంచితనం మూర్తీభవించిన మనీషిని కోల్పోయింది. మన సాహిత్యరంగంలో అంతటి వ్యక్తిని మళ్ళీ చూడబోమేమో.

# మేధావి

## ఎస్. వి. ఎస్. రావు

ఆంధ్ర సాహిత్య లోకంలో కొడవటిగంటి కుటుంబరావు అపూర్వ వ్యక్తి. తన సాహిత్య జీవితంలో అభ్యుదయ రచయిత లందరికి మహామేధావిగా గురుపీఠాన్ని ఎన్నో ఏళ్ళపాటు అలంకరించాడు. కె.కె. నిర్వహించిన అనితరసాధ్యమైన పాత్రను అర్థం చేసుకోవాలంటే అతని వ్యుత్పత్తి, వ్యక్తిత్వం ప్రత్యేక స్థాయికి చెందినవని గుర్తించవలసి వుంటుంది. ఆధుని కాంగ్ల సాహిత్యంలో అదే తరహాకు చెందిన హక్సలీ, వెల్స్ ఈ సందర్భంలో మనకు స్ఫురిస్తారు. వైజ్ఞానిక శాస్త్రంతోగల ప్రగాఢమైన పరిచయం ద్వారా సామాజిక ప్రగతికి అవసరమైన ప్రతి అంశాన్ని శాస్త్రీయ దృష్టితో పరిశీలించగల సామర్థ్యం, శాస్త్రజ్ఞులకు స్వాభావికమైన రచనాకౌశలం-అంటే, ఏ విషయంపై అయినా సూటిగా, క్లుప్తంగా విశదీకరించగల స్తోమత — ఈ కోవకు చెందిన రచయితలకు సామాన్య లక్షణాలు. స్వయంగా వైజ్ఞానికుడు గనుక మార్క్సిస్టు సిద్ధాంతాన్ని మూలపురుషుల స్థాయిలోనే అర్థం చేసుకోగల అవగాహన కె.కె. కు సంక్రమించడం ఆశ్చర్యకరమైన విషయం కాదు. కాని తన మేధాశక్తికి దీటైన భావుకత్వం లభించడం ఆయన ప్రత్యేకత. చాలామంది అభ్యుదయ రచయితలలో కొరతపడిన స్పష్టత కె.కె. రచనల్లో కనపడటం ఒక విలక్షణమైన అంశం.

ఎంతటి క్లిష్టమైన సమస్యనయినా అభ్యుదయ దృక్పథంతో ఆలోచించి, ఆత్మ విశ్వాసంతో నిర్మొహమాటంగా చెప్పగల శక్తి, నిజాయితీ ఆయన అభిప్రాయాలకు, రచనలకు గౌరవాన్ని చేకూర్చాయి.

మార్క్సిస్టు సిద్ధాంతం కె.కె. భావనా వ్యాపారానికి నిర్జీవమైన మంత్రదండం కాదు. "మనిషి బుద్ధిని జీవితం నుండి విడదీసి నిర్లిప్తత (objectivity) చేకూర్చేటందుకు మానవుడు చేసిన తొలి సాంస్కారిక ప్రయత్నాల ఫలితంగా భగవంతుడు, విధి వచ్చాయి....అంతా విధేననే నెపంమీద ఏ దుర్మార్గాన్నయినా సహించవలసిన స్థితి ఏర్పడింది. ఈ స్థితిలో సంస్కారానికి మరొక ఆధారం దొరికింది. అది నీతి...." ఈ విధంగా సాగే తాత్విక సమాలోచన కె.కె. చారిత్రక దృష్టికి ఉదాహరణ. ఆయన సిద్ధాంతాలను అందరూ ఆమోదించకపోవచ్చు. పైగా అపార్థం చేసుకుంటే మతానికి మళ్ళీ ప్రాతిపదిక కల్పిస్తున్నట్లు అపోహ కలగవచ్చు. కాని పిడివాదంతో మార్క్సిజానికి నిహిలిజంతో ముడిపెట్టడం కె.కె. ధోరణి కాదు. సామాన్య పాఠకులకు కొన్ని సందర్భాలలో లోతైన చర్చలు అనవసరం కావచ్చును. కాని, బుద్ధి జీవుల అవగాహన ఎల్లప్పుడు ఉన్నత స్థాయిలో ఉండవలసి ఉంటుంది. కుటుంబరావు శాస్త్రీయ దృష్టికి ఇంకొక ఉదాహరణ—"సాహిత్యం సాంఘిక చైతన్యంలో ఒక శాఖ....చైతన్యం చెట్టుమీది పువ్వులాంటిది. చెట్టు తాలూకు పరిణామాన్ని సూచిస్తుంది. కాని చెట్టు తాలూకు బీజం మళ్ళీ అందులోనే యిమిడి ఉంటుంది" అన్న వాక్యాలు. ఇలాంటి ఉపమానాలు బ్రిడ్జెస్‌లాగే కె.కె. వంటి శాస్త్రజ్ఞునికే సాధ్యమవుతాయి.

ఆధునిక యుగంలో మానవుడు కొంతవరకైనా సాధించిన సాంస్కృతిక వికాసాన్ని, వైజ్ఞానిక దృక్పథం గల మేధావి గనుకనే కె.కె. గుర్తించాడు. "ఇరవై ఏళ్ళనాటికన్న యీనాటి ప్రజల నిత్యజీవితంలో సాహిత్యం, సంగీతం, నృత్యం, అభినయం, చిత్రలేఖనం మొదలైన కళలకు అధిక స్థానం ఉంటున్నది. ఈనాడు పత్రికలు, రేడియోలు, సినిమాలు మొదలైన వాటి ధర్మమా అంటూ ఎవరు పడితే వారు నిత్యమూ తమకు కావలసిన కళలు ఆస్వాదించవచ్చు." "సినిమా అందరికీ పనికివచ్చే సాధనం. అది బీదలకు సయితం అందుబాటులో ఉంటున్నది. అందులో సాహిత్య, శిల్ప, నాట్య, నృత్యాది కళలు చేరి ఉన్నాయి కనుక సినిమాల ద్వారా ప్రజలకు సమగ్రమైన కళానుభూతి లభించే అవకాశం కూడా ఉన్నది." అయితే పెట్టుబడిదారీ సమాజంలో వీ టన్నిటినీ బూర్జువా మనస్తత్వం ప్రచారం చేయడానికి, ప్రజలను మభ్యపెట్టడానికి, వ్యాపారదృష్టితో ప్రజల అభిరుచులను నీచమైన స్థాయికి

దించి సాంస్కృతికంగా కూడా దోపిడీచేయడానికి వినియోగించడాన్ని కె. కె. గుర్తించాడు. కళను స్వలాభం కోసం సంఘ వ్యతిరేకులు ఎలా వక్రమార్గం పట్టిస్తారో చాలా వ్యాసాలలో ఆయన స్పష్టపరిచారు. కాని మనం గమనించవలసింది, కె.కె. సాహిత్యపరుడే కాక ఇతర కళలలో ప్రవేశం గల భావుకుడు, సంస్కారి. అందువల్లనే సాంఘిక పరివర్తనానికి అవసరమైన భావవిప్లవం సాధించడానికి సాహిత్యంతోపాటు ఇతర కళలపట్ల కూడ అభ్యుదయపరులు శ్రద్ధ తీసుకోవాలని, అభ్యుదయోద్యమం ఇతర కళారంగాలలోనూ వ్యాపించాలని ఆయన సూచించాడు. "సినిమాలు చూసే లక్షలాది ప్రజలు సినిమా పాటలు వింటున్నారు....ప్రజల సంగీతంగా పరిగణించటానికి యీ సినిమా సెక్టరు సంగీతం తప్ప యీనాడు మరొకటి కనబడదు" అని కె. కె. రాసింది ఇరవై సంవత్సరాల క్రితం. తర్వాత ఫిల్మ్ సంగీతం స్థాయి దిగజారిన మాట వాస్తవమే. అయితే, "ప్రజల సంగీతానికి సాహిత్యం కూడా ఉండటం అవసరం. జానపద గేయ సాహిత్యం యీ విషయాన్ని స్పష్టంగా నిరూపిస్తుంది" అని కూడా కె. కె. ఇదివరకే సూచించాడు. ఉత్సాహవంతులైన కవులు ప్రజల్లోకి చొచ్చుకుపోవడానికి చేతనాత్మకమైన గేయాన్ని ఈనాటికైనా చేపట్టడం ముదావహమైన విషయం. కవి కాకపోయినా కవిత్వం పట్ల ఆయన దూరదృష్టికి ఇదొక నిదర్శనం.

అభ్యుదయ రచనకు కంకణం కట్టుకున్న సాహితీపరులు పదే పదే చర్చించే అంశం, సాహిత్యంలో వస్తువుతో పాటు శిల్పానికి గల ప్రాముఖ్యత. కె. కె. ప్రధానంగా వచన రచయితా, పైగా హెమింగ్‌వే ఫక్కీలో వస్త్వాత్మకమైన, నిరాడంబరమైన శైలి నలవరచుకొన్న రచయితా అయినప్పటికీ, శిల్పానికి గల ప్రాధాన్యతను గుర్తించడం గమనింపదగ్గ విషయం. "అభ్యుదయ ఉద్యమంతో పాటు కళాసాధన సాధించటం రచయితల విధి .... కళ కానిదానికి మనం కళార్హతనివ్వం. కళార్హత ఉన్నప్పటికి సాంఘికాభ్యుదయానికి పాటుపడనట్లయితే దాన్ని మనం ఆదరించం.... (అయితే) అభ్యుదయ రచన అన్నట్టయితే అందులో కళాదృష్టి, శిల్పనైపుణ్యం అవసరం లేదని, శ్రామికవర్గం గురించి రాస్తేనే అది అభ్యుదయ రచన అనీ, శ్రామిక వర్గాన్ని గూర్చి రాస్తే ఎట్లా రాసినా అభ్యుదయ రచనేననీ రకరకాల అపోహలు రచయితలలో ఉన్నట్టు కనిపిస్తుంది....వాటిని పోగొట్టడం మన విధి" అంటా డాయన ఈ సందర్భంలో. కె. కె. ఈ విషయంలో సరయిన దృక్పథం అవలంబించడానికి సంగీతం పట్ల ఆయనకు గల అభిరుచి కారణ మని నేను భావిస్తున్నాను. కళ లన్నిటిలో నూటికి నూరుపాళ్ళు Abstract art కనుక క్రమబద్ధం కాని సంగీతం

when time is broke and no proportion kept అన్నట్లు నిరర్థకమవుతుంది.

ఉత్తమ స్థాయికి చెందిన మేధావిగా కె.కె. మనకు అందించిన ఇంకొక సూచన, సాహిత్యంలో విమర్శకు గల ఆవశ్యకత. "మనకు విమర్శన తగుమాత్రం లేకపోవడం గూడా ప్రతిబంధకంగానే ఉంది. ఆత్మవిమర్శ అభ్యుదయ రచయిత యొక్క ఉత్తమోత్తమ సాధనం. దాని ద్వారానే మన లోపాలు దిద్దుకోగలుగుతాం" అంటా రాయన.

కె.కె. వ్యాసాలు చదివితే ఆయన విశ్వసాహిత్యాన్ని అవలీలగా తన భావ ప్రపంచంలోకి ఇముడ్చుకొన్న సంగతి విశదమవుతుంది. కాని తన పాండిత్య ప్రకర్షను చీటికి మాటికి ఎత్తి చూపని ఆధునికాంధ్ర రచయితలలో కె.కె. ముఖ్యుడు. ఆయనపై పాశ్చాత్య సాహిత్య ప్రభావం ఎలాంటిదన్న అంశంపై నా అభిప్రాయం - సాక్షీ సాహిత్యం నుండి నెగెటివ్ లక్షణాలన్నీ బుచ్చిబాబు స్వీకరిస్తే, పాజిటివ్ లక్షణాలు కె.కె.కు సంక్రమించినట్లు కనపడుతుంది. అందుకు కారణం కె.కె. అభ్యుదయ పరుడు, మార్క్సిస్టు కావడం అని నా ఊహ. పాశ్చాత్య సాహిత్యాన్ని అనుక రించడంపై మోజు తగ్గించుకోవాలని కె.కె. భావించడానికి కారణం, రచయితలకు ప్రత్యక్ష జీవితమే ఆలంబనం కావాలన్న ఆయన నమ్మకం. "రచయిత తాలూకు ప్రభావం సంఘంమీద ఉన్నంత మాత్రాన లాభం లేదు. సంఘం యొక్క ప్రభావం రచయితమీదకూడా ఉండాలి" అంటా డాయన. బహుశా కె.కె. ఉద్దేశం అభ్యుదయ సాహిత్యం సాంఘిక పరిస్థితులకు, సామాజిక చైతన్య స్థాయికి అనుగుణంగా ఉండా లని కావచ్చు. అభ్యుదయ సాహిత్యం ప్రజా ఉద్యమం తాలూకు వివిధ దశలలో ప్రత్యేక లక్షణాలు కలిగి ఉంటుందన్నదే నా అభిప్రాయం కూడా.

సాహిత్యం - వాస్తవికత అనే విషయం పట్ల కె.కె. అభిప్రాయాలు విలక్షణ మైనవి. వాస్తవిక జీవితాన్ని చిత్రించాలనే ఉన్నతాదర్శంతో పాటు 'వాస్తవికత' పట్ల లోతైన అవగాహన అవసరమని కె.కె. చాలాసార్లు నొక్కి చెప్పాడు. వాస్తవిక జీవితం, జీవిత వాస్తవికత వేర్వేరు అంశాలు అన్నా డాయన. జీవిత వాస్తవికతను అర్థంచేసుకోవడం వల్లనే సాంఘిక సమస్యల అవగాహనకు మార్గం చూపించగలడు ఉత్తమ రచయిత. ఇదే మంత తేలికైన విషయం కాదు. అభ్యుదయపరుల మధ్య కూడ ప్రచారంలో గల భ్రమలను అధిగమించవలసి ఉంటుంది. "జీవితాన్నీ, అనుభ వాన్నీ జీర్ణించుకునే శక్తి అందరు మనుషులకూ వుంటుందనడం అతిశయోక్తి అవు తుంది. అదే కాక, అటువంటి శక్తి అందరికీ వుంటే యిక సాహిత్యమే అవసరం

లేదు". "జీవితాన్ని అర్థంచేసుకోవటానికి కేవలం జీవితానుభవం చాలదు. కొన్ని సాంఘిక సిద్ధాంతాలు కూడ అవసరం". "సాంఘిక సిద్ధాంతాల అవసరం లేకుండా మన కళలు, సాహిత్యము అభివృద్ధి అవుతాయన్నది కేవలం భ్రమ". ఇత్యాది అభిప్రాయాలు కె.కె. మేధాశక్తికి ప్రతీకలు. ముఖ్యంగా రాజకీయాలు సాహిత్యంలో అప్రస్తుతం కాదు కదా అత్యవసరమని చెప్పిన కె. కె. కూడ, "కథ సంఘటనను అరటిపండు వొలిచిపెట్టినట్టు వొలిచిపెట్టాలా లేక చదివేవాడి ఆలోచనలు రేపి వదలాలా అంటే నా అభిప్రాయం, ఆలోచన రేపి వదలాలనే. సరి అయిన సాహిత్యం చదివేవారి భావాలను ఒక మార్గంగా నడపాలి గాని ఒక గమ్యస్థానం చేర్చి వదలరాదు" అని రాయడాన్ని మనం గమనించాలి.

అభ్యుదయ సాహిత్యానికి చెందిన చర్చనీయాంశాల్లో కె.కె. కృషి చేసిన ఇంకొక ముఖ్యమైన సమస్య 'కళాకారులు - స్వేచ్ఛ'. విస్పష్టమైన జీవిత దృక్పథానికి, సిద్ధాంతానికి కట్టుబడిన రచయిత తన స్వాతంత్ర్యాన్ని కోల్పోతాడని. అదే విధంగా సామ్యవాద దేశాలలో కళాకారుడికి స్వేచ్ఛ లభించదని అభివృద్ధి నిరోధకులు సాగించే దుష్ప్రచారానికి కె. కె. తగిన సమాధానం ఇస్తాడు కొన్ని వ్యాసాలలో. "డబ్బు కోసం పత్రికాధిపతి కోరినటువంటి రచనను సవినయంగా రాసే రచయిత తనకు స్వాతంత్ర్యం లేదని గుర్తించడు .... కాని ఆ రచయితే జన సామాన్యానికి ఉపకరించే రచనలు, సంఘంమీద ప్రభావం చూపే రచనలు రాయమని మనం కోరగానే తన స్వేచ్ఛ యావత్తూ అంతరించినట్టుగా బాధపడతాడు". "ఒక పత్రికా సంపాదకుడి నిర్ణయాన్నీ, చిత్ర నిర్మాత అయిన బ్లాక్ మార్కెటీర్ శాసనాలనూ శిరసావహించే కన్న, కళాకారుడు సాంస్కృతిక వికాసం గల సంఘాలు చేసే నిర్ణయాలను శిరసావహించటం చాలా రెట్లు వాంఛనీయం" అన్నాడాయన ఒకసారి.

అభ్యుదయ సాహిత్య స్రష్టగా కె. కె. నిర్వహించిన పాత్రను గుర్తించాలంటే "నాకు తెలిసినంత వరకు సాహిత్యాన్ని a great civilising medium అన్న గురజాడ తర్వాత, సాహిత్య ప్రయోజనం గురించి యింత స్పష్టమైన అవగాహన గలవారు తెలుగులో మరొకరు కనిపించరు" అనవలసి ఉంటుంది రాచమల్లు రామచంద్రారెడ్డి మాటల్లో.